

శ్రీరస్తు
శ్రీమతే రామానుజాయ నమః



# దివ్యదేశ వైభవ ప్రకాశికా

(సచిత్ర ఆంధ్ర వివరణాది విభూషితా)

మూలము:

ఉ.వే. శ్రీమాన్ కిడాంబి గోపాల కృష్ణమాచార్య స్వామి

ఆంధ్ర వివరణము

ఉ.వే. శ్రీమాన్ N.V.L.N రామానుజాచార్యులు

ప్రకాశకులు

ఉభయ వేదాంత సభ

పెంటపాడు-534 166 (A.P)





శ్రీరస్తు
శ్రీమతే రామానుజాయ నమః
నూజివీడు సంస్థానాస్థాన విద్వత్తల్లజై:
ఉభయ వేదాన్త పారావార పారీణై:

శ్రీమన్నారాయణ చరణ సరసిజ వినిస్సరన్మరన్ద ధారాయిత
మధుర కవితా ప్రవాహోపనిబద్ధ రసవత్తరనైక ప్రబన్ధై:
ఉ.వే.ప్ర శ్రీ మద్భి:
**కిడాంబి గోపాల కృష్ణమాచార్య స్వామి చరణై:**
అనుగృహీతా

# దివ్యదేశ వైభవ ప్రకాశికా

**(సచిత్ర ఆంధ్ర వివరణాది విభూషితా)**

ఆంధ్ర వివరణము

**ఉ.వే. శ్రీమాన్ N.V.L.N రామానుజాచార్యః**

ప్రకాశకులు
**ఉభయ వేదాంత సభ**
**పెంటపాడు-534 166 (A.P)**

# దివ్యదేశ వైభవ ప్రకాశికా

ఈశ్వర సంవత్సర మేషార్ద్ర.



ప్రథమ ముద్రణ 1997.
ప్రతులు 2000

మూల్యము: రూ. 200/-

ప్రాప్తి స్థానములు:
1. ఉభయవేదాన్త సభ
పెంటపాడు-534 166 (A.P.) Ph: 23963 (08818)

2. ఉ.వే. శ్రీమాన్ వి. శ్రీ రామాచార్యులు గారు
ప్లాట్ నెం. 12, సెక్టార్ నెం. 11, ఎమ్.వి.పి. కాలనీ,
విశాఖపట్నం (A.P.) Ph: 532276

3. ఉ.వే.శ్రీమాన్ ఎస్.ఎన్.సి. నరసింహాచార్యులు గారు
7/ 16, దేవుని అల్వాల, బొల్లారం పోస్ట్
సికిందరాబాద్-500 010 (A.P.) Ph: 7866078

4. ఉ.వే. శ్రీమాన్ వి. వెంకటాచార్యులు
అడ్వొకేట్,
కోటిపల్లివారి వీధి,
నరసాపురం-534 275 (A.P.) Ph: 660 (08825)

D.T.P. & Printing:
శ్రీ సత్య ఆఫ్‌సెట్ ప్రింటర్స్,
తాడేపల్లిగూడెం-534 102
ఫోన్: 23360, 23350

## కృతజ్ఞతలు



## ACKNOWLEDGEMENT

*This Book is published with the financial assistance of*

**TIRUMALA TIRUPATHI DEVASTANAMS**

*under their Scheme*

*Aid to Publish Religious Books.*



ఉభయ వేదాన్త మహావిద్వాన్

శ్రీమాన్ కిడాంబి గోపాల కృష్ణమాచార్య స్వామి వారు



ఉభయ వేదాన్త మహావిద్వాన్
శ్రీమాన్ కిడాంబి గోపాల కృష్ణమాచార్య స్వామి వారు



ఉ. వే. శ్రీమాన్ నడాదూరు వేంకట వరద
కృష్ణమాచార్య స్వామి వారు
(దివ్య దేశ వైభవ ప్రకాశికా సంరక్షకులు)

శ్రీరస్తు

శ్రీమతే రామానుజాయ నమః

# విజ్ఞప్తి

ఆర్య,

"దివ్యదేశ వైభవ ప్రకాశిక" యను ఈ విలక్షణమైన స్తోత్రమును అనుగ్రహించినవారు ఉ.వే.ప్ర. శ్రీమాన్ కిడాంబి గోపాలకృష్ణమాచార్య స్వామివారు. వీరు ఉభయ వేదాంత నిష్ణాతులు. వ్యాకరణ శాస్త్ర పారంగతులు. మహాకవి. బహు గ్రంధ రచయిత. వీరి తండ్రిగారైన ఉ.వే.ప్ర. శ్రీమాన్ రామానుజాచార్యస్వామివారి తదనన్తరం వీరు నూజివీడు (కృష్ణాజిల్లా) సంస్థానమున ఆస్థాన పండితులుగా నియమింపబడినారు.

వీరి రచనలలో "శ్రీశోభనాద్రీశ వైభవ చమ్పూకావ్యము" 24 వేల గద్య పద్యములతో నొప్పుచు రామాయణ భారత భాగవత కథలను రస్య రహస్యార్థ సంశోభితముగ వర్ణించుచున్నది. ఇది నూజివీడు సంస్థానాధిపతులచే నాలుగు భాగములుగ ముద్రింపబడి ఆంధ్రదేశమున విస్తృత ప్రచారమును పొందినది. ఇట్లే వీరి "శ్రీభగవద్రామానుజార్య దివ్యావతారోత్సవ వర్ణన కావ్యము" "శ్రీఆదికేశవ బ్రహ్మోత్సవ వర్ణన కావ్యము" ఆధ్యాత్మిక వ్యాసమాల" ముద్రితములై నేడు ప్రచారములోనున్నవి.

వీరి రచనలలో 'దివ్యదేశ వైభవ ప్రకాశిక' అను ఈ స్తుతి కావ్యము మరుగున పడిన మాణిక్యము వలె ఇంతకాలము ముద్రణ భాగ్యము నందక పోవుటచే పాఠకులకు అందుబాటులో లేకుండినది. ఆలోటును తీర్చుటకై ఆంధ్ర వివరణలతో ఈ స్తోత్రమును ముద్రింప సంకల్పించినాము.

దక్షిణ దేశమున 'ఆళ్వారులు' అని సుప్రసిద్ధులైన శ్రీవిష్ణు భక్తులు భక్తి పారవశ్యంతో భగవంతుని కీర్తించిన గేయ సంపుటిని నాలాయిర దివ్య ప్రబంధమని యందురు. ఈ గేయములు ద్రవిడ భాషలలో అతి ప్రాచీనమైన తమిళ భాషలో నున్నవి. 'ద్వాదశ సూరులు' అని ప్రసిద్ధి గాంచిన ఈ ఆళ్వారులు వారి సమకాలమున యావద్భారతమునందు ప్రఖ్యాతి గాంచియున్న నూట ఎనిమిది దివ్య క్షేత్రములలో గల విష్ణు మూర్తులను తమ గేయములలో ప్రస్తుతించినారు. శ్రీవైష్ణవులు నేటికిని ఆ నూట ఎనిమిది దివ్య క్షేత్రములను పరమ ప్రాప్యములనుగా భావించి జీవితంలో ఒక్కమారైనా వాటినన్నింటిని దర్శింపవలయునని ఉవ్విళలూరుచుందురు.

అనన్త గరుడ విష్వక్సేనాది నిత్యసూరులు ముక్త పురుషులు పరమపదనాథుని సదా దర్శించి స్తుతించుచు ఆనందింతురు. యోగులు తమతమ హృదయములలో అంతర్యామిగా ఉన్న పరమాత్మను దర్శించి అనందింతురు. దేవతలు క్షీరాబ్ధిశాయిని సేవించి తమ బాధలను తొలగించుకొని ఆనందింతురు. భగవంతుని రామకృష్ణా ద్యవతారములను సమకాలములో నున్నవారు వారిని దర్శించి సేవించి ధన్యులైనారు.

మరి మనవంటి వారికి భగవద్దర్శన సాధనమే లేదా? అనినచో, ఏలలేదు? మన కొఱకే గదా భగవంతుడు అర్చావతారమును దాల్చి శ్రీరంగం, తిరుమలై, కాంచీపురం తిరునారాయణపురం బదరికాశ్రమం సాలగ్రామం మొదలైన దివ్య క్షేత్రములలో అర్చారూపముతో వేంచేసియున్నాడు. మన రాకను ప్రతీక్షించుచున్నాడు. దర్శించిన చాలును తప్పక అనుగ్రహించును. తిరుమలైలో ఇది మనకు అనుభవసిద్ధము గదా. ఈ నాడు ప్రయాణ సౌకర్యములు ఎంతగానో అభివృద్ధి చెందియున్నవి. అదృష్టవంతులెందరో పలు పర్యాయములు ఈ దివ్యక్షేత్రములను దర్శించి తరించినవారున్నారు.

ఒకనాడు ఈ క్షేత్రములను దర్శించుట దూర దేశస్థులకు చాల శ్రమ సాధ్యముగా ఉండెడిది. 'కాశీకి పోయినవాడు కాటికి పోయినవాడితో సమానం' అనే మాట మనం వింటూనే ఉంటాం. ఆళ్వారులయందును వారి దివ్యప్రబంధముల యందును అత్యంత ప్రావణ్యం గల ఉ.వే. శ్రీమాన్ గోపాలకృష్ణమాచార్య స్వామివారు తమ డెబ్బదియవ సంవత్సరమున దక్షిణ దివ్యదేశ యాత్రకు సకుటుంబంగా బయలుదేరినారు. ఆ సందర్భంలో అనుగ్రహించినదే ఈ స్తోత్రం. ఈ స్తోత్రంలో నూట ఎనిమిది దివ్యదేశాల పేర్లు అక్కడ వేంచేసియున్న స్వామి పిరాట్టి (అమ్మవారు) తీర్థము విమానము మున్నగు వాని పేర్లతో బాటు ఏయే ఆళ్వారులు ఆస్వామిని కీర్తించినది తెల్పుచు ఒక్కటి రెండు మూడు శ్లోకములలో అతిమనోహరముగను భక్తిరస భరితముగను స్తుతించినారు. ఈ స్తోత్రమును ఒకమారు చదివినా ఆక్షేత్రాలను దర్శింపవలయునను ఉత్కటమైన కోరిక పాఠకులకు కలుగును. సందేహంలేదు.

శ్రీమాన్ గోపాలకృష్ణమాచార్య స్వామివారు తమ చివరి దశలో వ్రాసిన దగుటచేత ఈ స్తోత్రము ముద్రణ కాలేదు. శ్రీస్వామివారు తిరుపతిలోని, వారి వియ్యంకుడుగారైన ఉ.వే. శ్రీమాన్ నమ్మయ్యాస్వామివారి తిరుమాళిగలో (నాధముని వీధిలో) 1932 సంవత్సరమున పరమపదించినారు. తిరువేంగడముడైయాన్ తన తిరువడిఘళ్ళ చెంతనే వారికి పరమపదమును ప్రసాదించినారు.

వీరు పరమపదించి 60 సంవత్సరములు పూర్తి అయిన సందర్భంగా 1992 సంవత్సరమున వీరి అముద్రిత రచనలను ముద్రింప సంకల్పించి ఆ ప్రయత్నంలో ఉండగా శిథిలావస్థలో ఉన్న ఈ స్తోత్రము యొక్క వ్రాతప్రతి దర్శనమిచ్చినది. దీని వైశిష్ట్యమును గుర్తించి మూలమును ఆంధ్రమున దాని వివరణమును - ఆయా దివ్యదేశములలోని అర్చామూర్తులయొక్క ఒరిజినల్ కలర్ చిత్రములను, ఈమూర్తులను ఏయే ఆళ్వారులు ఎక్కడెక్కడ ఎన్నెన్ని పాశురములను (గేయములను) అనుగ్రహించినది ఆ వివరమును. ఆయా క్షేత్రాదులకు గల ప్రయాణ సౌకర్యాది వివరణలతో సహా ముద్రించుచున్నాము. ఇది దివ్య దేశ సర్వస్వమనుటలో అతిశయోక్తిలేదు. ఇంత వరకు ఇట్టి గ్రంధము ఆంధ్రమున ముద్రింపబడలేదు అనుట నిస్సంశయము. పాఠకులు ఆదరింతురు గాక.

భవదీయుడు

**యన్.వి.యల్.యన్. రామానుజాచార్యులు.**

శ్రీరస్తు

# దివ్యదేశ అష్టోత్తర శతనామ స్తోత్రమ్

శ్రీమాన్ శ్రీరంగనాథ శ్శ్రీ నిచుళాపుర నాయకః
నీలమేఘః సుందరశ్చ కదంబ వరదో హరిః

శ్రీరామః పుండరీకాక్షః రసాపూపప్రద స్త థా
భుజంగశయనో దేవరాజో నారాయణాత్మకః

హరశాపహర స్సారనాథో రక్తాబ్జ నాయకః
శార్ఙ్గపాణిః శ్రీనివాసః శౌరిః సౌందర్యనాయకః

పూర్ణః సుందర జామాతా నాథ నాథః త్రివిక్రమః
గోవిందరాజ స్సౌగంధ్య వననాథో జగత్పతిః

గజేంద్ర వరదోదేవః శ్యామళో భక్తవత్సలః
శృంగార సుందరో నష్టప్రదీపశ్చ పరాత్పరః

వైకుంఠనాథో దేవానాం నాయకః పురుషోత్తమః
కృపావాన్ రక్త పద్మాక్షః రత్నకూటాధినాయకః

శ్రీమాన్నారాయణః కృష్ణః కమలాపతి సుందరః
సౌమ్యనారాయణ స్సత్యగిరినాథో జగత్పతిః

పితా శ్రీకాళమేఘశ్చ సుందర స్సుందరో హరిః
రంగమన్నారా దినాథో పద్మాక్షో దేవనాయకః

దేవాధి నాయక శ్శ్రీమాన్ శ్రీమత్కాయ్శిన భూపతిః
మకరాయతకర్ణ శ్రీః వైకుంఠో విజయాసనః

మాయానటో మహాపూర్ణః నిక్షిప్తనిధి నాయకః
అనంతశయన శ్రీమత్ వక్షోః వాత్సల్య నాయకః

మాయా విష్ణు స్స్వాక్తినాథో రక్తనేత్ర స్థలాధిపః
నారాయణశ్చ కమలా నాథోఽ లంకార నాయకః

శ్రీపద్మినీ కేశవశ్చ శ్రీమానభయదాయకః
సుధానారాయణః పద్మాపతిః శ్రీదేవనాయకః

త్రివిక్రమ శ్చ వరదో నృసింహ శ్చాది కేశవః
ముకుందః పాండవానాంచ దూతో దీప ప్రకాశకః

జగతామీశ్వరః పూర్ణ సోమాస్యోథ త్రివిక్రమః
యథోక్తకారీ భగవాన్ కమలాకర నాయకః

చోరాహ్వయో వరాహశ్చ వైకుంఠో విద్రుమాధరః
విజయ శ్రీరాఘవో భక్తవత్సలో వీరరాఘవః

తోయాద్రివర్ణః శ్రీనిత్య కల్యాణశ్చ స్థలేశయః।
శ్రీమత్త్కైరవిణీతీర పార్థ సారధి రవ్యయః

ఘటికాద్రి నృసింహశ్చ శ్రీమద్వేంకట నాయకః
అహెూబల నృసింహశ్చా ప్యయోధ్యారఘునాయకః

దేవరాజోథ శ్రీమూర్తిః బదర్యాశ్రమణో హరిః
పరమః పురుషో నీలమేఘః కల్యాణనాయకః

నవమోహన కృష్ణశ్చ కృష్ణః సర్వాంగ సుందరః
క్షీరాబ్ధి శయన శ్రీమాన్ వైకుంఠో భక్తవత్సలః॥

అష్టోత్తర శతం-నామ్నాం అర్చామూర్తి ముపేయుషః
విష్ణోరిదం పఠేన్నిత్యం సర్వాన్ కామానవాప్నుయాత్॥



శ్రీరస్తు

శ్రీమతే రామానుజాయ నమః

# ఆముఖము



**ఉ॥వే శ్రీమాన్**
**కె.యస్. రామానుజాచార్యులు యమ్.ఎ**
**అధ్యక్షులు, ఉభయవేదాంత సభ.**
**రిటైర్డ్ ప్రిన్సిపాల్, నెల్లూరు.**

'ఆళ్వార్' అనగా భక్తి పరవశుడని యర్థము. వీరు పదిమంది యని ప్రసిద్ధి "ఉపదేశరత్తినై మాలై"లో మణవాళమామునులు

పా॥ పొయ్గై యార్, పూదత్తార్, పేయార్, పుగళ్ మళ్లిశై అయ్య, నరుల్ మాఱన్, శేరలర్కోన్, తుయ్య భట్టనాదన్, అన్బర్తాళ్ తూళి, నఱ్పాణన్, నన్ కలియన్ ఈతివర్ తోత్తతడైవా మింగు. అను పాశురమునందు వీరిని అవతార క్రమానుసారం పేర్కొన్నారు. వీరికి దివ్యసూరులు అని నామాన్తరము.

వీరి నామధేయములు

| **తమిళమున** | **సంస్కృతమున** |
|---|---|
| 1. పొయ్గై యాళ్వార్ | సరోయోగి |
| 2. పూదత్తాళ్వార్ | భూతయోగి |
| 3. పేయాళ్వార్ | మహాయోగి |
| 4. తిరుమళ్లిశై ప్పిరాన్ | భక్తిసారయోగి |
| 5. నమ్మాళ్వార్ | శఠకోపముని |
| 6. కులశేఖర ప్పెరుమాళ్ | కులశేఖరులు |
| 7. పెరియాళ్వార్ | భట్టనాథముని |
| 8. తొండరడిప్పొడియాళ్వార్ | భక్తాంఘ్రిరేణుముని |
| 9. తిరుప్పాణాళ్వార్ | మునివాహనసూరి |
| 10. తిరుమంగై యాళ్వార్ | పరకాలయోగి |

ఈ పది మంది దివ్యసూరులతోబాటు మధురకవిని శ్రీగోదాదేవిని చేర్చినచో ద్వాదశ దివ్యసూరులగుచున్నారు.

వీరు అనుగ్రహించిన దివ్యప్రబన్ధములు

## ఆళ్వార్ ప్రబన్ధము

| | |
|---|---|
| 1. పొయ్గై యాళ్వార్ | (ముదల్) తిరువన్దాది |
| 2. పూదత్తాళ్వార్ | (ఇరణ్డాం) తిరువన్దాది |
| 3. పేయాళ్వార్ | (మూన్ఱాం) తిరువన్దాది |
| 4. తిరుమళ్ళిశై ఆళ్వార్ | 1.నాన్ముగన్ తిరువన్దాది |
| | 2. తిరుచన్ద విరుత్తం |
| 5. నమ్మాళ్వార్ | 1. తిరు విరుత్తం |
| (ప్రపన్నజన కూటస్థులు) | 2. తిరువాశిఱియం |
| | 3. పెరియ తిరువన్దాది |
| | 4. తిరువాయ్ మొళ్ళి |
| 6. కులశేఖరాళ్వార్ | పెరుమాళ్ తిరుమొళ్ళి |
| 7. పెరియాళ్వార్ | 1. తిరుప్పల్లాణ్డు |
| | 2. పెరియాళ్వార్ తిరుమొళ్ళి |
| 8. తొండరడిప్పొడియాళ్వార్ | 1. తిరుప్పళ్ళియెళ్ళుచ్చి |
| | 2. తిరుమాలై |
| 9. తిరుప్పాణాళ్వార్ | 1. అమలనాదిపిరాన్ |
| 10. తిరుమంగై యాళ్వార్ | 2. పెరియతిరుమళ్ళి |
| | 3. తిరుక్కుఱున్దాణ్డగం |
| | 4. తిరునెడున్దాణ్డగమ్ |
| | 5. తిరువెళ్ళుక్కూత్తిఱుక్కై |
| | 6. శిఱియ తిరుమడల్ |
| | 7. పెరియ తిరుమడల్ |
| 11. మధురకవి యాళ్వార్ | 1. కణ్ణినుణ్ శిఱుత్తామ్బు |
| 12. ఆండాళ్ (గోదాదేవి) | 1. తిరుప్పావై |
| | 2. నాచ్చియార్ తిరుమొళ్ళి |

## నాలాయిర దివ్య ప్రబన్ధము

శ్రీవిశిష్టాద్వైత సంప్రదాయ ప్రవర్తకులైన శ్రీమన్నాథమునులు (శ్రీరంగనాథముని) దక్షిణదేశ యాత్రగావించుచు 'తిరుక్కుడన్దై' అను కుమ్భకోణ క్షేత్రమున వేంచేసియున్న ఆరావముద ప్పెరుమాళ్ళను గూర్చి శ్రీనమ్మాళ్వార్ అనుగ్రహించిన "ఆరావముదే అడియే నుడలం నిన్బాల్ అన్బాయే" అని ప్రారంభమైన పది పాశురములను భక్తులు పారవశ్యంతో గానం చేయుచుండగా విని పరమానన్ద

భరితులై - పూర్తి ప్రబన్ధం దొరకనందున ఆళ్వార్ తిరునగరికి చేరి ఆనాటి పెద్దల ఆదేశానుసారం "కణ్ణిమణ్ శిఱుత్తామ్బు" అను నమ్మాళ్వార్ విషయకమైన దివ్యప్రబన్ధమును 12 వేల పర్యాయములు అనుసంధించి నమ్మాళ్వారుల అనుగ్రహమునకు పాత్రులై యోగదశలో వారివలన ఆళ్వారులందరి దివ్యప్రబన్ధములను ఉపదేశము పొందిరి. ఈ విధముగా వీరు నమ్మాళ్వారులకు శిష్యులై ద్రావిడ వేదాన్త సంప్రదాయమునకును ప్రవర్తకులైనారు.

వీరు తాము "ఉపదేశము పొందిన దివ్య ప్రబన్ధములను నాలుగు వేలుగా వర్గీకరించినారు. ఇవి వ్యాసభగవానునిచే వర్గీకరింపబడిన నాలుగు వేదములకు ప్రతిరూపములని సంప్రదాయము. మరియు నమ్మాళ్వారులు అనుగ్రహించిన నాలుగు దివ్య ప్రబన్ధములు నాల్గువేదముల ప్రతిరూపములు.

| | |
|---|---|
| 1. ఋగ్వేదము | తిరుచ్ఛన్ద విరుత్తం |
| 2. యజుర్వేదము | తిరు వాశిఱియమ్ |
| 3. అధర్వణవేదము | పెరియ తిరువన్దాది |
| 4. సామవేదము | తిరువాయిమొழி |

ఈ నాలుగు దివ్య ప్రబన్ధములకును తిరుమంగై యాళ్వార్ అనుగ్రహించిన ఆరు ప్రబన్ధములు వేదాలకు షడంగములవలె ఒప్పుచున్నవి. తక్కిన ఆళ్వారుల దివ్య ప్రబన్ధములు ఉప బృంహకములు అని సంప్రదాయము.

## నాలాయిర విభజన క్రమము

### 1. ముద లాయిరమ్

1. తిరుప్పల్లాణ్డు
2. పెరియాళ్వార్ తిరుమొழி
3. తిరుప్పావై
4. నాచ్చియార్ తిరుమొழி
5. పెరుమాళ్ తిరుమొழி
6. తిరుచ్ఛన్ద విరుత్తం
7. తిరుమాలై
8. తిరుప్పళ్ళి యెழுచ్చి
9. అమలనాది పిరాన్
10. కణ్ణిమణ్ శిఱుత్తామ్బు

### 2. ఇరండాం ఆయిరం

1. పెరియ తిరుమొళ్ళి
2. తిరుక్కుఱున్దాణ్డకమ్
3. తిరునెడున్దాణ్డగమ్

### 3. మూన్ఱా మాయిరమ్ (ఇయఱ్పా)–

1. ముదల్ తిరువన్దాది
2. ఇరణ్డాం తిరువన్దాది
3. మూన్ఱాం తిరువన్దాది
4. నాన్ముగన్ తిరువన్దాది
5. తిరువిరుత్తమ్
6. తిరువాశిఱియమ్
7. పెరియ తిరువన్దాది
8. తిరువెళ్ళుక్కూత్తిరుక్కై
9. శిఱియ తిరుమడల్
10. పెరియ తిరుమడల్

**సూచన:** "ఇరామానుశ నుత్తన్దాది" యను భగవద్రామానుజముని విషయకమైన ప్రబన్ధమును కూడ ఈ సహస్రంలో చేర్చారు.

### 4. నాన్గా మాయిరమ్

### 1. తిరువాయ్ మొళ్ళి

ఈ రీతిని ద్వాదశ దివ్యసూరుల దివ్య కీర్తనలతో ఈ నాలాయిర దివ్య ప్రబన్ధమేర్పడినది. వీటిని శ్రీవైష్ణవులు అత్యంత భక్తి శ్రద్ధలతో శ్రీ వైష్ణవాలయములయందును తమ గృహముల యందును అనుసంధించుచుందురు. దేశభాషలోని ఈ కీర్తనలకు మతపరముగ ఇంతటి ఉన్నత స్థానము లభించుట ముదావహము. ప్రమాణ మూర్ధన్యములైన ప్రబన్ధములు దివ్య ప్రబన్ధములు. ప్రమాతృ మూర్ధన్యులైన ఆళ్వార్లు దివ్యసూరులు. ఆళ్వార్లచే కీర్తింపబడిన ప్రమేయ మూర్ధన్యములైన క్షేత్రములు దివ్య క్షేత్రములు. భగవంతునికి సంబంధించినవి ఏవి మాత్రం దివ్యములుకావు? భగవన్తుడు తానే భగవద్గీతలలో "జన్మ కర్మ చ మే దివ్యమ్" అన్నాడుగదా. అంతేకాదు భగవన్తుని దర్శింపగల నేత్రమును "దివ్యం దదామి తే చక్షుః" అంటూ దివ్య నేత్రమని అన్నాడు గదా ఈ 'దివ్య' పదము శ్రీవైష్ణవ సంప్రదాయమున విరివిగా విశిష్ట పదార్థ వాచకముగా ప్రయోగింపబడు చుండును.

## ఆళ్వారుల నిష్ఠ

వేదములు పరవాసుదేవుని వైభవమును వేనోళ్ళ చాటిచెప్పినవి. ఉపనిషత్తులు అంతర్యామి వైభవమును ప్రతిపాదించినవి. ఇతిహాస పురాణములు వ్యూహమూర్తి (క్షీరాబ్ధిశాయి) యొక్కయు రామకృష్ణా ద్యవతారముల యొక్కయు వైభవమును వర్ణించినవి. భక్తి పరవశులైన ఆళ్వార్ల కీర్తనలతో నేర్పడిన నాలాయిర దివ్య ప్రబన్ధము అర్చావతారవైభవమును కీర్తించినది. ఆళ్వారులందరు అర్చావతారనిష్ఠులు. "పిన్నానార్ వణజ్గుం శోదిత్తిరుమూళ్ళిక్కళత్తానాయ్ ముదలానాయే" జగత్కారణ భూతుడవైన ఓస్వామి, రామకృష్ణా ద్యవతారములను చాలించిన తర్వాత కూడా నిన్ను మేము సేవించుటకు వీలుగా నీవు "తిరుమూళ్ళిక్కళమ్" అనే దివ్యక్షేత్రమున వేంచేసియుండి సేవ సాయించుచున్నావు" అని తిరుమంగై ఆళ్వార్ ఈ విషయాన్ని స్పష్టముగావించినారు.

శ్లో॥ నానారూపోపాసా
లక్ష్యం తావ త్త్వ మేక ఏవ౽తః ।
అర్చోపాసాం విదధతి
వైఖానస పాంచరా త్రాద్యాః ॥

నేడు మనకు ఈ అర్చోపాసనమే శరణ్యము. కావున అష్టోత్తర శత దివ్యదేశములను అచటి విశేషములను తెలియజెప్పు ఈ దివ్యదేశ వైభవ ప్రకాశికను ప్రచురింప సంకల్పించినాము.

ఈస్తుతి కావ్యమును అనుగ్రహించినవారు ఉభయవేదాంత మహావిద్వాన్ శ్రీమాన్ కిడాంబి గోపాలకృష్ణమాచార్యస్వామివారు. దీనిని స్వహస్తాక్షరములతో వ్రాసికొని సంరక్షించినవారు నరసాపుర వాస్తవ్యులు అస్మత్ పితృవ్య చరణులు ఉ॥వే॥ శ్రీమాన్ నడాదూరు వేంకట వరద కృష్ణమాచార్యస్వామివారు. వీరు ఉ॥వే॥ శ్రీమాన్ గోపాలకృష్ణమాచార్య స్వామివారి పుత్రవర్యులు. నడాదూరు వంశమునకు దత్తులు. వీరు నరసాపురంలోని శ్రీఆదికేశవ యెంబెరుమానార్‌స్వామి వారి సన్నిధిలో అధ్యాపకులుగా నిరంతరము కైంకర్యము చేయుచుండెడివారు. తమ జనక తండ్రిగారైన ఉ॥వే॥ శ్రీమాన్‌గోపాలకృష్ణమాచార్యస్వామివారు క్రీ.శ. సం. 1903 నుండి నిర్వహించిన భగవత్‌రామానుజుల వర్ష తిరునక్షత్రోత్సవములయందు జరుగు తదీయారాధన కైంకర్యమును అనేక వ్యయప్రయాసలకోర్చి అవిచ్ఛిన్నముగా తాము వేంచేసి యున్నంతవరకూ జరుపుతూ వచ్చినారు. ఆకైంకర్యమును ఇప్పటికిని సోదరులు ఉ॥వే॥ శ్రీమాన్‌కిడాంబి వేంకటాచార్యులు, యమ్.ఎ గారు ఎంతో శ్రద్ధతో జరుపుచున్నారు.

ఉ॥వే॥ శ్రీమాన్ నడాదూరు వేంకట వరద కృష్ణమాచార్యస్వామివారి జ్యేష్ఠ కుమారులు ఉ॥వే॥ శ్రీమాన్ వేంకటలక్ష్మి నరసింహ రాఘవ రామానుజాచార్యులు గారు (తెలుగు పండితులు, పెంటపాడు) వీరు ఈ దివ్యదేశ వైభవ ప్రకాశికకు చక్కని ఆంధ్రానువాద వివరణను ఎంతో శ్రమపడి సమకూర్చినారు. అంతేకాక ముద్రణభారము సహితము తమ భుజస్కంధముల మీదికెత్తుకొనినారు. ఇది వీరి శక్తికి మించిన పని. అయినను ధైర్యే సాహసే లక్ష్మీః అనికదా పెద్దల సూక్తి. "యోగక్షేమం వహామ్యహమ్" అన్న శ్రియః పతి అనుగ్రహించినాడు. శ్రీమత్ పరమహంస పరివ్రాజకాచార్య శ్రీ శ్రీ శ్రీ త్రిదండి చినశ్రీమన్నారాయణ రామానుజ జీయర్ స్వామి వారి మంగళాశాసనములు లభించినవి. యెందరెందరో వదాన్య శిరోమణులు అడిగినదే తడవుగా అహమహమికతో ఈ పవిత్రకార్యమునకు ఉదారముగా ఆర్థిక సహాయముగావించినారు. ఆమహనీయులకు మా కృతాజ్ఞతాభివందనములను ఉభయవేధాంత సభద్వారా సప్రశ్రయముగా తెలుపుకొనుచున్నాము. ఈదివ్యదేశ వైభవప్రకాశికను సర్వాంగ సుందరముగా వెలుగులోనికి తెచ్చి ఆంధ్ర పాఠకలోకమునకు మహోపకారము గావించిన ఉ॥వే॥ శ్రీమాన్ యస్.వి.యల్.యస్. రామానుజాచార్యులకు అనేక మంగాళాశాసనములను చేయుచున్నాము.

పాఠకులు దీనిని ఆదరించి ఆనందించి ఆనన్దింపజేయుదురుగాక.

శ్లో॥ శ్రీరంగ మంగళమణిం కరుణా నివాసమ్ ।
శ్రీవేంకటాద్రి శిఖరాలయ కాలమేఘమ్ ॥
శ్రీహస్తిశైల శిఖరోజ్జ్వల పారిజాతమ్ ।
శ్రీ శం నమామి శిరసా యదుశైల దీపమ్ ॥

శ్లో॥ ప్రాచ్యాం దేవం జగన్నాథం భుక్తిముక్తి ప్రదాయకమ్ ।
సకృత్ప్రపన్నాభయదం అవాచ్యాం సేతుమాధవమ్ ॥
ప్రతీచ్యాం ద్వారకాధీశం శరణాగత రక్షకమ్ ।
ఉదీచ్యాం బదరీనాథం నమామ్యష్టాక్షర ప్రదమ్ ॥



శ్రీరస్తు

శ్రీమతే రామానుజాయనమః

# కృతజ్ఞతా నివేదనము

శ్రీమతేஉవాప్త కామాయ కల్యాణగుణ సింధవే
బంధవే సర్వలోకానాం కేశవాయ నమో నమః

మా పితామహపాదులు ఉ.వే. శ్రీమాన్ కిడాంబి గోపాల కృష్ణమాచార్యస్వామివారు. వీరనుగ్రహించినదే ఈ "దివ్యదేశ వైభవ ప్రకాశిక. ఇది 1931-32 ప్రాంతములో రచింపబడినది. శిధిలావస్థకు చేరిన ఈస్తోత్రమును తిరిగివ్రాసి సంరక్షించినవారు మా తండ్రిగారు ఆచార్యులునగు ఉ.వే. శ్రీమాన్ నడాదూరు వేంకట వరదకృష్ణమాచార్యస్వామివారు. వీరు ఉ.వే. శ్రీమాన్ గోపాల కృష్ణమాచార్య స్వామివారి పుత్రరత్నము. నడాదూరు వంశమునకు దత్తులు.

స్వామివారు ఈస్తోత్రముతోపాటు గచ్చత్ వ్యాఖ్యను కూడ అనుగ్రహించి యున్నారు. కానీ అది శిధిలమైనది. మాతండ్రిగారు దీనిని తిరిగి వ్రయునపుడు చివరలో "యావల్లబ్ధం తావదలేఖి" అని వ్రాసికొనియున్నారు.

ఆవ్రాతప్రతియు శిధిలావస్థకు చేరగా దానిని తిరిగివ్రాసి మా అన్నగారును కాలక్షేప ఆచార్యులునగు ఉ.వే. శ్రీమాన్ కిడాంబి శ్రీనివాస రామానుజాచార్యుల వారికి చూపించితిని. వారు దీనిని పరిశీలించి ఆంధ్ర వివరణతో ప్రకటించిన మిక్కిలి ఉపయోగకరముగా నుండునని కొన్ని సూచనలతో దాసుని ఆదేశించిరి. వారి ఆదేశానుసారము దీనికి ఆంధ్రవివరణాదులను కూర్చితిని. నాయీ ప్రయత్నమును కవిశాబ్దికకేసరి ఉ.వే. శ్రీమాన్ న.చ రఘునాథాచార్యస్వామివారికి విన్నవింపగా వారు "జగదాచార్య ఉ.వే. శ్రీమాన్ కాంచీ ప్రతివాది భయంకరం అణ్ణంగరాచార్యస్వామి వారనుగ్రహించిన **"అష్టోత్తరశత దివ్యదేశస్తుతిని"** కృపచేసినారు. దీనిని ప్రచురించుటకు ఉ.వే. శ్రీమాన్ ప్రతివాది భయంకరం రాజహంసస్వామి అనుమతిని కృపచేసినారు. వారికి మాకృతజ్ఞతలు.

ఈ ప్రయత్నములోనే దివ్యస్థలాదర్శమను ప్రాచీనకోశమొకటి లభించినది. ఈరెండు స్తోత్రములను దీనికి అనుబంధముగా చేర్చితిమి.

నూటయెనిమిది దివ్యదేశములను అనునిత్యము అనుసంధించుకొనుటకు వీలుగా "దివ్యదేశస్తుతి" అర్చనకు ఉపయుక్తముగా అష్టోత్తర శత దివ్యదేశ శతనామస్తోత్రమును కూడా కూర్చితిమి.

దివ్యదేశములను వివరించునపుడు ఆయాప్రబంధముల వ్యాఖ్యానములలోని విశేషాంశాదులను, ఆళ్వార్ల ఆచార్యుల అనుభవములను యథావకాశము వివరించితిమి మధ్యమధ్య పూర్వాచార్యుల శ్రీసూక్తులను సంప్రదాయరహస్యములను "మంచిమాట" అను శీర్షిక ద్వారా అందించితిమి.

మాయీప్రయత్నమును విన్నవింపగా సఫలమగునట్లు మంగళాశాసనమనుగ్రహించినవారు శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య శ్రీ శ్రీ శ్రీ త్రిదండి చిన శ్రీ **మన్నారాయణరామానుజజీయర్ స్వామివారు.** వారి మంగళా శాసనముతో పాటు పదివేలరూపాయల ఆర్థిక సహాయమును కూడ అందించిన పరమోదారులు. వారి మంగళాశాసన బలమే ఈ కార్యమునకు శ్రీరామరక్ష. వారి శ్రీపాదములందు సహస్రప్రణామములర్పించుచున్నాడను.

మా ప్రయత్నమును ఆదరించి ఆర్థిక సహాయము నందించిన తిరుమల తిరుపతి దేవస్థానము వారికి మా కృతజ్ఞతాంజలి నర్పించుచున్నాము.

ఈస్తోత్రము విషయమై ఉ.వే. శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్యస్వామివారిని సేవించినపుడు వారు మంగళాశాసనము కృపచేయుటయేగాక విశాఖభక్తుల సహకారము గూడ అందునట్లు సహకరించినారు. వారి సన్నిధిలో ప్రణామములర్పించుచున్నాము.

అట్లే తగిన సూచనలతోపాటు మార్గ నిర్దేశకులై మంగళాశాసనము ననుగ్రహించిన కవిశాబ్దిక కేసరి ఉ.వే. శ్రీమాన్ న.చ. రఘునాథాచార్య స్వామి వారి సన్నిధిలో ప్రణామముల నర్పించుచున్నాను.

ఈ స్తోత్రమునాదరించి మాకవసరమగు తమిళ అక్షరములను యిచ్చుటయేగాక మంగళాశాసనము ననుగ్రహించిన శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య శ్రీ శ్రీ శ్రీ త్రిదండి శ్రీ **రంగ రామానుజ జీయర్ స్వామివారి** సన్నిధిలో సహస్ర ప్రణామములర్పించుచున్నాము.

ఇంకను ఈగ్రంథప్రచురణలో అపూర్వ సహకారము నందించిన మహనీయులు ఉవే. శ్రీమాన్ కె.కె.పరకాలన్ స్వామివారి సన్నిధిలో ప్రణామపూర్వక కృతజ్ఞతలను తెలుపుకొనుచున్నాను. అటులనే తగిన సూచనలను సహకారమునందించి మంగళాశానముల ననుగ్రహించిన

ఉ.వే. శ్రీమాన్ కె.వి.ఆర్. నరసింహాచార్యులుగారు, విశాఖపట్నం

ఉ.వే శ్రీమాన్ యస్.బి. రఘునాథాచార్యులుగారు, వైస్‌చాన్సలర్, తిరుపతి.

ఉ.వే శ్రీమాన్ కె. వేంకటాచార్యులుగారు, నరసాపురం.

వారలకు ప్రణశ్శతములర్పించుకొనుచున్నాడను.

ఈస్తోత్ర ప్రచురణకై నాకంటె మిన్నగా శ్రమపడి పదాన్యులను కలసికొని వారి ద్వారా ఆర్థిక సహాయములను చేకూర్చిన సోదరద్వయము ఉ.వే. శ్రీమాన్ వేదాల వేణుగోపాలచార్యులు. ఉ.వే. శ్రీమాన్ వేదాల శ్రీరామాచార్యులగార్లకు మాకృతజ్ఞతల నర్పించికొనుచున్నాము.

తొలుతగా నీగ్రంధ ప్రచురణకు ఆర్థిక సహాయము నందించిన పరమ భాగవత శిఖామణులు శ్రీమాన్ గునుపాటి చెల్వపిళ్లైగార్కి, శ్రీమాన్ డా॥ వేదాల రంగనాధ్ గార్కి మాకృతజ్ఞతా పూర్వకమంగళాశాసనములు.

తమకు అపరచితమైన భాష - తమ ప్రాంతముకాదు. అయినను భగవత్కైంకర్యమునకునివి ప్రతి బంధకములు కావని భావించి ఈగ్రంధముద్రణకు అవసరమైన కాగితపు వెలను కైంకర్యముగా సమర్పించిన మహనీయులు శ్రీమాన్ ఉపేంద్రషా - బొంబాయివారు వారి ఔదార్యమునకు కృతజ్ఞతా పూర్వక మంగళాశాసనముల నర్పించుచున్నాము.

ఈస్తోత్ర ఆంధ్ర వివరణలో నాకు సహకరించిన నా సోదరుడు శ్రీమాన్ చి.నడాదూరు గోవిందరాజన్, యమ్.ఎ., యమ్.ఫిల్‌కు; ఉ.వే. శ్రీమాన్ వంగల వేంకటాచార్యులు, బి.ఎ., బి.యల్.కు అనేక మంగళాశాసనములు.

శుద్ధప్రతిని తయారుచేయుటలోను, తమిళలిపిలోని గ్రంధములను చదివి వినిపించుటలోను, ప్రూఫురీడింగులోను సహకరించిన నాశ్రీమతి హేమాబ్జవల్లి, యమ్.ఎ. (తెలుగు) యమ్.ఎ. సంస్కృతంకు అనేక ఆశీస్సులు.

ఇక ముద్రణ విషయమున నాకు సహకరించిన శిష్యుడు శ్రీమాన్ చి॥భాస్కరాచార్యులకు అందముగా **D.T.P.** చేసిన శ్రీ సత్తి జగదీష్ రెడ్డి, సూరిభట్ల నాగేశ్వరరావులకు అనేక ఆశీస్సులు. దీనిని అందముగా ముద్రించుటలో సహకరించిన శ్రీసత్యా ఆఫ్‌సెట్, తాడేపల్లిగూడెం వారికి మా కృతజ్ఞతలు.

ఆదినుండి అంత్యమువరకు దీనిని పర్యవేక్షించి ఇంత సర్వాంగ సుందరముగా తీర్చిదిద్దిన మా అన్నగారు ఉ.వే. శ్రీమాన్ కె.ఎస్. రామానుజాచార్యుల వారి సన్నిధిలో సహస్ర ప్రణామములర్పించు చున్నాడను.

భాగవతవిధేయుడు

రామానుజాచార్యులు

# తనియన్లు

శ్రీశైలేశ దయాపాత్రం ధీభక్త్యాదిగుణార్ణవమ్ ।
యతీన్ద్ర ప్రవణం వన్దే రమ్యజామాతరం మునిమ్ ॥
లక్ష్మీనాథ సమారమ్భాం నాథయామున మధ్యమామ్ ।
అస్మదాచార్య పర్యన్తాం వన్దే గురుపరమ్పరామ్ ॥
యో నిత్య మచ్యుత పదామ్బుజయుగ్మ రుక్మ
వ్యామోహత స్తదితరాణి తృణాయ మేనే ।
అస్మద్గురో ర్భగవతోఽస్య దయైకసిన్ధోః
రామానుజస్య చరణౌ శరణం ప్రపద్యే ॥
మాతా పితా యువతయ స్తనయా విభూతిః
సర్వం యదేవ నియమేన మదన్వయానామ్ ।
ఆద్యస్య నః కులపతే ర్వకుళాభిరామం
శ్రీ మత్తదఙ్ఘ్రి యుగళం ప్రణమామి మూర్ధ్నా ।
భూతం సరశ్చ మహదాహ్వయ భట్టనాథ
శ్రీ భక్తిసార కులశేఖర యోగివాహాన్
భక్తాఙ్ఘ్రిరేణు పరకాల యతీన్ద్రమిశ్రాన్
శ్రీమత్పరాఙ్కుశ మునిం ప్రణతోఽస్మి నిత్యమ్ ।

  

శ్రీరస్తు

# దివ్యదేశ మంగళా శాసన పంచకమ్

1 విధివిహిత సపర్యాం వీతదోషానుషంగాం
ఉపచిత ధనధాన్యాం ఉత్సవైస్త్యాన హర్షామ్
స్వయ ముపచిను నిత్యం రంగధామన్ స్వరక్షాం
శమిత విమతపక్షాం శాశ్వతీం రంగలక్ష్మీమ్ ।

2. ప్రశమిత కలిదోషాం ప్రాజ్యభోగానుబన్ధాం
సముచిత గుణజాతాః సమ్యగాచార యుక్తామ్ ।
శ్రితజన బహుమాన్యాం శ్రేయసీం వేంకటాద్రౌ
శ్రియ ముపచిను నిత్యం శ్రీనివాస త్వమేవ ॥

3. వరద విరచయ త్వం వారితా శేషదోషాం
పునరుపచిత పుర్యాం భూషితాః పుణ్యకోట్యా ।
సిత ముదిత మనోభి స్తావకై ర్నిత్య సేవ్యాం
హత రిపుజన యోగాం హస్తి ధామ్న స్సమృద్ధిమ్ ॥

4. నవనవ బహుభోగాః నాధ నారాయణ త్వం
విరచియ దురితౌఘైః తా మనాఘ్రాతగన్ధామ్ ।
సహజ సులభ దాస్యై స్సద్భి రభ్యర్థ నీయాం
యతి పరిబృఢ హృద్యాం యాదవాద్రే స్సమృద్ధిమ్ ॥

5. శ్రీరంగ ద్విరద వృషాద్రి పూర్వకేషు
స్థానేషు స్థిర విభవా భవత్సపర్యా ।
ఆకల్పం వరద విధూత వైరిపక్షా
భూయస్యా భవదను కంపయైవ భూయాత్

"శ్రీమద్వేదాంత దేశికులు"

# 108 దివ్యదేశములు

ఈరిరుబదామ్ శోழுమ్ ఈరొన్బదామ్ పాణ్డి
ఓర్ పదిన్మూన్ఱామ్ మలై నాడు; ఒరిరణ్డామ్ శీర్నడునాడు
ఆరోడు ఈరెట్టు తొణ్డై; అవ్వడై నాడు ఆరిరణ్డు;
కూరు తిరునాడు ఒన్ఱాగకొళ్

మణ్ణిల్ అరఙ్గమ్ ముదల్ వైకున్ద నాడళవుమ్
యెణ్ణుమ్ తిరుప్పది నూత్తెట్టినైయుమ్ నణ్ణువార్
కర్పార్ తుదిప్పార్ కరుదువార్ కేట్టిరుప్పార్
పొర్పాదమ్; యెన్తలైమేల్ పూ.

(108 తిరుప్పది అన్దాది)

చత్వారింశత్ దివ్యదేశాః చోళదేశే ప్రకీర్తితాః ।
పాండ్యరాజస్య దేశేతు అష్టాదశ ఇతీరితాః ॥
ద్వేక్షేత్రే మధ్యదేశేచ చేరదేశే త్రయోదశ ।
తొణ్డమణ్డల క్షేత్రాణి ద్వావింశతిరితిస్మృతః ॥
ప్రతీచ్యాం ద్వాదశేత్యాహుః వైకుణ్ఠేన సమంతథా ।
సంఖ్యాంతు దివ్యక్షేత్రాణాం అష్టోత్తర శతం విదుః ॥

| | |
|---|---|
| చోళదేశ దివ్యదేశములు | 40 |
| పాండ్యదేశమున | 18 |
| మధ్యదేశమున | 02 |
| కేరళదేశమున | 13 |
| తొండమండలమున | 22 |
| ఉత్తరభారతమున | 12 |
| శ్రీవైకుంఠము | 01 |

శ్రీరస్తు
శ్రీమతే రామానుజాయనమః

# "దివ్యదేశస్తుతి"

శ్రీ రంగనాథః శ్రీరంగే దివ్య సూరిభిరర్చితః
శ్రీమత్సుందర జామాతా నిచుళాపురనాయకః
తంజపుర్యాం నీలమేఘః; సుందరో బాణపట్టణే
కదంబ వనవాసీతు కదంబవరదోహరిః
శ్వేతాద్రౌ పుండరీకాక్షః; రామోభూత పురీవరే
బృహత్పుర్యాం రసాపూపప్రదో విష్ణు స్సనాతనః
ఆదనూర్ నగరే రమ్యే భుజఙ్గ శయనోహరిః
కృష్ణారణ్యే త్వప్పనాఖ్యః; బాలవ్యాఘ్ర పురీవరే
శ్రీమన్నారాయణో దేవ; స్త్వరుణాఖ్యపురే శుభే
వెణ్ శుడర్ నామదేవోఽయం; కండియూర్ నామ పట్టణే
హర శాపహరో దేవః విష్ణుః పరమశోభనః
సార పుర్యాం సారనాథో; శ్రీశౌరిః కణ్ణపట్టణే
కుంభఘోణే శార్ఙపాణిః చక్రపాణిశ్చ సున్దరః
శ్రీమద్గగన పుర్యాం తు శ్రీనివాసో జగత్పతిః
శ్రీమత్యాళిపురే రమ్య జామాతా; నాగపత్తనే
సౌందర్య రాజః; పూర్ణ శ్రీనరయూర్ పట్టణే శుభే
సుగంధ విపినే రమ్యే సుగంధి వననాయకః
దివ్యే నన్దివనే నాథనాథో భక్తపరాయణః
చిత్రకూటే తు గోవిందరాజో; దేవస్త్రి విక్రమః
శ్రీరామ విణ్ణగర క్షేత్రే; కూడలూర్ నామ్ని పత్తనే
జగద్రక్షక దేవోఽయం; శ్యామళః కృష్ణ పట్టణే
శ్రీభక్తవత్సలః కృష్ణ పుర్యాం; భృగుపురీవరే
శృంగార సుందరోనామ; గజేంద్ర వరదో హరిః

కపిస్థలే తు; నన్దాఖ్యప్రదీపో మణి మండపే
శ్రీవైకుంఠనభః క్షేత్రే దేవో వైకుంఠనాయకః
దుర్విజ్ఞేయ వియత్‌దేశే దేవదేవః పరాత్పరః
శ్రీదేవ బృంద పుర్యాంతు దేవో దైవత నాయకః
పురుషోత్తమ పుర్యాంతు భగవాన్ పురుషోత్తమః
హేమాబ్జ క్లృప్తనిలయే కృపావాన్ శ్రీహరిస్థితః
మణి కూటపురే దివ్యే శ్రీమణి కూ్కాడ నాయకః
శివగీత ఇతి ఖ్యాతే క్షేత్రే శ్రీకృష్ణ నామకః
శ్రీమత్ శ్వేత సరో నామ్న్యాం పుర్యాం నారాయణో హరిః
పార్తన్‌పళ్ళి మహాక్షేత్రే దేవోఽయం కమలాప్రియః
సౌందర్య వల్ల్యా సహితః వనాద్రౌ సుందరాహ్వయః
గోష్ఠి పురే తు ప్రఖ్యాతః సౌమ్య నారాయణో విభుః
శ్రీసత్యగిరి నాథోయం మెయ్యనాఖ్యేతు పట్టణే
పుల్లారణ్యే జగన్నాథః; తణ్‌గాల్ పుర్యప్పనాహ్వయః
మోహూరాఖ్య పురే కాళమేఘాఖ్య స్సర్వకామదః
మధురాయాం మహాపుర్యాం దేవస్సున్దర నాయకః
రంగమన్నారితి ఖ్యాతః ధన్వినవ్య పురే హరిః
శ్రీనగర్యా మాదినాథః తోతాద్రౌ దేవనాయకః
తులవిల్లి మంగళాఖ్యే పద్మాక్షో దేవనాయకః
తింత్రిణే మందిరే రమ్యే దేవఃకాయ్‌శిన భూపతిః
తెన్ తిరుప్పేర్ పురే దివ్యే దేవో మకరకుండలః
శ్రీవైకుంఠ మహాక్షేత్రే వైకుంఠో భగవాన్ హరిః
వరమంగాభిధక్షేత్రే దేవశ్శ్రీవిజయాసనః
బృహత్తటాక నగరే మాయానట ఇతిశ్రుతః
కురంగనామ్ని నగరే శ్రీపూర్ణః పంచధా స్థితః
తిరుక్కోళూరితి క్షేత్రే నిక్షిప్తనిధి నామకః

అనంతశయనేఽనంత పద్మనాభో రమాసఖః
తిరువణ్ పరిశారాఖ్యే తిరువాళ్ మార్పనాహ్వయః
శ్రీమన్నిరద సేత్వాఖ్యే దేవో వాత్సల్య నాయకః
తిరుమూళిక్కళ క్షేత్రే భగవానప్పనాహ్వయః
మాయానట వరః శ్రీమాన్ శార్దూల నగరీ వరే
రక్తనేత్ర స్థలాధీశః ఇమై యోరప్పనాహ్వయః
శ్రీ శ్రీనావపురే రమ్యే నావాయ్ నారాయణో హరిః
శ్రీవల్లవాళితిక్షేత్రే దేవోఽలంకార నామకః
సిత భ్రమర పుర్యాంతు పాంబణై అప్పనాహ్వయః
సముద్రనిమ్నగాఖ్యాన నగర్యామాది కేశవః
విద్వద్గోష్ఠి నగర్యాంతు శ్రీమానభయ దాయకః
శ్రీమత్కటిస్థాన పురేఽ ద్భుత నారాయణో విభుః
తిరువారన్ విళై క్షేత్రే దేవః పద్మాసనీ ప్రియః
దేవనాథ నితిఖ్యాత స్త్వహీంద్రాఖ్య పురీవరే
శ్రీకోవళూర్ పురే లక్ష్మ్యా దేవదేవ స్త్రి విక్రమః
శ్రీమత్కాంచీ నగర్యాం తు వరదోఽభీష్టదాయకః
తత్రైవ శ్రీహస్తిగిరౌ నారాసింహో మహాబలః
శ్రీమత్యష్టభుజ క్షేత్రే శ్రీమానష్టభుజో హరిః
తిరుత్తణ్గా దివ్యక్షేత్రే దేవో దీపప్రకాశకః
వేళుక్కై పత్తనే రమ్యే ముకుందశ్చ నృకేసరీ
పార్థదూతస్తు భగవాన్ శ్రీత్పాడక పట్టణే
జగతామీశ్వరో నామ ఖ్యాతోనీర నికేతనే
కచ్చినామ్ని మహాక్షేత్రే పూర్ణ చంద్రముఖోహరిః
త్రివిక్రమోహ్యూరగాఖ్యే కారగే కరుణాకరః
కార్వానాఖ్య పురే రమ్యే చోరాహ్వయధరో విభుః
వరాహరూపీ భగవాన్ కళ్వనూరితి నామకే

యథోక్తకారీ గోవిందః తిరువెంకాహ్వయే పురే
ప్రవాళవర్ణో భగవాన్ ప్రవాళాఖ్య పురీ వరే
వైకుంఠనాథో వైకుంఠః పరమేశాంబరే పురే
తిరుప్పుళ్ కుళి సుక్షేత్రే దేవో విజయ రాఘవః
శ్రీ నిన్రవూరితి క్షేత్రే భగవాన్ భక్తవత్సలః
వీక్షారణ్యే శాలిహోత్ర వరదో వీరరాఘవః
తిరునీర్మల పుర్యాంతు నీర్వణ్ణన్ నామ నాయకః
ఇడవెందై పురే రమ్యే నిత్యకల్యాణ సుందరః
కడల్మల్లై ఇతిక్షేత్రే స్థలశాయీ సనాతనః
ఖ్యాతే కైరవిణీ తీరే పార్థసారథి రవ్యయః
ఘటికాద్రౌ శ్రీనృసింహః సేవ్యమానో హనుమతా
శ్రీమద్వేంకటశైలాగ్రే శ్రీమాన్ వేంకటనాయకః
అహోబిలే నృసింహాఖ్యః నవధా సేవ్యతే హరిః
శ్రీరామచంద్రోఽయోధ్యాయాం శరణాగత వత్సలః
శ్రీదేవరాజో భగవాన్ నైమిశాఖ్యాన కాననే.
సాలగ్రామేతు శ్రీమూర్తిః సులభ స్సర్వ కామదః
శ్రీమన్నారాయణో దేవః ప్రఖ్యాతో బదరీ వనే
దేవప్రయాగే శ్రీనీలమేఘాఖ్యో దైత్యసూదనః
తిరుప్పిరిది పుర్యాం తు దేవః పరమపూరుష ః
మధురాయాం వాసుదేవః శ్రీకృష్ణో దేవకీసుతః
ద్వారకాయాంతు కల్యాణ నారాయణ ఇతిస్తుతః
నవమోహన కృష్ణాఖ్యః సేవ్యతే గోకులే శుభే
క్షీరాబ్ధి శయన శ్శ్రీమాన్ క్షీరార్ణవ నికేతనః
శ్రీమద్వైకుంఠనగరే దివ్యలోకే శ్రియసహ
భక్తై ర్భాగవతై స్సాకం వాసుదేవో నిషేవ్యతే
అష్టోత్తర శతస్థానే ష్వావిర్భూతస్య శార్ఙ్గిణః
యః పఠేత్ ప్రయత స్స్తోత్రం సర్వాన్ కామానవాప్నుయాత్





శ్రీమతే రామానుజాయ నమః

# దివ్యదేశ వైభవ ప్రకాశికా

(సచిత్ర ఆంధ్ర వివరణాది విభూషితా)



SRI LAKSHMI HAYAGREEVA SWAMI

హయగ్రీవర్

**Hayagreevar**

శ్రీరస్తు
శ్రీమతే రామానుజాయ నమః
శ్రీ మద్వరవరమునయే నమః

# దివ్యదేశ వైభవ ప్రకాశికా

**మఙ్గళా చరణ శ్లోకః**

శ్లో॥ వందే శ్రీపతి మిందు సుందరముఖం వందారు చింతామణిం
కుంద ద్యోతి రదావళిం కమలయా సంశోభితోరస్థలమ్ ।
నందా నందధు దాయకం ఘన కృపా వారాంనిధిం సన్నిధిం
బృందారణ్య విలాస వాసరసికం శ్రీ రఙ్గరాజం సదా ॥

**గ్రంథావతరణోపోద్ఘాతః**

శ్లో॥ శ్రీ శేష శైలోత్తమ పూర్వభాగే– శ్రీ మంగళం బాడి రితిప్రసిద్ధః
దివ్యాగ్రహారోఽస్తి హి వైష్ణవానాం–రమ్యాలయ శ్రేణి విరాజమానః ॥

శ్లో॥ ఆత్రేయాన్వయ వంశ రమ్య మణినా వైరాగ్య విద్యాబ్ధి నా
నిర్దిష్ట స్తిరు వేఙ్గడార్య విదుషా తద్గ్రామ సంవాసినా ।
తద్వంశ్యో భగవత్పద ద్వయపదో గోపాలకృష్ణః కవి :
దివ్యక్షేత్ర సువైభవం రచయతే శృణ్వంతు సంతో ముదా ॥

శ్లో॥ క్వాఽయం జనః క్వచ రమాపతి దివ్యదేశ–
జాతాని పుణ్య పురుషావళి సేవితాని ।
అప్యేవ మద్య యతిరాజ కృపా కటాక్ష
భూమ్నా వదామి విభవాన్ భగవత్ స్థలానామ్ ॥

శ్లో॥ ప్రథమం చోళదేశీయ దివ్య క్షేత్రాణి సజ్జనైః ।
సేవితాని ప్రకీర్త్యంతే శ్రీ రఙ్గాదీని విస్తరాత్ ॥

## ❁ 1 శ్రీ రంగమ్ 1 ❁

శ్లో॥ కావేరీ పరిపూత పార్శ్వ యుగళే పున్నాగ సాలాంచితే
చంద్రాఖ్యాయుత పుష్కరిణ్యనుగతే రంగాభిధానే పురే ।
వైమానే ప్రణవాభిధే మణిమయే వేదాఖ్య శృంగోజ్జ్వలే
దేవం ధర్మదిశా ముఖం ఫణిశయం శ్రీ రఙ్గనాథం భజే ॥

శ్లో॥ శ్రీ ధర్మవర్మ రవివర్మ నిషేవితాఙ్గః
శ్రీ రఙ్గిణీ చటుల విభ్రమ లోల నేత్రః ।
నీళా సరస్యముఖ సూరి వరేణ్య గీతి
పాత్రం విరాజతి విభీషణ భాగధేయః ।

**వివరణః-** శ్రీరఙ్గనాథుడు(నంబెరుమాళ్), శ్రీరఙ్గనాయకి, ఉభయ కావేరులు; చంద్రపుష్కరిణీ, ప్రణవాకార విమానము; దక్షిణ ముఖము; భుజంగ శయనము; ధర్మవర్మకు; రవివర్మకు విభీషణునకు ప్రత్యక్షము. ఆళ్వార్లు అందరు కీర్తించిన తిరుపతి. ఆంతరంగిక కైంకర్య పరులు తిరుప్పాణి ఆళ్వార్

**ఉత్సవములుః** మకరం పునర్వసు; కుంభం శుద్ధ ఏకాదశి; మీనం ఉత్తర; మేషం రేవతి అవసాన దినములుగా నాలుగు బ్రహ్మోత్సవములు జరుగును. ధనుశ్శుద్ధ ఏకాదశికి ముందు వెనుకలుగా అధ్యయనోత్సవము పగల్‌పత్తు, రాపత్తు ఉత్సవములు, మిక్కిలి వైభవముగా జరుగును.

**విశేషము :** శ్రీ రంగము ఉభయ కావేరీ నదుల మధ్యన గల ఒక ద్వీపము. సప్త ప్రాకారములతో పదునైదు గోపురములతో విలసిల్లు భూలోక వైకుంఠము.

శ్లో॥ కావేరీ విరజా సేయం వైకుంఠం రంగమందిరమ్ ।
సవాసుదేవో రంగేశః ప్రత్యక్షం పరమం పదమ్ ॥

ఆళ్వార్లు కీర్తించిన నూట యెనిమిది దివ్య దేశములలో శ్రీరంగము ప్రధానమైనది. శ్రీరామకృష్ణాది విభవావతారములకు క్షీరాబ్ధి నాధుడు మూల కందమగునట్లు అర్చావతారములకు శ్రీరంగనాధుడే మూల కందము.

కావుననే మన పెద్దలు ప్రతి దినం "శ్రీమన్ శ్రీరంగ శ్రియ మను పద్రవాం అనుదినం సంవర్ధయ" అని అనుసంధానము చేతురు. పదిమంది ఆళ్వార్లు, ఆండాళ్, ఆచార్యులు అందరు సేవించి ఆనందించి తరించిన దివ్యదేశము. భోగ మండపము, త్యాగ మండపము; పుష్ప మండపము; జ్ఞాన మండపములుగా ప్రసిద్ధి చెందిన నాల్గు క్షేత్రములలో శ్రీ రంగము భోగ మండపము. 2. తిరుమలై - పుష్ప మండపము. 3. కాంచీపురము - త్యాగ మండపము 4. తిరనారాయణపురము - జ్ఞాన మండపము. ప్రణవాకార విమానములో శ్రీ రంగ నాథులు శయనతిరుక్కోలమున వేంచేసియున్న తీరు అత్యద్భుతము. మరియు సర్వేశ్వరుడు స్వయముగా నవతరించిన యెనిమిది క్షేత్రములలో ప్రధానమైనది **శ్రీరఙ్గము.**

## స్వయం వ్యక్త క్షేత్రములు

| | | |
|---|---|---|
| 1. | శ్రీరంగము | శ్రీ రంగనాథులు |
| 2. | శ్రీముష్ణము | భూవరాహ పెరుమాళ్ |
| 3. | తిరుమలై | తిరువేంగడముడైయాన్ |
| 4. | తిరునీర్మలై | శ్రీరంగనాధన్ (నీర్వణ్ణన్) |
| 5. | నైమిశారణ్యం | దేవరాజన్ (వనరూపి) |
| 6. | పుష్కరమ్ | పరమపురుషన్ (తీర్థరూపి) |
| 7. | బదరికాశ్రమమ్ | తిరునారణన్ |
| 8. | సాలగ్రామం | శ్రీమూర్తి |

వైవస్వత మనువు కుమారుడు ఇక్ష్వాకు మహారాజు. ఆయన బ్రహ్మను గూర్చి తపము గావించెను. బ్రహ్మ ప్రీతుడై తన ఆరాధనయగు శ్రీరంగనాథుని ఇక్ష్వాకు మహారాజునకు ప్రసాదించెను. ఆ తిరువారాధన ఇక్ష్వాకు మహారాజు నుండి శ్రీరామచంద్రుల వరకు వచ్చెను.

శ్రీ రామ పట్టాభిషేకానంతరము విభీషణులు శ్రీరామ వియోగమును భరింపజాలక లంకకు మరల లేకుండిరి. ఆ సమయమున శ్రీరామచంద్రులు తమకు మారుగ తమ తిరువారాధనయగు శ్రీరంగనాథుని విభీషణాళ్వాన్లకు ప్రసాదించిరి. విభీషణులు సంతుష్టాంతరంగులై లంకకు పయనమైరి.

ఈ విధముగా లంకకు పయనమైన శ్రీరంగనాథులు ఉభయ కావేరి మధ్య భాగమును చేరిరి. విభీషణులు స్వామిని అక్కడ వేంచేపు చేసి సంధ్యా వందనము చేసి తిరిగి వచ్చిరి. ఇంతలో శ్రీరంగనాథులు ప్రణవాకార విమానమున అక్కడనే వేంచేసి యుండుట చూచి విభీషణాళ్వార్ మిక్కిలి ఖేద పడిరి. అంత శ్రీరంగనాథులు వారిని ఊరడించి రాత్రి భాగమున శ్రీవిభీషణాళ్వార్లచే తిరువారాధన పొందునట్లు వర మనుగ్రహించిరి.

ఇచ్చట గర్భాలయములో శయనించియున్న మూర్తికి "పెరియ పెరుమాళ్" అని పేరు. ఉత్సవ మూర్తికి 'నంబెరుమాళ్' అనిపేరు. ఒకానొక సమయమున తురుష్కుల వలన ఉపద్రవ మేర్పడగా శ్రీరంగనాధుల ఉత్సవ మూర్తిని చంద్రగిరి ప్రాంతమునకు వేంచేపుచేసికొని పోయిరి. అ సమయములో మరియొక అర్చామూర్తిని ఉత్సవమూర్తిగా వేంచేపు చేసిరి. ఆ విధముగా కలాపకాలమున వేంచేసి ఉత్సవాదులు స్వీకరించిన మూర్తిని 'తిరువరంగ మాళిగై యార్' అని యందురు.

పిళ్లై లోకాచార్యుల వారు తమ "ముముక్షుప్పడి" గ్రంధములో సర్వేశ్వరుని కళ్యాణగుణములను విశదీకరించి "ఇవై యెల్లామ్ నమక్కు నంబెరుమాళ్ పక్కలిలే కాణలామ్" (ఈ తిరుకల్యాణ గుణము లన్నియు మనకు నంబెరుమాళ్ విషయములో కనుపించును) అని ప్రస్తుతించుటచే ఉత్సవమూర్తికి "నంబెరుమాళ్" అని పేరు వచ్చినది. వారు శ్రీరంగనాధుని సౌందర్యమును ఇట్లు అభివర్ణించిరి. **తిరుక్కైయిలే పిడిత్త. దివ్యాయుధజ్గళుమ్; వైత్తు అఞ్జలెన్న కైయుమ్; కవిత్త ముడియుమ్; ముగముమ్; మురువలుమ్; ఆసన పద్మత్తిలే అళుత్తిన తిరువడిగళుమాయ్ నిఱ్కిర నిలయే నమక్కు త్తఞ్జమ్".**

శ్రీ పరాశర భట్టారకులును తమ శ్రీరంగరాజ స్తవమున

శ్లో॥ **అబ్జన్యస్త పదాబ్జ మంచితకటీ సంవాది కౌశేయకం**
**కించిత్ తాండవ గంధి సంహననకం నిర్వ్యాజ మందస్మితమ్ ।**
**చూడాచుమ్బి ముఖాంబుజం నిజభుజా విశ్రాంత దివ్యాయుధం**
**శ్రీరంగే శరదశ్శతం తత ఇతః పశ్యేమ లక్ష్మీ సఖమ్ ।**

అని ప్రస్తుతించి యున్నారు.

గర్భాలయములో శ్రీరంగనాధుని ఎదుటగల బంగారు స్తంభములకు "తిరుమణైత్తూణ్" అనిపేరు. నంబెరుమాళ్ల సౌందర్య సముద్రములో పడి కొట్టుకొని పోవు వారిని నిలువరించు స్తంభములుగా వీనిని పేర్కొందురు. స్వామి ప్రసాదములారగించు ప్రదేశమునకు "గాయత్రీమంటపము" అనిపేరు. గర్భాలయమునకు ముందుగల ప్రదేశము "చందన మంటపము." గర్భాలయ ప్రదక్షిణకు "తిరువణ్ణాళి" ప్రదక్షిణమని పేరు.

<u>మొదటి ప్రాకారమునగల ముఖ్య విశేషములు:</u> ద్వారపాలకులు, యాగశాల; విరజబావి; సేనమొదలియార్ సన్నిధి; పగల్‌పత్తు మండపం; చిలకల మండపం; కణ్ణన్, సన్నిధి. ఇక్కడ గల చిలుకల మండపము నుండియే విమానముపై గల పరవాసు దేవులను సేవింప వలయును.

<u>రెండవ ప్రాకారము:</u> ఈ గోపుర ద్వారమునకు "ఆర్యభట్టాళ్‌వాశల్" అని పేరు. ఈ ప్రాకారములోనే పవిత్రోత్సవ మండపం గలదు. ఈ మండపములో

హయగ్రీవులకు సరస్వతిదేవికి సన్నిధులు కలవు. రెండవది ఉళ్కోడై మంటపము. దీనికి దొరమండపమనియు పేరుగలదు. విరజా మండపము. దీని క్రింద విరజానది ప్రవహించుచున్నదని పెద్దలందురు. నాల్గవది వేద విణ్ణప్పం జరుగు మండపం. పరమపద వాశల్; తిరుమడప్పళ్లి; ఊంజల్ మండపం; ధ్వజారోహణ మండపం గలవు. ఇచట స్తంభముపై గల వినీత ఆంజనేయస్వామి వరప్రసాది.

**మూడవప్రాకారము :** ఈ ప్రాకారమునకు "ఆలినాడన్ తిరువీథి" అనిపేరు. ఈ తిరువీధిలో గరుడన్ సన్నిధి గలదు. దీనికి వెలుపల వాలిసుగ్రీవుల సన్నిధులు గలవు. నమ్మాళ్వార్ల సన్నిధి ఈ ప్రాకారములోనే కలదు. ప్రాకారమునకు ఎడమ భాగమున ధాన్యం కొలచు మండపము గలదు. దీని ప్రక్కనే నంజీయర్ సన్నిధి గలదు. ఉగ్రాణము; మేల్ పట్టాభి రామన్ సన్నిధి; ముదలాళ్వార్ల సన్నిధి, చంద్రపుష్కరిణి, పొన్నవృక్షము, దీని వెనుక వేదవ్యాసర్ సన్నిధి, వరాహ పెరుమాళ్ కోయిల్, వరదరాజస్వామి సన్నిధి, కీళ్ పట్టాభిరామన్ సన్నిధి, వైకుంఠనాధన్ సన్నిధి, తిరుమణల్ వెళి (ఇసుకబయలు) తిరుమళిశై ఆళ్వార్ల సన్నిధి, శ్రీ భండారము, సూర్య పుష్కరిణి, తిరుక్కచ్చినంచి సన్నిధి గలవు.

**నాల్గవ ప్రాకారం :** ఈ ప్రాకారమునకు "అకళంకనాట్టాళ్వాన్ తిరుచ్చి అనిపేరు. ఈ ప్రాకారము లోపల కుడిప్రక్క కూరత్తాళ్వాన్ సన్నిధి గలదు. శ్రీ పరాశర భట్టర్ సన్నిధిలో వారి శ్రీపాదములందు నంజీయర్ వేంచేసి యున్నారు. లక్ష్మీనారాయణులు, అమృత కలశ హస్తులైన గరుడాళ్వార్ సన్నిధి కలదు. ఎడమచేతి ప్రక్క బజారు దాటిన పిమ్మట శ్రీమన్నాథమునుల సన్నిధి గలదు. దీనికి బయట కంబనాట్టాళ్వాన్ మండపము కలదు.

ఈ ప్రాకారమలో సేవింప దగినది శ్రీరంగ విలాస మండపం. దీనిపై తిరుమంత్రము, ద్వయము, చరమశ్లోకములు, (శ్రీకృష్ణ, శ్రీవరాహ, శ్రీరామ) అవతరించిన విధము చిత్రించబడినది.

విజయ స్తంభము, ఉళ్ ఆండాళ్ సన్నిధి, వాహన మండపం, చక్రత్తాళ్వాన్ సన్నిధి, తిరువరంగత్తముదనార్ సన్నిధి, వసంత మండపం, ఈ ప్రాకారములోనే కలవు. శ్రీరంగనాచ్చియార్ సన్నిధియు ఈ ప్రాకారములోనే యున్నది. ఈ సన్నిధి ముఖ మండప స్తంభముపై తిరువెళ్లరై పుండరీకాక్షులు వేంచేసియున్నారు. మీనమాస పంగుని ఉత్తారా నక్షత్రమున శ్రీరంగనాచ్చియార్‌తో శ్రీరంగనాథులు వేంచేసియున్న సమయమున ఉడయరులు శరణాగతి గద్యను విన్నవించిన స్థలము శరణాగతి మండపము. అది ఈ ప్రాకారములోనే కలదు. మేట్టళగియ సింగర్ సన్నిధి, ధన్వంతరి సన్నధి, ఐన్దుకుడి మూన్ఱు వాశల్ (అయిదు గుంటలు, మూడు

ద్వారములు) శ్రీనివాస పెరుమాళ్, పెరియవాచ్చాంబిళ్లై సన్నిధి, ఈ ప్రాకారములోనే కలవు.

ప్రతి సంవత్సరము రాపత్తు పది దినములు శ్రీరంగనాధులు కొలువు తీరు వేయి కాళ్ల మండప మీప్రాకారములో కలదు.దీనికి "ఆయిరమ్ కాల్ మండపమని" పేరు. (సహస్రస్థూణా మండపం) ఈ మండపములో స్వామి వేంచేయుండు స్థలమునకు తిరుమామణి మండపమని పేరు.

ఇచట గల శేషరాయన్ - మండపములో ఒక ప్రక్క దశావతారములు, మరియొక ప్రక్క కోదండరామన్ సన్నిధి కలవు. దాని ప్రక్కన పిళ్ల లోకాచార్యుల వారి సన్నిధి, వారి సోదరులు అళగియ మణవాళ పెరుమాళ్ నాయనార్ సన్నిధి, పార్ధ సారధి సన్నిధి కలవు.

ఈ ప్రాకారములో ప్రధానమైన మరియొక సన్నిధి ఉడయవర్ (భగవద్రామానుజులు) సన్నిధి. ఇచట ఉడయవర్ "తానాన" తిరుమేనిగా వేంచేసి యున్నారు (తానేయైన తిరుమేని) ఇది పూర్వము వసంత మండపము. ఇచట వేంచేసి యున్న ఉడయ వరులు సేవించువారి హృదయమున వేంచేసి యుందురని మణవాళ మామునులు అభివర్ణించి యున్నారు. ఈ సన్నిధిలో ఆళవందార్ పెరియ నంబి వేంచేసి యున్నారు. స్వామి తిరువారాధన యగు తేవ ప్పెరుమాళ్ (వరదరాజస్వామి) సన్నిధి ప్రక్కన వేంచేసి యున్నారు. ప్రతి దినం ఉదయం 9 గంటల ప్రాంతమున స్వామి సన్నిధిలో సేవ శాత్తుముఱై జరుగును.

ఇంకను ఈ ప్రాకారములో వీరాంజనేయ స్వామి సన్నిధి, విఠల్ కృష్ణన్ సన్నిధి, తొండరడిప్పొడియాళ్వార్ సన్నిధి కలవు.

<u>ఐదవ ప్రాకారము :</u> ఈ ప్రాకారమునకు ఉత్తర వీధి యనిపేరు. మకర (తై) మీన (పంగుని) మాసములో జరుగు బ్రహ్మోత్సవములలో శ్రీరంగనాధులు ఈ వీధులలో వేంచేయుదురు. మకరమాస పుష్యమీ నక్షత్రమున నంబెరుమాళ్లు ఉభయనాచ్చిమార్లతో తిరుత్తేరుపై వేంచేయుదురు.

ఈ ప్రాకారములో ఉత్తమనంబి, తిరుమాళిగ, శ్రీరంగనారాయణ జీయర్ మఠం, ఆచార్యపురుషుల తిరుమాళిగలు మణవాళమామునుల సన్నిధి కలవు.

<u>ఆరవ ప్రాకారము :</u> ఈ ప్రాకారమునకు "చిత్రివీధి" యనిపేరు. మేషమాస (చిత్రి) బ్రహ్మోత్సవమున నంబెరుమాళ్లు ఈ వీధులలో వేంచేయుటచే ఈ వీధికి "చిత్రివీధి" యని పేరు వచ్చెను. ఆళ్వారాదులు తిరునక్షత్రముల యందు ఈ తిరువీధులలో వేంచేయుదురు.

ఉత్తర మాడ వీధిలో వేదాంత దేశికర్ సన్నిధి, దీనికి ప్రక్క జగన్నాధన్

సన్నిధి, తూర్పు చిత్రి మాడ వీధిలో తిరుత్తేరు, పెరియనంబి, కూరత్తాళ్వాన్, మొదలి యాండాన్ తిరుమాళిగలు, వానమామలై జీయర్ మఠం గలవు.

దక్షిణ ప్రాకార వీధి మధ్యలో పాతాళకృష్ణన్ సన్నిధి కలదు. ఇది ఐదు అడుగుల లోతులోనున్నది.

<u>ఏడవ ప్రాకారము :</u> ఈ ప్రాకారమునకు 'అడయవళంజాన్' వీధియనిపేరు. ఈ ప్రాకారములో తిరుక్కురళప్పన్ (వామనుని) సన్నిధి కలదు. వెళియాండాళ్ సన్నిధి కూడా కలదు. పడమటి ద్వారము గుండ తెప్పగుంటకు పోవచ్చును. కుంభమాస (మాసి) బ్రహ్మోత్సవములో రథోత్సవమునకు బదులు తెప్ప ఉత్సవము ఈ తెప్పగుంటలోనే జరుగును. ఉత్తర ద్వారమునుండి కొల్లిడమునకు పోవు దారి కలదు. ఈ కొల్లిడం దక్షిణ తీరమున తిరుమంగై యాళ్వార్లకు ప్రత్యక్షమైన దశావతారముల సన్నిధి కలదు. ఇచట తిరుమంగై ఆళ్వార్ వేంచేసి యున్నారు. ఈ కొల్లిడ మందు తిరుమంగై ఆళ్వార్ పడిత్తురై, ఆళవందార్ పడిత్తురై కలవు. పడమటి ద్వార సమీపములో కాట్టళిగియ శింగర్ సన్నిధి కలదు. ఇది శ్రీవచన భూషణ మవతరించిన స్థలము. దక్షిణ గోపురము ద్వారా కావేరి నదికి పోవచ్చును. దీనికే రాయగోపురమని పేరు.

<u>ఉత్సవ విశేషములు :</u> మకరం, కుంభం, మీనం, మేష మాసములందు వరుసగా నాల్గు బ్రహ్మోత్సవములు జరుగును. మకరమాసమున "పునర్వసు" తీర్థోత్సవముగా బ్రహ్మోత్సవము జరుగును. ఇది చక్రవర్తి తిరుమగన్ (శ్రీరామచంద్రులచే) ఏర్పాటు చేయబడినది. కావున దీనికి భూపతి తిరునాళ్ల అని పేరు వచ్చినది. కుంభ మాసమున "శుద్ధ ఏకాదశి" తీర్థోత్సవముగా బ్రహ్మోత్సవము. ఇది స్వామి యెంబెరుమనార్లచే ఏర్పాటు చేయబడినది. మీన మాసమున "ఉత్తరా నక్షత్రము" తీర్థోత్సవముగా బ్రహ్మోత్సవము. ఇది చతుర్ముఖ బ్రహ్మచే జరిపింప బడినది. దీనికి ఆది బ్రహ్మోత్సవమని పేరు. మేష మాసమున "రేవతి" అవసాన దినముగా బ్రహ్మోత్సవము. దీనికి విరుప్పన్ తిరునాళ్ల అనిపేరు.

ఇవిగాక అధ్యయనోత్సవము(పగల్‌పత్తు రాపత్తు) తప్పక సేవింప దగినది. ధనుర్మాసము, ధనుశ్శుద్ధ ఏకాదశి నాటి వైకుంఠ ద్వార దర్శనము సేవింపదగినది. ఇంకను ఉగాది, విజయ దశిమి మున్నగు ఉత్సవములు జరుగును. ఇచట ప్రతి నిత్యము ఉత్సవ సంరంభమే.

<u>ఈ క్షేత్ర స్వామి విషయమై ఆళ్వార్ల అనుభవములు:</u>

నమ్మాళ్వార్ల తిరువాయి మొళి సప్తమ శతకము రెండవ దశకములో (7-2) భగవద్విశ్లేషమును సహింపలేక శ్రీరంగనాథుల శ్రీపాదములలో ప్రపత్తి చేసి అదియు ఫలింపక పోవుటచే దుఃఖనిమగ్నులై నాయికావస్థను బొంది యుండగా అప్పుడామె

తల్లిగారు తమ కుమార్తె విషయమై 'నీవేమి తలచియున్నావని' శ్రీరంగనాథుని ప్రశ్నించుచున్నారు. "ఇవళ్ తిరత్తు ఎన్ శిన్దిత్తాయ్" ఈమె విషయమై ఏమి తలంచితివి ?

"అమాయకురాలగు ఈ శఠగోపనాయికను పరితపింప చేయుచు నేమియు తెలియని వానివలె కావేరీ జలపరిపూర్ణమైన శ్రీరంగముననాగపర్యంకముపై పవళించి యుంటివా ! ఈమెనేమి చేయ దలచితివి ? యని శ్రీరంగనాథుని **సౌహార్దమను** గుణమును ప్రకాశింప చేయు చున్నారు.

పెరియాళ్వార్ ఈ దివ్యదేశమును **"తిరువాళన్ తిరుప్పది"** యని అభివర్ణించి యున్నారు.

తిరుమంగై ఆళ్వార్లు ఈ స్వామిని "కుడపాలానై" పశ్చిమ దిగ్గజమని వర్ణించియున్నారు.

తెన్నానై - సుందర బాహువు (తిరుమాలిరుంశోలై) దక్షిణ దిగ్గజమని
వడవానై - తిరువేంగడముడైయాన్ - ఉత్తర దిశా దిగ్గజము
కుణపాలమదయానై - శౌరిరాజ పెరుమాళ్ - ప్రాక్‌దిశా దిగ్గజము (తిరుక్కణ్ణాపురమ్)
నమ్మాళ్వారు తమ తిరువాయిమొళి ప్రబంధమును శ్రీరంగనాథులకు అంకితము జేసిరి.నమ్మాళ్వార్లు "ముగిల్వణ్ణనడిమేల్ శొన్నశొల్మాలై ఆయిరత్తి పత్తుమ్" మొయిలు వంటి కాంతిగల శ్రీరంగనాథుల శ్రీపాదముల విషయమై సర్వేశ్వరుడు అర్చావతారమున తన నిత్య కృత్యములను ఈ విధముగా నిర్వహించునని పెద్దలు సాదింతురు.

| | | |
|---|---|---|
| నిద్రమేల్కొనుట | - | తిరునారాయణపురమున |
| సుప్రభాతసేవ | - | తిరుమలై |
| స్నానము | - | ప్రయాగ |
| జపము | - | బదరికాశ్రమము |
| ఆరగింపు | - | పూరీ జగన్నాధము |
| రాచకార్యము | - | అయోధ్య |
| విహారము | - | బృందావనము |
| శయనము | - | శ్రీరంగము |

**ఈ స్వామి విషయమై వెలసిన స్తోత్రము పెక్కులు. అందుకొన్ని**

| | | | |
|---|---|---|---|
| 1. | స్తోత్ర రత్నము | - | ఆళవన్దార్ (యామునాచార్యుల వారు) |
| 2. | కాన్తా చతుశ్లోకి | - | (ఆళవన్దార్) |



౦.పెరియ పెరుమాళ్ - శ్రీరంగం
Periya Perumal Sri Rangam



1A.నంబెరుమాళ్ - శ్రీరంగం

Namberumal Sri Rangam

| | | | |
|---|---|---|---|
| 3. | గద్యత్రయమ్ | - | భగవద్రామనుజులు |
| | శరణాగతిగద్య | - | " " |
| | శ్రీరంగగద్య | - | " " |
| | శ్రీవైకుంఠగద్య | - | " " |
| 4. | శ్రీ స్తవం | | కూరత్తాళ్వాన్ |
| 5. | శ్రీరంగరాజస్తవమ్ | - | (పరాశరభట్టర్) |
| 6. | శ్రీరంగనాథస్తోత్రమ్ | - | (పరాశర భట్టర్) |
| 7. | శ్రీగుణరత్నకోశమ్ | - | (పరాశర భట్టర్) |
| 8. | క్షమాషోడశీ | - | (వేదాంతాచార్య) |
| 9. | శ్రీస్తుతి : | - | శ్రీమద్వేదాన్త దేశికులు |
| 10. | భగవద్ధ్యాన సోపానమ్ | - | శ్రీమద్వేదాంత దేశికులు |
| 11. | అభీతిస్తవ : | - | శ్రీమద్వేదాంత దేశికులు |
| 12. | న్యాసతిలకమ్ | - | శ్రీమద్వేదాంత దేశికులు |
| 13. | శ్రీరంగనాధాష్టకమ్ | - | (ఆది శంకరాచార్యులు) |

## ఆళ్వారుల మంగాళా శాసన పాశురములు

1. ఒన్రు మఱన్దఱియే నోదనీర్ వణ్ణనై నాన్
ఇన్రు మరప్పనో వేళైకాళ్ - అన్రు
కరువరఙ్గత్తుట్కిడన్దు కై తొழுదేన్ కణ్డేన్
**తిరువరఙ్గ మేయాన్ తిశై.**

పొయిగై ఆழ్వార్-ముదల్ తిరువన్దాది 6

2. మనత్తుళ్ళాన్ వేఙ్గడత్తాన్ మాకడలాన్ మఱ్ఱుమ్
నినైప్పరియ **నీళరఙ్గత్తుళ్ళాన్** - ఎనైప్పలరుమ్
దేవాది దేవనెనప్పడువాన్; మున్నొరునాళ్
మావాయ్ పిళన్ద మగన్.

పూదతాళ్వార్-ఇరండాంతిరువన్దాది 28

3. విణ్ణ గరమ్ వెஃకా విరితిరై నీర్ వేఙ్గడమ్
మణ్ణకరమ్ మామాడ వేళుక్కై;- మణ్ణగత్త
తెన్ కుడన్దై తేనార్ **తిరువరఙ్గమ్** తెన్కోట్టి;
తన్ కుడఙ్గై నీరேఱ్ఱాన్ తాழ்వు

పేయాழ்వార్ - మూన్ఱాం తిరువన్దాది 62

4. కొణ్డై కొణ్డ కోదై మీదు తేనులావు కూనికూన్
ఉణ్డై కొణ్ణ రఙ్గవోట్టి యుళ్ మగిழ்న్ద నాదనూర్
నణ్డెయుణ్డు నారై పేర వాళపాయ ; నీలమే
అణ్డెకొణ్డు కెణ్డై మేయు **మన్దణీరరఙ్గమే**

తిరుమழிశై ఆழ்వార్ తిరుచ్చన్ద విరుత్తమ్ 49

5. కఙ్గులు మ్పగలు ఙ్కణ్డుయి లఱియాళ్ కణ్ణనీర్ కైగళాలిఱైక్కుమ్;
శఙ్గు శక్కరఙ్గళెన్రు కైకూప్పుమ్ తామరైక్కణ్ణెన్రే తళరుమ్,
ఎఙ్గనే తరిక్కేనున్నై విట్టెన్ను మిరునిలఙ్కై తుழாవిరుక్కుమ్
శెఙ్గయల్ పాయ్నీర్ **త్తిరువరఙ్గత్తా యివళ్** తిఱత్తెన్ శెయ్గిన్రాయే ॥

నమ్మాழ்వార్ - తిరువాయిమొழி 7-2-1

ఇరుళిరియ చ్చుడర్ మణిక ళిమైక్కుమ్ నెற்றி
యినత్తుత్తియణి పణమాయిరఙ్గళార్న్ద
అరవరశ ప్పెరుమ్జోది యనన్దనెన్ను
మణివిళఙ్గు మయర్ వెళ్ళై యణైయై మేవి;
**త్తిరువరఙ్గ ప్పెరునగరుళ్** తెణ్ణీర్ప్పొన్ని
త్తిరైక్కైయా లడివరుడ ప్పళ్ళికొళ్ళుమ్
కరుమణియై క్కోమళత్తై క్కణ్డుకొణ్డు
ఎన్ కణ్ణిణైగ ళెన్రుకొలో కళిక్కునాళే

కులశేఖరాழ்వార్. పెరుమాళ్తిరుమొழி 1-1-1

మాదవత్తోన్ పుత్తిరన్ పోయ్ మఱి కడల్వాయ్ మాణ్డానై
ఓదువిత్త తక్కణైయా వురువురువే కొడుత్తానూర్
తోదవత్తి త్తూయ్మఱైయోర్ తుఱై పడియ త్తుళుమ్బియెఙ్గుమ్
పోదిల్వైత్త తేన్ శొరియుమ్ **పునలరఙ్గ మెన్బదువే**

పెరియాழ்వార్ - పెరియాழ்వార్ తిరుమొழி 4-8-1

పాఙ్గోదమ్ శూழ்న్ద పువనియుమ్ విణ్ణులగమ్
అఙ్గాదుమ్ శోరామే యాళ్గిన్ఱ వెమ్బెరుమాన్
శెఙ్గోలుడైయ **తిరువరఙ్గచ్చెల్వనార్**
ఎఙ్గోల్ వళైయా లిడర్ తీర్వ రాగాదే.

ఆండాళ్ నాచ్చియార్ తిరుమొழி 11 - 3

పచ్చై మామలై పోల్ మేని పవళవాయ్ కమల చ్చెఙ్గణ్
అచ్చుదా అమరరేఱే ఆయర్ తమ్ కొழுన్దే యెన్నుమ్
ఇచ్చువై తవిర యాన్పోయ్ ఇన్దిరలోకమాళుమ్
అచ్చువై పెఱినుమ్ వేణ్డేన్ **అరఙ్గమానగరుళానే.**

తొణ్డరడిప్పొడియాழ்వార్ - తిరుమాలై 2



1C. శ్రీరంగనాయకి - శ్రీరంగం
Sri Ranga Nayaki Sri Rangam.



1.B.నంబెరుమాళ్ - శ్రీరంగం
Namberumal Sri Rangam.



2. అళగియ మణవాళన్ - ఉఱైయూర్
Alagiyamanavalan . Urayur



3.నీలమేఘపెరుమాళ్ తంజమామణిక్కోయిల్
Neelamegha Perumal Tanjur

అమల నాదిపిరాన్ అడియార్కు ఎన్నై ఆట్పడుత్త
విమలన్ ; విణ్ణవర్ కోన్ విరై యార్ పొళిల్ వేఙ్గడవన్;
నిమలన్ నిన్మలన్ నీదివానవన్ నీళ్ మదిళరఙ్గత్తమ్మాన్–
తిరుక్కమల పాదమ్ వన్దు ఎన్ కణ్ణి నుళ్ళన వొక్కిన్ఱదే.

తిరుప్పాణి ఆళ్వార్ అమలనాదిపిరాన్ 1

తుళఙ్గునీణ్ముడి యరశర్ దమ్కురిశిల్ తొణ్డైమన్నవన్ తిణ్డిఱలొరువఱ్కు;
ఉళఙ్గొళన్బి నోడిన్నరుళ్ శురన్ద ఙ్గాడునాళిగై యెళ్ఱుడనిరుప్ప;
వళఙ్గొళ్ మన్దిరమ్ మఱ్ఱవర్కరుళిచ్చెయ్దవా అడియే నఱిన్దు; ఉలగ
మళన్ద పొన్నడియే యడైన్దుయ్న్దే నణిపొళిల్ తిరువరఙ్గత్తమ్మానే ॥

తిరుమంగై ఆళ్వార్ పెరియ – తి.మొ. 5-8-9

## కుంభం – రోహిణి

### తిరునక్షత్ర తనియన్

తపస్యమాస రోహిణ్యాం తటే సహ్య భువి స్థితమ్ ।
శ్రీ రఙ్గ శాయినం వన్దే సేవితం సర్వదేశికైః ॥

### నిత్య తనయన్

శ్రీ స్తనాభరణం తేజ శ్శ్రీరంగేశయ మాశ్రయే ।
చింతామణి మివోద్వాన్తం ఉత్సఙ్గేఽనన్తభోగిన ః ॥

### వాళితిరునామమ్

తిరుమగళుమ్ మణ్మగళుమ్ శిఱక్కవన్దోన్ వాళియే
శెయ్యవిడై త్తాయ్ మగళావ్ శేవిప్పోన్ వాళియే
ఇరువిశుమ్బిల్ వీత్తిరుక్కు మిమైయవర్కోన్ వాళియే
ఇడర్ కడియ ప్పాఱ్కడలై యెయ్దినాన్ వాళియే
అరియ తయరదన్ మగనా యవదరిత్తాన్ వాళియే
అన్దరియామిత్తువము మాయినాన్ వాళియే
పెరుగి వరుం పొన్ని నడుప్పిన్ తుయిన్దాన్ వాళియే
పెరియ పెరుమాళెఙ్గళ్ పిరానడిగళ్ వాళియే



# ❁ 2 ఉఱైయూర్ 2 ❁

శ్లో॥ లక్ష్మీ చరణ లాక్షాంక సాక్షి శ్రీవత్స వక్షసే
క్షేమంకరాయ సర్వేషాం శ్రీ రంగేశాయ మంగళమ్ ।

శ్లో॥ శుభే కల్యాణాఖ్యాప్రథిత వర తీర్థేషు నిచుళా
పురే పారే రమ్యే శుభ కుడమురుట్ట్యాఖ్య సరితః
విమానే కల్యాణే ధనపతి దిశావక్త్ర రుచిరః
స్థితో భాతి శ్రీమాన్ వరవర సమాఖ్యో మధురిపుః॥

శ్లో॥ త్రయస్త్రింశత్కోటిదేవ రవిధర్మాది గోచరః
కలిధ్వంసి ముని స్తుత్యో వాసలక్ష్మీ సమన్వితః

వివరణః అళగియ మణవాళన్ – వాసలక్ష్మి (ఉఱైయూర్ వల్లి నాచ్చియార్ కల్యాణ పుష్కరిణి – కుడమురుట్టి నది – కల్యాణ విమానము. ఉత్తర ముఖము – నిలచున్న సేవ – ముప్పది మూడు కోట్ల దేవతలకు ధర్మవర్మకు, రవివర్మకుప్రత్యక్షము.తిరుమంగై యాళ్వార్ కీర్తించినది.

విశే : ధర్మవర్మ పుత్రికగా లక్ష్మీదేవి అవతరించి వాసలక్ష్మి అను పేరుతో శ్రీరఙ్గనాధుని పరిణయమాడిన స్థలము. మీన మాసములో శ్రీ రంగములో జరుగు ఆది బ్రహ్మోత్సవమున మూడవనాడు శ్రీరఙ్గనాధులు ఉఱైయూరు వేంచేసి వాసలక్ష్మితో ఏకాసనాసీనులై భక్తకోటిని అనుగ్రహింతురు. వీరు మేష మాసమున ఉత్తరా నక్షత్రమున అవతరించిరి. ఇచట స్వామి ప్రయోగ చక్రముతో వేంచేసి యుందురు. తిరుప్పాణి ఆళ్వార్లు ఈ క్షేత్రముననే అవతరించిరి. ఈ క్షేత్రమునకు “కోళి”యని “నాచ్చియార్ కోయిల్” అని తిరునామములు గలవు. ఇది తిరుచ్చిలో ఒక భాగము. తిరుచ్చినుండి 2 కి.మీ.టౌన్ బస్ కలదు.

కోళియుమ్ కూడలుమ్ కోయిల్ కొణ్డ కోవలరే యొప్పర్ ; కున్దమన్న
పాళియమ్ తోళుమోర్ నాన్గుడై యర్ పణ్డివర్ తమ్మైయుమ్ కణ్డఱియోమ్;
వాళియరో వివర్ వణ్ణ మెణ్ణిల్ మా కడల్ పోన్లుళర్; కైయిల్ వెయ్య
ఆళియొన్రేన్దియోర్ శఙ్గు పత్తియచ్చో వారువళగియవా.

తిరుమఙ్గై ఆళ్వార్ పెరియతిరుమొళి 9–2–5

# ❋ 3 తంజమా మణి క్కోయిల్ 3 ❋

**(తంజావూర్- తిరువయ్యార్ 3 కి.మీ)**

శ్లో॥ కన్యా పుష్కరిణీ వరామృత లసత్తీర్థాంచితే ప్రాఙ్ముఖ
స్త్వాసీన శ్శుభ తంజమామణి పురే శ్రీ నీలమేఘో విభుః ।
శ్రీమద్రమ్య విమాన వాసరసికో రమ్యాబ్జ వల్లీ ప్రియః
ప్రత్యక్షస్తు పరాశరస్య యమినః శార్ఙ్గాంశ సూరిస్తుతః ॥

**వివః** నీలమేఘ పెరుమాళ్ - శెంగమలవల్లి తాయార్ - కన్యాపుష్కరిణీ అమృత తీర్థము - తూర్పుముఖము-కూర్చున్నసేవ - సుందర విమానము-పరాశర మహర్షికి ప్రత్యక్షము - పూదత్తాళ్వార్ తిరుమంగై యాళ్వార్ కీర్తించినది.

**—తంజయాళి—**

శ్లో॥ శ్రీ సూర్యాబ్జిని తంజయాళి నగరే శ్రీరామ తీర్థాంచితే
తంజాఖ్యాయుత నాయకీ పరిగత శ్రీ నారసింహో విభుః ।
ప్రాగాస్యో వరవేద సుందర లసద్వ్యోమాన గర్భాసనో
మార్కండేయ నిషేవితో విజయతే శ్రీమత్కలిఘ్న స్తుతః ॥

**వివః** నరసింహస్వామి - తంజనాయకి-శ్రీరామ తీర్థము-వేద సుందర విమానము- తూర్పుముఖము- కూర్చున్న సేవ - మార్కండేయునకు ప్రత్యక్షము - తిరుమంగై ఆళ్వార్ కీర్తించినది.

**విశే:** ఈ రెండు క్షేత్రములు తంజావూరునకు ఉత్తరమున (తిరువైయార్ పోవుమార్గమున) 3 కి.మీ దూరములో దక్షిణ పెన్నానదీ తీరమున 'విణ్ణాత్తుంకరై' అనుచోట కలవు. ఈ రెండు దివ్య దేశములను చేర్చి ఒకే దివ్య దేశముగా భావించు చున్నారు. తంజావూరి నుండి టౌన్‌బస్ కలదు. తంజయను రక్కసిని సంహరించుటచే తంజవూర్ అనిపేరు వచ్చినదట.

ఎమ్బిరా నెన్రై యెన్నుడై చ్చుత్త మెనక్కర శెన్నుడై వాణాళ్
అమ్బినా లరక్కర్ వెరుక్కొళనెరుక్కి యవరుయిర్ శెగుత్త వెమ్మణ్ణల్
వమ్బులా మ్శోలై మామదిళ్ తఞ్జైమామణిక్కోయిలే వణఙ్గి
నమ్బిగాళుయ్య నాన్ కణ్డు కొణ్డేన్ నారాయణా వెన్నుమ్ నామమ్ ॥
తిరుమంగై యాళ్వార్ పె.తి.మె 1-1-6

## ❀ 4 అన్బిల్ (బాణాపురం) 4 ❀

### లాల్గుడి నుండి 8 కి.మీ

శ్లో॥ అన్బిల్ నామ్నిపురే ప్లవాఖ్య సరసీ సంశోభితే తారకే
శ్రీ మూర్త్యుజ్జ్వల పూర్ణ నామక విభుర్భోగీంద్ర భోగేశయః।
ఆలింగన్ రుచిరోపపూర్వలతికా దేవీం సురేశాముఖో
వాల్మీకి ద్రుహిణప్రియో విజయతే శ్రీ భక్తి సారస్తుత ॥

వివః తిరువడి వళ్గియనంబి పెరుమాళ్ - అళగియవల్లి తాయార్. మండూక పుష్కరిణి - తారక విమానము - తూర్పు ముఖము - భుజంగ శయనము - వాల్మీకి మహర్షికి, బ్రహ్మకు ప్రత్యక్షము తిరుమళిశై ఆళ్వార్ కీర్తించినది.

విశేః ఈ క్షేత్రము తిరుచ్చి - కల్లణై - కుంభకోణం బస్ మార్గములో కలదు. తిరుచ్చినుండి బస్ సౌకర్యం మితంగా కలదు. కావున "నటరాజపురం" బస్సులో పోయి అక్కడ నుండి 1 కి.మీ నడచి సన్నిధిని చేరుట సులభము. ఇచట ఏ విధమైన వసతులు లేవు. శ్రీ రంగమునుండి పోయి సేవింపవలెను. శ్రీ రంగమునకు 20 కి.మీ - 3 కి.మీలో తిరుప్పేర్ నగర్ కలదు.

నాగత్తణైక్కుడన్తై వెఃకాత్తిరువెవ్వుళ్;
నాగత్తణై యరఙ్గమ్ పేరమ్బిల్- నాగత్
త్తణై ప్పాఱ్కడల్ కిడుక్కుమ్ ఆది నెడుమాల్
అణై ప్పార్ కరుత్త నావాన్.

(తిరుమళిశై ఆళ్వార్ - నాన్ముగన్దిరువన్దాది 36)

## ❀ 5.కరంబనూర్ (ఉత్తమర్‌కోయిల్) 5 ❀

శ్లో॥ రంభా వృక్షయుతే కదంబ నగరే కాదంబ తీర్థాంచితే
పూర్వాఖ్యాప్రియయా భుజంగశయనో హ్యుద్యోగవైమానగః।
ధ్యాత శ్రీ సనకాది యోగి కలిజిత్ కాదంబ వస్వాదిభిః
ప్రాగాస్యః పురుషోత్తమో విజయతే కీర్త్యః కలిద్వేషిణః॥

వివః పురుషోత్తమ పెరుమాళ్ - పూర్వాదేవి తాయార్ - కదంబ తీర్థము - ఉద్యోగవిమానము - తూర్పు ముఖము - భుజఙ్గ శయనము, స్థల వృక్షము అరటిచెట్టు, సనకసనందాదులకు, కదంబ మహర్షికి, ఉపరిచర వసుమహారాజునకు, తిరుమంగై యాళ్వార్లకు ప్రత్యక్షము. తిరుమంగై యాళ్వార్ కీర్తించినది.



4. తిరువడి వళగియనంబి - అన్బిల్

Tiruvadivalagiya Nambi - Anbil



5. పురుషోత్తమన్ - కరంబనూర్

Purushottaman - Karambanur

**విశే:** ఈ సన్నిధిలో శివాలయము, బ్రహ్మకు ఆలయమును కలవు. సన్నిధిలో పురాతనమైన అరటిచెట్లు కలవు.

శ్రీరంగమునకు ఉత్తరమున 2 కి.మీ. దూరమున గలదు. శ్రీరంగము నుండి తిరుచ్చి నుండి బస్ సౌకర్యము గలవు. శ్రీ రంగము నందుండియే సేవింప వలెను.

పేర్రానై కుఱుజ్గుడి యెమ్బెరుమానై ; తిరుత్తణ్గా
లూర్రానై క్కరమ్బనూరుత్తమనై ; ముత్తిలజ్గు
కారార్ తిణ్ కడలేழுమ్ మలై యేழுవ్వులగే ழுణ్డుమ్
ఆరాదెన్నిరున్దానై క్కణ్డదు తెన్నరజ్గత్తే
తిరుమంగై ఆழ்వార్ పె.తి.మొ 5-6-2

## ❋ 6. తిరువెళ్ళరై (శ్వేతగిరి) 6 ❋

శ్లో॥ తీర్థై: పుష్కల పద్మ చక్ర కుశకై స్సంశోభ మానస్థితే
రమ్యే శ్రీ మణి కర్ణి కాహ్వయ వరాహాఖ్యాత తీర్థాశ్రితే ।
గంధ క్షీరసుదివ్య పుష్కరిణికా యుక్తే సితాద్ర్యాహ్వయే
రాజంతం నగరేతు వెళ్లర పదే ప్రాగాస్య సంస్థానగమ్ ।

శో॥ శ్రీ మచ్చంపక వల్లికా పరిగతం శ్రీ పంగయచ్చెల్వికా
నాయక్యా విమలాకృతిం సురుచిరం వైమాన వర్యాశ్రితమ్ ।
మార్కండేయ శిబిక్షితీశ గరుడ క్షోణీ దృశాం గోచర
పద్మాక్షాహ్వయ మాశ్రయే కలిరిపు శ్రీ విష్ణు చిత్త స్తుతమ్ ।

**వివ:** పుండరీకాక్షులు - పంగయచ్చెల్వి తాయార్ - (చంపకవల్లి) పుష్కల, పద్మ, చక్ర, కుశ, మణి కర్ణిక, వరాహ, గంధ, క్షీర, పుష్కరుణులు - శ్వేతాద్రి - విమలాకృతి విమానము - తూర్పు ముఖము - నిలుచున్న సేవ - మార్కండేయ, శిబి, గరుడ, భూదేవులకు ప్రత్యక్షము - పెరియాళ్వారులు, తిరుమంగై ఆళ్వారులు కీర్తించినది.

**వి.శే:** ఈ క్షేత్రమునకు శ్వేతగిరి యనిపేరు. శిబి చక్రవర్తి ప్రార్థనచే స్వామి ప్రయోగచక్రముతో పుండరీకాక్షు లనుపేర సేవ సాయించిరి. ఇచట స్వామికి ఇరువైపుల సూర్య చంద్రులు వింజామరలు వీచుచుందురు. మరియు ఇచ్చట ఉత్తరాయణ - దక్షిణాయన ద్వారములు గలవు. ఉయ్యక్కొండార్ (పుండరీకాక్షులు) అవతార స్థలము. మీన మాసమున బ్రహ్మోత్సవం.

**మార్గము :** శ్రీరంగము నుండి ఉత్తమర్ కోయిల్ మీదుగా తిరుచ్చి - ఉరయూర్ బస్ మార్గములో శ్రీరంగమున నుండి 15 కి.మీ దూరమున గలదు. బస్ దిగిన పిమ్మట 1/2 కి.మీ దూరంలో సన్నిధి కలదు. ఏ వసతులు లేవు. శ్రీరంగము నుండి సేవించాలి.

ఇన్దిరనోడు పిరమన్ ఈశన్ ఇమయవ రెల్లామ్
మన్దిర మామలర్ కొణ్డు మత్తైన్దువరాయ్ వన్దు నిన్దార్
శన్దిరన్ మాళిగై శేరుమ్ శదురరగళ్ వెళ్లత్తై నిన్దాయ్
అన్దియ మ్పోదిదువాగుమ్ అళగనే ! కాప్పిడ వారాయ్

పెరియాళ్వార్ - పెరియాళ్వార్ తిరుమొళి 2-8-1

# ❀ 7. తిరుప్పుళ్ళం పూతంగుడి 7 ❀

**(కుంభఘోణము 10 కి.మీ)**

**శ్లో॥ శ్రీ గృధ్రాభిధ తీర్థ సుందర తటే భోగేశయః ప్రాఙ్ముఖః**
**పుళ్లంపూద పురే తు శోభనపదం వైమాన మభ్యాగతః ।**
**శ్రీ మాన్ వల్విలిరామ నామక విభుః పొత్తామరాఖ్యా ప్రియః**
**గృధ్రేంద్రాక్షి పదం కలిఘ్న వచసాం పాత్రం తు రారాజతే ॥**

**వివ :** వల్ విల్లి రాములు - పొత్తామరై యాళ్ తాయార్ - శోభన విమానం గృధ్ర తీర్థము - తూర్పు ముఖము - భుజంగ శయనము - జటాయువునకు ప్రత్యక్షము. తిరుమంగై ఆళ్వార్ కీర్తించినది.

**విశే :** శ్రీరామచంద్రులు జటాయువునకు ప్రత్యక్షమై మోక్షము నిచ్చిన స్థలము. ఈక్షేత్ర స్వామి విషయమై శ్రీ వేదాంత దేశికులు '**పరమార్థ స్తుతి**' అను స్తోత్రమును అనుగ్రహించిరి. తొండరడిప్పొడి యాళ్వార్ల అవతార స్థలమైన 'మణ్డంగుడి' ఈ దివ్యదేశమునకు అతి సమీపములో గలదు. 1 కి.మీ దూరములో తిరువాదనూర్ దివ్య దేశము కలదు.

**మార్గము :** కుంభకోణం - స్వామిమలై - తిరువైకావూర్ టౌను బస్ మార్గములో స్వామిమలై నుండి 5 కి.మీ. దూరములో నున్నది. ఈ సన్నిధి అహోబిల మఠంవారి నిర్వాహములో నున్నది. మఠములో తగిన వసతులు గలవు.

అఱివదఱియాన నైత్తులగుముడై యానై యాళుడై యాన్
కుఱియ మాణురువాగియ కూత్తన్ మన్నియమరుమిడమ్;
నఱియ మలర్మేల్ శురుమ్బార్క వెళిలార్ మఞ్జై నడమాడ
పొఱిగొళ్ శిఱై వణ్డిశై పాడుమ్ **పుళ్ళమ్బూదఙ్గుడిదానే**

తిరుమంగై ఆళ్వార్ పెరియ తిరుమొళి 5-1-1



## ❁ 8. తిరుప్పేర్ నగర్ 8 (అప్పక్కుడుత్తాన్) ❁

**(లాల్గుడి 10 కి.మీ.) (కోవిలడి)**

శ్లో॥ ఇంద్రాఖ్యాయుత తీర్థ శోభిత తలే శ్రీ మత్తిరుప్పేర్ పురే
పశ్చాద్వక్త్ర యుతో భుజంగ శయనోఽహీంద్రాఖ్య వైమానగ :।
ఆలింగన్ కమలోప పూర్వ లతికా మప్పక్కుడుత్తాన్ విభు :
దృశ్యశ్చోపమనో : పరాశరమునే ర్విభ్రాజతే సర్వదా ॥

శ్లో॥ భక్తిసార శఠారాతి కలిజిత్ రథయోగిభి :।
సంస్తుత : కుంభ సంరాజ ద్వామేతర కరాంబుజ :॥

**వివ :** అప్పక్కుడుత్తాన్ - కమలవల్లి తాయార్ - ఇంద్ర తీర్థము - ఇంద్ర విమానము - పశ్చిమ ముఖము - భుజంగ శయనము - ఉపమన్యువునకు పరాశర మహర్షికి ప్రత్యక్షము. కుడిచేతి క్రింద కుంభము - తిరుమழிశై ఆళ్వార్, నమ్మాళ్వార్, పెరియాళ్వార్, తిరుమంగై యాళ్వార్ కీర్తించినది.

**విశే:** ఈ దివ్య దేశమునకు పెరునగర్ (పెద్ద నగరము) అను విలక్షణమైన తిరునామము కలదు. నమ్మాళ్వార్లు తిరువాయిమొழி (10వ శతకం 9 వ తిరువాయిమొழி) తిరుమాలిరుంశోలై మలై అను దశకములో "తిరుమాల్ వన్దెన్నెంజు నిఱైయ పుకున్దాన్." (ఆ సర్వేశ్వరుడే వచ్చి నా హృదయము నిండునట్లు )అని పెరుమాళ్ల యొక్క స్వామిత్వమును ప్రకాశింపచేసిరి.

**మార్గము:-** "కోవిలడి" అనియే చెప్ప వలెను. అన్బిల్ కొల్లడం ఎడమవైపు దాటిన ఈ క్షేత్రమును చేరవచ్చును. తిరుచ్చి నుండి బస్ మార్గం 24 కి.మీ. లాల్గుడి నుండి 10 కి.మీ. కుంభకోణం నుండి - తిరుక్కాట్టుపల్లి - తిరువైయ్యారు బస్ మార్గమున 'కల్లణై' పోవు బస్‌లోను పోవచ్చును.

తిరుమాలిరుఞ్జోమలై యెన్తేనెన్న
తిరుమాల్ వన్దెన్నెఞ్జు నిఱైయప్పుగున్దాన్
కురమామణియున్దు పునల్ పొన్నితెన్ పాల్
తిరుమాల్ శెన్ఱు శేర్విడమ్ తెన్ తిరుప్పేరే.

నమ్మాழ్వార్ తిరువాయిమొழி 10-8-1

## ❁ 9 తిరువాదనూర్ (స్వామిమలై 3 కి.మీ.) ❁

శ్లో : ఆదనూర్ నగరే దివ్యే సూర్య పుష్కరిణీయుతే
శ్రీ రఙ్గనాయకీ నాథ : ప్రణవాఖ్య విమానగ :

శ్లో : ఆండళక్కుం మెయ్యనాఖ్య : ప్రాఙ్ముఖో భుజగేశయః ।
రాజతే కామధేన్వక్షి గోచరో కలిజిన్నుత : ।

వివః ఆండళక్కుం మెయ్యన్ - శ్రీరంగ నాయకి - ప్రణవాకార విమానము సూర్యపుష్కరిణి - తూర్పు ముఖము - భుజంగ శయనము - కామధేనువునకు ప్రత్యక్షము - తిరుమంగై ఆళ్వార్లు కీర్తించినది.

**మార్గముః** స్వామిమలై నుండి 3 కి.మీ. వసతులు స్వల్పము.

విశేః కామ ధేనువుకు ప్రత్యక్షమగుటచే ఆదనూర్ అనిపేరు వచ్చెను. ఈ సన్నిది అహోబిల మఠ నిర్వహణలో నున్నది. పెరుమాళ్ల శ్రీపాదములలో తిరుమంగై ఆళ్వారు కామధేనువు కలరు.

అన్నవనై ఆదనూర్ ఆణ్డళక్కుమైయనై
నెన్నలై యిన్రినై నాళైయై - నీర్మలమేల్

తిరుమంగై ఆళ్వార్ పెరియతిరుమడల్ 130

## నవవిధ సంబంధములు

మంచిమాట

పరమాత్మకు జీవాత్మకు మధ్యన గల సంబంధములు తొమ్మిది. అవి

| | పరమాత్మ | జీవాత్మ | సంబంధము |
|---|---|---|---|
| 1. | పిత | పుత్ర | కార్యకారణ సంబంధము |
| 2. | రక్షకుడు | రక్ష్యుడు | రక్ష్య రక్షక సంబంధము |
| 3, | శేషి | శేషుడు | శేష శేషి సంబంధము |
| 4. | భర్త | భార్య | భర్తృ భార్యా సంబంధము |
| 5. | జ్ఞేయ | జ్ఞాతా | జ్ఞాతృ జ్ఞేయ సంబంధము |
| 6. | స్వామి | దాసుడు | స్వస్వామి సంబంధము |
| 7. | ఆధారము | ఆధేయము | ఆధార ఆధేయ సంబంధము |
| 8. | ఆత్మా | శరీరము | శరీరాత్మ సంబంధము |
| 9. | భోక్త | భోగ్యము | భోక్తృభోగ్య సంబంధము |



10. ఆమరువియప్పన్ - తిరువళుందూర్

Amaruviyappaṉ Tiruvalundur



11. అరుళ్మాకడల్ - శిరుప్పులియూర్

Arulmakadal - Sirupuliyur

## ❀ 10. తిరువ(ళ్లు)ందూర్ 10 (మాయవరం 12 కి.మీ.) ❀

### (తేరళందూర్)

శ్లో ॥ దివ్యే దర్శన పద్మినీ తటగతే శ్రీమత్యళందూర్ పురే
రాజ త్యామరువి ప్రభు ర్గరుడ ఇత్యాఖ్యే విమానే స్థిత ః।
ప్రాప్త శ్శెంగమలోప పూర్వలతికాం ప్రాచీముఖ స్సహ్యజా
ధర్మ శ్రీ వసురాజ సేవిత వపు శ్రీ్మత్కలిఘ్న స్తుతః ॥

**వివః** ఆమరువియప్పన్ – శెంగమలవల్లి తాయార్ – గరుడ విమానము – దర్శన పుష్కరిణి – తూర్పుముఖము – నిలుచున్న సేవ – కావేరికిని, యమధర్మరాజునకు, వసుమహారాజునకు ప్రత్యక్షము. తిరుమంగై ఆళ్వార్లు కీర్తించినది.

**విశేః** పెరుమాళ్లకు కుడివైపున గరుడాళ్వారు ఎడమవైపున ప్రహ్లాదాళ్వారు వేంచేసియున్నారు. ఇచ్చట కోవెల వీధిలో శ్రీ రఙ్గనాథుల సన్నిధి, గోవిందరాజస్వామి సన్నిధి వేరుగా కలవు. వృషభ మాసం హస్తా నక్షత్రము తీర్థోత్సవముగా బ్రహ్మోత్సవము జరుగును. కంబ మహాకవి పుట్టిన ప్రదేశము.

**మార్గముః** మాయవరం నుండి టౌను బస్ కలదు. కుంభకోణం – మాయవరం – తంజావూరు – మాయవరం – బస్ కలదు. అహోబిల మఠం ఉన్నది.

తిరువుక్కుద్దిరువాగియ శెల్వా దెయ్‌వత్తుక్కరశే శెయ్యకణ్ణా;
ఉరువచెఙ్జుడరాళ్లి వల్లానే యులగుణ్డ వాొరువా తిరుమార్బా;
ఒరువఱ్ఱాత్తియుయ్యుమ్ వగై యెన్దాలుడన్నిన్దైవ రెన్నుళ్ పుగన్దు ;ఊళియా
తరువిత్తిన్నిడ అజ్జి నిన్నడైన్దేన్ ఆళున్దూర్ మేల్‌త్తిశై నిన్ఱ వమ్మానే .
తిరుమంగై ఆళ్వార్ పెరియ తిరుమొళ్లి 7-7-

## అర్థ పంచకము

**ముముక్షువు తప్పక తెలిసికొనవలసినవి ఐదు.**

1. స్వస్వరూపము - భగవచ్ఛేషత్వము
2. పరస్వరూపము - సర్వశేషిత్వము
3. ఉపాయ స్వరూపము - భగవత్ కృప
4. ఉపేయ స్వరూపము - భగవత్ కైంకర్యము
5. విరోధ స్వరూపము - అవిద్య కర్మప్రకృతి సంబంధములు

## ❁ 11 శిరుపులియూర్ 11 ❁

శ్లో ।   దివ్యేఽనంత సర స్సుమానస బిసి న్యత్యద్భుతే సంస్థితం
రాజంతం పులియూర్ పదే పురవరే యామ్యాస్య భోగేశయమ్ ।
నాయక్యా తిరుమామగళ్ పదయుజా వ్యాస్సర్షి నేత్రాతిథిం
సేవేహం త్వరుమాకడల్ విభు మహం శార్ఙ్గాంశ యోగిస్తుతమ్ ।

శ్లో।   నంద వర్ధన వైమాన మధిష్ఠాయ జగత్పతి :।
తిరుమామగళాఖ్యాక నాయక్యా సహ రాజతే ।

**వివ:** అరుళ్ మాకడల్ పెరుమాళ్ - తిరుమామకళ్ నాచ్చియార్ - అనంత సరస్సు - మానసపుష్కరిణి - నంద వర్ధన విమానము - దక్షిణ ముఖము - భుజంగ శయనము - వ్యాఘ్ర పాదమునికి, వ్యాసమునికిని ప్రత్యక్షము - తిరుమంగై ఆళ్వార్ కీర్తించినది.

**విశే:** ఇచట పెరుమాళ్లు శయనించిన బాలుని వలె సేవ సాదింతురు.

**మార్గము:** మాయవరం నుండి టౌను బస్‌లో కొల్లు మాంగుడి చేరి అక్కడకు 2 కి.మీ దూరమున గల సన్నిధిని సేవింప వచ్చును. ఏవిధమైన వసతులు లేవు. మాయవరంలోనే బసచేయవలెను. సన్నిధిలో ప్రసాదము లభించును.

కరుమా ముగిలురవా కనలురువా పునలురువా ;
పెరుమాల్వరై యురువా పిఱవ్వురువా నినదురువా;
తిరుమామకళ్ మరువులమ్ శిఱుపులియూర్ చ్చల శయనత్తు;
అరుమా కడలముదే యునదడియే శరణామే

తిరుమంగై ఆళ్వార్ - పెరియ తిరుమొழி 7-9-9

### భగవంతుని గుణాష్టకము

1. అపహత పాప్మత్వము 2. విజరత్వము 3. విమృత్యుత్వము 4. విశోకత్వము 5. విజిఘత్సత్వము 6. అపిపాసత్వము 7 సత్య కామత్వము 8. సత్య సంకల్పము

## ❁ 12. తిరుచ్చేఱై 12 (కుంభకోణం 12 కి.మీ) ❁
## (సార క్షేత్రము)

శ్లో॥ శ్రీ సారాఖ్య సరోజనీ కృతరుచౌ సారాభిధానే పురే
సారాఖ్యాయుత నాయకీ ప్రియ వపు స్సారాఖ్య వైమానగః।
ప్రాగ్వక్త్రాంబుజ సంస్థితి ర్విజయతే శ్రీ సారనాథో విభుః
కావేరీ నయనా తిథి : కలిరిపు స్తుత్య శ్శ్రితాభీష్టదః।

వివః– సారనాథ పెరుమాళ్ – సారనాయకి – సార పుష్కరణి – సార విమానము – తూర్పు ముఖము – నిలచున్న సేవ – కావేరికి ప్రత్యక్షము – తిరుమంగై ఆళ్వార్ కీర్తించినది.

విశే: పుష్కరిణి తీరమున కావేరీ అమ్మన్ సన్నిధి కలదు. మకరమాసములో జరుగు రథోత్సవమున పెరుమాళ్లు శ్రీదేవి, భూదేవి, నీళాదేవి, సారనాయకి మహాలక్ష్మి వీరితో కలసి వేంచేయుదురు.

మార్గము: కుంభఘోణము నుండి కూడ వాశల్ పోవు టౌన్ బస్‌లో 12 కి.మీ. దూరమున గలదు . సత్రములు హెూటళ్లు గలవు. ఉప్పిలియప్పన్ (తిరువిణ్ణగర్) సన్నిధి నుండి, నాచ్చియార్ కోయిల్ నుండియు కూడ పోవచ్చును.
ఈ క్షేత్రమునకు 5 కి.మీ నాచ్చియార్ కోయిల్.

కణ్ శోర వెఙ్గురుది వన్దిழிయ వెన్దழల్ పోల్ కున్దలాழ்
మణ్ శేర ముழై యుణ్డ మామదలాయ్ వానవర్ తఙ్కోవే యెన్ఱు
విణ్ శేరు మిళన్దిఙ్గళగడురిఞ్జ మణిమాడమల్గు; శెల్వ
త్తణ్ శేఱై యెమ్బెరుమాన్ తాళ్ తొழுవార్ కాణ్మినెన్దలై మేలారే !
తిరుమంగై ఆழ్వార్ పెరియ తిరుమొழி 7-4-1

### అష్టవిధ పుష్పములు

భగవంతుని ప్రాకృత పుష్పములతో పాటు ఈ పుష్పముల తోడను పూజింపవలెను.
1. అహింసా 2. ఇంద్రియ నిగ్రహము 3. సర్వ భూత దయ 4. క్షమా 5. జ్ఞానము 6. తపస్సు 7. ధ్యానము 8. సత్యము
ఈ ఎనిమిది విష్ణువునకు ప్రీతికరమైన పుష్పములు.

శ్లో॥అహింసా ప్రథమం పుష్పమ్ - పుష్ప మింద్రియ నిగ్రహః
సర్వభూతదయా పుష్పం- క్షమా పుష్పం - విశేషతః
జ్ఞానం పుష్పం - తపః పుష్పం - ధ్యానం పుష్పం తథైవ చ
సత్య మష్ట విధం పుష్పం విష్ణోః ప్రీతి కరం భవేత్ ॥

# ❋13 తలైచ్చంగనాణ్మదియమ్ 13 (తలైచ్చగాండ్రు)❋

శ్లో॥ శ్రీ చంద్రాహ్వాయ పద్మినీ తటతలే శ్రీమత్తలచ్చజ్గమి
త్యాఖ్యే దివ్య పురేతు చంద్ర పదకే వైమాన వర్యే స్థిత :।
దేవో నాణ్మతియ ప్రభుర్విజయతే దేవ్యా పురాఖ్యాయుజా
ప్రాగాస్య శ్శశి దేవ సేవిత తను శ్శార్జ్గాంశ మౌని స్తుత :॥

**వివ:** నాణ్మదియప్పెరుమాళ్ - వెణ్ శుడర్ పెరుమాళ్ - తలైచ్చంగ నాచ్చియార్ - శెంగమల వల్లి తాయార్ - చంద్ర పుష్కరిణి - చంద్ర విమానము - తూర్పు మఖము - నిలుచున్నసేవ - చంద్రునకు దేవతలకు ప్రత్యక్షము - తిరుమంగై ఆళ్వార్ కీర్తించినది.

**విశే:** ఈ క్షేత్రమునకు అరుణ వనమని పేరు కలదు.

**మార్గము:** మాయవరం నుండి అక్కూర్ చేరి అట నుండి శీర్గాళిపోవు మార్గములో 3 కి.మీ. దూరమున సన్నిధి కలదు తలచ్చంగాడనియే చెప్పాలి. తలచ్చంగాడు నుండి మణ్శాలై పోవు మార్గంలో 1/4 కి.మీ దూరమున సన్నిధి కలదు. వసతులు మితముగా నున్నవి.

కణ్ణార్ కణ్ణపుర ఙ్కడిగై కడి కమ్ఘుమ్;
తణ్ణార్ తామరై శూழ் తలైచ్చజ్గమే త్తిశైయుళ్;
విణ్ణోర్ నాణ్మదియై విరిగిన్ఱ వెఞ్జుడరై
కణ్ణార కణ్డు కొణ్డు కళిక్కిన్ఱ దిజ్గెన్ఱు కొలో.

తిరుమంగై ఆழ்వార్ పెరియ తిరుమొழி 8-9

## అష్టవిధ భక్తి

| | | | |
|---|---|---|---|
| 1. | మద్భక్తజన వాత్సల్యమ్ | - | భగవద్భక్తుల యందు ప్రేమ |
| 2. | పూజాయాంచ అనుమోదనం | - | భగవదారాధన యందు కోరిక |
| 3. | స్వయం అభ్యర్చనమ్ | - | స్వయముగా ఆరాధించుట |
| 4. | మదర్థే డంబవర్జనమ్ | - | భగవద్విషయమున ఆడంబరములను విడుచుట |
| 5. | మత్కథాశ్రవణే భక్తిః | - | భగవంతుని కథలను వినుటయందు భక్తి |
| 6. | సర్వ నేత్రాంగ విక్రియా | - | భగవత్కథలను వినునపుడు శరీరముపులకించుట |
| 7. | మమానుస్మరణం నిత్యం | - | ఎల్లపుడు భగవంతుని తలచుట |
| 8. | యచ్చమాం నోపజీవతి | - | ప్రయోజనాంతరముల యందు ఆశలేకుండుట |



14.A ఆరావముదన్ - కుంభకోణము
Aravamudan - Kumbhakonam

## ❀ 14 తిరుక్కుడందై 14 (కుంభకోణము) ❀

శ్లో॥ శ్రీ హేమాంబుజినీ తటీ తు నగరే శ్రీ కుంభఘోణాభిదే
ప్రాప్తః కోమల వల్లికాఖ్య మహిషీం శ్రీవైదికా గారగః ।
హేమాఖ్యాన మునీక్షితో విజయతే శ్రీ శార్ఙ్గపాణి ప్రభుః
ప్రాగాస్యో భుజగేంద్ర భోగశయనోఽత్యప్తామృతాఖ్యాయుతః॥

శ్లో॥ శ్రీ భూత మహదాఖ్యాన భక్తి సార శఠారిభిః ।
విష్ణుచిత్త కలిఘ్నాఖ్యాం గోదాస్తుతి పరిష్కృతః ॥

వివః శార్ఙ్గపాణి పెరుమాళ్ - ఆరావముదు పెరుమాళ్ - కోమల వల్లి తాయార్ - హేమపుష్కరిణి-వైదిక విమానము - తూర్పు ముఖము -భుజంగ శయనమున ఉత్థాన శయనము పూదత్తాళ్వార్; పేయాళ్వార్; తిరుమழிశై ఆళ్వార్, నమ్మాళ్వార్ పెరియాళ్వార్, ఆండాళ్-తిరుమంగై యాళ్వార్ కీర్తించినది. హేమ మహర్షికి ప్రత్యక్షము.

విశే : ఈ దివ్యదేశమున ఈ సన్నిధి కాక చక్రపాణి పెరుమాళ్ సన్నిధి; రామర్, వరాహనాయనార్ సన్నిధులు గలవు. బ్రహ్మాలయము, సూర్యాలయము కలవు. తిరుమழிశై ఆళ్వార్ తిరునాడు అలంకరించిన (పరమ పదించిన) స్థలము. శార్ఙ్గ పాణి పెరుమాళ్ సన్నిధికి పడమట వీరికి సన్నిధి గలదు. మకరం-మేషమాసములలో బ్రహ్మోత్సవము జరుగును.

ఈ క్షేత్రమునకు కుడమూక్కు (కుంభ ఘోణం) అను విలక్షణమైన తిరునామము కలదు. నమ్మాళ్వారు తిరువాయిమొழிలో "ఆరావము"తే యను దశకమున (5-8) ఆరావముతే (అతృప్తామృతమా! అనగా ఎంత సేవించినను అనుభవించినను తనివి తీరక ఇంకను అనుభవింపవలెనను కోరిక కలుగునట్లు వేంచేసియున్నవాడా !) అని కీర్తించి యున్నారు. అంతియే కాక "శూழ்విశుమ్" అను తిరువాయిమొழிలో (10-9) తమ పరమ పదానుభవమును ప్రకటించుచు భూలోకస్మరణ ప్రసక్తియే లేని సందర్భమున కూడ "కుడన్దై యెజ్గోవలన్" అని కుంభఘోణక్షేత్రమును కీర్తించిరి. అట్లే తిరుమజ్గై యళ్వార్లును తమ ప్రబంధములలో మొదటిదగు పెరియ తిరుమొழி ప్రారంభములో "ఆవియే యుముదే" అను పాశురమున (పె.తి1-1-2) శూழ்పునల్ కుడన్దైయే తొழுదు" (జలాశయ పరివృతమైన కుంభఘోణక్షేత్రమునే సేవించి) యని మొట్ట మొదట కుంభఘోణక్షేత్రమునే ప్రస్తుతించిరి. అంతియే కాక తమ ప్రబంధములలో చివరిదగు "తిరునెడున్దాణ్డగ"మున "తణ్కుడన్దక్కిడన్దమాలై" యని ఈ క్షేత్రమునే ప్రస్తుతించి ముగించిరి.

మఱియు ఈ క్షేత్ర స్వామి విషయముగా "తిరువెழுక్కూత్తిరుక్కై" యను ప్రబంధమును అనుగ్రహించిరి. నాథమునులకు ముందుగా లభ్యమైనది "ఆరావముదే" యను దశకము (5-7) మాత్రమే. దానినాధారముగా చేసికొని వారు ఆళ్వార్ తిరునగరి చేరి కణ్ణినుణ్ చిఱుత్తాంబు ప్రబంధమును పన్నెండు వేల పర్యాయములు జపించి నమ్మాళ్వార్ల అనుగ్రహమును పొంది తిరువాయిమొழிని తక్కిన ప్రబంధములను పొందగల్గిరి.

తిరుమழிశై ఆళ్వార్ "నడన్దకాల్గళ్నొన్దవో" యను పాశురమున స్వామీ ! కావేరీ తీరమున పవళించి యుంటివే ! ముల్లోకములను కొలచి నందు వలన నీ శ్రీపాదములు నొచ్చుట చేతనా ? లేక వరాహావతారమున భూదేవిని పైకి ఎత్తుట వలన కలిగిన శ్రమచేతనా ? లేచి కూర్చొని చెప్పుము" అని పలుకగా భక్తపరాధీనుడగు శార్ఙ్గపాణి లేచుటకు సిద్ధపడగా అళ్వార్లు సేవించి అర్చావతార సమాధి చెడకూడదని తలచి "వాழி " యని శయన తిరుక్కోలమునకు మంగళము పాడిరి. కావుననే ఇచట స్వామి "ఉత్థానశాయి"గా సేవ సాయించుచున్నారు.

**మార్గము:** తమిళనాడులో అన్ని ప్రసిద్ధ పట్టణముల నుండి బస్ సౌకర్యం గలదు.

నడన్దకాల్గళ్ నొన్దవో నడుఙ్గ ఞాలమేనమాయ్
ఇడన్ద మెయ్ కులుఙ్గవో విలఙ్గుమాల్ వరైచ్చురమ్
కడన్ద కాల్ పరన్ద కావిరిక్కరై **క్కుడన్దైయుళ్**
కిడన్ద వారెழுన్దిరున్దు పేశువాழி కేశనే ! ॥

తిరుమழிశై ఆழ்వార్ తిరుచ్చన్ద విరుత్తం 61

ఆరావముదే ! అడియేనుడలమ్ నిన్బాల్ అన్బాయే
నీరాయలైన్దు కరైయ ఉఱుక్కుగిన్ద నెడుమాలే !
శీరార్ శెన్నెల్ కవరి వీశుమ్ శెழுనీర్ **తిరుక్కుడన్దై**
ఏరార్ కోలమ్ తిగழக్కిడన్దాయ్ ! కణ్డేన్ ఎమ్మానే.
కళవాయ్ తున్బమ్ కళైయాదొழிవాయ్ కళైగణ్ మత్తిలేన్
వళైవాయ్ నేమిప్పడైయాయ్**కుడన్దై** క్కిడన్ద మామాయా !
తళరావుడలమ్ ఎనదావి శరిన్దు పోమ్బోదు
ఇళయాదు నదాళ్ ఒరుఙ్గప్పిడిత్తు పోద విశైనీయే.

నమ్మాళ్వార్ - తిరువాయిమొழி 5-8-1,8

ఆవియే ! యముదే ! యెననినైన్దురుగి అవరవర్ పణైములై తుణయా
పావియే నుణరాదెత్తనై పగలుమ్ పழுదుపో యొழிన్దన నాళ్గళ్
తూవిశేరన్నమ్ తుణైయొడుమ్ పుణరుమ్ శూழ் పునల్ కుడన్దైయే తొழுదు ఎన్
నావినాలుయ్య నాన్ కణ్డు కొణ్డేన్ నారాయణా వెన్నుమ్ నామమ్॥

తిరుమంగై యాழ்వార్లు - పెరియతిరుమొழி 1-1-2



14.B.చక్రపాణి - తిరుక్కుడంద్దై
Chakrapani - Kumbhakonam



15. హరశాపహరన్ - తిరుక్కండియూర్
Harasapaharan - Tirukkandiyur



16. ఉప్పిలియప్పన్ - తిరువిణ్ణగర్
Uppiliyappan - Tiruvinnagar



17. వయలాలి మణవాళన్ - తిరువాలి తిరునగరి
Vayalali Manavalan - Tiruvali Tirunagari

# ❁ 15. తిరుక్కండియూర్ 15 ❁

శ్లో॥ నిత్యం భాతి కపాల తీర్థ రుచిరే శ్రీ కండియూర్ పట్టణే
వైమానే కమలాకృతౌ స్థితియుతః ప్రాచీముఖాలంకృతః ।
నాయక్యా హర శాప నాశక విభు శ్శ్రీపద్మ వల్ల్యా శ్రితః
ప్రత్యక్షో వర కుంభ సంభవ మునేః కీర్త్యః కలిద్వేషిణః ॥

**వివ :** హర శాపం తీర్త పెరుమాళ్-(హర శాపనాశకర్) కమలవల్లి తాయార్-కపాల తీర్థము-కమలాకృతి విమానము-తూర్పుముఖము-నిలచున్న సేవ-అగస్త్యునకు ప్రత్యక్షము. తిరుమంగై ఆళ్వార్ కీర్తించినది.

**విశే :** రుద్రుని చేతియందు గల కపాలమును నేలపడునట్లు అనుగ్రహించిన స్థలము. సన్నిధికి 1 కి.మీ. దూరములో బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులకు సన్నిధులు కలవు. ఈ క్షేత్ర సమీపములో కల్యాణపురమున శ్రీనివాస పెరుమాళ్ సన్నిధి కలదు.

**మార్గం:** తంజావూరు నుండి తిరువయ్యారు పోవుటౌను బస్‌లో పోవలెను. వసతులు లేవు. తంజావూరులోనే బసచేయవలెను

పా॥ పిణ్డియార్ మణ్డై యేన్ది ప్పిఱర్ మనై తిరి తన్దుణ్డుమ్
ముణ్డియాన్; శాపయ్ దీర్త ఒరువనూర్; ఉలగమేత్తుమ్
**కణ్డియూర్** అరఙ్గమ్ మెయ్యమ్ కచ్చిపేర్ మల్లై యెన్ఱు
మణ్డినార్; ఉయ్యలల్లాల్ మఱ్ఱైయార్క్కు ఉయ్యలామే ?

తిరుమంగై ఆళ్వార్ - తిరుక్కుఱున్దాణ్డగమ్ 19

## భగవత్కృపా పాత్రులు

**వివిధ జాతులలో జన్మించియు భగవంతుని కృపకు పాత్రులైన వారు**

1. గుహప్పెరుమాళ్ 2. శబరి 3. జటాయు మహారాజు 4. సుగ్రీవాది వానరులు 5. అయోధ్యా వాసులైన చరాచరము 6. చిన్తయన్తియను గోపిక 7. దధిభాణ్డు అను గొల్లవాడు 8. వాని పెరుగు బాన 9. కుబ్జ 10. సుదాముడను మాలా కారుడు 11. ఘంటా కర్ణుడు 12. శ్రీకృష్ణునకు భోజనమిడిన ఋషి పత్నులు 13. ప్రహ్లాదాళ్వార్ 14. విభీషణుడు 15. గజేంద్రాళ్వాన్ 16. గరుడునకు భయపడి భగవంతుని శరణు వేడిన సుముఖ మను సర్పము 17. శ్రీకృష్ణుని ఆశ్రయించిన గోవిందస్వామి 18. మార్కండేయుడు.

## ❀ 16. తిరువిణ్ణగర్ 16 (కుంభకోణం 5 కి.మీ) ❀

### (ఉప్పిలి యప్పన్ కోయిల్)

శ్లో॥ భాతి శ్రీ తిరువిణ్ణగర్ పురవరే హర్మ్యాబ్ధినీ శోభితే
శ్రీ మద్విష్ణు విమాన సంస్థితి లసన్ శ్రీ భూమి దేవీ పతిః
శ్రీ మాను ప్పిలి యప్పనాహ్వయ యుతః పక్షీంద్ర కావేరికా
ధర్మైర్దృష్ట వపు శ్శతారి కలిజిత్ సమ్యక్ స్తుతః ప్రాఙ్ముఖః

వివః ఉప్పిలియప్పన్ (శ్రీనివాసర్) భూమిదేవి తాయార్-ఆర్తి పుష్కరిణి (అహోరాత్ర పుష్కరిణి)-విష్ణు విమానము-తూర్పు ముఖము-నిలుచున్న సేవ-గరుత్మంతునకు, కావేరికి, యమునకు, మార్కండేయ మహర్షికి ప్రత్యక్షము-పొయిగై ఆళ్వార్, పేయాళ్వార్, నమ్మాళ్వార్, తిరుమంగై ఆళ్వార్లు కీర్తించినది.

విశే: ఈ దివ్య దేశమునకు "నణ్ణగర్" అను విలక్షణమైన తిరునామము కలదు. శ్లాఘ్యమైన దివ్య దేశము.(తి.వా.మొ 6-3-2) నల్ కురువుమ్ అను తిరువాయిమొళిలో(6-3) నమ్మాళ్వార్లు తమకు సేవ సాయించిన తిరువిణ్ణగర్ పెరుమాళ్ళ కల్యాణ గుణములను అనుభవించుచు "పల్వకయుంపరన్ద" అని సర్వేశ్వరుని అఘటిత ఘటనా సామర్థ్యమనెడి కల్యాణ గుణమును ప్రకాశింపజేసిరి. తంజావూరు జిల్లాలో ప్రసిద్ధమైన క్షేత్రము. ఇచ్చట స్వామి మార్కండేయ పుత్రికను వివాహమాడిరి. ఆ సమయమున భూమిదేవి నాచ్చియార్ చిన్న వయసు గలవారగుటచే తళియలో ఉప్పువేయుట కూడ తెలియనివారైరి. అందుచే నాటి నుండి స్వామి ఉప్పులేని ప్రసాదమునే ఆరగించెడివారు. నేటికిని ఉప్పులేని ప్రసాదమునే ఆరగించు చున్నారు. ఈ క్షేత్రమునకు తులసీ వనమనియు తిరునామము కలదు. అన్ని వసతులు గలవు. సన్నిధిలో ప్రసాదములు లభించును. కుంభఘోణమునుండి టౌను బస్ కలదు. ఈసన్నిధి తిరునాగేశ్వరము అను ప్రసిద్ధ శివ క్షేత్రమునకు1 కి.మీ. ఇచట నుండి తిరుచ్చేరై, "నాచ్చియార్ కోయిల్" పోయి సేవింప వచ్చును.

పరఞ్జుడరుడమ్బాయ్యుళుక్కు ప్పదిత్త వుడమ్బాయ్;
కరన్దుమ్ తోన్రియుమ్ నిన్రుమ్ కైదవఙ్గల్ శెయ్దుమ్; విణ్ణోర్
శిరఙ్గళాల్ వణఙ్గుమ్ తిరువిణ్ణగర్ చ్చేర్న్ద పిరాన్
వరఙ్గొళ్ పాదమల్లాలిల్లై యావర్క్కుమ్ వన్శరణే. నమ్మాళ్వార్- తిమొ 6-3-7
వణ్డుణు నఱుమల రిణ్డై కొణ్డు-పణ్డనమ్ వినై కెడవెన్రు; అడిమేల్
తొణ్డరు మమరరుమ్ పణియనిన్రు ఙ్గణ్డమోడ కలిడ మళన్దవనే
ఆణ్డాయునైక్కాణ్బదోర్ రరుళెనక్కరుళుదియేల్
వేణ్డేన్ మనై వాళ్కైయై విణ్ణగర్ మేయవనే. తిరుమంగై ఆళ్వార్ పె.తి.మొ. 6-1-1

## ❁ 17. తిరువాలి తిరునగరి (శీర్గాళి 18 కి.మీ) ❁

శ్లో॥ దివ్యేఽలాతని పద్మినీ తటగతే హ్యష్టాక్షరాగారగః
భాతి శ్రీ తిరువాలి పట్టణ వరే పాశ్చాత్య వక్త్రాసనః।
సంప్రాప్తో ఽమృత కుంభ పూర్వ లతికాం శ్రీ కర్దమాలాతని
ప్రత్యక్షో మణవాళ నాహ్వయ విభుః కీర్త్యః కలిధ్వంసినః

వివః వయలాలి మణవాళన్-అమృత ఘటవల్లి తాయార్-ఏవరవన్‌శిందై తనక్కినియాన్-అలాతని పుష్కరిణి-అష్టాక్షర విమానము-పశ్చిమ ముఖము-కూర్చున్న సేవ-అలాతనికి, కర్దమ ప్రజాపతికి ప్రత్యక్షము తిరుమంగై ఆళ్వార్ కీర్తించినది.

విశేః తిరుమంగై ఆళ్వార్ల అవతారస్థలమైన తిరుక్కురైయలూర్ ఈ క్షేత్రమునకు సమీపముననే గలదు. వృశ్చికమాసములో కృత్తికా నక్షత్రమునకు ముందు పది దినములు వీరి తిరు నక్షత్రము అతి వైభవముగా జరుగును.

తిరువాలి తిరునగరిలో పంగుని (మీనమాసం) ఉత్తరా నక్షత్రము అవసాన దినముగా బ్రహ్మోత్సవము జరుగును. ఈ ఉత్సవములలో ఎనిమిదవ ఉత్సవమునాటి రాత్రి తిరుమంగై ఆళ్వార్ "ఆడల్ మా" అను అశ్వము మీద వేంచేసి పెరుమాళ్ల తిరువాభరణములు అపహరించు సమయమున జరుగు సంవాదము అతి మనోహరముగా నుండును.తిరువాలి తిరునగరి వాస్తవముగా రెండు తిరుపతులు తిరువాలి నుండి తిరునగరి సుమారు 3 కిమీ దూరములో నున్నది. తిరువాలి యందు నరసింహ స్వామి సన్నిధి కలదు. తిరునగరి యందు వయలాలి మణవాళన్ వేంచేసి యున్నారు. ఈ తిరువాలికి దక్షిణమున 7 కి.మీ.దూరములో తిరునాంగూరు దివ్యదేశము కలదు. రామానుజ కూటము కలదు.

ఈ క్షేత్రమున వేంచేసియున్న తిరుమంగై ఆళ్వార్ల సౌందర్యము వర్ణనాతీతము ఆ సౌందర్యమును మణవాళ మామునులు ఇట్లు అభివర్ణించిరి.

అణైత్త వేలుమ్, తొழுత కైయుమ్; అழுన్దియ తిరునామముమ్; ఓమెన్ఱ వాయుమ్, ఉయర్న్ద మూక్కుం; కుళిర్న్ద ముగముమ్ పరంద విழியుమ్, ఇరణ్డ కుழలుమ్, శురుండ వళైయుమ్, వడిత్తకాతుమ్, మలర్న్ద కాతు కాప్పుమ్ తాழ்న్ద శెవియుమ్, శెఱిన్ద కழுత్తుమ్, అకన్ఱ మార్పుమ్, తిరణ్డ తోళుమ్; నెళిత్త ముతుకుమ్ కువిన్ద విడైయుమ్, అల్లి కయఱుమ్, అழுన్దియ శీరావుమ్, తూక్కియ కరుజ్ఞోవైయుమ్, తొజ్గలుమ్ తనిమాలైయుమ్, శాత్తియ తిరుత్తణ్డైయుమ్, శతిరాన వీరక్కழలుమ్, కున్దియిట్ట కణైక్కాలుమ్, కుళిరవైత్త తిరువడి మలరుమ్, మరువలర్‌త ముడల్ తుణియ వాళ్ వీశుమ్, పరకాలన్ మజ్ఞై మన్నరాన వడివే.

ఐయనరుళ్ మారి శెయ్యవడియెణై కళ్ వాళ్గియే
అన్దుకిలుమ్ శీరావుమ్ అణైయుమరై వాళ్గియే
మైయిలకు వేలణైత్త వన్మై మిక వాళ్గియే
మాఱామలజ్ఞలిశెయ్ మలర్క్కరజ్గళ్ వాళ్గియే
శెయ్యకలనుడనలజ్గల్ శేర్మార్పుమ్ వాళ్గియే
తిణ్బుయముమ్ పణిమలర్న్ద త్తిరుకళుత్తుమ్ వాళ్గియే
మైయల్ శెయ్యుముక ముఱువల్ మలర్క్కణ్గళ్ వాళ్గియే
మన్నుముడి తొప్పారమ్ వలయముడన్ వాళ్గియే.
"ఉణైకళిత్త వాళైయొత్త విళిమడన్దై మాతర్ మేల్,
ఉరుకవైత్త మనమొళిత్తు పులకళన్దనమ్బిమేల్,
కుణైయవైత్తుమడలెడుత్త కుణైయాలాళితిరుమణ
జ్గొణైతన్నిల్ వళిపఱిత్త కుఱ్ఱమత్త శెణ్డియాన్,
మణైయురైత్త మనిర్దణై మాలురైక్కవవన్ మున్నే,
మడియొతుక్కి మనమడక్కి వాయ్ పుతైత్తు ఒన్నలార్,
కణైకుళిత్త వేలణైత్తు నిన్తవిన్ద నిలెమైయెన్,
కణై విట్ట కన్దిడాతు కలియనాణై యాణైయే"

మార్గముః—శీర్గాళి నుండి తిరువెంగాడు పోవుబస్ మార్గములో 8 కి.మీ. దూరములో ఈ క్షేత్రము కలదు. వసతులు లేవు.

పా॥ తూవిరియ మలరుళక్కి త్తుణై యోడుమ్ పిరియాదే
పూవిరియ మదునగరమ్ పొఱివరియ శిఱువణ్డే;
తీవిరియ మణై వళఱ్కుమ్ పుగళాళర్; తిరువాలి
ఏవరివెశ్శిలై యాను క్కెన్నిలై మై యురాయే.

నిలయాళా నిన్ వణజ్గ వేణ్డాయే యాగిలుమ్; ఎన్
ములై యాళ వొరువాళున్నగలత్తాలాళాయే;
శిలై యాళా మరమెయ్ద తిఱలాళా తిరుమెయ్య
మలై యాళా; నీయాళవళై యాళమాట్టోమే
తిరుమంగై ఆళ్వార్ పెరియతిరుమొళి 3-6-1;9

## ❁ 18 తిరుక్కణ్ణపురం 11 (నన్నిలమ్ నుండి 7 కి.మీ) ❁

శ్లో॥ శ్రీ మత్కణ్ణ పురేతు నిత్య సరసీ సంశోభితే ప్రాజ్ముఖం
దేవ్యా కణ్ణ పురాభిధాన సుయుజా శ్రీ శౌరి రాజప్రభుమ్।
వైమానే స్థిత ముత్పలా వతక మిత్యాఖ్యేతు కణ్వేక్షితం
సేవే విష్ణు మనశ్శఠారి కలిజిత్ శ్రీ కౌస్తుభాంశ స్తుతమ్॥

వివః శౌరిరాజ పెరుమాళ్-కణ్ణపురనాయకి-నిత్య పుష్కరిణి-తూర్పు ముఖము-నిలుచున్నసేవ-ఉత్పలావర్తక విమానము-కణ్వ మహర్షికి ప్రత్యక్షము-నమ్మాళ్వార్; కులశేఖరాళ్వార్; పెరియాళ్వార్; ఆండాళ్, తిరుమంగై ఆళ్వార్ కీర్తించినది.

విశేః ఇచ్చట పెరుమాళ్లు శ్రీదేవి, భూదేవి, నీళాదేవి, గోదా దేవులతో వేంచేసి యున్నారు. పెరియపెరుమాళ్ల (శ్రీరంగనాధుల) మంగళా శాసనం ప్రకారం శ్రీ విభీషణాళ్వాన్లకై ప్రతి అమావాస్యనాడు దక్షిణ తిరుముఖమండలముగా వేంచేసి సేవ సాయింతురు.

ఈ శౌరిరాజ పెరుమాళ్లను తిరుమంగై అళ్వార్ "కుణపాల మదయానై" (ప్రాగ్దిశా దిగ్గజము) యని కీర్తించి యున్నారు. మఱియు ఈ క్షేత్రమును "కీళవీడు" (క్రింది నగరము) అని అభివర్ణించి యున్నారు. (మేలైవీడు శ్రీరంగము) "ఉత్పలావతకమ్" అనియు విలక్షణమైన తిరునామము గలదు. కృష్ణారణ్య క్షేత్రమనియు, సప్త పుణ్య క్షేత్రమనియు పేరు కలదు.

నమ్మాళ్వార్ 'మాలై నణ్ణి' అను తిరువాయిమొళిలో (9-10) "మరణమానాల్ వైకున్దం కొడుక్కుం పిరాన్" అని సర్వేశ్వరుని శరణ్యముకున్దత్వ గుణమును (అనగా ఆశ్రితులైన వారికి మోక్షమును ప్రసాదించు గుణమును) కీర్తించిరి. నమ్మాళ్వార్లు తిరువాయి మొళి (9-10)లో నాల్గు పాశురముల వరకు భక్తిని ఉపదేశించి ఈ పాశరమున (5) ప్రపత్తిని ఉపదేశించిరి. "తన శ్రీపాదములను ఆశ్రయించిన వారికి సకలవిధ రక్షకుడగును. శరీరావసానమున మోక్షమును ప్రసాదించును. తనను ప్రేమించిన వారికి తాను ప్రేమైక మూర్తి యగును" అని సర్వేశ్వరునకు గల "మోక్ష ప్రదత్వ" గుణమును ప్రకాశింపచేసిరి.

క్రిమి కంఠచోళుడు ఈ సన్నిధి ప్రాకారములు ఆరింటిని ధ్వంసము చేసెను. దానిని సహింప జాలని "అరయరుస్వామి" పెరుమాళ్లతో "ఇంత జరుగుచున్ననూ ఊరకుంటివే ! ఇది తగునా!" యని ప్రార్థించియు పెరుమాళ్లు పలుకక పోవుటచే చేతిలోని "తాళమును" స్వామిపైకి విసిరి వేసిరి. అంత పెరుమాళ్లు సుదర్శన చక్రమును ప్రయోగించి చోళుని వధించిరట. ఇందుకు నిదర్శనముగా పెరుమాళ్లు ప్రయోగచక్రముతో వేంచేసి యున్నారు.

వయాలాలి మణవాళన్ పెరుమాళ్ల వద్ద తిరుమంత్రమును పొందిన తిరుమంగై ఆళ్వార్లు ఈ దివ్యదేశములో ఆమంత్ర సిద్ధిని పొందిరి.

ఇచట పెరియ తిరువడి (గరుత్మాన్) గొప్ప తపమాచరించి పెరుమాళ్ల ఎదుట వేంచేసియున్నారు.

ఇచట ప్రతి నిత్యము రాత్రిభాగమున బియ్యముతో సమానముగా నేతినుపయోగించి చేసిన పొంగలిని పెరుమాళ్లు ఆరగింతురు. ఇది మిక్కిలి ప్రభావము గలది.

**మార్గము:** నాగపట్నం నుండి నన్నిలమ్ పోవు బస్‌లో తిరుప్పుగలూర్‌లో దిగి ఒక మైలు నడవాలి. మాయవరం - నల్లూరు బస్‌లో కూడ తిరుప్పుగలూర్ చేరవచ్చును.

పా॥మాలై నణ్ణి త్తొழுదెழுమినో వినై కెడ;
కాలై మాలై కమల మలరిట్టు నీర్
వేలై మోదుమ్ మదిళ్శూழ் **తిరుక్కణ్ణ పురత్తు;**
ఆలిన్ మేలాలమరన్దాన్ అడియిణై గళే
నమ్మాళ్వార్ తిరువాయిమొழி 9-10-1

శిలై యిలఙ్గు పొన్నాழி తిణ్పడై తణ్డొణ్ శఙ్గ మెన్గిన్ఱాళాల్
మలై యిలఙ్గుతోళ్ నాన్గే మత్తవను కెత్త కాణ్గెనిన్ఱాళాల్
ములై యిలఙ్గు పూమ్బయలై మున్బోడ అన్బోడి యిరుక్కిన్ఱాళాల్
కలై యిలఙ్గు మొழியాళర్ **కణ్ణపురత్తమ్మానై** క్కణ్డాళ్ కొలో.

శెరువరై మున్నాశఱుత్త శిలై యన్ఱో కైత్తలత్త తెన్గిన్ఱాళాల్
పొరువరై మున్బోర్ తొలైత్త పొన్నాழி మత్తిరుకై యెన్గిన్ఱాళాల్
ఒరువరయుమ్ నిన్నొప్పారొప్పిలా వెన్నప్పా వెన్గిన్ఱాళాల్
కరువరుపోల్ నిన్ఱానై **క్కణ్ణపురత్తమ్మానై** క్కణ్డాళ్ కొలో.

తిరుమంగై ఆழ்వార్ పెరియ తిరుమొழி 8-1-1,2.

## ❁ 19. తిరునాగై 19 (నాగ పట్టణమ్) ❁

శ్లో॥ సౌందర్య రాజ భగవాన్ తిరు నాగపుర్యాం సారాభిధాన సరసీ తటశోభితాయామ్।
సౌందర్య పూర్వ లతికా మహిషీ సమేత స్సౌందర్య నామ వరమన్దిర మధ్యవాసః ॥
సంస్థాన వేష రుచిరో భుజగాధి రాజః శ్రీమత్కలిఘ్న మునిసేవిత దివ్యమూర్తిః।
ప్రాచీముఖః కలిజిదాహ్వయ సూరి కీర్త్యః భక్తేష్ట దాన నిపుణో భువిరాజతేఽసౌ॥

**వివ:** సౌందర్య రాజ పెరుమాళ్-సౌందర్యవల్లి తాయార్ - సార పుష్కరిణి-సౌందర్య విమానము-తూర్పుముఖము-నిలచున్న సేవ-నాగరాజునకు, తిరుమంగై ఆళ్వార్లకు ప్రత్యక్షము. తిరుమంగై ఆళ్వార్లు కీర్తించినది.

**విశే:** నాగరాజునకు ప్రత్యక్షమైన స్థలమగుటచే నాగపట్నం అని పేరు కలిగెను. మీన మాసం ఉత్తరా నక్షత్రమున తీర్థోత్సవము.

ఈ క్షేత్రమునకు పశ్చిమముగా 10 కి.మీ దూరంలో "తిరుక్కణ్ణంగుడి"యను క్షేత్రము కలదు.

**మార్గము:-** నాగపట్నం ప్రసిద్ధి చెందిన పట్నము. వసతులున్నవి. బస్‌స్టేషన్‌కు ఎదుటవీధిలోనే సన్నిధి గలదు. మాయవరం నుండి వచ్చి సేవించుటయు సౌకర్యము.

పా॥ పొన్నివర్ మేని మరదకత్తిన్ పొఙ్గిళఙ్జోది యకలత్తారమ్
మిన్;ఇవర్ వాయిల్ నల్ వేదమోదుమ్ వేదియర్ వానవరావర్ తోழி
ఎన్నైయుమ్ నోక్కి యెన్నల్గులమ్ నొక్కి యేన్దిళఙ్గొఙ్గైయుమ్ నోక్కుకిన్నార్
అన్నైయెన్నోక్కుమెన్ఱఞ్జుగిన్ఱేన్ అచ్చోవొరు వరழగియవా
తిరుమంగై ఆళ్వార్ పెరియ తిరుమొழி 9-2-1

## ❁ 20. తిరునఱైయూర్ 20 కుంభకోణం 10 కి.మీ) ❁

శ్లో। నరయూర్ పరిపూర్ణ నామకే మణిముక్తాఖ్య తరంగిణీ తటే।
త్రిదశే ప్రదిశాముఖస్థితిః వరనంబిక్కలతా సమన్వితః॥
శ్లో॥ శ్రీనివాసే విమానస్థో మేధావీ మునిసేవితః।
కలిజిన్మౌని సంకీర్త్య రాజతే భక్తవత్సలః ॥

**వివ:** నంబి-నంబిగై నాచ్చియార్-మణిముక్తానది-శ్రీనివాస విమానము-తూర్పుముఖము-నిలచున్న సేవ- మేధావి మునికి ప్రత్యక్షము-తిరుమంగై ఆళ్వార్‌కీర్తించినది.

**విశే:** తాయార్లకు ప్రాధాన్యత గల క్షేత్రము. ఇచ్చటి పెరుమాళ్లకు శ్రీనివాసన్, వాసుదేవన్, పరిపూర్ణన్, నంబియను తిరునామములు కలవు. తాయార్ ఉత్సవర్ వంజుళవల్లి. ఇచట పెరుమాళ్లతోపాటు సంకర్షణ,ప్రద్యుమ్న;అనిరుద్ధ; పురుషోత్తములును వేంచేసి యున్నారు. బ్రహ్మకూడ వేంచేసి యున్నారు.

రాక్షసుడు అపహరించిన స్వామి వైరముడిని గరుడాళ్వార్ తీసికొని వచ్చుచుండగా ఆ యుద్ధములో కిరీట శిఖరమందలి మణి అచటనున్న నదిలో పడినది. కావున ఆ నదికి మణి ముక్తా నదియను పేరు వచ్చినది. స్వామి వైరముడి నేటికిని శిఖరము లేక యున్నది. తిరుమంగై ఆళ్వార్లకు పెరుమాళ్లు పంచ సంస్కారములను అనుగ్రహించిన దేశము.

ఈ సన్నిధిలో రాతి గరుడ వాహనము కలదు. మొదట నలుగురు స్వాములచే గర్భాలయము నుండి తీసికొని రాబడి, 16 మందిచే వాహన మంటపమునకు, 32 మందిచే అలంకార మంటపమునకు వేంచేపు చేయబడి అచట పెరుమాళ్లను వేంచేపు చేసి అలంకారమైన పిమ్మట 200మంది శ్రీపాత్తాంగులతో తిరువీధి ఉత్సవము జరుగు సందర్భము అతి విలక్షణమైనది. ఈ ఉత్సవము వైకుంఠ ద్వాదశినాడు; కుంభమాస బ్రహ్మోత్సవములో 5వ రోజున రాత్రి జరుగును.

మార్గం: కుంభకోణం నుండి టౌను బస్ కలదు. 10 కి.మీ. ఉప్పిలియప్పన్, తిరుచ్చేరైల నుండియు సేవింపవచ్చును.

1. పైడై యడర్త మడ వన్నమ్ పిరియాదు; మలర్కమలమ్
మడ వెడుత్త మదునుకరుమ్ వయలుడుత్త తిరునఱైయూర్
ముడై యడర్త శిరమేన్ది మూవులగుమ్ పలితిరివోన్
ఇడర్ కెడుత్త రువాళినిణై యడియే యడై నెఞ్జే.

2. కులై యార్న్ద పళుక్కాయుమ్ పశుఙ్గాయుమ్ పాళై ముత్తుమ్
తలై యార్న్ద విళఙ్గముగిన్ తడఙ్గోలై త్తిరునఱైయూర్
మలై యార్న్ద కోలఞ్జేర్ మణిమాడ మిగమన్ని;
నిలై యార నిన్రాన్ఱన్ నీళ్ కళలే యడై నెఞ్జే

తిరుమంగై ఆళ్వార్ పెరియతిరుమొళి 6-9-1,8.

## ❁ 21. నందిపుర విణ్ణగరమ్ (21 కుంభకోణం 10 కి.మీ) ❁

### (నాథన్ కోయిల్)

శ్లో॥ నంది పూర్వ పుర విణ్ణగర్ పురే నంది తీర్థయుజి పశ్చిమాననః ।
నాథనాథ ఇతి నామ సంయుతో నంది భక్తశిబిరాజ సేవితః ॥

శ్లో॥ శ్రీమచ్చంపక వల్లీతి నాయక్యా పరిశోభితః॥
మధ్యే మన్దార వైమాన మాస్తే శ్రీ కలిజిన్నుతః ॥

వివ: విణ్ణగర పెరుమాళ్-నాథ నాథ పెరుమాళ్-చంపకవల్లి తాయార్-నంది పుష్కరిణి-మన్దార విమానము-పశ్చిమ ముఖము-కూర్చున్న సేవ-నందికి శిబికి ప్రత్యక్షము-తిరుమంగై ఆళ్వార్ కీర్తించినది.

విశే: ఈ క్షేత్రమునకు తూర్పున 1 కి.మీ. దూరమున నందివనమను చోట



18. శౌరి రాజన్ - తిరుక్కణ్ణపురం
Souri Rajan - Tirukkana Puram



19. సౌందర్యరాజన్ - తిరునాగై
Soundarya Rajan - Nagapatnam



**20.నంబి - తిరునఱైయూర్**

**Nambi - Tirunarayuru**



**21. నాథనాథన్ - నందిపుర విణ్ణగరమ్**

**Nadhanadhan - Nandipuravinnagaram**

పెరుమాళ్ల సన్నిధి ఒకటి శిధిలముగా నున్నది. మీనమాసం హస్తా నక్షత్రము. తీర్థోత్సవం. ఈసన్నిధికి తూర్పున 5 కి.మీ. దూరంలో నాచ్చియార్ కోవెల కలదు. ఈ క్షేత్రమునకు దక్షిణ జగన్నాథమని పేరు.

**మార్గము:** 1 కుంభఘోణం నుండి టౌను బస్ కలదు.

2. కుంభకోణం నుండి "కొడుక్కి" అనుచోట దిగి 2 కి.మీ. దూరము నడిచియు సన్నిధిని సేవింపవచ్చును.

పా॥ తీదలు నిలత్తొడెరి కాలికొడునీర్ కెళువిశమ్బు మ్మై యాయ్,
మాశఉు మనత్తి నొడలక్క మొడిలక్కై యవై యాయ పెరుమాన్ తాయ్
శెలువళైన్దు తయిరుణ్డు కుడమాడు తడమార్వర్ తగైశేర్
నాదనుణ్డై కిన్దనకర్ నన్దిపుర విణ్ణగరుమ్ నణ్ణు మనమే.
తిరుమంగై ఆళ్వార్-పెరియతిరుమొళి 5-10-1

## ❁ 22. తిరు విందళూరు 22 (మాయావరం) ❁

### (తిరువళందూర్)

**శ్లో॥ శ్రీమదిందు సరసీకృతద్భుతా విందళూర్పురి సురేంద్ర దిఙ్ముఖః ॥**
**దివ్యగంధ వననాథ నామకః చంద్రశాప వినివర్తన ప్రియః ॥**
**శ్లో॥ వేద చక్రపద దేవయానగో వీరనామ శయనావలాంఛనః**
**చంద్రసేవిత తనుర్విరాజతే కౌస్తుభాంశ కలి జిన్మని స్తుతః ।**

**వివ:** సుగంధ వననాధుడు, మరువినియమైన్ద పెరుమాళ్, పరిమళ రంగన్- చంద్రశాప విమోచన నాచ్చియార్-పుండరీక వల్లి నాచ్చియార్-వేదచక్ర విమానము- చంద్ర పుష్కరిణి-తూర్పుముఖము- వీరశయనము- చంద్రునకు ప్రత్యక్షము- తిరుమంగై ఆళ్వార్ కీర్తించినది.

**విశే:** మీనం హస్త తీర్థోత్సవంగా బ్రహ్మోత్సవం. తులా మాసమున కావేరీ స్నానము మిక్కిలి విశేషము.

**మార్గము:-** ఇది మాయవరం నగరంలో ఒక భాగము టౌన్‌బస్ సౌకర్యము గలదు. మాయవరంలో అన్ని వసతులు కలవు.

పా॥ నుమ్మైత్తొழుదోమ్ నున్దమ్ పణిశెయ్దిరుక్కుమ్ నుమ్మడియోమ్
ఇమ్మైక్కిన్బమ్ పెత్తిమైన్దా యిన్దళూరీరే
ఎమ్మైక్కడితాక్కరుమమరుళి ఆవావెన్తి రజ్గీ
నమ్మై యొరుకాల్ కాట్టి నడన్దాల్ నాజ్గళుయ్యోమే
తిరుమంగైయాళ్వార్ - పెరియ తిరుమొళి 4-9-1.

## ❁ 23. తిరుచ్చిత్తరకూడమ్ 23 (చిదంబరం) ❁

శ్లో॥ శ్రీ పుండరీక సరసీ పరిశోభమానే
శ్రీ చిత్రకూట నగరే భుజగేంద్ర శాయీ।
శ్రీ పుండరీక లతికా ప్రియ దివ్యరూపః
శ్రీ సాత్త్వికాఖ్య వరమన్దిరవాస లోలః ॥

శ్లో॥ ప్రాచీముఖ శ్శివముఖా మర కణ్వ తిల్యా
ప్రత్యక్ష మంగళ తనుః కులశేఖరేణ।
సంకీర్తితః కలిజితా మునినా చ నిత్యం
గోవిందరాజ భగవానవనౌ విభాతి॥

వివః— గోవింద రాజస్వామి-పుండరీక వల్లి తాయార్-సాత్త్విక విమానం- పుండరీక సరస్సు - తూర్పుముఖము - భుజంగభోగశయనము - పరమశివునకు, దేవతలకు,కణ్వమహర్షికి, తిల్యకు ప్రత్యక్షము. కులశేఖరాళ్వార్లు, తిరుమంగై ఆళ్వార్లు కీర్తించినది.

**విశే:** ఈ క్షేత్రమునకు పడమట దిశగా 40 కి.మీ దూరమున "స్వయం వ్యక్త స్థలములలో నొకటియైన శ్రీముష్ణమును, నైరుతి దిశగా 25 కి.మీ దూరమున కాట్టుమన్నార్ కోవెలయు గలదు. ఈ సన్నిధిలోనే చిదంబర నటరాజ శివాలయము గలదు.

**మార్గముః** మద్రాసు-తిరుచ్చిరై లు మార్గములో కలదు. తమిళనాడులోనిఅన్ని ముఖ్యపట్టణముల నుండి బస్ వసతి కలదు. అన్ని సౌకర్యములు గల నగరము.

పా॥ అఙ్గణెడు మదిళ్ పుడై శూழ் అయోత్తి యెన్నుమ్
అణినగరత్తులగనై త్తుమ్ విళక్కుమ్ శోది
వెఙ్గదిరోన్ కులత్తు క్కోర్ విలక్కాయ్ త్తోన్రి
విణ్ ముழுదు ముయ్యక్కొణ్ణ వీరన్ఱన్నై
శెఙ్గణెడుమ్ కరుముగిలై యిరామన్ఱన్నై
త్తిల్లై నగర్ తిరుచ్చిత్తర కూడన్దన్నుళ్
ఎఙ్గళ్ తని ముదల్వనై యెమ్బెరుమాన్ఱన్నై
యెన్ఱుకొలో కణ్ కుళిర క్కాణునాళే

కులశేఖరాళ్వార్-పెరుమాళ్ తిరుమొழி 5-10-1



24.తాడాళన్ - కాళిచ్చీరామవిణ్ణగరమ్

Tadalan - Sirkali



25.వైయ్యంకాత్త పెరుమాళ్ - కూడలూర్

Vaivamkatta Perumal - Kudalur

# ❀ 24. కాఴిచ్చీరామ విణ్ణగరమ్ 24(శీయాళి) ❀

## (శీర్గాళి)

శ్లో॥ శంఖ పుష్కరిణీ చక్ర తీర్థ సుందర వైభవే ।
కాఴ్చీరామ పురే శ్రీమాన్ తాడాళన్నితి విశ్రుతః ॥

శ్లో॥ మరంద స్యంది కబరీ నాయకీ భాగలోలుపః ।
పుష్కలా వర్తకాఖ్యాన విమానస్థితి శోభితః ॥

శ్లో॥ అష్టకోణ మహర్షీణాం ప్రత్యక్షః ప్రాగ్దిశాముఖః ।
పరకాల వచోదివ్య సుధాప్రీతో విరాజతే ॥

**వివ :** తాడాళన్-త్రివిక్రమన్-మత్త విఴంకుఴలి నాచ్చియార్-లోక నాయకి-శంఖ పుష్కరిణి-చక్ర తీర్థము-పుష్కలా వర్తక విమానము- అష్టకోణ మహర్షికి ప్రత్యక్షము- తూర్పు ముఖము- నడచుచున్నసేవ-తిరుమంగై ఆళ్వార్ కీర్తించినది.

**విశే :** ఇచటనే తిరుమంగై ఆళ్వార్"ఒరు కుఱళాయ్"(పె.తి 3-4) అనుదశకమును అనుగ్రహించి "తిరుజ్ఞాన సంబందర్" అను శైవకవులను మెప్పించి "చతుష్కవి శిఖామణి" అను బిరుదమును పొందిరి. శ్రీ వైష్ణవ సిద్ధాన్త స్థాపన చేసి "తాడాళన్" పెరుమాళ్లను పునః ప్రతిష్ఠ గావించిరి. 'తిరుక్కోవలూర్' లో 'త్రివిక్రమన్' పెరుమాళ్ల కుడి పాదము పైకి యుండగా ఇచ్చటి పెరుమాళ్ల ఎడమ పాదము పైకి గలదు. మణవాళమా మునులు వేంచేసి మంగళాశాసనం చేసిన స్థలము.

**మార్గము :** శీర్గాళి పెద్ద పట్టణము. అన్ని వసతులు గలవు.

పా॥ ఒరు కుఱళాయిరు నిలమ్ మూవడిమణ్ వేణ్డి
యులగనైత్తు మీరడియా లొడుక్కి; ఒన్రుమ్
తరగవెనా మావలియై చ్చిఱైయిల్ వైత్త
తాడాళన్ తాళణై వీర్; తక్క కీర్తి
యరు మఱైయిన్ తిరళ్ నాన్గుమ్ వేళ్వియైన్దుమ్
అజ్గజ్గళవై యాఱు మిశై గేళ్విఴమ్
తెరువిల్ మలివిఴా వళముమ్ శిఱక్కుమ్ కాఴి
చ్చీరామ విణ్ణగరే శేర్మినీరే

తిరుమంగై యాழ్వార్ - పెరియ తిరుమొఴి 3-4-1

# ❁ 25. కూడలూర్ 25 (తిరువయ్యారు 10 కి.మీ) ❁

## (ఆడుదుర్రై పెరుమాళ్ కోయిల్)

శ్లో॥ చక్ర తీర్థాంచితే రమ్యే కూడలూర్ నగరీవరే
పద్మాసన లతానాథో వైయ్యంకాత్త విభుస్సదా ।

శ్లో॥ శుద్ధ సత్త్వ విమానస్థః ప్రాఙ్ముఖో నన్దకర్షిణా
ప్రత్యక్షితః కలిధ్వంసి స్తుతి ప్రీతో విరాజతే ।

**వివః–** వైయంకాత్త పెరుమాళ్ (జగద్రక్షకన్) పద్మాసనవల్లి తాయార్. చక్ర తీర్థము. శుద్ధ సత్త్వ విమానము. తూర్పు ముఖము- నిలుచున్న సేవ-నన్దక మహర్షికి ప్రత్యక్షము-తిరుమంగై ఆళ్వార్ కీర్తించినది.

**సూచనః–** తంజావూరు నుండి గణపతి అగ్రహారం పోవు టౌను బస్‌లో ఈ క్షేత్రమును చేరవచ్చును. ఇచట వసతులేమియు లేవు. అయ్యంపేటలోగాని, తిరువయ్యారులో గాని బసచేయవలెను. అయ్యంపేటకు 7 కి.మీ దూరములో ఈ క్షేత్రము గలదు. **అర్చక స్వాములు ఉండు సమయమును తెలిసికొని సేవింపవలయును.**

**మార్గముః–** తంజావూరు నుండి తిరువయ్యారు చేరి అక్కడ నుండి కుంభకోణం పోవు బస్‌లో 10 కి.మీ దూరములో ఈ సన్నిధి చేరవచ్చును. **ఆడుదుర్రై పెరుమాళ్ కోయిల్ అనియే చెప్పవలెను.**

పా॥ తాన్దమ్ పెరుమై యఱియార్; తూదు । వేన్దర్కాయవేన్దరూర్ పోల్;
కాన్దళ్ విరల్ మెన్ కలై నన్మడవార్ । కూన్దల్ కమళుమ్ **కూడలూరే.**

పా॥ తక్కన్‌వేళ్వి త్తకర్త తలైవన్ । తుక్కున్దుడై త్త తుణైవరూర్ పోల్
ఎక్కలిడు నుణ్ మణల్ మేల్, ఎఙ్గుమ్ । కొక్కిన్ పళమ్ వీళ్ **కూడలూరే.**

తిరుమంగై ఆళ్వార్ – పెరియ తిరుమొళి 5-2-1,6

---

## ముముక్షువు

మంచిమాట

కంటికి కనుపింపనిధానిని (అనగా భగవత్స్వరూపమును) కంటికి కనుపించునట్లు అనుసంధించుకొనుచు, కంటికి కనుపించు (శబ్దాదిభోగములను) వానిని కంటికి కనబడునట్లు భావించువాడే ముముక్షువు.

–"శ్రీపరాశరభట్టర్"

# ❋ 26. తిరుక్కణ్ణంగుడి26 ❋

## (కృష్ణారణ్యక్షేత్రం)

శ్లో॥ శ్రీ మచ్ఛ్రవణ కాసారే తిరుక్కణ్ణంగుడీరితే ।
పురే శ్యామళ తన్వాఖ్యః అరవిందలతాయుతః ॥
ఉత్పలాఖ్య విమానస్థః ప్రాఙ్ముఖో గౌతమర్షిణా ।
ప్రత్యక్షిత : కలిఘ్నార్య సంస్తుతో భువి భాసతే ॥

**వివః** శ్యామలమేని పెరుమాళ్-అరవిన్దవల్లి తాయార్-శ్రవణ పుష్కరిణి-ఉత్పల విమానము-తూర్పు ముఖము-నిలుచున్న సేవ- గౌతమ మహర్షికి (భృగు, బైద్యులకు) ప్రత్యక్షం తిరుమంగై ఆళ్వార్ కీర్తించినది.

**విశేః** ఈ క్షేత్రమునకు కృష్ణాంణ్య క్షేత్రమని పేరు కలదు. ఇచట ఆకులు ముడుచుకొనని చింతచెట్టు (ఉఱంగాప్పుళి;) తిరుమంగై ఆళ్వార్ రాయి విసరిన చోట ఏర్పడిన ఊరా కిణర్ అను మంచి నీటి చెఱువును ఉండెడివి. పుష్పించియు కాయలు కాయని పొగడ చెట్టు కలదు.

ఇచ్చట తాయార్ మూలవర్ ఉత్సవర్ ఒకే పోలికలో నుండుట విశేషము. తిరుమంగై ఆḻ్వార్ బంగారు బుద్ధ విగ్రహమును దాచిన స్థలము. ఆ స్థల యజమానితో వచ్చిన వివాద కారణముగా "తీరావழక్కు తిరుక్కణ్ణం గుడి" (తీరని వ్యాజ్యము తిరుక్కణ్ణంగుడి) యని ప్రసిద్ది చెందినది. కుంభమాసం మఖా నక్షత్రం తీర్థోత్సవము జరుగును.

**మార్గముః–** నాగపట్నం-శిక్కిల్-కీవళూర్ మధ్యనగల "ఆళియూర్" అనుచోట బస్‌దిగి 1 కి.మీ నడచి సన్నిధి చేరవచ్చును. తంజావూరు-కీవళూర్ మార్గములో కీవళూర్ నుండి 3 కి.మీ. వసతులు స్వల్పము.

పా॥ వఙ్గమామున్నీర్ వరినిఱప్పెరియవాళ రవినణైమేవి
తఙ్గమార ణైత్తడ మలరున్ది చ్చామమామేని యెన్దలైవన్
అఙ్గమా ఱైన్దు వేళ్వి నాల్ వేద మరుఙ్గలై పయిన్ఱు; ఎరిమూన్ఱుమ్
శెఙ్గయాల్ వళర్కున్దుళక్కమిల్ మనత్తోర్ తిరుక్కణ్ణఙ్గుడియుళ్ నిన్రానే.
వెన్రిశేర్ తిణ్మై విలఙ్గల్ మామేని వెళ్ళియిరగజురిత్తఱుకణ్,
పన్రియాయన్ఱు పార్ మగళ్ పయిలై తీర్తవన్ పఞ్జవర్ పాగన్
ఒన్రలావురువత్తులప్పిల్ పల్ కాలత్తయర్ కొడి యొళివళర్ మదియుమ్
శెన్రుశేర్ శెన్నిచ్చిగరనన్ మాడ త్తిరుక్కణ్ణఙ్గుడియుళ్ నిన్రానే.

తిరుమంగై ఆళ్వార్-పెరియ తిరుమొழి 9-1-1,4.

# ❁ 27. తిరుక్కణ్ణమంగై 28 (తిరువారూరు 8 కి.మీ) ❁

## (కృష్ణమంగళ క్షేత్రం)

శ్లో॥ దర్శనాఖ్యసరో రమ్యే కణ్ణ మంగై పురీవరే
అభిషేక లతాయుక్తః భక్తవత్సల నాయకః ॥
ఉత్పలాఖ్య విమానస్థః సురనాథ దిశాముఖః
రోమశర్షి ప్రచేతాభ్యాం సేవితః కలిజిన్నుతః ॥

**వివః–** భక్త వత్సల పెరుమాళ్–అభిషేకవల్లి తాయార్–దర్శన పుష్కరిణి–ఉత్పల విమానము–తూర్పు ముఖము–నిలుచున్న సేవ – రోమశ మహర్షికిని వరుణునకును ప్రత్యక్షము–తిరుమంగై ఆళ్వార్ కీర్తించినది.

**విశేః–** సన్నిధికి కావలసిన అంశములు ఏడు. అవి విమానము, మండపము,రథము, సరస్సు, క్షేత్రము, నదీ, నగరములు. ఈ ఏడు అంశములు కలిగియుండుటచే ఈ క్షేత్రమునకు సప్తామృతక్షేత్రమని పేరు వచ్చినది. ఈ సన్నిధిలో ఒక తేనెగూడు కలదు. మహర్షులు తేనెటీగల రూపములో స్వామిని ఆరాధించిరట. ఆ తేనె గూటికిని తిరువారాధన జరుగును. 'తిరుక్కణ్ణ మంగై యాండాన్' అవతార స్థలము. ఈ క్షేత్రస్వామిని గూర్చి తిరుమంగై యాళ్వార్ "పెఱుమ్పుఱక్కడలై" (పె.తి 10–10) అను దశకమును అనుగ్రహించు చుండగా నాల్గు పాశురములు అనుగ్రహించు సమయమున తిరునిన్ఱవూర్ భక్తవత్సల పెరుమాళ్ ఎదుట సేవ • సాయింపగా "కురుమామణి కున్ఱినై నిన్ఱవూర్ నిన్ఱ నిత్తిల త్తొత్తినై" అని మంగాళా శాసనం చేసిరి. ఒక రాత్రి ఇచట నిద్రించినను మోక్షము లభించునని ప్రసిద్ధి.

**మార్గం :–** తిరుచ్చేరై నుండి 24 కి.మీ. కుంభఘోణం – తిరువారూర్ బస్ మార్గం తిరువారూర్ నుండి టౌను బస్ కలదు. 8 కి.మీ. (కుంభకోణ మార్గం).

పా॥ పెరుమ్పుఱ క్కడలై యడలేఱ్ఱై త్తివై ప్పెణ్ణై యాణ్ణై ; ఎణ్ణిల్ మునివర్క్కు
అరుళ్ తరున్దవత్తై ముత్తిన్ తిరట్కోవై యై ప్పత్తరావియై నిత్తిలత్తొత్తినై
అరుమ్పినై యలరై యడియేన్ మనత్తాశై యై యముదమ్పొది యిన్జువై
కురుమ్పినై క్కనియై చెన్నునాడి **కణ్ణమఙ్గయు ట్కణ్డు** కొణ్డేనే.
ఏఱ్ఱినై యిమయత్తు ళెమ్మీశనై యిమ్మైయై మఱుమైక్కు మరున్దినై
ఆఱ్ఱలై అణ్డత్తప్పుఱత్తాయ్ త్తిడుమై యనై క్కై యళి యొన్దేన్దియ
కాఱ్ఱినై, కురుమామణిక్కున్ఱినై నిన్ఱవూర్ నిన్ఱ నిత్తిల త్తొత్తినై,
కాఱ్ఱినై ప్పునలై చ్చెన్ఱు నాడి క్కణ్ణమఙ్గై యుట్కణ్డు కొణ్డేనే.

తిరుమంగై ఆళ్వార్ – పెరియ తిరుమొళి 7–10–1,5.



27.భక్తవత్సలన్ - తిరుక్కణ్ణమంగై
Bhaktavatsalan - Tirukkanna Mangai



26.శ్యామలమేని పెరుమాళ్ - తిరుక్కణ్ణంగుడి
Syamalmeni Perumal - Tirukkanamgudi



28.గజేంద్ర వరదన్ - కపిస్థలం
Ganjendra Varadan - Kapistalam



29.కోలవల్‌విల్లి రామన్ - తిరువెళ్ళియంగుడి
Kolavalvilli Raman - Tiruvelliyangudi

# ❁ 28. కపి స్థలమ్ 28 ❁

శ్లో॥ శ్రీ మద్గజేంద్ర సరసీ కపిలాఖ్య తీర్థ। సంశోభితే శుభ కపిస్థల దివ్యదేశే।
దేవ్యా రమామణిలతాహ్వయయా సమేతో। దేవో గజేంద్ర వరదో భుజగేంద్ర శాయీ।

శ్లో॥ వైమానమస్య వర కారక నామధేయం। దేవేశ దిగ్వదన సంస్థితి శోభమానః
నాగాధిరాజ మరుదాత్మజ సేవితాఙ్ఘ్రిః శ్రీ భక్తిసారమునిరాజ నుతో విభాతి ॥

**వివ:—** గజేంద్ర వరదన్-రమామణి వల్లి తాయార్-పొఱ్ఱా మరైయాళ్ - గజేంద్ర పుష్కరిణి-కపిల తీర్థము-గగనాకార విమానము- తూర్పుముఖము- భుజఙ్గశయనము- గరుత్మంతునకు, హనుమంతునకు ప్రత్యక్షము. తిరుమழிశై ఆళ్వార్ కీర్తించినది.

**విశే :—** ఈ దివ్య దేశమునకు 5 కి.మీ దూరములో ఉమయాపురమునకు పోవు మార్గములో తొండరడిప్పొడి ఆళ్వార్ల తిరుఅవతారస్థలమైన మణ్డఙ్గుడి క్షేత్రము కలదు.

**మార్గము :—** కుంభఘోణం-పాపనాశం టౌను బస్. పాప నాశం నుండి 3 కి.మీ. కుంభఘోణం-తిరువయ్యారు బస్ మార్గమున 20 కి.మీ. సత్రములు కలవు.

పా॥ కూత్తముమ్ శారా కొడువినైయుమ్ శారా; తీ
మాత్తముమ్ శారా వగై అఱిన్దేన్ - ఆత్తఱ్
కరై కిడక్కుమ్ కణ్ణన్ కడల్ కిడక్కుమ్,
మాయన్ఉరై కిడక్కుమ్ ఉళ్ళత్తెనక్కు.

తిరుమழிశై ఆళ్వార్ - నాన్ముగన్ తిరువన్దాది 50 పా.

## సంబంధము

మంచిమాట

మిళకాళ్వాన్ అను ఆచార్యులు తామున్న గ్రామమునకు ప్రక్కనగల వేరొక గ్రామమునకు తరచుగా పోవుచుండెడివారు. ఒది తెలిసిన కొందరు భక్తులు వారిని జూచి మీరు ప్రక్కగ్రామమునకు పలుమార్లు పోవుచున్నారేల? అని ప్రశ్నించిరి. అందులకు మిళకాళ్వాన్ ఇట్లు సమాధానము చెప్పిరి.

"చూడుడు. నేను ఆయూరు వెళ్ళినచో ఆయూరివారికి భగవంతుని విషయములను చెప్పుచుందును. ఆ మంచి మాటలు వినుటచే ఆయూరివారు ఈయూరి వారికి విరోధులు కాకుండ నుందురు. మరియు నేను చెప్పిన భగవత్సంబంధమైన మాటలు విని సంతసించి వారు సమర్పించిన పదార్థములను తీసికొని వచ్చి భాగవత కైంకర్యము చేయుదును. ఇందువలన పదార్థములను సమర్పించిన వారికిని మంచి కలుగును.

ఆమాటలు వినిన భక్తులు వారి పదార్థములు మనకు అనుకూలించునా? అని ప్రశ్నింపగా మిళగాళ్వాన్ నేను అందరిని శ్రీమన్నారాయణునితో సంబంధము గల వారిగానే చూతును. కాని యెవరిని ప్రకృతి సంబంధులుగా చూడను. కావున నాకు ఏ వస్తువయినా శ్రీమన్నారాయణునకు సంబంధించినది గానే కనిపించును. అని చెప్పిరి.

కావున అందరిని, అన్నింటిని, శ్రీమన్నారాయణునితో సంబంధము కలవారిగానే దర్శింపవలెను.

- "వార్తామాల"

# ❁ 29. తిరువెళ్లియంగుడి 29 ❁

శ్లో॥ వెళ్ళి యఙ్గుడి పురేవిరాజతే । బ్రహ్మతీర్థ కవి పద్మినీయుతే ।
కోలవిల్లి రఘునాథ నామకో । నాయకీం మరతకాభిధాం శ్రితః॥
శోభనాభిద విమాన మధ్యగో । భోగిరాజ శయితేంద్ర దిఙ్ముఖః ।
ఇంద్ర శుక్ర విధిశక్తి సూనుభిః । సేవితః కలిహ సంస్తుతోనిశమ్ ॥

వివ :- కోలవల్ విల్లి రామన్ - (శృంగార సుందరన్) మరకతవల్లి తాయార్-బ్రహ్మతీర్థము-శుక్రపుష్కరిణి-శోభన(పుష్కలావర్తక) విమానము-తూర్పు ముఖము-భుజంగ శయనము-ఇంద్ర, శుక్ర, బ్రహ్మ, పరాశరులకు ప్రత్యక్షము. స్థలవృక్షము కదళీవృక్షము (అరటిచెట్టు) తిరుమంగై ఆళ్వార్ కీర్తించినది.

విశే :- ఇచ్చట చతుర్భుజములతో శంఖ చక్రములతో వేంచేసియున్న గరుడాళ్వారు కలరు. ఈ దివ్య దేశమునకు సమీపముననే పెరియవాచ్చాంపిళ్లై (శ్రీకృష్ణసూరి) అవతారస్థలమగు శెంగనల్లూరు కలదు.

**మార్గము:-** కుంభకోణము నుండి తిరువెళ్లియఙ్గుడికి టౌన్ బస్ కలదు. కుంభకోణము నుండి శంగనల్లూర్ చేరి అక్కడ నుండి 1 కి.మీ నడచి పోవచ్చును.

పా॥ పారినై యుణ్డు పారినై యుమిழ్న్దు పారదమ్ కై యెఱిన్దు; ఒరుకాల్
తేరినై యూర్న్దు తేరినై త్తురన్ద శెఙ్గణ్ మాల్ శెన్ఱుఱై కోయిల్
ఏర్నిరై వయలుళ్ వాళైగళ్ మఱుగియెమక్కిడ మన్ఱి దెన్ఱెణ్ణి;
శీర్ మలిపాయ్గై శెన్ఱడై గిన్ఱ **తిరువెళ్లియఙ్గుడి** యదువే.

కాఱ్ఱిడై ప్పూళై కరన్దనవరన్తై యుఱక్కడలరక్కర్ తమ్ శేనై
కూఱ్ఱిడై చ్చెల్ల క్కొడుఙ్గణై తురన్ద **కోలవిల్లిరామన్** కోయిల్
ఊఱ్ఱిడై నిన్ఱ వాழையిన్ కనిగళూழ்త్తు వీழ்న్దన వుణ్డు మణ్డి;
శేఱ్ఱిడై కయల్ గళుగళ్ తిగழ் వయల్ శూழ் తిరువెళ్లియఙ్గుడి వదువే

ఒళ్ళియ కరుమమ్ శెయ్వ నెన్ఱుణర్న్ద మావలి వేళ్వియిఱ్పుక్కు
తెళ్ళియ కుఱళాయ్ మూవడికొణ్డు తిక్కుఱ వళర్న్దవన్ కోయిల్
అళ్ళియమ్బొழிల్ వాయిరున్దువాழ் కుయిల్ కళరి యఱియెన్ఱవై యழைప్ప
వెళ్ళియార్ రుణఙ్గ విరైన్దరుళ్ శెయ్వాన్ తిరువెళ్ళియఙ్గుడి వదువే.

తిరుమంగై ఆళ్వార్ -పెరియ తిరుమొழி 4-10-5,6,7.

## ❁ 30. మణిమాడక్కోయిల్ 30 (తిరునాంగూర్) ❁

**(శీర్గాళి - వైదీశ్వరన్ కోయిల్ 10 కి.మీ.)**

శ్లో॥ భాభాతి దివ్య మణిమాడ పురే సురేంద్ర
రుద్రాభిధాన నళినీ ద్వయ శోభమానే ।
శ్రీపుండరీక లతికా మహిషీ సమేతో
నన్దా ప్రదీప భగవానితి నామధేయః ॥

శ్లో॥ ప్రాచీముఖాసనలసన్ ప్రణవాభిధాన
వైమాన వాస రసిక శ్రిత పారిజాతః ।
ఏకాదశేశ మఘవన్నయనాఽను భూత
శ్రీమత్కలిఘ్న మునిపుఙ్గవ కీర్తిత శ్రీః ॥

**వివః—** నందా విళక్కు పెరుమాళ్-(నరనారాయణర్) పుండరీక వల్లి-ఇంద్ర పుష్కరిణి-రుద్ర పుష్కరిణి (ప్రణవాకార విమానము- తూర్పు ముఖము - కూర్చున్న సేవ-ఏకాదశ రుద్రులకు, ఇంద్రునకు (మతంగ మహర్షికి) ప్రత్యక్షము-తిరుమంగై ఆళ్వార్లు కీర్తించినది.

**విశే :—** మకరమాసము అమావాస్య (తై అమావాస్య) నాడు జరుగు 12 గరుడ సేవలను సేవించియే తీరవలెను. తిరునాంగూర్ తిరుపతులలో నిదిమొదటిది. మిగిలినవి వైగున్ద విణ్ణగరం, అరిమేయ విణ్ణగరం, వణ్ పురుషోత్తమం, శెంబొన్ శెయ్ కోయిల్; తిరుత్తెట్రి యంబలమ్. ఈ సన్నిధిలో తిరుక్కోట్టియూర్ నంబి (గోష్ఠీపూర్ణులు) వేంచేసియున్నారు. అర్చకస్వాములను ముందుగా కలసికొని సేవింపవలెను. మేషం చిత్తా నక్షత్రము తీర్థోత్సవముగా బ్రహ్మోత్సవము జరుగును. శీర్గాళి నుండి టౌన్ బస్ కలదు. రామానుజ కూటం గలదు. మిగతా భోజనాది విషయాలు సన్నిధిలో ఏర్పాటు చేసికోవాలి.

ప్రతి సంవత్సరము మకర మాసము అమావాస్య దివసమున తిరుమంగై యాళ్వార్లు తిరువాలి తిరునగరి నుండి పల్లకిలో వేంచేసి తిరుక్కురై యలూర్ క్షేత్రమును చేరి అచట వేంచేసియున్న పంచ నృసింహమూర్తులకు "వాడినేన్‌వాడి", పాశురాలతో మంగళా శాసనం చేయుదురు. పిమ్మట మంగై మఠం చేరి "అఙ్గణ్ ఞాలం" అను పాశురములతో ఉత్తరదేశమున వేంచేసియున్న "శిఙ్గవేళ్‌కున్ఱమ్" (అహోబిలం) పెరుమాళ్లకు మంగళ శాసనం చేయుదురు.

అటు పిమ్మట తిరుక్కావళంబాడి, తిరుమణిక్కూడం; తిరుపార్థం పళ్లి మొదలగు క్షేత్రములకు వేంచేసి పెరుమాళ్లకు మంగళా శాసనము చేసి తిరుక్కావేరీ

నది యొడ్డునగల మంజక్కుళి మంటపము నందు వేంచేయగా అచట తిరుమంజనము వైభవముగా జరుగును.

అనంతరము "తుళంగునీణ్ముడి" యను పాశురముతో "నంబెరుమాళ్లకు" (శ్రీరంగనాథులకు) "కుళై యార్న్ద" అను పాశరముచే "తిరునఱైయూర్" నంబిగారికి మంగళాశాసనము చేసి సాయంకాలమునకు తిరున ంగూర్ వేంచేయుదురు. ఇచ్చట వేంచేసియున్న ఆరు తిరుపతులలోని పెరుమాళ్లకు మంగళాశాసనం చేసి అచటనే వేంచేసి యుందురు.

మరునాడు తిరునాంగూర్ ఆదిగాగల 11 క్షేత్రముల పెరుమాళ్లు మణిమాడక్కోయిల్‌కు వేంచేసి ఆళ్వార్లచే మంగళా శాసనములను పొందుదురు. పెరుమాళ్లు అందరకు తిరుమంజనములు జరిగిన పిమ్మట నాటిరాత్రి పెరుమాళ్లు అందరు గరుడ వాహనముల మీదను ఆళ్వార్లు హంస వాహనము మీదను వేంచేయగా తిరువీధి ఉత్సవము జరుగును.

మరునాడు పెరుమాళ్లు తమ తమ సన్నిధులకు వేంచేయగా ఆళ్వార్లు "తిరుత్తేవనార్తొగై" మొదలగు దివ్య దేశములకు మంగళా శాసనం చేసి తిరువాలిని చేరగా అచట వేంచేసియున్న నృసింహస్వామి గరుడవాహనమున సేవ సాదింతురు. వారికి మంగళా శాసనం చేసి తిరుమంగై ఆళ్వార్లు తిరునగరికి వేంచేతురు. ఈ పండ్రెండు గరుడ సేవలు తప్పక సేవింప దగినవి.

**మార్గము:-** శీర్గాళి నుండి 10 కి.మీ.

పా॥ నన్దావిళక్కే యళత్తఱ్కరియాయ్ నరనారణనే కరుమాముగిల్ పోల్
ఎన్దాయ్; ఎమక్కేయరుళా యెననిన్ఱిమై యోర్పరమిడమ్ ఎత్తిశై యుమ్;
కన్దార మన్దేనిశై పాడ మాడే కళివణ్డు ముళత్త ముల్ తుదైన్దు;
మన్దారనిన్ఱు **మణమల్గునాఙ్గూర్ మణిమాడక్కోయిల్** వణఙ్గెన్ మననే

పా॥ విడై యోడ వెన్ఱాయ్చ్చి మెన్ఱోళ్ నయన్ద వికిర్దావిళఙ్గు శుడరాళి యెన్ఱుమ్
పడై యోడు శఙ్గొన్నుడై యాయా యెననిన్ఱమై యోర్పరవుమిడమ్ పైన్దడత్తు
పెడై యోడు శెఙ్గాలవన్నమ్ తుగైప్పత్తొగైప్పుణ్డరీకత్తిడైచ్చెఙ్గ ళునీర్
మడై యోడ నిన్ఱు మదువిమ్మునాఙ్గూర్ మణిమాడక్కోయిల్ వణఙ్గెన్ మననే

తిరుమంగై ఆళ్వార్-పెరియతిరుమొళి 3-8-1,9

## ❁ 31. వైకుంద విణ్ణగరమ్ 31 ❁

శ్లో॥ ఆనంద తీర్థ కమలాసరసీ మనోజ్ఞే వైకుంఠ విణ్ణగర నామని దివ్యదేశే ।
వైకుంఠ పూర్వ వరవల్లికయా సమేతో వైకుంఠనాథ విభురాసన సన్నివిష్టః ।
శ్లో॥ సత్యాభివర్ధన విమాన ముపాశ్రితస్సన్ శ్రీమానుదంక వసురాజ నిరీక్షితాఙ్గః ।
జ్ఞానాలవాల పరకాల మునీంద్ర కీర్త్యః రాజత్యమంద మతిమానస రాజహంసః ।

వివ : వైకుంఠ నాథ పెరుమాళ్-(తామరై కణ్ణుడైయ పెరుమాళ్) వైకుంఠ వల్లి తాయార్-ఆనంద తీర్థం-లక్ష్మి పుష్కరిణి (ఉదంక పుష్కరిణి, విరజ) సత్యవర్ధన విమానము- తూర్పుముఖము-కూర్చున్నసేవ-ఉదంక మహర్షికి, వసుమహారాజునకు ప్రత్యక్షము. తిరుమంగై ఆళ్వార్ కీర్తించినది.

విశే : తిరునాంగూర్ తిరుపతులలోనిది.

**మార్గము:** మణిమాడక్కోయిల్‌కు 1 కి.మీ దూరమున గలదు. అర్చకస్వాములను ముందుగా కలసి కొని సేవింపవలసియున్నది.

పా॥ శలఙ్గొణ్డ విరణియనదగల్ మార్వ్వఙ్గీణ్డు ।
తడఙ్గడలై క్కడన్ద ముదఙ్గొణ్డు గన్దకాళై.
నలఙ్గొణ్డ కరుముగిల్‌పోల్ తిరుమేని యమ్మాన్
నాడోఱుమ్ మగిళ్న్దినిదు మరువియుఱై కోయిల్.
శలఙ్గొణ్డు మలర్ శొరియుమ్ మల్లిగై యొణ్ శెరున్ది ।
శెణ్బగఙ్గళ్ మణనాఱుమ్ వణ్ పొళిలినూడే
వలఙ్గొణ్డు కయలోడి విళై యాడు నాఙ్గూర్ ।
వైగున్ద విణ్ణగరమ్ వణఙ్గు మడనెఞ్జే.
తిరుమంగై ఆళ్వార్-పెరియతిరుమొళి 3-9-1

## ❁ 32. అరిమేయ విణ్ణగరమ్ 32 ❁

శ్లో॥ దేశేస్మి న్నరిమేయ విణ్ణగరకే కోట్యాఖ్య తీర్థాంచితే
సంప్రాప్తో లసదుచ్చ శృఙ్గ మతులం వైమానమైంద్రీ ముఖః ।
నాయక్యాఽమృత కుంభవల్లి విలస న్నామ్నా కలిఘ్నస్తుతః
ఆసీనఃకుడమాడు కూత్త పెరుమాళ్ రాజత్యుదంకేక్షితః ।

వివ : కుడమాడు కూత్తన్-అమృతఘటవల్లి తాయార్- కోటి తీర్థము-ఉచ్చశృంగ విమానము-తూర్పు ముఖము - నిలచున్న సేవ- ఉదంక మహర్షికి ప్రత్యక్షము- తిరుమంగై ఆళ్వార్ కీర్తించినది.

విశే :— తిరునాంగూర్ తిరుపతులలో ఒకటి.

మార్గము :— మణిమాడక్కోయిల్‌కు చేరువలోనే గలదు.

పా॥ తిరుమడన్దై మణ్ మడన్దై యిరుపాలుమ్ తిగ్ఱ
త్తీవినైగళ్ పోయగల వడియవర్‌గట్కెన్ఱుమ్
అరుళ్‌నడన్దు; ఇవ్వేழులగత్తవర్ పణియవానోర
అమర్‌న్దేత్త విరున్ద విడమ్ పెరుమ్ పుగழ் వేదియర్‌వాழ
తరుమిడజ్గళ్; మ్ఱుర్‌గళ్ మిగుకై త్తెగళ్ శెఙ్ఙునీర్
తామరైగళ్ తడజ్గడోరుమిడజ్గ డోఱుమ్ తిగழ
అరువిడజ్గళ్ పొழిల్ తழువి ఎழిల్ తిగழ నాజ్గూర్
అరిమేయ విణ్ణగరుమ్ వణజ్గు మడనెఞ్జే

తిరుమంగై ఆళ్వార్-పెరియ తిరుమొழి 3-10-1

# ❁33.తిరుత్తేవనార్‌తొగై 33 (కీళచాలై)❁

శ్లో॥ తేవనార్ తొగై సునామ్ని పట్టణే శోభనాఖ్య నళినీ సమన్వితే ।
శోభనాహ్వయ విమాన మధ్యగః పశ్చిమాననయుత స్థ్సితిప్రియః॥

శ్లో॥ దేవనాయక విభుః కడల్ మకళ్ నాయకీ వపుషి మగ్నలోచనః
సేవితో వర వసిష్ఠ యోగినా రాజతే కలిహ సంస్తుత స్సదా ॥

వివః— తెయ్‌వనాయకన్ - కడల్ మకళ్ తాయార్ - శోభన పుష్కరిణి - శోభన విమానము - పశ్చిమ ముఖము - నిలచున్న సేవ. వసిష్ఠునకు ప్రత్యక్షము - తిరుమంగై ఆళ్వార్ కీర్తించినది.

దేవతలు గుమిగూడి పెరుమాళ్ళను వేంచేపుచేసిన స్థలము గాన తిరుతేవనార్ తొగై యనిపేరు వచ్చినది.

విశే :— తిరువెళ్లక్కుళము, తిరుక్కావళంబాడి సన్నిధి అర్చకులే ఈ సన్నిధి కైంకర్యమును కూడ చేయుచున్నారు. కావున వారిని ముందుగా కలసికొని సేవింపవలసియున్నది.

మార్గముః— తిరునాంగూర్‌కు 1 కి. మీ దూరములో ఉన్నది. ఈక్షేత్రమునకు 1 కి.మి దూరములో అణ్ణన్ కోయిల్ కలదు.

పా॥ ఞాలమెల్లా మముదుశెయ్‌దు నాన్మఱైయుమ్ తొడరాద,
పాలగనా యాలిలై యిల్ పళ్లికొళ్లుమ్ పరమ నిడమ్,
శాలివళమ్ పెరుగివరుమ్ తడమణ్ణి త్తెన్ కరై మేల్,
శేలుగళుమ్ వయల్ నాజ్గై త్తిరుత్తేవనార్ తొగైయే.

తిరుమంగై ఆళ్వార్ -పెరియ తిరుమొழి 4-1-6



31. వైకుంఠనాథన్ - వైగుందవిణ్ణగరమ్
Vaigundanadhan - Vaigundavinnagaram



30.నన్దావిళక్కు పెరుమాళ్ - మణిమాడకోయిల్
Nandavilakku Perumal - Manimada koil



33.దెయ్వనాయగన్ - తిరుత్తేవనార్తొగై
Daivanayagan - Tiruttevanartogai



32.కుడమాడుకూత్తన్ - అరిమేయవిణ్ణగరమ్
Kudamadukuttan - Arimeyavinnagaram

## ❁ 34. వణ్ పురుడోత్తమ్ 34 ❁

శ్లో॥ సేవ్య శ్రీ పురుషోత్తమాఖ్య నగరే క్షీరాబ్ధి తీర్థాంచితే
నాయక్యా పురుషోత్తమాహ్వయయుజా ప్రాగాస్య సంస్థానగమ్।
సంజీవిగ్రహ దేవయాన విలసద్రూపోపమన్యోః ప్రియం
శ్రీమంతం పురుషోత్తమ ప్రభుమహం శార్ఙ్గాంశ యోగిస్తుతమ్ ॥

వివ:- పురుషోత్తమన్-పురుషోత్తమ నాయకి-క్షీరాబ్ధి పుష్కరిణి - సంజీవిగ్రహ విమానము - తూర్పుముఖము - నిలుచున్న సేవ ఉపమన్యువునకు ప్రత్యక్షము-తిరుమంగై ఆళ్వార్ కీర్తించినది.

విశే :- మీనమాసం చిత్తా నక్షత్రం తీర్థోత్సవమ్. మణవాళ మహామునుల మంగళాశాసనం.

మార్గము:- "మణిమాడక్కోయిల్, అరిమేయ విణ్ణగరం, తిరుత్తెట్రియం బలం, వణ్ పురుడోత్తమ్." ఈ నాల్గు దివ్య దేశములు ఒకే మార్గములో కలవు.

పా॥ కమ్బమాకడలడై త్తిలజ్జెక్కుమన్ కదిర్ ముడియవై పత్తుమ్
అమ్బినాలఱుత్తు; అరశవన్ తమ్బిక్కళిత్తవ నుఱైకోయిల్
శెమ్బలానిరై శెణ్బగమ్ మాతవి శూతకమ్ వాழைగళ్ శూழ
వమ్బులామ్ కముగోజ్గియ నాఙ్గూర్ వణ్పురుడోత్తమమే.

తిరుమంగై ఆழ్వార్ - పెరియ తిరుమొழி 4-2-1

## ❁ 35. శెంపొన్ శెయ్ కోయిల్ 35 ❁

శ్లో॥ శెంపొన్శెయ్ నగరేతు నిత్య సరసీ స్వర్ణా ఖ్య తీర్థాంచితే
శ్రీమాన్ పేరరుళాళ నాయక ఇతి స్వర్ణాఖ్యవిమానగః ।
ప్రాగాస్య స్థితి రల్లిమామలరితి ప్రాప్తోతి శేతే శ్రియం
రుద్రావేశిక దివ్యమంగళతను శ్రీమత్కలిఘ్నస్తుతః ॥

వివ:- పేరరుళాళన్ పెరుమాళ్-అల్లిమామలర్ తాయార్-నిత్య పుష్కరిణి-స్వర్ణ తీర్థము-స్వర్ణ విమానము-తూర్పుముఖము-నిలుచున్న సేవ-శివునకు ప్రత్యక్షము-(త్రుట నేత్ర మునికి ప్రత్యక్షం) తిరుమంగై ఆழ்వార్ కీర్తించినది.

విశే :- ఈ తిరునాంగూర్ తిరుపతులు పదకొండు ఏకాదశరుద్రుల ఆరాధనకై వేంచేసి యున్నారు.

మార్గము:- ఈ క్షేత్రమును తిరునాంగూర్లోనే కలదు.

పా॥ పేరణి న్దులగత్తవర్ తొழுదేత్తుమ్ పేరరుళాళ నెమ్బిరానై
వారణి ములై యాళ్ మలర్మగళోడు మణ్మగళు ముడన్ నిఱ్ప ;
శీరణిమాడ నాఙ్గై నన్నడువుళ్ శెమ్బొన్శెయ్ కోయిలినుళ్ళే
కారణి మేగమ్ నిన్దదొప్పానై క్కణ్డు కొణ్డుయ్న్దొழிన్దేనే॥

తిరుమంగై ఆழ்వార్-పెరియతిరుమొழி 4-3-1

## ❁ 36. తిరుత్తెత్రియమ్బలమ్ 36 ❁

శ్లో॥ సూర్యాఖ్యాబ్జిని తెత్తియంపలపురే వేదాఖ్యవైమానగః
శెజ్గణ్మాలితి విశ్రుత స్స్వరదిశా వక్త్రో భుజంగే శయః।
నాయక్యా స్స్పృహణీయ పద్మలతికా నామ్న్యా తయైవేక్షితో
ష్టు త్యశ్రీ కలిజిన్మునే ర్విజయతే శ్రీ ప్రసన్నానంతాక్షి గః॥

వివ :– శెజ్గణ్మాల్–శెంగమలవల్లి తాయారు–సూర్య పుష్కరిణి వేదవిమానము–తూర్పుముఖము–భుజంగ శయనము–శెంగమల వల్లి తాయార్లకు, అనంతునకు ప్రత్యక్షము. తిరుమంగై ఆళ్వార్ కీర్తించినది.

విశే :– ఇది తిరునాంగూర్ దివ్యదేశముల లోనిది.

పా॥ మాత్తరశర్ మణిముడియుమ్ తిఱలుమ్ తేశుమ్
మత్తవర్తమ్ కాదలిమార్ కుళయుమ్; తన్దై
కాత్తళైయ ముడన్ కూలవన్దు తోన్ఱి
క్కదనాగమ్ కాత్తళిత్త కణ్ణర్ కణ్డీర్
నూత్తిదళ కొక్కళర విన్దమ్ నుళయ్న్ద పళ్ళ
త్తిళజ్గుముగిన్ ముదుపాళై పగువాయ్ నణ్డిన్
శేత్తళై యిల్ వెణ్ ముత్తమ్ శిన్దు నాజ్గూర్
**తిరుత్తెత్తియమ్బలత్తెన్ శెజ్గణ్ మాలే**

పా॥ ఏళులగుమ్ తాళ వరైయు మెజ్గుమూడి
యెణ్డిశైయుమ్ మణ్డలముమ్ మణ్డి; అణ్డమ్
మోళయెళున్దాళి మిగుమూళి వెళ్లమ్
మున్నగట్టి లొడిక్కియ వెమ్మూర్త్తి కణ్డీర్;
ఊళిదొఱు మూళిదొఱు ముయర్న్ద శెల్వ
త్తోజ్గియ నాన్మఱైయ యనైత్తుమ్ తాజ్గు నావర్;
శేళుయర్న్ద మణిమాడమ్ తిగళు నాజ్గూర్
**తిరుత్తె త్తి యమ్బలత్తెన్ శెజ్గణ్ మాలే.**

తిరుమంగై ఆళ్వార్ – పెరియ తిరుమొళి 4–4 1,9



34.పురుషోత్తమన్ - వన్‌పురుడోత్తమ్

Purushottaman - Vanpurudottam



35.పేరరుళాళన్ - సెంబొన్‌సెయ్‌కోయిల్

Perarulalan - Senbonsey Koil

## ❁ 37. తిరుమణిక్కూడమ్37 (తిరునాంగూర్ తిరుపతి) ❁

శ్లో॥ దివ్యేమణిక్కూడ పురేస్థితస్సన్ చంద్రాబ్జినీ స్వర్ణ విమాన రమ్యే।
ఆలింగ్యదేవీం తిరుమామకళ్ ప్రథాం శ్రీమాన్ మణిక్కూడ ప్రభుర్విరాజతే॥

శ్లో॥ గరుడేంద్ర తపోలబ్ధ శక్ర దిఙ్ముఖ సుందరః।
పరకాల వచో హార్య శిఖరే ముదిరాయతే ॥

**వివ :–** మణిక్కూడ నాయకన్ - తిరుమామగళ్ తాయార్-చంద్ర పుష్కరిణి - స్వర్ణ విమానము-తూర్పు ముఖము-నిలుచున్న సేవ-గరుత్మంతునకు చంద్రునకు ప్రత్యక్షము. తిరుమంగై ఆళ్వార్ కీర్తించినది.

**మార్గము :–** తిరునాంగూర్ నుండి 1 కి.మీ తూర్పున గలదు. వసతులు లేవు.

పా॥ తూమ్బుడై ప్పనై కైక్కేమ్ తుయర్ కెడుత్తరుళి; మన్ను
కామ్బుడై కున్తమేన్ది క్కడు మఴై కాత్త వెన్దై;
పూమ్బునల్ పొన్నిముత్తుమ్ పుగున్దు పొన్ వరణ్డ; ఎఙ్గుమ్
తేమ్బొళిల్ కమఴు నాఙ్గూర్ తిరుమణి క్కూడత్తానే.

తిరుమంగై ఆళ్వార్ - పెరియ తిరుమొఴి 4-5-1

### ప్రపన్నుడు

మంచిమాట

ఒకనాడు కొందఱు భక్తులు తిరుపతి యాత్రకు పోవుచుండిరి. దారిలో వారు ఒక అరణ్యమున నదిలో స్నానము చేయుచుండిరి. వారిలో ఒక ప్రపన్నుని పాముకరిచెను. తక్కిన భక్తులు వాని చుట్టును చేరి "ఏదీ ! పాము ఎచ్చట కరిచెను?" అని ప్రశ్నింపసాగిరి. దానికా ప్రపన్నుడు "అదిగో ! ఆచెట్టును కరిచినది" అని సమాధానమిచ్చెను. అది విని భక్తులందరు సిగ్గుపడి తొలగిరి.

క్రమముగా వారందరు తిరుమలచేరి "అనంతాళ్వాను" వారిని సేవించిరి. మార్గములో ప్రపన్నుని పాము కరిచిన వార్తయు వారికి తెలిసెను. వారు ఆప్రపన్నుని చూచి "పాము విషము పోవుటకై మీరేల చికిత్స చేయించుకొనలేదు ?" అని అడిగిరి. అందులకు ఆ ప్రపన్నుడిట్లు సమాధానమిచ్చెను.

"కరచిన పాము బలము గలదైనచో విరజానదిలో తీర్థమాడి పరమపదనాథుని సేవించెదను. కరవబడిన పాము (ఆయుర్దాయము) బలమైనదైనచో స్వామి పుష్కరిణిలో తీర్థమాడి శ్రీనివాసుని సేవించెదను."

ఆ సమాధానము విని అనంతాళ్వాన్ మిక్కిలి సంతోషించిరి.

## ❁ 38. తిరుక్కావళంబాడి 38 (తిరునాంగూర్ తిరుపతి) ❁

శ్లో॥ పృథు పుష్ప సరో రమ్యే కావళంబాడి పట్టణే ।
స్వయంభు వర వైమాన స్థాయీం శెంగమలాభిధామ్ ॥

శ్లో॥ నాయకీ మాశ్రితశ్శ్రీప ప్రాఙ్ముఖో రుద్ర సేవితః ।
గోపాలకృష్ణ భగవాన్ రాజతే కలిజిన్నుత ః॥

**వివః–** గోపాలకృష్ణన్-శెంగమలవల్లి-మడవరల్ మంగై నాచ్చియార్ - తడమలర్ పొయిగై పుష్కరిణి-స్వయంభూ విమానము-తూర్పుముఖము-నిలుచున్న సేవ-రుద్రునకు ప్రత్యక్షము-తిరుమంగై ఆళ్వార్ కీర్తించినది.

**విశే :–** తిరుమంగై ఆళ్వార్ తిరు అవతార స్థలమైన తిరుక్కుఱైయలూర్; తదీయారాధన చేసిన ప్రదేశమగు మంగై మఠము సమీపముననే కలవు. మంగ మఠము నందు శ్రీ వీర నరసింహస్వామి సన్నిధి కలదు.
అర్చకులు కీళ్‌చాలై లోనుందురు. వారిని తోడ్కొనివెళ్ళియే సేవింప వలసియున్నది.

**మార్గము:–** తిరుత్తేవనార్‌తొగై కు (కీళ్‌చాలై) 1 కి.మీ. దూరములో ఈక్షేత్రము కలదు.ం

పా॥ తావళన్దులగముఱ్ఱుమ్ తడమలర్ప్పొయ్గై పుక్కు
నావళ నవిన్ఱఙ్గేత్త నాగత్తిన్ నడుక్కమ్ తీర్తాయ్
మావళమ్ పెరుగి మన్నుమఱైయవర్ వాழుమ్, నాఙ్గైక్
**కావళమ్బాడి**మేయ కణ్ణనే కళైగణీయే.

పా॥ శన్దమాయ్ చ్చమయమాగి చ్చమయవైమ్బూదమాగి;
అన్దమాయాదియాగి యఱుమఱైయలైయు మానాయ్
మన్దమార్ పొழిల్‌కడోఱుమ్ మడమయిలాలు నాఙ్గై
కన్దనూర్ **కావళన్దణ్** పాడియాయ్ కళైగణీయే
తిరుమఙ్గై యాழ్వార్-పెరియ తిరుమొழి 4-6-9

### భగవత్ప్రాప్తి

మంచిమాట

మూడు జన్మలు (హిరణ్య కశిప, రావణ, శిశుపాల) భగవంతునితో విరోధించి అపచారములు చేసిన శిశుపాలుడు చివరకు భగవంతుని బొందినాడు గదా! అనాది కాలముగా అనేక జన్మ పరంపరలలో భగవంతునితో విరోధించి అపచారము చేయుచున్న మనము సర్వేశ్వరుని పొందకపోదుమా !

'కురుగూరునంబిగారు'

# ❀ 39. తిరువెళ్లక్కుళమ్ 39 (అణ్ణన్ కోయిల్ ❀

శ్లో॥ పురేతు వెళ్లక్కొళ మిత్యభిశ్రుతే తన్నామ తీర్థే సుర దిఙ్ముఖ స్థితి : ।
నారాయణాఖ్యో వరతత్త్వబోధ వైమానమాసాద్య విరాజతే హి ॥

శ్లో॥ ఇక్ష్వాకు శ్వేత రాజోగ్ర ప్రత్యక్షత్వ ముపాగతః ।
పూమార్ తిరుమకళ్ దేవీ మాశ్రితః కలిహస్తుతః ॥

వివః– నారాయణన్ – అణ్ణన్ పెరుమాళ్-పూవార్ తిరుమగళ్ నాచ్చియార్ – వెళ్లక్కొళమ్ పుష్కరిణి తత్త్వబోధ విమానము-తూర్పుముఖము-నిలుచున్న సేవ-ఇక్ష్వాకు వంశీయుడైన శ్వేతుకేతు మహారాజునకు, పరమ శివునకు ప్రత్యక్షము-తిరుమంగై ఆళ్వార్ కీర్తించినది.

విశే :– తిరుమంగై ఆళ్వార్ల దేవిమార్లగు (భార్య) కుముదవల్లి నాచ్చియార్ ఈ తిరువెళ్లక్కొళ తీర్థమునందే అవతరించిరి.

మార్గము:– కీళ్చాలైకు(తిరుత్తేవనార్ తొగైకు)పశ్చిమంగా 1 కి.మీ దూరము."అణ్ణన్ కోయిల్ అనియే చెప్పాలి." వసతులు లేవు.

పా॥ కణ్ణార్ కడల్పోల్ తిరుమేని కరియాయ్ ।
నణ్ణార్ మునై వెన్ఱి కొళ్వార్ మన్ను నాఙ్గూర్
తిణ్ణార్ మదిళ్శూழ் తిరువెళ్లక్కుళత్తుళ్ ।
అణ్ణా; అడయే నిడరై క్కళైయాయే.

పా॥ వేడార్ తిరువేఙ్గడమ్ మేయవిళక్కే;।
నాడార్ పుగழ் వేదియర్ మన్నియ నాఙ్గూర్
శేడార్ పొழிల్ శూழ் తిరువెళ్లక్కుళత్తాయ్ ।
పాడా వరువేన్ వినై యాయినపాత్తి.

తిరుమంగై ఆళ్వార్-పెరియ తిరుమొழி 4-7-1,5.

## సంసార బీజము

మంచిమాట

ముముక్షువునకు సంసారబీజము నశింపవలెను. పేడపురుగు పేడలో తిరుగుచున్నను ఆపేడ దానికి అంటనట్లుగా ముముక్షువైనవాడు సంసారములో నుండినను సంసారముతో సంబంధము లేకుండ నుండవలెను. అట్లున్నచో సంసార బీజము నశించును. అట్టివారు జనకచక్రవర్తి వంటివారు.

# ❁ 40. తిరుపార్థన్ పళ్లి 40 ❁

శ్లో॥ పార్థన్‌పళ్లి పురేతు శంఖ సరసీ యుక్తే తు నారాయణం
వైమానం సమధిశ్రిత స్థితిలసన్ ప్రాచేతసాశీముఖః ।
దేవస్తామరయాళ్ ప్రియోఽర్జున జలేశైకాదశేశేక్షితః ॥
ప్రాప్తస్తామర నాయకీం విజయతే శార్ఙ్గాంశ యోగిస్తుతః ॥

**వివ :–** తామరయాళ్ కేళ్వన్–తామరై నాయకి–శంఖ పుష్కరిణీ–నారాయణ విమానము–పశ్చిమ ముఖము–నిలుచున్న సేవ–అర్జునునకు వరుణునకు–ఏకాదశ రుద్రులకును ప్రత్యక్షము–తిరుమంగై ఆళ్వార్ కీర్తించినది.

**విశే :–** ఇచ్చట పెరుమాళ్లు శ్రీదేవి, భూదేవి, నీళాదేవులతో కలిసి వేంచేసియుందురు. ఇచ్చట శంఖ చక్ర గదలతో వేంచేసియున్న కోలవిల్లి రామన్ కలరు. వీరి హస్తములో శార్ఙ్గమును (విల్లు) సమర్పించియున్నారు. ఇచట అర్జునునకు వేరు సన్నిధి కలదు. **చరమ శ్లోకార్థము** ప్రకాశించిన స్థలము–మకరం పుష్యమీ నక్షత్రం తీర్థోత్సవం. అర్చకులు సన్నిధికి సమీపముననే కలరు.

**మార్గం :–** తిరునాంగూర్‌కు దక్షిణం 3 కి.మీ చిన్న గ్రామం. వసతులు లేవు.

పా॥ కవళయానై కొమ్బుశిత్త కణ్ణనెన్ఱుమ్; కామరుశీర్
క్కువళమేగ మన్నమేని కొణ్డ కోనెన్నానై యెన్ఱుమ్
తవళమాడునీడు నాఙ్గై త్తామరై యాళ్ కేళ్వనెన్ఱుమ్
పవళవాయాళెన్ మడన్దై **పార్త్తన్పళ్ళి పాడువాళే.**

తిరుమంగై ఆళ్వార్ – పెరియ తిరుమొழி 4–8–1

శ్లో॥ చోళదేశే ప్రసిద్ధానాం దేశానాం కమలాపతేః ।
ఏవం చత్వా రింశ తస్తు వై భవో వర్ణితోమయా ॥

**వివ :–** ఇంత వరకు చోళదేశపు దివ్య తిరుపతులు నలుబది క్షేత్రములు వర్ణింపబడినవి.

## (పాండ్యదేశీయ దివ్యదేశములు)

శ్లో॥ ఇదానీం పాండ్యదేశీయ దివ్యదేశ సువై భవమ్ ।
యతీంద్ర కరుణా భూమ్నా వర్ణ్యతే విదుషాంముదే ॥

**వివః–** భగవద్రామానుజుల వారి కృపాకటాక్షమున పండితుల సంతోషము కొఱకు ఇకపై పాండ్యదేశమున గల దివ్యదేశముల వైభవము వర్ణింపబడును.



39.నారాయణన్ - తిరువెళ్ళక్కుళమ్

Narayanan - Tiruvellakkulam



38.గోపాలకృష్ణన్ - తిరుక్కావళంబాడి

GopalaKrishnan - Tirukkavalanbadi



40.తామరైయాళ్ కేళ్వన - పార్థన పళ్ళి

Tamarayal Kelvan - Partan Palli

## ❁ 41 తిరుమాలిరుం శోలై మలై (మధుర 20 కి.మీ.) 1 ❁

## (అఴగర్ కోయిల్)

శ్లో॥ శ్రీమద్వనాద్రి పథ నూపుర నిమ్నగాంతే
దేశేస్థితో వృషభ పర్వత చందనాఢ్యే ।
ధర్మేక్షితస్తు మలయధ్వజ పాండ్య దృష్టః
ప్రాగాననో లసతి సుందరబాహు నాథః ॥

శ్లో॥ **సోమసుందర విమాన మధ్యగః సుందరోప పద వల్లికాయుతః ।**
**విష్ణుచిత్త కలిజిత్ పరాంకుశైః గోదయా మణి మహర్షిణాస్తుతః ॥**

**వివః–** సుందర బాహు పెరుమాళ్ - అఴగర్ - (మాలాలంకారర్)- సుందరవల్లి తాయార్, కళ్యాణవల్లి తాయార్, నూపురగంగ(శిలమ్బాఱు) సోమసుందర విమానము – వృషభగిరి – చందన వృక్షము – తూర్పు ముఖము – నిలుచున్న సేవ ధర్మదేవతకు మలయధ్వజ పాండ్యరాజునకు ప్రత్యక్షము - పూదత్తాழ్వార్, పేయాழ్వార్, నమ్మాழ్వార్, పెరియాழ్వార్, ఆణ్డాళ్, తిరుమంగై ఆழ్వార్ కీర్తించినది.

ఈ క్షేత్రమునకు దక్షిణ తిరుపతి యనియు, వనగిరి యనియు పేరు. ఇచట మూలవర్, ఉత్సవర్ కూడ పంచాయుధములతో వేంచేసి యుందురు. మూలవర్‌కు వైకుంఠ నాథన్, పరమ స్వామియను తిరునామములు కలవు. స్వామి ప్రయోగ చక్రహస్తులై వేంచేసియున్నారు.

ఈక్షేత్రస్వామి విషయమై ఆణ్డాళ్ "నాఱు నఱుమ్పొழிల్" అను పాశురమున స్వామికి నూరు గంగాళముల అక్కారవడిశల్(పాయసాన్నము), నూరు గిన్నెలతో వెన్న ఆరగింపుచేతునని మాట యిచ్చినారు.

పిమ్మట భగవద్రామానుజులు అవతరించి ఆణ్డాళ్ శ్రీసూక్తి సఫలమగునట్లుగా నూరు గంగాళముల అక్కార వడిశల్, వెన్న ఆరగింపుచేసి పిమ్మట ఈ విషయమును ఆండాళ్ సన్నిధిలో విజ్ఞాపన చేసిరి. అంతహారు సంతుష్టాంత రంగులై ఉడయవరులను జూచి "ఎన్ కోయిల్ అణ్ణనే" అని పిలచి ఆదరించి గౌరవించిరట. అది మొదలు ఉడయవర్లకు "గోదాగ్రజః" అనియు "కోయిల్ అణ్ణన్" అనియు తిరునామములు ఏర్పడినవి. ఇచట ఆణ్డాళ్ "వీత్తిరున్ద తిరుక్కోలముతో (కూర్చున్న భంగిమ) వేంచేసియున్నారు.

ఈక్షేత్రమునకు "మయల్ మిగు పొழிల్" (తిరువాయ్ మొழி 2-10-3) (దట్టమైన తోటలుగల దివ్యదేశము) అను విశిష్టమైన తిరునామము కలదు. తిరుమంగై ఆழ్వార్ ఈక్షేత్రస్వామిని "తెన్నానై" (తెఱ్కు ఆనై) దక్షిణ దిగ్గజముగా

అభివర్ణించినారు. ఈక్షేత్రస్వామికి కళ్ళళగర్ అను తిరునామము కలదు. నమ్మాళ్వార్లు **"శొఞ్జాఱ్కవిగాళ్"** అనితిరువాయిమొళి లో "నెఞ్జముయిరుముళ్ కలన్దు" (మనస్సు నందును ప్రాణము నందును కలసిపోయి) అని సర్వేశ్వరుని "ఆశ్రిత వ్యామోహమనెడి గుణమును అభివర్ణించిరి. నమ్మాళ్వార్ల భక్తికి పరవశుడైన సర్వేశ్వరుడు ఆళ్వార్లను వీడలేక వారి తిరుమేని యందు మిక్కిలి ప్రీతిని చూపగా ఆళ్వార్లు "అయ్యో! సర్వేశ్వరుడు నన్ను ఈ దేహముతోనే పరమపదమునకు తీసికొని పోవునేమో! అట్లైన ఈ సంసారము నిత్యమగునే!" యని తలచి సర్వేశ్వరుని ప్రార్థించి ఈ దేహముపై మోహమును విడువుమని ప్రార్థింపగా స్వామి యట్లేయని యంగీకరించెను. అపుడు ఆళ్వార్లు "ఆహా! ఏమి సర్వేశ్వరుని శీలగుణము, ఆశ్రిత వ్యామోహము" అని ఆశ్చర్యపడి ఆ ఆశ్రిత వ్యామోహమును "శొఞ్జాల్ కవిగాళ్" అను దశకమున ప్రకటించుచున్నారు.

ఈ సన్నిధి చాల పెద్దది. దీనికి అళగర్ కోట యని పేరు. సన్నిధికి ఉత్తరముగా కొండపై నూపుర గంగ కలదు. సన్నిధి గోపురద్వారమున 18వ పడి గట్టులో **"కరుప్పణన్"** అను వారు సన్నిధికి కావలిగా నుందురు. సన్నిధి తాళము వేసిన పిమ్మట ఆ తాళములను వీరి సన్నిధిలోనే ఉంచుదురట.

బ్రహ్మోత్సవ సమయంలో చక్రత్తాళ్వాన్ మాత్రమే గోపుర ద్వారము నుండి వేంచేయుదురు. పెరుమాళ్లు ప్రక్కనున్న ద్వారము నుండి వేంచేతురు.

మేషం పౌర్ణమినాడు ఏటి ఉత్సవమునకు పెరుమాళ్లు వేంచేయగా తాయార్లకు కోపము వచ్చినదట. ఆకారణమున నాడు మొదలు బ్రహ్మోత్సవము వరకు సన్నిధి ప్రకారములో గల ఒక మండపములో వేంచేసి తిరువారాధన స్వీకరింతురు.

ఉత్సవములు:- మేషమాసములో పౌర్ణమినాడు మధురలో గల వైగై నదిలో ఏటి ఉత్సవము జరుగును. ఈక్షేత్రస్వామి విషయమై శ్రీకూరత్తాళ్వాన్ సుందరబాహుస్తవమునను గ్రహించిరి.

కర్కాటక మాసములో బ్రహ్మోత్సవము జరుగును. పలు సత్రములు సన్నిధి సమీపములో కలవు. సన్నిధిలో ప్రసాదము లభించును. అన్ని వసతులు గల క్షేత్రము.

**మార్గము:-** మధురకు 15 కి.మీ. దూరము.

పా॥ కిళరొళి యిళమై కెడువదన్ మున్నమ్,
వళరొళి మయోన్ మరువియ కోయిల్,
వళరిళమ్ పొళిల్ శూళ్ **మాలిరుఞ్జోలై**
తళర్విలరాగిల్ శార్వదు శదిరే.

నమ్మాళ్వారు - తిరువాయి మొళి 2-10-1



41,అళగర్ - తిరుమాలిరుంశోలై

Sundarabahu - Tirumalirunsolai



42.సౌమ్యనారాయణన్ - తిరుక్కోట్టియూర్

Soumyanarayan - Tirukkottiyur



43.సత్యగిరినాథన్ - తిరుమెయ్యమ్

Satyagirinadhan - Tirumeyyam

పా॥ అలమ్మా వెరుట్టా క్కొన్ను తిరియు మరక్కారై
కుక్కలమ్మాఘ్ పడుత్తు కుక్కలవిళక్కాయ్ నిన్దకోన్ మలై,
శిలమ్మార్క వన్దు తెయ్వ మకళిర్కళాడుమ్. శీర్
చ్చిలమ్పాఱు పాయుమ్ తెన్ **మాలిరుమ్ శోలైయే.**

పెరియాఘ్వారు - పెరియాఘ్వార్ తిరుమొఘి 4-2-1

పా॥ నాఱు నఱుమ్పొఘిల్ **మాలిరుమ్ శోలై నమ్బిక్కు,** నాన్
నూఱు తడావిల్ వెణ్ణెయ్ వాయ్ నేర్న్దు పరావివైత్తేన్,
నుఱు తడానిరైన్ద అక్కారవడిశిల్ శొన్నేన్,
ఏఱు తిరువుడైయా నిన్డు వన్దివై కొళ్ళుజ్గొలో.

ఆణ్డాళ్ - నాచ్చియార్ తిరుమొఘి 9-6

పా॥ మున్దుఱవురై క్కేన్ వరై కుఘల్మడవార్ కలవియై విడుతడుమారల్
అన్దరమేఘ్ మలై కడల్ఘ్ మాయ వెమ్మడిగళ్ తమ్ కోయిల్
శన్దొడు మణియు మణిమయిల్ తఱ్ఘయున్దఘివి వన్దరువిగళ్ నిరన్దు
వన్దిఘి శారల్ **మాలిరుఞ్జోలై** వణజ్గుదుమ్ వామడనెఞ్జే.

తిరుమంగై ఆఘ్వార్ - పెరియ తిరుమొఘి 9-8-1.

పా॥ నేశమిలాదవర్క్కుమ్ నినైయాదవర్క్కు మరియాన్
వాశమలర్ పొఘిల్ శూఘ్ వడమా మదుఱ్పిఱన్దాన్
దేశమెల్లామ్ వణజ్గు **న్దిరుమాలిరుమ్ శ్జోలై** నిన్ద
కేశవనమ్బిదన్నై క్కణ్డె యొణ్ కణ్ణి కాణుజ్గొలో.

పా॥ వలమ్బురి యాఘియనై వరై యార్ తిరడోళన్నై
పులమ్పురి నూలవనై ప్పొఘిల్ వేజ్గడ వేదియనై
శిలమ్బియలాఱుడైయ **తిరుమాలిఞ్జోలై**నిన్ద
నలన్దిగఘ్ నారణనై నణుగుజ్గొలెన్నున్దలే.

9-9-1,6,9.

శ్లో॥ పీతామ్బరం వరద శీతల దృష్టిపాతం
ఆజానులమ్బి భుజ మాయత కర్ణపాశమ్
**శ్రీమన్మహా వనగిరీన్ద్ర** నివాస దీక్షం
లక్ష్మీధరం కిమపి వస్తు మమావిరస్తు

శ్రీకూరత్తాళ్వాన్ - సుందరబాహుస్తవమ్ 14 శ్లో

## 42. తిరుక్కోట్టియూర్ 2 (గోష్ఠిపురము)

శ్లో॥ శ్రీమద్దేవ సరోజినీ విలసితే గోష్ఠీపురే ప్రాఙ్ముఖ
ష్త్వష్టాంగాఖ్య విమాన మధ్య నిలయ శ్రీసౌమ్య నారాయణః।
ఆలింగన్ తిరుమామకళ్ పదయుతాం దేవీంతు నాట్య స్థితిః
కాదంబేంద్ర విలోచనాతిథివపు ర్విద్యోతతే సర్వదా।

శ్లో॥ భక్తిసార మహాయోగి పరకాల గదాంశజైః।
విష్ణుచిత్తేన మునినా మంగళాశాసనైః స్తుతః॥

వివ: సౌమ్య నారాయణన్ - తిరుమామకళ్ నాచ్చియార్ - దేవ పుష్కరిణి
అష్టాంగ విమానము-తూర్పు ముఖము-నిలుచున్న, కూర్చున్న,నడుచుచున్న నాట్య
మాడుచున్న సేవ. కదంబ మహర్షికి ఇంద్రునకు ప్రత్యక్షము. పూదత్తాళ్వార్;
పేయాళ్వార్, తిరుమళిశై ఆళ్వార్, పెరియాళ్వార్, తిరుమంగై ఆళ్వార్ కీర్తించిన
క్షేత్రము.

విశే.: హిరణ్యుని బాధలను సహింప జాలని దేవతలు కదంబమునిని ప్రార్థింపగా
హిరణ్యుడు రాలేని ఈ ప్రదేశమునందుండుడని వారిని నియమించెను. ఆ ప్రకారము
దేవతలు గోష్ఠిగానున్న కారణమున గోష్ఠీపురమని పేరువచ్చెను.

ఇచ్చట సన్నిధి నాలుగు మిద్దెలుగానుండును. ఇచట గల అష్టాంగ విమానము
విశ్వకర్మచే నిర్మింపబడినది. ఉడయవర్ ఈ క్షేత్రములో వేంచేసియున్న
తిరుక్కోట్టియూర్ నంబిగారి వద్దకు పదునెనిమిది పర్యాయములు వేంచేసి
చరమశ్లోకార్థమును (తిరుమంత్రార్థమని కొందరి అభిప్రాయము) సేవించి జన
కోటికి అనుగ్రహించిన ప్రదేశము. ఇచ్చట తిరుక్కోట్టియూర్ నంబిగార్కి, ఉడయ
వరులకు సన్నిధులు గలవు. గోపురముపై ఉడయవర్ గ్రామమునంతను చూచు
చున్నట్లుందురు. తిరుక్కోట్టియూర్ నంబిగారి అవతార స్థలం. మేషం చిత్త
తీర్థోత్సవము.

మార్గము: మధుర నుండి బస్‌లో తిరుప్పత్తూర్ చేరి అచట నుండి వేరు బస్‌లో
10 కి.మీ. దూరమున ఈ క్షేత్రమును చేరవచ్చును.

పా॥ ఇన్తావటికిక్తే నల్లేన్; ఇరు నిలత్తై
చ్చెన్తాళ్ళన్ద తిరువడియై - అన్తు
కరుక్కోట్టియు ట్కిడన్దుకై తొళుదేన్ కణ్డేన్
**తిరుక్కోట్టి య్యెన్దై తిఱమ్.**

పూదత్తాళ్వార్ - ఇరండాం తిరువన్దాది 87 పా॥

## ❀ 43. తిరుమెయ్యమ్ 3 (పుదుక్కోట్టై 20 కి.మీ.) ❀

శ్లో॥ రమ్యే మెయ్యపురే కదంబ సరసీ సత్యాఖ్య తీర్థాంచితే
సత్యాద్ర్యాఖ్య విమాన మాప్య పనస క్షోణీరుహాలంకృతే ।
దేవస్సత్యగిరి ప్రభు ర్విజయతే దేవ్యోయ్యవన్తాళితి
ప్రాగాస్యో వర సత్యదేవ నయనానన్దః కలిఘ్నః స్తుతః ॥

**వి.వః** సత్యగిరినాథన్ - ఉయ్యవందాళ్ తాయార్ - కదంబపుష్కరిణి - సత్య పుష్కరిణి - సత్యగిరి విమానము - పనసవృక్షము - తూర్పుముఖము - నిలుచున్నసేవ - సత్యదేవతకు ప్రత్యక్షము - తిరుమంగై ఆళ్వార్ కీర్తించినది.

**విశే:** ఇచ్చట శ్రీరఙ్గనాథునివలె పెరియ (పెద్ద) తిరుమేనితో, పవళించిన స్వామి కలరు. వృషభమాసం ధనిష్ఠతీర్థోత్సవము. దీనిని సత్యవ్రత క్షేత్రమనియు అందురు. తిరుమెయ్యపు రాజగు ఊమైయ్యన్ దాగియుండిన ప్రదేశము చూడదగినది.

మార్గముః ఈక్షేత్రము పుదుక్కోట్టైకు 20 కి.మీ. దూరములో గలదు. పుదుక్కోట్టై - కారైక్కుడి రైలు మార్గము.
ఇచటకు 10 కి.మీ దూరమున తిరుక్కోట్టియూర్ కలదు.

పా॥ నిలయాళా ! నిన్ వణఙ్గ వేణ్డాయే యాకిలు; మెన్
ములై యాళ వొరునాళున్న కలత్తారాళాయే
శిలై యాళా ! మరమెయ్త తిఱలాళా! - తిరుమెయ్య
మలై యాళా ! నీయళ వళై యాళ మాట్టోమే
తిరుమంగై ఆళ్వార్ - పెరియ తిరుమొழి 3-6-9

కలయాళా!వకలలకుల్ కనవళై యుమ్ కై యాళా! వెన్ శెయ్గేన్ నాన్ ।
విలై యాళా! వడియేనై వేణ్డుదియో వేణ్డాయో వెన్నుమ్; మెయ్య
**మలైయాళన్** వానవర్ దమ్ తలై యాళన్ మరామరమే ழுయ్దవెన్ఱి
చ్చిలై యాళన్, ఎన్ మగ్గళై చ్చెయ్దనక శెఙ్జనమ్ నాన్ శిన్దిక్కే నే.
తిరుమంగై ఆళ్వార్-పెరియతిరుమొழி 5-5-2.

అరువిశోర్ వేఙ్గడమ్ నీరమలై యెన్ఱువాయ్,
వెరువినాళ్, మెయ్యమ్ వినవియిరుక్కిన్ఱాళ్
పెరుగుశీర్ క్కణ్ణపురమెన్ఱు పేశినాళ్
ఉరుగినాళ్, ఉళ్మెలిన్దాళ్ ఇదువెన్గొలో.

తిరుమంగై ఆళ్వార్ - పెరియతిరుమొழி 8-2-3.

## ❀ 44.తిరుప్పుల్లాణి 4(రామనాథపురం 10 కి.మీ.) ❀

### (దర్భ శయనం)

శ్లో॥ శ్రీపుల్లాణి పురేతు పిప్పలనగ శ్రీ చక్ర తీర్థాంచితే
కల్యాణాఖ్య విమాన మధ్య నిలయః కల్యాణ వల్లీ ప్రియ :
కల్యాణాఖ్య జగత్ప్రభు ర్విజయతే ప్రాగాననో రాజతే
పుల్లారణ్య మహర్షి సేవిత తనుః కీర్త్య : కలిద్వేషిణ :॥

**వివ :** కల్యాణ జగన్నాథన్-కల్యాణవల్లి తాయార్ - చక్ర తీర్థము - కల్యాణ విమానము - పిప్పల పర్వతము - తూర్పుముఖము - కూర్చున్నసేవ - అశ్వత్థవృక్షము - దర్భ శయనము-పుల్లారణ్య మహర్షికి ప్రత్యక్షము.

**వి.శే:** ఈ క్షేత్రమునకు దగ్గరలో రామేశ్వరం, ధనుష్కోటి కలవు. ఈ సన్నిధిలో గల అశ్వత్థ వృక్షము క్రింద నాగ ప్రతిష్ఠ చేసిన వార్కి సంతానము కలుగును. పెరుమాళ్లు ఆరగించు పాయసము తప్పక స్వీకరింపవలెను.ఇచట దేవగణములతో పత్నీ సహితుడైన వరుణుడు, విభీషణుడు, శరణాగతి చేయుచుండగా దర్భలపై శయనించిన చక్రవర్తి తిరుమగన్( శ్రీరామచంద్రులు) సేవ సాదింతురు.

**మార్గము:** రామనాథపురమునకు 10 కి.మీ. కారైక్కుడి నుండి రామనాథపురం బస్‌లో పోవచ్చును.

పా॥ విల్లాలిలజ్గై మలజ్గచ్చరమ్ దురన్ద,
వల్లాళన్ పిణ్ పోన నెఞ్జమ్ వరుమళవుమ్;
ఎల్లారు మెన్దన్నై యేశిలుమ్ పేశిడినుమ్
**పుల్లాణి** యెమ్బెరుమాన్ పొయ్‌కేట్టిరున్దేనే.
కనై యారిడి కురలిన్ కార్ మణియిణ్ నా వాడల్
తినై యేనుమ్ నిల్లాదు తీయిల్ కొడిదాలో
పునై యార్ మణిమాడ **పుల్లాణి** కై తొழுదేన్
వినై యేన్ మేల్ వేలై యుమ్ వెన్దழலే వీశుమే.
వేదముమ్ వేళ్వియుమ్ విణ్ణు మిరుశుడరమ్
ఆదియుమానా నరుళ్ తన్ద వానమక్కు
పోదలరుమ్మున్నై శూழ **పుల్లాణి**కై కొழுదేన్
ఓదముమ్ నాను ముఱజ్గా దిరున్దేనే.

తిరుమంగై ఆழ்వార్ - పెరియ తిరుమొழி 9-4-5, 7,9.

# 45. తిరుత్తణ్‌కాల్ 5 (తిరుత్తంగాలూర్) (శివకాశి 3.కీమీ.)

శ్లో॥ దివ్యే పాప వినాశ తీర్థ రుచిరే తణ్‌గాల్ పురే ప్రాఙ్ముఖః
శ్రీమానప్పనితి ప్రియామనుభవన్ ఆనందనామ్నీం స్థిత : ।
దేవీభిస్తు దిశా సమానగణనాభిర్దేవ చన్ద్రాలయః
శ్రీమద్వల్లభదేవ సేవిత వపూ రేజే కలిఘ్నస్తుతః ॥

వివః— అప్పన్-తణ్‌గాలప్పన్-అన్ననాయకి, అనంతనాయకి; అమృతనాయకి, జాంబవతి యను నలుగురు తాయార్లు - పాప వినాశ తీర్థము-దేవచంద్ర విమానము-తూర్పు ముఖము-నిలుచున్న సేవ- వల్లభదేవునకు ప్రత్యక్షము. తిరుమంగై ఆళ్వార్ కీర్తించినది.

విశే :— ఉషా అనిరుద్ధుల వివాహము జరిగిన ప్రదేశము. ఇచట జాంబవతీ తాయార్ నిన్న తిరుక్కోలమున వేంచేసియున్నారు. మరియు ఇచట గరుడాళ్వారు సర్ప,అమృతకలశ, అంజలిహస్తులై వేంచేసి యుందురు. అన్ని వసతులు గలవు. రామానుజకూటము కలదు.

మార్గముః— విరుదునగర్ - తెన్ కాశి రైలుమార్గము. శివకాశి నుండి 5 కి.మీ. శ్రీవిల్లి పుత్తూరు నుండి విరుదు నగర్ నుండి బస్ సౌకర్యం కలదు.
ఈ క్షేత్రమునకు 25 కి.మీ. దూరంలో శ్రీవిల్లి పుత్తూరు కలదు.

పా॥ పేరానై కుఱుఙ్గుడి యెమ్బెరుమానై,తిరుత్తణ్‌గా,
లూరానై క్కరమ్బనూరుత్తమనై ; ముత్తిలఙ్గు
కారార్ తిణ్‌కడలేழுమ్ మలై యేழுవ్వులగేழுణ్డుమ్,
ఆరాదెన్ఱిరున్దానై క్కణ్డదు తెన్నరఙ్గత్తే.
తిరుమంగై ఆళ్వార్ - పెరియ తిరుమొழி 5-6-2.

## పరమ ప్రయోజనము

మంచిమాట

ఆచార్యులందరి అభిప్రాయము; ఆళ్వారుల హృదయము; చతుర్వేదముల తాత్పర్యము, సర్వశాస్త్రముల ఉద్దేశ్యము పరిశీలించి చూడగా ఆచార్య కైంకర్యమే పరమ ప్రయోజనము అని తెలియుచున్నది. --- "నంజీయర్"

ఆచార్య కైంకర్యము అనునది తనకు ఆకలి కలుగునపుడు భుజించుట వంటిది. భాగవతకైంకర్యము తల్లికి అన్నము పెట్టుట వంటిది. భగవత్కైంకర్యము అందరితోపాటు తాను అన్నము తినుట వంటిది. --- "వడుగ నంబి"

## ❀ 46. తిరుమోగూర్ 6 (మధుర 10 కి.మీ) ❀

### ("మోహనపురము")

శ్లో॥ మోకూర్ నామ్నిపురే పయోబ్ధి సరసీ సంశోభితే ప్రాఙ్ముఖః
స్థాయీ మేఘలతా పరిష్కృత వపు శ్శ్రీకాళమేఘప్రభుః ।
శ్రీమత్కేతక దేవయాన వసతి ర్విద్యోతతే పద్మభూ
రుద్రేంద్రాదిమ సేవితః కలిజితః పాత్రం శఠారేస్తుతేః ।

**వివః–** కాలమేఘ పెరుమాళ్-తిరుమోగూర్ వల్లి తాయార్-మేఘవల్లి (మోహన వల్లి) క్షీరాబ్ది పుష్కరణి-కేతకి విమానం (మోహన విమానం) తూర్పుముఖము- నిలుచున్న సేవ-బ్రహ్మ,రుద్ర,ఇంద్రులకు ప్రత్యక్షము- నమ్మాళ్వార్, తిరుమంగై ఆళ్ళార్ కీర్తించినది.

**విశే :–** ఇచ్చట శ్రీ భూసమేతులైన క్షీరాబ్ధిశాయి పెరుమాళ్ల సన్నిధి గలదు. (పళ్లికొండ పెరుమాళ్) షోడశ బాహు సుదర్శన పెరుమాళ్ సన్నిధియు కలదు.

**మార్గము:–** మధురకు 10 కి.మీ. మధుర నుండి టౌన్ బస్ సౌకర్యం కలదు. మధుర నుండి "మేలూరు" వెళ్లుబస్‌లో ఒత్తక్కడై అనుచోట దిగి అట నుండి (నడచిగాని) తిరువాదవూర్ వెళ్లు బస్‌లో 11/2 కి.మీ. వెళ్లిన సన్నిధి చేర వచ్చును.

అమృతమును పంచు నిమిత్తమై మోహినీ అవతారము దాల్చిన స్వామి దేవతల ప్రార్థన నంగీకరించి కాళమేఘ పెరుమాళ్లుగా అవతరించుటచే ఈ క్షేత్రమునకు మోహనపురమని పేరువచ్చెను. సన్నిధి ప్రక్కన గల క్షీరాబ్ధి పుష్కరిణి కడురమణీయమైనది. తాళతామరై నది ఇచట ప్రవహించుచున్నది. సన్నిధిలో ప్రసాదము లభించును. ఇచట వేంచేసియున్న చక్రత్తాళ్వార్ మిక్కిలి ప్రభావ సంపన్నులు. వృషభం విశాఖ తీర్థోత్సవం.

పా॥ తాళతామరై త్తడమణివయల్ **తిరుమోగూర్**
నాళుమేవి నన్గమర్న్దు నిన్ఱు అశురరై త్తగర్క్కుమ్;
తోళునాన్గుడై చ్చురికుళల్‌కమలక్కణ్ కనివాయ్
కాళమేగత్తై యన్ఱి మత్తొన్ఱిలజ్గదియే.

పా॥ ఇడర్ కెడవెమ్మై ప్పోన్దళియా యెన్ఱెన్ఱేత్తి;
శుడర్ గొళ్ శోతియై త్తేవరుమ్ మునివరుమ్ తొడర
పడర్ కొళ్ పామ్బణై ప్పళికొళ్వాన్ **తిరుమోగూర్,**
ఇడర్‌కెడ వడిపరవుదుమ్ తొణ్డీర్ వమ్మినే.

నమ్మాళ్వార్ - తిరువాయిమొళి 10-1-1,4.



46.కాలమేఘ పెరుమాళ్ - తిరుమోగూర్

Kalamegha Perumal - Tirumogur



47.కూడలళగర్ - మధురై

Kudalalagar - Madhurai

## ❁ 47. తెన్ మధురై 7 (మధుర) (తిరుక్కూడలి) ❁

శ్లో॥ శ్రీమద్ధేమ సరోవరేణ కలితే చక్రాఖ్య తీర్థాంచితే
శ్రీమత్యే మధురాపురే సురదిశా వక్త్రాసనాలంకృతః।
దేవ్యా సుందర నాయకో వకుళయా త్వష్టాంగవైమానగః
దృష్ట శ్శౌనక భార్గవాది మునిభి ర్భక్తార్థ ముజ్జృంభతే ॥

శ్లో॥ భక్తిసార కలిఘ్నాభ్యాం విష్ణుచిత్త మహర్షిణా।
నీళయాపి చ తత్పుత్ర్యా మంగళాశాసిత స్సదా ।

**వివ :–** కూడలళగర్–మధురవల్లి–వకుళవల్లి (మరకత వల్లి వరగుణవల్లి తాయార్) హేమ పుష్కరిణి–చక్రతీర్థము–అష్టాంగ విమానము–తూర్పుముఖము–కూర్చున్నసేవ–శౌనక భృగుమహర్షులకు, పెరియాళ్వార్లకు ప్రత్యక్షము. తిరుమళిశై ఆళ్వార్, పెరియాళ్వార్, ఆండాళ్, తిరుమంగై ఆళ్వార్ కీర్తించినది.

**విశే :–** మధుర పాండ్య రాజసభలో విష్ణు పరత్వ నిర్ణయము గావించి విజయులైన పెరియాళ్వార్లకు గరుడ వాహనారూఢులై స్వామి సాక్షాత్కరింపగా పెరియాళ్వార్లు పల్లాండు పాడిన ప్రదేశము. తిరుప్పల్లాండు అవతరించిన స్థలము. ఇచట గల అష్టాంగ విమానము చాలా పెద్దది. అందు శయన తిరుక్కోలముతో (పవళించిన) శ్రీరంగనాథులు–పై అంతస్థులో నిన్ఱ తిరుక్కోలముతో (నిలచున్న) సూర్యనారాయణులు వేంచేసియున్నారు. వృషభం అనూరాధ తీర్థోత్సవం–కుంభ మాసం మఖ శాత్తుముఱై గా పది దినములు తెప్ప ఉత్సవం. ఈ సన్నిధికి మూడు ప్రాకారములు గలవు. రెండవ ప్రాకారములో నవగ్రహములు ప్రతిష్ఠింపబడినవి. మూడవ ప్రాకారములో తాయార్, ఆండాళ్, మణవాళమామునుల సన్నిధులు గలవు. సన్నిధిలో ప్రసాదము లభించును. సన్నిధి వద్ద రామానుజ కూటము కలదు.

**మార్గము:–** మధుర ప్రసిద్ధ పట్టణమగుటచే తమిళనాడులోని అన్ని ప్రాంతముల నుండి బస్ సౌకర్యం కలదు. రైలు వసతియు కలదు. 20 కి.మీ. దూరంలో తిరుమాలిరుంశోలై, 10 కి.మీ. దూరములో తిరుమోగూర్ కలవు.

పా॥ కోళియుమ్ **కూడలుమ్** కోయిల్ కొణ్డ కోవలరేయొప్పర్; కున్ఱమన్న
పాళియుమ్ తోళుమోర్ నాన్గుడై యర్ పణ్డివర్ తమ్మైయుమ్ కణ్డఱియోమ్;
వాళియరో వివర్ వణ్ణ మెణ్ణిల్ మాకడల్ పోన్ఱుళర్, కైయిల్ వెయ్య
ఆళియొన్ఱేన్దియోర్ శఙ్గుపత్తి యచ్చో వొరువర్ అళగియవా !

తిరుమఙ్గై యాళ్వార్ – పెరియ తిరుమొళి 9–2–5

# ❁ 48. శ్రీవిల్లి పుత్తూరు 8 ❁

శ్లో॥ దివ్యే ముక్కుళ తీర్థ సుందరతటే శ్రీ విల్లి పుత్తూర్ పురే
శ్రీమత్సంశన దేవయాన నిలయః ప్రాచీముఖ స్సంస్థిత : ।
భాతిశ్రీ వటపత్రశాయి భగవాన్ శ్రీ గోదయా సంస్తుతః
శ్రీమద్విష్ణుహృదా ప్రశస్య విభవో మండూక యోగీక్షితః ।

**వివ :–** . వటపత్రశాయి పెరుమాళ్ – రంగమన్నార్, ఆండాళ్ తాయార్ – ముక్కళ తీర్థము. సంశన విమానం – తూర్పుముఖము – వటపత్ర శయనము. రంగమన్నార్ నిలచున్న సేవ-మండూక మహర్షికి ప్రత్యక్షము. పెరియాళ్వార్ ఆండాళ్ కీర్తించినది.

**వి.శే:–** పెరియాళ్వార్ ఆండాళ్ అవతరించిన దివ్యదేశము. మిధునం స్వాతి పెరియాళ్వార్ తిరునక్షత్రం, కర్కాటకం పుబ్బ, ఆండాళ్ తిరునక్షత్రం పది దినములు అతి వైభవముగా జరుగును. కన్యా శ్రవణం తీర్థోత్సవం. ఇచ్చట పెరియాళ్వార్లు పెంచిన నందనవనము, ఆండాళ్ అవతరించిన స్థలము, కణ్ణాడి కిణర్ (ఆండాళ్ ముఖము చూచుకొన్న బావి) కలవు. ఈ దివ్యదేశమునకు 20 కి.మీ. దూరములో కాట్టళగర్ సన్నిధి, 5 కి.మీ. దూరములో శ్రీనివాసన్ సన్నిధి 24 కి.మీ. తిరుత్తణ్‌గాల్‌క్షేత్రము కలవు. మిధునమాస ఉత్సవములో 5వ రోజు ఉదయం రంగమన్నార్, వటపత్రశాయి, కాట్టళగర్, శ్రీనివాసన్, తణ్‌గాలప్పన్ వేంచేయుగా పెరియాళ్వార్లు మంగళాశాసనం చేయుదురు. నాటి రాత్రి ఆండాళ్ హంసవాహనారూఢులై వేంచేయగా పెరుమాళ్లు అందరు గరుడ వాహనముపై వేంచేయుట సేవింపదగినది.

పంగుని ఉత్తరా నక్షత్రమున ఆండాళ్‌కు తిరుక్కల్యాణం జరుగును. రం॥ సన్నిధిలో రంగమన్నార్ పెరుమాళ్లకు కుడివైపున ఆండాళ్; ఎడమవైపు గరుడాళ్వార్ వేంచేసియున్నారు.

ఆండాళ్ ప్రార్థన వలన రంగమన్నారును రాజగోపాల రూపములో తీసుకొని వచ్చిన గరుడాళ్వార్ పెరుమాళ్లతో ఏకాసనమున వేంచేసి యున్నారు.

వటపత్రశాయి సన్నిధిలో ఆదిశేషన్, నాభికమలమున బ్రహ్మ, శ్రీదేవి భూదేవి; విల్లి; పుత్తర్ అను కిరాత రాజులైన భక్తులు కలరు. విల్లి ; పుత్తర్ అను కిరాత రాజులచే కట్టబడుటచే ఈక్షేత్రమునకు విల్లి పుత్తూరను పేరు వచ్చినది.

ఇచట ప్రతి నిత్యము పెరియాళ్వార్లకు తిరుమంజనము జరుగును. పిమ్మట పెరియాళ్వార్ పెరుమాళ్లకు మంగళా శాసనం చేతురు. పెరియాళ్వార్ సన్నిధి ప్రక్కనగల నందన వనములో ఆండాళ్ సన్నిధి వేరుగా కలదు. శ్రీరంగములో వల

ఇచట కూడా అరయర్ సేవ కలదు.ఈస్వామి విషయమై శ్రీపరాశర్ భట్టర్ గోదాచతుశ్లోకి శ్రీమద్వేదాంత దేశికులు గోదాస్తుతి అనుగ్రహించి యున్నారు.

**మార్గము:—** తెన్‌కాశి - విరుదునగర్ రైలు మార్గము.మధురకు 65 కి.మీ.

పా॥ మిన్ననైయ నుణ్ణిడియార్ విరిక్కుల్‌మేల్ నుఱుఙ్దవణ్డు
ఇన్నిశైక్కుమ్ విల్లిపుత్తూరిని తమర్న్దాయ్, ఉన్నైక్కణ్డార్
ఎన్ననోన్బు నోఱ్ఱాళ్ గొలో ఇవనై పెఱ్ఱ వయిఱుడైయాళ్
ఎన్నుమ్ వార్త్తై యెయ్‌దువిత్త విరుడీకేశా! ములైయుణాయే

పెరియాఴ్వార్ - పెరియాళ్వార్ తిరుమొఴి 2-2-6

మెన్నడై యన్నమ్ పరన్దు విళైయాడుమ్ విల్లిపుత్తూరుఱై వాన్దన్,
పొన్నడి కాణ్బదోరాశైయినా లెన్ పొరుకయ ఱ్కణ్ణిణై తుఞ్జా;
ఇన్నడి శిలోడు పాలము తూట్టి యెడుత్త వెన్ కోలక్కిళియై;
ఉన్నొడు తోఴమైక్కొళ్వన్ కుయిలే యులగళన్దాన్ వరక్కూవాయ్

ఆండాళ్ - నాచ్చియార్ తిరుమొఴి 5-5

## గోదా చతుశ్లోకి

నిత్యాభూషా నిగమ శిరసా నిస్సమోత్తుఙ్గవార్తాం
కాన్తోయస్యాః కచవిలులితైః కాముకోమాల్య రత్నైః
సూక్త్యా యస్యా శ్రుతిసుభగయా సుప్రభాతా ధరిత్రీ
**సైషాదేవీ సకల జననీ సిఞ్చతాం మామపాఙ్గైః ।** 1
మాతా చేత్తులసీ పితాయదితవ శ్రీ విష్ణు చిత్తోమహాన్
భ్రాతా చేద్యతి శేఖరః ప్రియతమః శ్రీరఙ్గధామాయది
జ్ఞాతారస్తనయా స్త్వదుక్తి సరస స్తన్యేన సంవర్ధితాః
**గోదాదేవి కథం త్వ మన్య మనిశం సాధారణా శ్రీరసి ।** 2
కల్పాదౌ హరిణా స్వయం జనహితం దృష్టేన సర్వాత్మనాం
ప్రోక్తం స్వస్యచ కీర్తనం ప్రపదనం స్వస్మై ప్రసూనార్పణం
సర్వేషాం ప్రకటం విధాతు మనిశం శ్రీధన్వినవ్యేపురే
**జాతాం వైదిక విష్ణు చిత్తతనయాం గోదా ముదారాం స్తుమః ।** 3
ఆకూతస్య పరిష్క్రియా మనుపమా మసేచనం చక్షుషోః
ఆనన్దస్య పరం పరామనుగుణా మారామ్యశైలే శితుః
తద్దోర్మధ్య కిరీట కోటి ఘటిత స్వోచ్ఛిష్ట కస్తూరికా
**మాల్యామోదన మేది తాత్మవిభవాం గోదాముదారాం స్తుమః ।** 4

# ❋ 49. తిరుక్కురుగూర్ 9 (ఆళ్వార్ తిరునగరి) ❋

శ్లో॥ భాతి శ్రీ కురుకాపురే పురవరే శ్రీ తామ్రపర్ణీ నదీ
తీరస్థే సురదిఙ్ముఖ స్థితిరసౌ గోవింద వైమానగః ।
దేవ్యా సంతత మాదినాథలతయా యుక్త శ్శఠ ద్వేషిణాం
దృష్టస్త్వ్యవ లోలుపో నవరతం దేవాధినాథ ప్రభుః ॥

**వివ :–** ఆదినాథ పెరుమాళ్ (పొలిందునిన్ఱ పిరాన్) ఆదినాథ వల్లి – తామ్ర పర్ణీనది– గోవింద విమానము–తూర్పుముఖము–నిలుచున్న సేవ–నమ్మాళ్వార్లకు ప్రత్యక్షం– నమ్మాళ్వార్ కీర్తించినది.

**విశే :–** ఈ క్షేత్రమునకు **"ఉఱైకోయిల్"** (సర్వేశ్వరుడు నిత్య నివాసము చేయుచున్న) దివ్య దేశము అను విలక్షణమైన తిరునామము కలదు. నమ్మాళ్వార్లు ఈ స్వామి విషయములో పరత్వ సౌలభ్య గుణములను సేవించి ప్రకాశింపజేసిరి. (తిరువాయిమొழி 4-10)
ఈ దివ్య దేశమునకు 1 కి.మీ దూరములో నమ్మాழ்వార్ల అవతార స్థలమైన **"అప్పన్ కోయిల్"** అను గ్రామము కలదు. ఈ క్షేత్రమునకు సమీపముననే నవ తిరుపతులు గలవు. ఆళ్వారు తిరునగరి యను అష్టాక్షరీ మంత్రరూప పద్మమునకు యెనిమిది అక్షరములనెడి యెనిమిది పద్మదళములవలె యెనిమిది దివ్యదేశములు అమరియున్నవి.
ఈక్షేత్ర సంగ్రహశ్లోకము
1. వైకుంఠ నాథ 2. విజయాసన 3. భూమిపాలన్
4. దేవేశ 5. పఙ్కజ విలోచన 6. చోరనాట్యన్
7. నిక్షిప్తవిత్త 8. మకరాయత కర్ణపాశౌ
9. నాథం నమామి వకుళాభరణేన సార్థం.

**వివ:** 1.వైకుంఠం–శ్రీవైకుంఠం 2. విజయాసన–వరగుణమంగై 3.భూమిపాలాన్– తిరుప్పుళిఙ్గుడి 4. దేవేశ–తొలవిల్లి మంగలం 5. పంకజ విలోచన–తొలవిల్లి మంగలం 6. చోరనాట్యన్–తిరుక్కుళందై 7. నిక్షిప్తవిత్త–తిరుక్కోళూరు 8. మకరాయతకర్ణపాశౌ–తెన్‌తిరుప్పేర్ 9. నాథం–పొలిందు నిన్ఱపిరాన్–ఆళ్వార్ తిరునగరి.
ఈ తిరునగరిలో నిర్నిద్ర తింత్రిణి (నిద్రపోని చింతచెట్టు) కలదు. ఇది ఆదిశేషుల యవతారమని పెద్దలు చెప్పుదురు. ఈ వృక్షము క్రిందినే నమ్మాழ்వార్లు యోగ నిష్ఠలో వేంచేసియుండిరి. ఇచట జ్ఞానప్పిరాన్ అను వరాహ పెరుమాళ్ సన్నిధి కలదు. ఈ క్షేత్రము మణవాళ మహామునులచే నిర్వహింపబడినది. మేషం ఉత్తర తీర్థోత్సవము. వృషభం విశాఖ నమ్మాழ்వార్ తిరునక్షత్రం. 5వ రోజు ఉత్సవమున నమ్మాழ்వార్ హంసవాహనముపై వేంచేయగా నవ తిరుపతుల పెరుమాళ్లు వేంచేయుట



48.రంగమన్నార్ - శ్రీవిల్లిపుత్తూర్

Rangamannar - Sriviliputtur



49.ఆదినాథన్ - ఆళ్వార్‌తిరునగరి

Adinadhan - Alvar Tirunagari

తిరుమంజనం గరుడసేవలు సేవింప తగినవి. శ్రీరంగములో వలె ఇచటను అరయర్ సేవ కలదు.

ఇచట స్వామి స్వయం వ్యక్తము. పెద్దతిరుమేనితో వేంచేసి యున్నారు. స్వామి శ్రీపాదములు భూమిలోనున్నవని ఐతిహ్యము.

ఇంద్రుడు పితరులను సేవింప నందున వారిచే శపింపబడి, ఈస్థలమునకు వచ్చి ఆదినాథ పెరుమాళ్లను సేవించి శాపవిముక్తిని బొందెనని స్థల పురాణము.

"సర్వేశ్వరుని పరత్వమును తెలిసికొన లేక సంసారులు నశించి పోరాదు" అను ఔదార్యముతో ఆళ్వార్లు "ఒన్ఱుమ్ తేవుమ్" అను దశకమును ఉపదేశించి సర్వేశ్వరుడే సమస్త కారణభూతుడు అని పరత్త్వమును ప్రకటించి, అతడు మన కొరకే తిరుక్కురుగూర్ అను దివ్యదేశమున (తిరుక్కురు గూర్ అదనుళ్నిన్ఱ) వేంచేసియున్నారు. అని సర్వేశ్వరుని "**పరత్త్వ సౌలభ్యములు**" అనుగుణములను ప్రకటించిరి.

**మార్గము:** తిరునల్వేలి నుండి తిరుచ్చందూర్ రైలుమార్గం. ఆళ్వార్ తిరునగరిస్టేషన్ శ్రీవైకుంఠ స్టేషన్ నుండి 5 కి.మీ.

పా॥ ఒన్ఱుమ్దేవు ములగు ముయిరుమ్; మత్తుమ్ యాదుమిల్లా
అన్ఱు; నాన్ముగన్దన్నొడు తేవరులకోడు యిర్ పడైత్తాన్
కున్ఱమ్పోల్ మణిమాడ నీడు **తిరుక్కురుగూరదనుళ్**
నిన్ఱ వాదిప్పిరాన్ నిఱ్క మత్తైత్తైయ్వమ్ నాడుదిరే॥

పా॥ ఇలిఙ్గత్తిట్ట పురాణత్తీరుమ్ శమణరుమ్ శాక్కియరుమ్
వలిన్దు వాదుశెయ్ వీర్గళుమ్ మత్తుమ్ నున్దెయ్వము మాగినిన్ఱాన్
మలిన్దు శెన్నెల్ కవరివీశుమ్ **తిరుక్కురుగూరదునుళ్**
**పొలిన్దు నిన్ఱ పిరాన్** కణ్డీర్ ఒన్ఱుమ్పొయిల్లై పోత్తుమినే.
ఓడియోడి ప్పలపిఱప్పుమ్పిఱన్దు, మత్తోర్తెయ్వమ్
పాడియాడిప్పణిన్దు పల్ పడికాల్ వழியేఱి క్కణ్డీర్
కూడివాన వరేత్తనిన్ఱ **తిరుక్కురుగూరదనుళ్,**
ఆడుపుట్కొడి యాది మూర్త్తి క్కడిమై పుగువదువే.

నమ్మాళ్వార్-తిరువాయిమొழி 4-10-1,5,7.

# 50. తిరుత్తొల విల్లి మంగలమ్ 10 (ఇరట్టై తిరుప్పతి)

శ్లో॥ దివ్యే శ్రీ తొలవిల్లి మఙ్గల పురే శ్రీ తామ్రపర్ణీతటే
ప్రాప్తే వారుణ తీర్థకం శతరిపు స్తుత్య స్సురేశాననః।
నాయక్యా మరవింద లోచన విభూ రక్షః కరుంకణ్ణితి
ప్రాప్యేంధే కుముదం విమాన మనిల స్త్రీర్థేశ శక్రేక్షితః ॥

**వివః—** తేవ పిరాన్-అరవిందలోచనుడు-కరుందడం కణ్ణి తాయార్ - తామ్రపర్ణీ నది-వరుణ తీర్థము-కుముద విమానము-తూర్పు ముఖము-నిలచున్న సేవ-కూర్చున్న సేవ- ఇంద్ర, వరుణ వాయువులకు ప్రత్యక్షము- నమ్మాళ్వార్ కీర్తించినది.

**విశే:—** ఇవిరెండు క్షేత్రములగుటచే ఇరట్టై తిరుపతియని వ్యవహారము. **ఈక్షేత్రము అరణ్యప్రాంతములో నుండుటచే అర్చకులతో కలసి సేవింపవలెను.** నమ్మాళ్వార్ ఈ క్షేత్రమునకు "అవ్వూరా" (ఆ దివ్యదేశము) 6-5-9 అను విలక్షణమైన తిరునామమును అనుగ్రహించిరి. **"తువళిల్ మామణి మాడమ్"** అను దశకములో (తిరువాయిమొழி 6-5-11) **"తేవపిరానైయే తన్దైతాయ్"** అని (దేవపిరాన్ సర్వేశ్వరుడే తండ్రీ తల్లియని) సర్వేశ్వరుని సకలవిధ బంధువుగా కీర్తించి **బంధుత్వగుణమును** ప్రకాశింపజేసిరి.

నమ్మాழ்వార్లు తోழிమార్ అవస్థలో (సఖీభావనలో) చెప్పిన దశకములు మూడు. 1.తీర్ప్పారయామిని 2. తువళిల్‌మామణిమాడమ్ 3.కరుమాణిక్కమలై మేల్. ఇందు రెండవదియగు "తువళిల్ మామణిమాడమ్" అను దశకమున "అరవిందలోచనుని సేవించినది మొదలు ఆழ்వార్ల నాయికి అతని స్వరూపమును గుణచేష్టితములనే పలవరించుచు మన వశము తప్పియున్నది." అని చెలికత్తెలు ఆழ்వార్ల తల్లిగారికి నివేదించుచున్నట్లు ఈ దశకము సాగినది.

**సూచనః—** ఇది తామ్రపర్ణీనదీ తీరమున గల దివ్యదేశము. ఈ క్షేత్రమునకు సమీపమున నమ్మాళ్వార్ల తిరువవతార స్థలము అప్పన్ సన్నిధి కలదు.

మార్గముః ఆళ్వార్ తిరునగరి నుండి 3 కి.మీ. తూర్పున తామ్రపర్ణీనది ఆవలియొడ్డున గలదు. ఒక సన్నిధి తామ్రపర్ణీ నదీతీరమున మరియొక సన్నిధి కాలువ సమీపమున గలవు.

పా॥ తిరున్దు వేదముమ్ వేళ్వియుమ్ తిరుమామక ళిరున్దామ్, మలి
న్దిరున్దు వాழ் పొరునల్ వడకరై వణ్డులై విల్లిమఙ్గలమ్;
కరున్దడఙ్కణ్ణి కై తొழுదవన్నాళ్ తుడఙ్గియిన్నాళ్డొఱుమ్;
ఇరున్దిరున్దరవిన్ద లోచన వేన్రెన్రే నైన్ది రఙ్గుమే.

నమ్మాళ్వార్ - తిరువాయిమొழி 6-5-8

# ❁ 51 శిరీవరమంగై 11 (నాంగునేరి) ❁

## (వానమామలై)

శ్లో॥ తోతాద్రౌ వర పంకసార సరస స్సంశోభి తేంద్రాబ్జినీ
రమ్యే నందన వర్ధనం సముపయన్ వైమాన మైంద్రాననః ।
దేవ్యా శ్రీ వరమజ్గనామ యుతయా తోతాద్రినాథః కు, మా
నీళా, సేనప తార్క్ష్య చామర ధరా సూర్యేందుభీ రాజతే ॥

శ్లో॥ భృగు రోమశ మౌనిభ్యాం మార్కండేయ మహర్షిణా ।
బ్రహ్మణాపిచ దృష్టాంగ శ్శఠారాతి మునిస్తుతః ॥

**వివః–** వానమామలై పెరుమాళ్-తెయ్వనాయకన్ (దేవనాయకన్)-శిరీవరమజ్గై తాయర్-తోతాద్రి-శేత్తుత్తామరై పుష్కరిణి, ఇంద్రపుష్కరిణి-నంద వర్ధన విమానము, తూర్పు ముఖము-కూర్చున్నసేవ- శ్రీదేవి, భూదేవి, నీళాదేవి, సేన ముదలియార్ (విష్వక్సేనులు) పెరియ తిరువడి (గరుత్మాన్) చామరములు ధరించిన కన్యలు, సూర్యుడు, చంద్రుడు, వీరందరితో కలసి వేంచేసియుందురు. భృగు, రోమశ, మార్కండేయ మహర్షులకు, బ్రహ్మకు ప్రత్యక్షము. నమ్మాళ్వార్ కీర్తించినది.

**విశేః–** ఇచట వేంచేసియున్న తాయార్ పేరుమీదనే ఈ క్షేత్రమునకు "శిరీవరమజ్గై" యని పేరు ఏర్పడినది. ఇచట పెరుమాళ్లను పునరుద్ధరించు సమయమున భూమినుండి ఎత్తునపుడు దెబ్బతగులుటచే ప్రతిదినము తైలముతో తిరుమంజనము జరుగును. ఆ తైలము సకల వ్యాధి నివారకము. అష్ట స్వయంవ్యక్త క్షేత్రములలో ఇదియొకటి. ఇచట గల వానమామలై మఠము జగత్ ప్రసిద్ధము.

సింధుదేశపురాజు కుశాసనమహర్షిచే శపింపబడి శునకస్వరూపుడై "శేత్తుత్తామరై"పుష్కరిణిలో స్నానమాడి పూర్వ రూపమునందెను. ఇచ్చట శఠారిలో నమ్మాళ్వార్ల తిరుమేని (విగ్రహము) వేంచేసి యుండుట విశేషము. ఊర్వశి, తిలోత్తమ అను దేవకన్యలు తపమాచరించి భగవానుని అనుగ్రహమున చామర కన్యకలుగా వేంచేసియున్నారు. మణవాళమామునుల స్వర్ణముద్రిక ఇచట (ఉంగరము) కలదు. తులా మాసం మూలా నక్షత్రమున వానమామలై జీయరుస్వామి దీనిని ధరించి శ్రీపాదతీర్థమును అనుగ్రహింతురు.

నమ్మాళ్వార్లు "నోత్తనోన్బు" అను తిరువాయిమొళిలో (5-7-10) ఆఱెనక్కు నిన్పాదమే (నీ శ్రీపాదములే నాకు ఉపాయము) ఓ దేవ నాయకా ! ఏ విధమైన ఉపాయములేని నాకు నీ శ్రీపాదములనే ఉజ్జీవనోపాయముగా ప్రసాదించితివి. దీనికి నేనేమి ప్రత్యుప కృతిని గావించెదను. నాయాత్మకూడ నీదేగాన దానిని కూడ

నీకు స్మమర్పించు నధికారము నాకు లేదు గదా ! యని సర్వేశ్వరుని **ఔదార్యగుణమును** ప్రకాశింపజేసిరి.

మీన మాసం ఉత్తర తీర్థోత్సవముగా బ్రహ్మోత్సవము జరుగును. ఇచటగల తేనమాంపొర్రిల్ (తేనెచే సమృద్ధమైన మామిడి తోటలు గలది) అను పెరుమాళ్ల ఉద్యానవనము, స్వర్ణగోరథము సేవింపదగినవి.

**సూచన:** ఈక్షేత్రమును "నాంగునేరి" అని చెప్పవలెను. లేనిచో ఎవరికినీ తెలియదు. ఈక్షేత్రస్వామి విషయమై కొన్ని శ్లోకములు.

శ్లో॥ వరమంగే శుభోత్తుంగే వర పంకేరుహేక్షణే ।
పదపంకేరుహే నిత్యం తవ భృఙ్గం కురుష్వమామ్ ॥
మాత శ్రీవరమంగే మధురిపు వాంఛిత మనోహరా పాంగే ।
మంగళవదన శశాంకే మామవ విద్యుల్లతా సమానాంగే ॥
వన్దేఽహం వనమాలినం సరసిజా సర్వం సహా సేవితం
చంచచ్చామర కన్యకా భృగుయుతం చక్రాది భూషాన్వితమ్ ।
మార్కండేయ మునీన్ద్ర వన్దిత వియత్ క్ష్మాభృన్నివాస ప్రియం
సేనాధీశ దినేశ చంద్ర విహగాధీశై స్సదా సేవితమ్ ॥
నౌమి శ్రీసురరాజ మమ్బుజదృశం పద్మా మహీ సేవితం ।
గోదాలోచన కోమలోత్పల విధుం శ్రీదాంఘ్రి పఙ్కేరుహమ్ ।
వానక్ష్మాధర నిత్యవాస రసికం దీనాఽవనే దీక్షితం
మాత్రా శ్రీవరమంగయా విలసితం సార్ధం శరద్వేషిణా ॥

**మార్గము:** తిరునల్వేలి నుండి తిరుక్కురుఙ్గుడి మార్గములో నాంగునేరిలో దిగవలెను. తిరునల్వేలి నుండి 30 కి.మీ. ఇచట సర్వసౌకర్యములు కలవు.

పా॥ ఏనమాయ్ నిలఙ్గీణ్డ వెన్నప్పనే కణ్ణా; యెన్నుమెన్నె యాళుడై ;
వాననాయకనే; ! మణిమాణిక్క చ్చుడరే;
తేనమామ్పొరిల్; **శిరీవరమఙ్గలత్తవర్ కై** తొర్రుపుఱ్ఱై ;
**వానమామలైయే;** యడియేన్ తొర్రువన్దరుళే ॥

పా॥ ఆఱెనక్కు నిన్పాతమే; శరణాక త్తన్దొరిన్దాయ్; ఉనక్కోర్కై
మ్మాఱు నానొన్ఱిలే; నెనతావియు మునతే
శేఱుకొళ్ కరుమ్బు మ్పెరుఞ్చెన్నలు; మలితణ్ **శిరీవరమఙ్గై;**
నాఱు పూన్దణ్డుఴాయ్ ముడియాయ్; **తెయ్వ నాయకనే** ॥

నమ్మాళ్వార్ - తిరువాయిమొழி 5-7-6,10.



52.కాయ్శినవేందన్ - తిరుప్పులింగుడి
Kaisinavendan - Tiruppulingudi



51. దెయ్వనాయగన్ - శిరీవరమఙ్గై
Deyavanayagan - Vanamamalai

# ❁ 52 తిరుప్పుళింగుడి 12 ❁

శ్లో॥ శ్రీమత్కాశిన వేందనాహ్వాయ విభు స్తీర్థాంచితే నిర్ఋతే :
ప్రాచీ వక్త్రయుతః పుళిఙ్గుడి పురే భోగీంద్ర భోగేశయః ।
నాయక్యా తు మలర్ మకళ్ పదయుజా శ్రీ వేద సారంగతో
వైమానం వరుణాశరాతిథి వపూ రేజే శఠారి స్తుతః ॥

వివః– కాయశిన వేందన్-మలర్మకళ్ తాయార్(పుళిఙ్గుడి వల్లి) వరుణ తీర్థము-నిర్ఋతి తీర్థము-వేదసార విమానము-తూర్పుముఖము-భుజఙ్గ శయనము-వరుణ నిర్ఋతులకు ప్రత్యక్షం-నమ్మాళ్వార్ కీర్తించినది.

నమ్మాళ్వార్ **"పణ్డైనాళాల్"** అను తిరువాయిమొళిలో (9-2-4) "పుళిఙ్గుడిక్కిడన్దు" (తిరుప్పుళిఙ్గుడిలో వేంచేసి యుండి) యని సర్వేశ్వరుని **"భోగ్యపాకత్వర"** అను గుణమును ప్రకాశింపజేసిరి. ఈక్షేత్రమునకు **"తెళిన్దశిన్దైక్కు-మున్నిల్ మూన్దు"**(నిర్మలమైన హృదయములో ప్రకాశించిన స్వామిగల దివ్యదేశములు మూడు 9-2-4) అను విలక్షణ తిరునామము కలదు. మిగిలిన రెండు క్షేత్రములు వరగుణమఙ్గై, శ్రీవైకుంఠము. ఇంద్రునకు బ్రహ్మహత్యా దోషము పోగొట్టిన స్థలము.

స్వామి తిరుప్పుళిఙ్గుడిలో శయనించియున్నాడు. శ్రీవైకుంఠములో నిలచియున్నాడు. ఆళ్వార్లు స్వామిని "స్వామీ ! ఒక్కమారైనను సుఖాసీనుడవై దర్శనమును అనుగ్రహింపుము. సంసారులందరు నీపాదములపై బడి నిన్ను స్తోత్రము చేయుదురు. ఆ కమనీయ దృశ్యమును సేవింప నాశగానున్నది" యని ప్రార్థించిరి. ఇచట నొక ఐతిహ్యము కలదు.

ఒకనాడు పెరుమాళ్ల సన్నిధిలో శ్రీవైష్ణవులు ఒక వైపున గొల్లవాండ్రు ఒకవైపున నిలచి పెరుమాళ్లను సేవించుచుండగా "వంగి పురత్తునంబి" అనువారు శ్రీవైష్ణవ గోష్ఠిని వీడి గొల్లల పంక్తిని చేరిరట. దీనిని చూచిన "ముదలి యాండాన్" "ఇట్లేల చేసితిరి?" అని అడుగగా ఎట్లైనను మనకు అభిమానము, అభిజనాహంకారము ఉండియే తీరును. గొల్లవాండ్ర కవి లేవు. కావున పెరుమాళ్ల దృష్టి వారితోపాటు నామీద కూడ పడునని నిలచితిని. సర్వేశ్వరుని దృష్టిమనమీద పడుట నీరు మెరకకు ప్రవహించుట వలె కష్టము. వీరిపై పడుట నీరు పల్లమునకు ప్రవహించుట వలె సుకరము కదా!" యని యనిరి.

పిమ్మట ముదలియాండాన్ "స్వామీ! గొల్లలు సర్వేశ్వరుని ఏమని స్తుతించిరి? "యని యడుగ" నూరేళ్లు వర్ధిల్లుము; సిరి సంపదలతో తులతూగుము అని స్తుతించిరని చెప్పిరి. "దేవరవారు ఏమని స్తుతించిరి?" అని ప్రశ్నింపగా "విజయీభవ! విజయీభవ! అని పలికితిని అనిరట. అంత ముదలియాండాన్

చూచితిరా! స్వామీ! మీరు ఆ గోష్ఠిలో చేరినను మీరు మీ సంస్కృతమును వదలక పోతిరి. కావున మనమేగోష్ఠిలో చేరినను మనము మనమే వారు వారే! అని పలికిరట.

**మార్గము:** ఇది ఆళ్వార్ తిరునగరి నవతిరుపతులలో నొకటి. తిరువరగుణమజ్ఞై క్షేత్రము నుండి 1 కి.మీ. దూరములో గలదు.

పా॥ పణ్డైనాళాలే నిన్ఱిరు వరుళుమ్; పజ్గయత్తాళ్ తిరువరుళుమ్
కొణ్డు; నిన్ కోయిల్ శీయ్త్తు ప్పల్ పడికాల్; కుడి కుడి వழி వన్దాట్చెయ్యుమ్
తొణ్డరోర్క్కరుళి చ్చోతివాయ్ తిఱన్దున్; తామరైక్కణ్గళాల్ నోక్కాయ్;
తెణ్డిరై ప్పొరునల్ తణ్ పణైశూழన్ద; **తిరుప్పుళిఙ్గుడిక్కిడన్దానే.**
నమ్మాళ్వార్ - తిరువాయిమొழி 9-2-1.

## ❋ 53. తెన్ తిరుప్పేర్ 13(తిరుప్పేరై) ❋

**శ్లో॥ శ్రీతెన్ తిరుప్పేర పురేతు శుక్ర సరస్సు రమ్యే సురదిజ్ముఖాసనః ।
శ్రీమత్కుழைకోద లతా౽దినాథో విరించి నేశానగ విప్ర సేవితః ।
మకరాయత కర్ణ భూషణ శ్శుభ భద్రాఖ్య విమాన మాశ్రితః
శఠవైరి మహర్షిణాస్తుతో భువి భక్తేష్టకృతే విరాజతే ।**

**వివః** మకరనెడుం కుழைక్కాద ప్పెరుమాళ్-నిగరిల్ ముకిల్ వణ్ణన్ - కుழைకోదై వల్లి తాయార్-శుక్ర పుష్కరిణి-భద్ర విమానం-తూర్పుముఖము-కూర్చున్నసేవ, బ్రహ్మ, శివ, శుక్రులకు ప్రత్యక్షము- నమ్మాళ్వార్లు కీర్తించినది.

**విశే:** ఈ దివ్య దేశమునకు **"మానగర్"** (మహానగరము తి.మొ.7-3-9) అను విలక్షణమైన తిరునామము కలదు. నమ్మాళ్వార్ తిరువాయి మొழிలో **"వెళ్లచ్చురిశజ్గొడు"** అను దశకమున "శెజ్గనివాయిన్(ఎఱ్ఱని పండు వంటి అధరము) అను పాశురమున ఓసఖీ! తిరుప్పేరై దివ్యదేశమున వేంచేసియున్న స్వామి ఎఱ్ఱని పండువంటి అధరమును తేజోవంతమైన కిరీటమును, శంఖ చక్రాది ఆయుధములను ధరించి నామనస్సును వశపరుచుకొనినాడు" అని సర్వేశ్వరుని **సౌందర్యమును** సేవించి ప్రకాశింపజేసినారు. మీనం ఉత్తర తీర్థోత్సవము.

**మార్గము:** ఈక్షేత్రమునకు **తిరుప్పేరై** యని వాడుకపేరు. తిరునల్వేలి తిరుచున్దూర్ రైలుమార్గములో ఆళ్వార్ తిరునగరి నుండి 5 కి.మీ. సత్రము కలదు. వసతులు స్వల్పము.

పా॥ శెజ్గని వాయిన్ తిఱత్తదాయుమ్; శెఙ్జుడర్ నీళ్ముడి తాழన్ద దాయుమ్;
శజ్గొడు శక్కరమ్ కణ్డుగన్దుమ్; తామరైక్కణ్ కళు క్కత్తు త్తీర్న్దుమ్;
తిజ్గళునాళుమ్ విழாవఱాద ; **తెన్ తిరుప్పేరెయిల్ వీత్తిరున్ద;**
నజ్గళ్ పిరాను క్కెన్నెఞ్జన్దోழி !; నాణు నిఱైయు మిழన్దదువే.!!
**నమ్మాழ్వార్ - తిరువాయిమొழி 7-3-3**

# 54. శ్రీ వైకుంఠము 14

శ్లో॥ శ్రీవైకుంఠపురే పృథ్వస్తు సరసా శ్రీ తామ్రపర్ణీ తటే
యుక్తే చంద్ర విమాన మధ్యనిలయో వైకుంఠ నాథః ప్రభుః।
ప్రాగాస్య స్థితి రాశ్రితః ప్రియతమాం వైకుంఠ వల్లీం ముదా
భాతి శ్రీ పృథురాజ శక్ర నయనా గంతు శ్శఠారి స్తుతః॥

వివః వైకుంఠనాథ పెరుమాళ్-(కళ్ళపిరాన్) వైకుంఠవల్లి-పృథు తీర్థము-తామ్రపర్ణీనది-చంద్ర విమానము-తూర్పుముఖము-నిలుచున్నసేవ-పృథు చక్రవర్తికి, ఇంద్రునకు ప్రత్యక్షము. నమ్మాళ్వార్ కీర్తించినది.

నమ్మాళ్వార్లు "పణ్డానాళాలే" అను దశకమున (9-2) "**పుళిఙ్గుడిక్కిడన్దు వరగుణ మఙ్గైయిరున్దు వైకున్దత్తుళ్ నిన్ఱు**" అను తావున (**తిరుప్పుళిఙ్గుడిలో** శయనించి యుండుట; **వరగుణమఙ్గై** యను క్షేత్రమునకూర్చునియుండుట; **శ్రీవైకుంఠమున** నిలచి యుండుటలో చేతనులమగు మనలను పొందుటకై సర్వేశ్వరుడుపడు తొందరను ప్రస్తుతించి సర్వేశ్వరుని "**భోగ్యపాకత్వర**" యను గుణమును ప్రకాశింపజేసిరి.

**సూచనః** ఈక్షేత్రమునకు 5 కి.మీ. తూర్పున ఆళ్వారు తిరునగరి, 1 కి.మీ దూరమున వరగుణమఙ్గై, తిరుప్పుళిఙ్గుడి క్షేత్రములు కలవు.

**మార్గముః** తిరునల్వేలి-తిరుచ్చెన్దూర్ రైలుమార్గములో శ్రీవైకుంఠం స్టేషన్ నుండి 2 కి.మీ. దూరములో సన్నిధి కలదు.

ంపా॥ ఎఙ్గళ్ కణ్ ముగప్పే యులగర్ గళెల్లా; మిణ్ణై యడితొழுదెழு దిఱైఞ్జి;
తఙ్గళన్బారత్తముదు శొల్లలత్తాల్; తలైత్తలై చ్చిఱన్దు పూశిప్ప;
తిఙ్గళ్శేర్ మాడ త్తిరుప్పుళిఙ్గుడియాయ్; **తిరువైకున్దత్తుళ్ళాయ్** తేవా;
ఎఙ్గళ్ మాఞాలత్తిదనుళు మొరునాళిరు న్దిడాయ్; వీత్త్రిడఙ్గొణ్డే.

నమ్మాళ్వార్ - తిరువాయి మొழி 9-2-8

## మంచిమాట

**అహంకారము అనునది ఒక సర్పము - మమత దానికి శరీరము.**
**రాగద్వేషములు ఆసర్పముయొక్క దంతములు.**
**దంతములను తీసివేసినచో ఆసర్పము నశించును.**
**అనగా రాగద్వేషములను విడచిపెట్టినచో**
**అహంకారము నశించునని తాత్పర్యము.**



# 55. తిరువరగుణమంగై 15(నత్తం)



శ్లో॥ శ్రీమత్యాం వరగుణమంగై నామ పుర్యాం ప్రాప్తోయాభి రుచిరం సుతీర్థమగ్నే :।
నాయక్యా వరగుణమంగై నామ వత్యా ప్రాగాస్యాసన రుచిరోఽగ్ని దృష్టరూప :।
విజయకోటి విమాన వరస్థిత శ్శతరిపూత్తమ భవ్య వచః ప్రియః।
సుజన సేవిత పాద సరోరుహః విజయతే ధరణౌ విజయాసనః॥

**వివః—** విజయాసన పెరుమాళ్-వరగుణమంగై తాయార్-అగ్నితీర్థం-విజయకోటి విమానం-తూర్పుముఖము-కూర్చున్నసేవ-అగ్నిహోత్రునకు ప్రత్యక్షము-నమ్మాళ్వార్ కీర్తించినది.

**విశే:—** ఆకలిగొన్నవాడు అన్నము పచనమగు వరకు అచటనే నిలబడి, కూర్చుండి, పరుండి, అన్నమునకై ఎదురుచూచునట్లుగా భక్తునకు పరమ భక్తి రూపమగు పరిపక్వ దశ వచ్చు వరకు సర్వేశ్వరుడు కూడ పై విధముగా త్వరపడుచుండునట. ఆళ్వారుల విషయమై సర్వేశ్వరునకు గల ఈ "భోగ్యపాకత్వరను" ఆళ్వార్లు "పుళిజ్గుడి"యను క్షేత్రమున శయనించి; తిరువరగుణ మంగై యను క్షేత్రమున కూర్చుండి, శ్రీవైకుంఠ క్షేత్రమున నిలబడి" యని ప్రకాశింపజేసిరి.

**సూచన:** తిరువారాధన కాలమందు పోయి సేవింపవలెను. లేకున్న అర్చక స్వాములను ముందుగా కలసి ఏర్పాటు చేసికొనవలెను.

**మార్గము:** శ్రీవైకుంఠము నుండి తూర్పుగా 2 కి.మీ. దూరమున గలదు. "నత్తం" అనియే చెప్పవలెను. వసతులు స్వల్పము.

పా॥ పుళిజ్గుడిక్కిడన్దు **వరగుణమజ్గై** యిరన్దు; వైకున్దత్తుళ్ నిన్ఱు;
తెళిన్ద వెన్శిన్దై యగజ్కళియాదే; యెన్నైయాళ్వా యెనక్కరుళి;
నళిర్న్ద శీరులగమ్ మూన్ఱుడన్ వియప్ప; నాజ్గళ్ కూత్తాడి నిన్ఱార్ప
పళిజ్గునీర్ ముగిలిన్ పవళమ్పోల్ కనివాయ్ శివప్ప; నీ కాణవారాయే.
నమ్మాళ్వార్-తిరువాయిమొళి 9-2-4.

**మంచిమాట**

**భక్తుడు భగవంతుని సంతోషింప చేయవలయునని ప్రయత్నించును.**
**భగవంతుడు ప్రపన్నులను సంతోషింపచేయ ప్రయత్నించును.**



55.విజయాసనర్ - తిరువరగుణమంగై

Vijayasanar - Tiru Varakuna Mangai



56.మాయక్కూత్తన్ - తిరుక్కుళంది

Mayakkuttan - Tirukkulandai



57.A వైష్ణవ నంబి - తిరుక్కుర్ఙ్గుడి
Vaishnavanambi - Tirukkurungudi



57.B తిరుప్పార్కడల్ నంబి - తిరుక్కురుంగుడి
Tirupparkadalnambi - Tirukkurungudi



## 56. తిరుక్కుళందై (తెన్‌కుళన్దై) (పెరుంకొళమ్)

శ్లో॥ శ్రీమత్కుళంద నగరేతు పెరుంకొళాఖ్య
తీర్థే కుళంద లతికా నయనాబ్జ భృఙ్గః।
ప్రాగాసన స్థితి రసౌ గురుసేవితాంగః
శ్రీమత్పరాఙ్కుశ మునీన్ద్ర పరిస్తుతాత్మా ॥

శ్లో॥ ఆనంద నిలయాఖ్యాన విమానస్థో మహీయతే।
మాయానట విభుర్భక్త పరిరక్షణ దీక్షిత:॥

**వివ:** మాయక్కూత్తన్-కుళందవల్లి తాయార్-పెరుంకుళ తీర్థం - ఆనందనిలయ విమానం-తూర్పుముఖము-నిలుచున్నసేవ-బృహస్పతికి ప్రత్యక్షము-నమ్మాళ్వార్ కీర్తించినది.

**విశే:** ఇచ్చట పెరుమాళ్ల ప్రక్కగా పెరియ తిరువడి (గరుత్మంతులు) వేంచేసియున్నారు. "అత్యంత ప్రీతితో తనను జేరిన వారి స్త్రీ సహజ ధర్మములను పోగొట్టి తన అద్భుత ఆశ్చర్య చేష్టిత గుణములను ప్రకాశింపజేసిన స్వామి"యని "పల్ వళై యార్ మున్ పరిశళిన్దేన్, అను పాశురమున (తిరువాయి మొళి 8-2-4) నమ్మాళ్వార్ భగవంతుని **అద్భుత చేష్టిత** గుణమును ప్రకాశింపజేసిరి.

**సూచన:** ఇచటి అర్చకస్వాములు తొలవిల్లి మఙ్గలం క్షేత్రమునకు పోవుదురు. వారుండు సమయమును ముందుగా తెలిసికొని సేవింపవలెను.

**మార్గం:** ఈ క్షేత్రమును పెరుఙ్కుళ మనియే చెప్పవలెను. తిరుప్పుళిఙ్గుడి నుండియు, శ్రీ వైకుంఠము నుండియు పోయి సేవింపవచ్చును. ఆక్షేత్రములకు 10 కి.మీ. దూరములో గలదు.

పా॥ కూడచ్చెన్ఱ్రేన్ ఇనియెన్ కొడుక్కేన్; కోల్వళై నెఞ్జత్తుడక్కు మెల్లామ్;
పాడత్తొళియ విళై న్దువై గల్; పల్వళై యార్ మున్ పరిశళిన్దేన్,
మాడక్కొడి మదిళ్ తెన్ కుళన్దై; వణ్ కుడపాల్ నిన్ఱమాయ క్కూత్తన్;
ఆడల్ పఱవై యుయర్త్త వెల్పోర్; ఆళి వలవనై యాదరిత్తే. ॥

నమ్మాళ్వార్ - తిరువాయిమొళి 8-2-4.

**మంచిమాట**

**ఈ ఆత్మకు సర్వేశ్వరుడు కట్టిన మంగళసూత్రమే తిరుమంత్రము.**

**- "పిళ్ళై తిరునరయూర్ అరయర్"**

# ❁ 57. తిరుక్కురుంగుడి ❁

శ్లో॥ శ్రీక్షీరాబ్ధి తరఙ్గిణీ తటతలే పూర్ణాహ్వయ శ్రీ పతిః ।
దివ్యే భాతి తిరుక్కురుఙ్గుడి పురే పంచాకృతి ద్యోతితః ।
సంప్రాప్త శ్శుభ పంచకేతక పదం వైమాన మైంద్రీముఖ
స్థాయీ సాక్షి పదం కురుఙ్గుడి లతానాథ శ్శఠారి స్తుతః ॥

శ్లో॥ శ్రీ మద్విష్ణు మన శ్రీశ్శమత్సర కాల వచః ప్రియః ।
రామానుజార్య మునిసాత్కృతో భయ విభూతికః ।

**వివః–** వైష్ణవ నంబి. మలై మేల్ నంబి; నిన్ఱ నంబి, ఇరుందనంబి; కిడంద నంబి, తిరుప్పార్ కడల్ నంబి" అను పంచాకృతులలో వేంచేసియున్నారు. కురుంగుడి వల్లి తాయార్; తిరుప్పార్ కడల్ నది; పంచకేతక విమానము; తూర్పుముఖము, నిలుచున్నసేవ, పరమ శివునకు ప్రత్యక్షము, నమ్మాళ్వార్, పెరియాళ్వార్, తిరుమళిశై ఆళ్వార్, తిరుమంగై యాళ్వార్ కీర్తించినది. ఉడయవరులకు ఉభయ విభూతి నాయకత్వమును అనుగ్రహించిన స్థలము.

**విశే:** ఈ క్షేత్రమునకు వైష్ణవ వామనమని పేరు. ఇచట స్వామి వడుగ నంబి రూపముతో ఉడయవరులను (శ్రీరామానుజులను) ఆశ్రయించి వారి నుండి మంత్రోపదేశమును పొంది సకల వేదాన్తార్థములను గ్రహించి "మేమును శ్రీభగవద్రామానుజులను ఆశ్రయించితిమి; ధన్యులమైతి" మని ఆనందముతో ప్రకటించుటచే ఈ క్షేత్రమునకు వైష్ణవ వామనమని పేరు. ఈ ఉత్సవము ప్రతి సంవత్సరము మిధునమాసములో జరుగును. వామనుడు వసించిన చోటగుటచే **కురుఙ్గుడి** యనియు **సిద్ధాశ్రమమనియు** పేరు వచ్చెను. ఉడయవర్ తడి వస్త్రములను ఆరబెట్టిన "తిరువట్టప్పారై" ఇచట సేవింపవచ్చును. ఇచట ఉడయవర్ అంజలి ముద్రతో కాక జ్ఞాన ముద్రతో వేంచేసియుందురు. నిన్ఱ–కిడంద నంబుల సన్నిధుల మధ్య శివుని ఆలయము కలదు.

ఈ సన్నిధికి 10 కి.మీ. దూరములో కొండమీద మలై మేల్ నంబి సన్నిధి గలదు. ఈ దివ్యదేశమున తాయార్; పెరుమాళ్లతో కలసి వేంచేసియుందురు. మీనం ఉత్తర తీర్థోత్సవము.

ఈ క్షేత్రమును గూర్చి ఆళ్వార్లు **"నిఱైన్ద శోతి వెళ్లమ్ శూழ్న్ద; నీణ్డ పొన్మేని యోడుమ్, నిఱైన్దెన్నుళ్ళే నిన్ఱొழిన్దాన్"** "పరిపూర్ణమైన కాన్తి ప్రవాహముచే పరివృతమై స్పృహణీయమైన దివ్య మంగళ విగ్రహముతో స్వామి నా హృదయమున వేంచేసి యున్నాడు." అనియు **"నీలమేనియుమ్ నాన్గుతోళుమ్ ఎన్నెంజమ్ నిఱైన్దనవే"**

నీలమేఘ శ్యామలమైన తిరుమేనియు చతుర్భుజములు గలిగి నామనస్సున నిండియున్నాడు." అనునట్లుగా **విభవావతార లావణ్యమును** అర్చావతారమందు దర్శించిరి.

**సూచన:** ఇచట ఎంబెరుమానార్లు స్వామికి మంత్రోపదేశము చేయుటచే అన్నిదివ్య దేశములలో వలె అంజలి ముద్రతో గాక జ్ఞానముద్రతో వేంచేసియుందురు. తిరుమంగై ఆళ్వార్ శ్రీరంగనాథుని యాజ్ఞానుసారము తిరునాడలంకరించిన ప్రదేశమును వారిని తిరుప్పళ్లి చేర్చిన స్థలమును ఇచట సేవింపవచ్చును.

**మార్గం:** నాఙ్గునేరి (వానమామలై) నుండి 15 కి.మీ దూరములో గలదు. బస్‌వసతి కలదు. నాంగునేరి నుండి కళక్కాడు పోయి అటనుండి వేరుబస్‌లో తిరుక్కురుఙ్గుడి చేరవచ్చును. రామానుజకూటము,జీయర్‌స్వాముల మఠము కలవు. మితమైన సౌకర్యములు గలవు.

పా॥ నిఱైన్ద వన్పళి నఙ్గుడిక్కివళెన్ఱు; అన్నై కాణ కొడాళ్;
శిఱన్ద కీర్త్తి త్తిరుక్కురుఙ్గుడి నమ్బియై; నాన్ కణ్డ పిన్;
నిఱైన్దశోతి వెళ్ళమ్ శూழ్న్ద; నీణ్డ పొన్మేని యొడుమ్;
నిఱైన్దెన్నుళ్లే నిన్ఱొழిన్దాన్; నేమియఙ్గై యుళతే.
నమ్మాళ్వార్ - తిరువాయిమొழி 5-5-7

## మంచిమాట

### "అవిద్య"

**అనాత్మన్యాత్మ బుద్ధి ర్యా అస్వే స్వమితి యామతి:**

**అవిద్యా తరు సంభూతి: బీజమేతత్ద్విధా స్థితమ్ ॥**

**అవిద్య అనునది యొక వృక్షము.**

**ఈ వృక్షమునకు పుట్టిన బీజములు రెండు**

**1. ఆత్మకాని దేహేంద్రియాదులను ఆత్మ అని భావించుట. (అహంకారము)**

**2. తనదికాని ఆత్మను తనదియని తలంచుట (మమకారము)**

**సంసారులగు చేతనులు ఈ అవిద్యతో కూడియుందురు. ఈ అవిద్య వలన దేవతిర్యక్ మనుష్య స్థావరములను నాల్గు విధములైన జన్మలు కలుగును. కావున ప్రాజ్ఞుడైనవాడు అవిద్యను పారద్రోలవలెను. అనగా అహంకార మమకారములను విడచిపెట్టవలెను.**

# 58. తిరుక్కోళూరు 18

శ్లో ।  శ్రీకోళూర్ నగరే కుబేర సరసీ శ్రీ తామ్రపర్ణీ తటే
యుక్తే శ్రీకర దేవయాన నిలయో భోగేశయః ప్రాఙ్ముఖః ।
శ్రీకోళూరు లతా పరిష్కృత వపు ర్నిక్షిప్త విత్తః ప్రభుః
కౌబేరాక్ష్యతిథి శ్శఠారి మునినా సంకీర్తితో రాజతే ॥

వివః  "వైత్తమానిది" పెరుమాళ్ (నిక్షిప్తవిత్తన్) కోళూర్ వల్లి త్తాయార్, కుబేర పుష్కరిణి; తామ్రపర్ణీనది; శ్రీకర విమానము; భుజంగ శయనము; తూర్పుముఖము; కుబేరునకు, మధురకవి యాళ్వార్లకు ప్రత్యక్షము. నమ్మాళ్వార్లు కీర్తించినది.

విశే:  ఈ దివ్యదేశ పెరుమాళ్ల విషయమై ఆళ్వార్లు "వైత్తమానిదియామ్ మదుశూదనై యే యలత్తి" ("నిక్షిప్తవిత్తనౌ (నిధివలెనున్నస్వామి) అగుమధుసూదనుని ఆర్తితో జపించి") అని **ఆపత్సఖత్వమను** గుణమును (అనగా ఆపదలో ఆదుకొనుట) ప్రకాశింపజేసిరి. మఱియు ఈ దివ్యదేశమునకు **"పుకుమూర్"** అను విలక్షణమైన తిరునామమును కృపజేసిరి. అనగా ఇచటి స్వామియొక్క నిరుపమాన సౌందర్యమును సేవించినవారు వెనుదిరిగి వెళ్లలేరని భావము. నవనిధులు ఇచట దాగియున్నవని అధర్మము కుబేరునితో కొండెములు చెప్పెనట. ఆకారణమున ఈ క్షేత్రమునకు కోళూరు అనుపేరు కలిగెనని చెప్పుదురు. ఇది మధురకవి ఆళ్వార్ల అవతారస్థలము.

సూచన:  సింహమాసం పునర్వసు తీర్థోత్సవముగా బ్రహ్మోత్సవము జరుగును. తెన్ తిరుప్పేరై ఈ దివ్యదేశమునకు 3 కి.మీ. దూరమున గలదు

మార్గము:  తెన్ తిరుప్పేరై నుండి ఆళ్వార్ తిరునగరిపోవు మార్గమున చిన్నకాలిబాట మార్గములో ఈ క్షేత్రము గలదు.

పా॥  ఉణ్ణుమ్ శోఱు పరుగునీర్; తిన్నుమ్ వెత్త్రిలై యు మెల్లామ్
కణ్ణన్; ఎమ్బెరుమానెన్లెన్రే; కణ్గళ్ నీర్ మల్గి;
మణ్ణి నుళవన్ శీర్ వళమ్మిక్క; వనూర్ వినవి;
**తిణ్ణమెన్నిళమాన్ పుగుమూర్; తిరుక్కోళూరే.**

నమ్మాళ్వార్–తిరువాయిమొழி 6-7-1

ఏవం శ్రీ పాండ్య దేశస్థ స్థలానాం వర్ణితో మయా ।
పురాణ సూక్త్యా యుక్తానాం వర్ణితః శ్రీశ భక్తితః ॥

శ్రియః పతియందు గల భక్తితో పాండ్యదేశములోని దివ్యదేశములు వర్ణింపబడినవి.

**మళయాళ దివ్య దేశములు**

మలయాళ మహాదేశ దివ్య క్షేత్రేషు సంభవమ్ ।
విజ్ఞాపయామి విభవం యతిరాజ కటాక్షతః ॥
శ్రీ భగవద్రామానుజుల వారి కృపచే మలయాళ దేశము నందు గల దివ్య స్థలముల యొక్క వైభవమును ఇకపై విన్నవింతును.



57.ఎరున్దనమ్బి - తిరుక్కురుఙ్గుడి

Erundanambi - Tirukkurungudi



58.వైత్తమానిధి - తిరుక్కోళూర్

Vaittamanidhi - Tirukkoluru



59.అనంత పద్మనాభన్ - తిరువనంతపురం

Ananta Padmanabhan - Tiruvananta Puram



60.తిరువాళ్మార్పన్ - తిరువన్ పరిసారమ్

Tiruval Marpan - Tiruvan Parisaram

# ❁ 59. తిరువనంతపురమ్ 1 ❁

శ్లో॥ తిరువనంత పురే భుజగేశయో రుచిరమత్స్య సరోవర సుందరే।
శశి విభూషణ వజ్రధరేక్షిత శ్శతరిపూత్తమ సూరి పరిష్కృతః॥
అనంత పద్మనాభ శ్రీశ్శహరిః లక్ష్మీ సమన్వితః।
ద్వారత్రయేణ సంసేవ్యః హేమ కూట విమానగః॥

**వివః** అనంత పద్మనాభస్వామి- శ్రీహరిలక్ష్మీతాయార్-భుజంగశయనం-మత్స్య పుష్కరిణి-హేమకూట విమానము - తూర్పు ముఖము - మూడు ద్వారములలో దర్శనము-శివునకు, ఇంద్రునకు ప్రత్యక్షము-నమ్మాళ్వార్లు కీర్తించినది.

**విశేః** ఇది కేరళ రాష్ట్ర ముఖ్య పట్టణము. సన్నిధి కోట మధ్య భాగమున కలదు. ఇచట స్వామి మూడు ద్వారములలో సేవ సాదింతురు. ఈ స్వామి విషయమై నమ్మాళ్వార్లు తమ తిరువాయిమొழி ప్రబంధములో (10-2) **"అరవిల్ పళ్ళి ప్పెణ్ణవన్ పాతజ్ఞాణ నడుమినో నమర్ కళుళ్లీర్"** భాగవతులారా! అనంతునిపై పవళించియున్న పద్మనాభ స్వామి శ్రీపాదములను సేవింప బయలుదేరుడు" అని యుపదేశించియున్నారు.

శ్రీరంగమున అధ్యయనోత్సవమున అరయరులు ఈ పాశురమును గానము చేయగా విని ఆళవందార్లు ఆనందపరవశులై ఆళ్వార్లు పిలిచిన ఈ క్షేత్రమునకు పోయిరావలయునని వెంటనే తిరువనంతపురమునకు వేంచేసిరి.

'కురుగై క్కావలప్పన్' అనువారు ఆళ్వందార్లకు యోగరహస్యములను ఉపదేశింప దలచి ఒక సుముహూర్తమును నిర్ణయించిరి. కాని ఆళవందార్లు ఆదినమున తిరువనంతపురములో వేంచేసియుండిరి. ఆకారణమున యోగరహస్యము వారికి లభింపకపోయెనట. "అయ్యో! పుష్పక విమానమైనను లేదే. ఉన్నచో కురుగై క్కావలప్పన్ సన్నిధికి చేరి యోగరహస్యములను పొంది యుండు వారమే" యని భావించిరట.

ఈక్షేత్రమున సేవింపవలసిన విశేషములు పెక్కులు గలవు. ఇచటికి సమీపమునగల "యానై మలై, అగస్త్య పర్వతము, ఏలకకాయల కొండ చూడదగినవి.

ఆచార్య హృదయములోని "సపై న్య పుత్ర శిష్య సాధ్య సిద్ధ భూసురార్చన త్తుక్కు ముఖ, నాభి పాదజ్ఞళై ద్వారత్రయత్తాలే కాట్టుమ్ సామ్యమ్ అనన్త శయనత్తిలే వ్యక్తమ్" అనుచూర్ణిక "సైన్య,పుత్ర, శిష్య సాధ్య, సిద్ధ బ్రాహ్మణారాధనలకు అనుకూలముగా ముఖము, నాభి, పాదములతో మూడు ద్వారములందు సేవసాదించు సామ్యగుణము (ఎల్లరను ఒక్కరీతిని జూచు గుణము) తిరువనంత పురమున కనిపించును అని తెలుపుచున్నది.

అమరరాయ్త్తిరిగిన్హార్గళ్కు-ఆది" అనుటచే బ్రహ్మాది దేవతలు సేవించుటను; **'అమరర్కోన్ అర్చిక్కిన్ఱ అజ్గగప్పణి శెయ్వర్ విణ్ణోర్"** "సేన ముదలియాళ్వార్ (విష్వక్సేనులు) ఆరాధింపగా అందుకు తగినట్లు అంతరంగ కైంకర్యనిరతులును నిత్యముక్తులును, **అనుటచే సైన్యాధిపతి సేవించుటయు "నమర్గళో శొల్లక్కేణ్మిన్ నాముమ్ పోయ్ నణుగ వేణ్డుమ్"** "భాగవతులారా ! నామాట వినుడు మనము తిరువనంతపురము పోయి కైంకర్యము చేయవలెను" అనుటచే **మన వంటి వారి సేవను** స్వీకరించు చున్నాడు.

ఈవిధముగా ఏవిధమైన తారతమ్యము లేక సర్వుల సేవను స్వీకరించుటచే సామ్యమను గుణము ప్రకాశించుచున్నది.

**మార్గము:** ఇది కేరళ రాష్ట్ర రాజధాని. చెన్నై - తిరువనంతపురం (త్రివేండ్రం) రైలు మార్గము. తిరువనంతపురం సెంట్రల్ స్టేషన్ నుండి 1 కి.మీ.

పా॥ కెడుమిడరాయ వెల్లామ్; కేశవా వెన్న; నాళుమ్
కొడువినై శెయ్యుమ్ కుఱ్తిన్; తమర్ గళుమ్ కురుగ కిల్లార్;
విడముడై యరవిల్ పళ్ళి; విరుమ్బినాన్ శురుమ్బలత్తుమ్;
తడముడైవయ; లనన్ద పురనగర్ పుగుదు మిన్రే.
కడువినై కళై యలాగుమ్; కామనై ప్పయన్ద కాళై;
ఇడవగై కొణ్డదెన్బర్; ఎళిలణి యనన్దపురమ్;
తడముడై యరవిల్ పళ్ళి; పయిన్రవన్ పాదమ్ కాణ
నడమినో నమర్గళుళ్ళీర్; నాముమక్కఱియచ్చొన్నోమ్;
నమ్మాళ్వార్ - తిరువాయిమొళి 10-2-1,8

## మంచిమాట

### జీవులు

**నిత్యవిభూతియగు పరమపదము లీలావిభూతి యీ రెండును సర్వేశ్వరునకు శేషభూతమై యుండుమ. వీనిలోనివసించువారు నిత్యులనియు ముక్తులనియు బద్ధులనియు మూడు విధములుగానుందురు. అందు నిత్యులనగా అనంతగరుడ విష్వక్సేనాది అంతరంగిక కైంకర్యపరులు. ముక్తులనగా కొంతకాలము సంసారమున పడియుండియు సర్వేశ్వరుని కృపకు పాత్రులై పరమపదమును చేరినవారు. బద్ధులనగా సంసారమున బడియుండువారు. వీరు రెండు విధములుగా నుందురు. 1 బుభుక్షువులు 2 ముముక్షువులు. బుభుక్షువులనగా అవిద్యకు వశ్యులై దేహయాత్రచేయువారు. ముముక్షువులనగా సుకృతవశమున ఆచార్యానుగ్రహము లభింప సర్వేశ్వరుని పొందుటకైప్రయత్నించువారు.**

# ❀ 60. తిరువణ్ పరిశారమ్ 2 ❀

శ్లో॥ తిరువణ్ పరిశార పట్టణే వరలక్ష్మీ సరసా సమన్వితే ।
సురదిగ్వదనోపవేశనో వినతాకారి విలోచనాతిథిః ॥

శ్లో॥ ఇంద్ర కల్యాణ నిలయః తిరువాళ్ మార్పనాహ్వయః ।
దేవ్యా కమల వల్ల్యాయం రేజే శఠరిపుస్తుతః ॥

**వివః** తిరువాళ్ మాఱ్పన్ (తిరుక్కురళప్పన్) కమలవల్లి తాయార్ - లక్ష్మీతీర్థం - తూర్పుముఖము-కూర్చున్నసేవ-ఇంద్ర కల్యాణ విమానము-వినతకు, ఉడయనంగై యార్‌కు,(నమ్మాళ్వార్ల తల్లిగారు) కారి,(నమ్మాళ్వార్ల తండ్రిగారు)-గరుడాళ్వార్లకు ప్రత్యక్షము. నమ్మాళ్వార్లు కీర్తించిన క్షేత్రము.

**విశేః** ఈ దివ్య దేశమునకు **"అచ్చేరి"** అను విలక్షణమైన తిరునామము కలదు. ఈస్వామి విషయమై నమ్మాళ్వార్లు **సౌకుమార్యమను** గుణమును ప్రకాశింప జేసియున్నారు.

సంసారులు శబ్దాది విషయలంపటులు - నిత్య సూరులు భగవదను భవమున మునిగినవారు. వీరెవరును స్వామిశ్రమను గుర్తించుటలేదు. కావుననే అతి సౌకుమార్యముగల స్వామి **"ఆళియుమ్ శజ్గుమ్ శుమప్పార్ తామ్"** అనునట్లు శంఖ చక్రములను తానే స్వయముగా భరించుచున్నాడే **"వాళుమ్ విల్లుమ్ కొణ్డు పిన్ శెల్వార్ మత్తిల్లై** "శంఖ చక్రములను విల్లును తీసికొని వెనుక నడుచు వారు ఎవరును లేరే" యని ఆళ్వార్లు సర్వేశ్వరుని **సౌకుమార్యమను** గుణమును ప్రస్తుతించిరి.

నమ్మాళ్వార్ల తల్లిగారైన ఉడయనంగై యార్ అవతార స్థలము. వారి సన్నిధి కోయిలకు సమీపముననే గలదు. ఇచట ఆళ్వార్లు బాల్యదశాసూచకమైన అర్చా రూపమున వేంచేసియున్నారు.

**మార్గముః** కన్యాకుమారికి ఉత్తరమున 20 కి.మీ.దూరమున నాగర్‌కోయిల్‌కు 4 కి.మీ. దూరమున గలదు. తిరువాట్టారునుండి 'తొడువెట్టి' చేరి బస్సు మారి నాగర్ కోయిల్ చేరవచ్చును. వసతులు స్వల్పము.

పా॥ ఆళుమాళారాళియుమ్; శజ్గుమ్ శుమప్పార్ తామ్;
వాళుమ్ విల్లుజ్కొణ్డు; పిన్ శెల్వార్ మఱ్ఱిల్లై ;
తాళుమ్ తోళుమ్; కైగళై యారత్తొళుక్కాణేన్;
నాళుమ్ నాళుమ్ నాడువ; నడియేన్ ఞాలత్తే.

పా॥ వరువార్ శెల్వార్; **వణ్ పరిశారత్తిరున్ద**; ఎన్
తిరువాళ్ మార్వఱ్కెన్; తిఱమ్ శొల్లార్ శెయ్‌వదెన్;
ఉరువార్ శక్కరమ్; శజ్గు శుమన్దిజ్గుమ్మోడు;
ఒరుపాడుళ్గల్వా; నోరడియాను ముళనెన్ఱే

నమ్మాళ్వార్ - తిరువాయి మొళి 8-3,7.



# 61. తిరుక్కాట్కరై 3



శ్లో॥ పురే తిరుక్కాట్కర నామ్ని పుష్కలం విమాన మాస్థః కపిలాఖ్య తీర్థగే ।
శ్రితః పెరుం శెల్వి రమా మధి శ్రితో విరాజతే కాట్కర యప్ప నాహ్వయః ।

శ్లో॥ విభీషణ పురోధేన కటాక్షః కపిలేక్షితః ।
శఠారాతి మునిశ్రేష్ఠ దివ్య సూక్తి విభూషణమ్ ॥

**వివ:** కాట్కరయప్పన్-పెరుం శెల్వినాయకి; (వాత్సల్యవల్లి)-పుష్కల విమానము-కపిల తీర్థము -దక్షిణ ముఖము -నిలుచున్న సేవ-కపిల మహామునికి ప్రత్యక్షము-నమ్మాళ్వార్లు కీర్తించినది.

**విశే:** నమ్మాళ్వార్లు ఈ స్వామి యొక్క **శీలగుణమును** ప్రకాశింపజేసిరి. శీలమనగాపెద్దలు పిన్నలతో అరమరికలు లేక కలసిపోవుట. శ్రియఃపతియగు సర్వేశ్వరుడు తన సంశ్లేషమును ఆళ్వార్లకు గుర్తుతెచ్చెను. కాని అది అప్పటి అనుభవమే యనిపించెను. అంతట ఆళ్వార్లు **"ఆరుయిర్ పట్టదు? ఎనదుయర్పట్టదు"** "పుండరీకాక్షుడు, కల్పశాఖల వంటి చతుర్భుజములు కలవాడు, నీలమేఘశ్యామలుడునైన స్వామి తిరుక్కాట్కరై క్షేత్రమున వేంచేసియుండగా నాఆత్మ పడుపాట్లు వేరెవరి యాత్మ పడుచున్నది" యని స్వామి శీల గుణమును ప్రకాశింపజేసిరి. వీరినే మలయాళదేశీయులు వామనుడని పిలతురు. శ్రవణ ద్వాదశినాడు గొప్ప ఉత్సవము జరుగును.

**మార్గము:** తిరువనంతపురమునకు 45 కి.మీ. నాగర్కోయిల్కు 30 కి.మీ. సౌకర్యములు గలవు. ఆలవాయ్ - తిరుచ్చూరు రైలుమార్గములో "ఇరుఞాలక్కోడి స్టేషన్ నుండి "అజ్ఞమాలి' స్టేషన్ నుండి 15కి.మీ

పా॥ ఉరుగుమాల్ నెఞ్జ; ముయిరిన్పర మన్ఱి;
పెరుగుమాల్ వేట్కైయు; మెన్ శెయగేన్ తొణ్డనేన్;
తెరువెల్లామ్ కావికముఴ; **తిరుక్కాట్కరై,**
మరువియ మాయన్ తన్; మాయమ్ నినైతొఱే;

పా॥ ఆరుయిర్ పట్ట దెనదుయిర్ పట్టదు;
పేరిదుఴ త్తామరై క్కళ్; కనివాయదోర్;
కారెఴిల్ మేగ; త్తెన్ కాట్కరై కోయిల్కొళ్;
శీరెఴిల్ నాల్ తడన్తోళ్; తెయ్వవారిక్కే

నమ్మాళ్వార్-తిరువాయిమొఴి 9-6-1,9.



64.ఇమయవరప్పన్ - తిరుచ్చెంగున్నూర్
Emayavarappan - Tiruchenkunnur



63.మాయప్పిరాన్ - తిరుప్పులియూర్
Mayappiran - Tiruppuliyur.

# ❁ 62. తిరుమూఴిక్కళమ్ 4 ❁

శ్లో॥ సరసీం తు పెరుకొళాభిధాం తిరుమూఝిక్కళ పట్టణే శ్రితే
సురనాథ దిశాముఖ స్థితి ర్వర సౌందర్య విమాన మందిరః ॥
శ్లో॥ మధురవేణిరమా నయనప్రియో నిజపురాహ్వయ వా నవనే శ్రుతః
హరితనామ మహాముని వీక్షితో విజయితే శఠవైరి పరిష్టుతః ॥

**వివ:** తిరుమూఝిక్కళత్తాన్-(అప్పన్, శ్రీసూక్తి నాథన్) మధురవేణి త్తాయార్, పెరుంకొళ తీర్థం-తూర్పుముఖము-నిలుచున్న సేవ-సౌందర్య విమానము-హారీతునకు ప్రత్యక్షము. నమ్మాళ్వార్ తిరుమంగై యాళ్వార్ కీర్తించినది.

**విశే:** నమ్మాళ్వార్లు ఈస్వామియొక్క **మార్దవ గుణమును** ప్రకాశింపజేసిరి. ఈ దివ్యదేశమునకు **వళత్తిన్ కళమ్** (తి.మొ. 7-1-6) అను విలక్షణమైన తిరునామము కలదు. తిరువాయిమొఝిలో నాలుగు దూతప్రేషణములు కలవు.

**మొదటిది: తమ దోషములను సహింపగల క్షమాగుణమును** గుర్తుచేయుచు అఙ్జిరైయ మడనారాయ్ (1-4-1) అను దశకములో **వ్యూహమూర్తి** విషయమై దూతప్రేషణ చేయబడినది.

**రెండవది: "వైకల్‌పూజ్గఴివాయ్"** అను దశకమున సర్వేశ్వరుని ఆర్త రక్షణ దీక్షను గుర్చుచేయుచు **విభవమూర్తి** విషయమై దూతప్రేషణ చేయబడినది.

**మూడవది: "పొన్నులగాళీరో"** అను దశకమున సర్వేశ్వరుని **రసజ్ఞతా గుణమును** గుర్తుచేయుచు **పరవాసుదేవుని** విషయముగను **అంతర్యామి** విషయముగను దూతప్రేషణ చేయబడినది.

**నాల్గవది: "ఎఙ్గానలగమ్ కఴివాయ్"** అను దశకమున సర్వేశ్వరుని **సౌందర్యాతిశయమును** గుర్తుచేయుచు **అర్చావతార విషయమై** తిరుమూఝిక్కళ స్వామిని గూర్చి దూత ప్రేషణ చేయబడెను.

"ఎంగానలగంగఴివాయ్" అను ఈ దశకమున ఆళ్వార్లు **"రూప సౌందర్య మార్దవములను** గుణములను ఆధారముగా **అర్చామూర్తి** విషయమై దూత ప్రేషణ చేయుచున్నారు. ఇందు రెండవ పాశురమున **"తమరోడు అజ్గువైవార్కు"** (తమ పరిజనులతో అచట నిత్యవాసము చేయువారికి)" స్వామి యాదృచ్ఛికముగా నన్ను కలిపినాడు. భాగవతగోష్ఠిలో కలసిన కారణమున బంధువులును వదలినారు. ఇట్లెవ్వరికినీ కాకపోతినే ! స్వామి నన్ను ఎందులకు ఉపేక్ష చేయుచున్నాడు ? భాగవత గోష్ఠిలో పరవశుడై నన్ను మరచియుండవచ్చును. ఆ గోష్ఠిలో నన్ను చేర్చుకొనుటకు నేను తగనా ! అని అడిగి రండు" అని దూతలను పంపుచున్నారు.

**మార్గము:** ఆల్‌వాయ్ టౌన్ నుండి బస్సు కలదు. బస్టాండు సమీపంలోనే సన్నిధి కలదు. ఎర్నాకుళం నుండియు రావచ్చును 10 కి.మీ.

పా॥ ఎజ్ఞానలగజ్కుళివాయ్; ఇరై తేర్న్ది జ్ఞనిదమరుమ్;
శెజ్ఞాల మడనారాయ్; తిరుమూళిక్కళత్తుఱై యుమ్;
కొజ్ఞార్ పూన్తుళాయ్ ముడి; యెజ్కుడక్కూత్తర్ క్కేన్ తూదాయ్;
నుజ్ఞాల్ గ ళెన్ తలై మేల్; కెళుమీరో నుమరోడే;

నమ్మాళ్వారు-తిరువాయిమొళి 9-7-1

## ❀ 63. తిరుప్పులియూర్ 5 (కుట్టనాడు) ❀

**శ్లో॥ పులియూరితి విశ్రుతే స్థితో నగరే పూంశున తీర్థ సుందరే**
**పురుషోత్తమ దేవయానగ శ్శుభే పొఱ్కొడి నాయకీపతిః ।**

**శ్లో॥ మాయప్పిరాన్ నామ హరిః ప్తర్షి నయనాతిథిః**
**ప్రాఙ్ముఖ శ్శఠజి త్సూక్తి శఠకే కీర్తితోపమే ।**

**వివ:** మాయప్పిరాన్-పొఱ్కొడినాయకి-పూంశునై తీర్థము-పురుషోత్తమ విమానము-తూర్పుముఖము-నిలుచున్నసేవ-సప్తర్షులకు ప్రత్యక్షము-నమ్మాళ్వార్ తిరుమంగై యాళ్వార్ కీర్తించినది. ఈ క్షేత్రమునకు **"వళమ్పుగళుమ్ ఊర్"** అనువిలక్షణమైన తిరునామము కలదు. (సౌందర్యస్తుతి దేశము 8-9-3 తి.వా.మొ)

**విశే:** ఈ క్షేత్రము భీమసేనుని ప్రతిష్ఠయని యందురు. పెరుమాళ్ల తిరుముఖ మండలము రజత కవచముచే కప్పబడి యుండును. నమ్మాళ్వార్ల తిరువాయిమొళిలో తోళిమార్(సఖి) దశలో చెప్పిన దశకములు మూడు. అందులో **"కరుమాణిక్కమలై మేల్"** (8-9) అను దశకము మూడవది. ఈ మూడు దశకములలోను ప్రణవ మందలి ఉకారార్థమగు అనన్యార్హత్వము ప్రకటింపబడినది. ఇందు మొదటి పాశురమున **"కరుమాణిక్కమలై మేల్ మణిత్తడన్దామరై క్కాడుగళ్‌పోల్; తిరుమార్పు వాయ్ కణ్కై ఉన్దికాల్ ఉడై ఆడైగళ్"** .

తిరుప్పులియూర్‌లో వేంచేసియున్న స్వామి తిరుమేని నీల రత్నగిరివలె నున్నది. స్వామి వక్షస్థలము; మోవి; నేత్రములు, శ్రీహస్తములు; నాభి, శ్రీపాదములు; పీతాంబరము మున్నగునవి ఆకొండమీది సరోవరమునగల పద్మవనము వలెనున్నవి" యని ఉత్తమ నాయక లక్షణములను ప్రకాశింపజేసిరి.

**మార్గము:** శజ్ఞణూర్‌కు 5 కి.మీ. వసతులు స్వల్పము.

పా॥ కరుమాణిక్కమ్మలై మేల్; మణిత్తడన్తామరై క్కాడుగళ్పోల్
తిరుమార్వు వాయ్ కణ్కై ; యున్ది కాలుడై యాడై కళ్ శెయ్య పిరాన్;
తిరుమాలెమ్మాన్ శెழுనీర్వయల్; కుట్టనాట్టు **త్తిరుప్పులియూర్;**
అరుమాయన్ పేర్తన్ఱి ప్పేచ్చిలళ్; ళవ్వైమీరిదఱ్కెన్ శెయ్గేనో.
నమ్మాళ్వారు-తిరువాయిమొழி 8-9-1

# ❀ 64. తిరుచ్చెంకున్ఱూర్ 6 (శంగణూర్) ❀

శ్లో॥ చెంకున్ఱూర్ నగరే తు శంఖ సరసీ హ్రస్వాపగా సంయుతే ।
**వైమానం సమధి(శ్రిత స్థితిలసన్ దివ్యం జగద్యోతిషమ్ ।
నాయక్యా నిమిషః ప్రభుర్విజయతే పశ్చాన్ముఖాంభోరుహే
యుక్త శృంగమలాభిధా సహితయా శ్రీమచ్ఛఠారి స్తుతః ।
భస్మాసుర నిమిత్తేన శశిభూషణ వీక్షితః
భక్తబృంద పరిత్రాణ కాముక స్సతతం హరిః ।**

**వివః** ఇమయవరప్పన్ - శెంగమలవల్లి - శంఖ పుష్కరిణి - హ్రస్వాపగా నది (దీనికే తిరుచ్చిత్తార్ అనిపేరు) జగజ్జ్యోతి విమానం - పశ్చిమ ముఖము - నిలుచున్నసేవ - భస్మాసుర నిమిత్తమై పరమశివునకు ప్రత్యక్షము - నమ్మాళ్వార్ కీర్తించినది.

**విశేః** సంసారులు స్వప్రయోజనపరులు. స్వామి యందు నుంతయేని ప్రేమలేనివారు. అట్టి సంసారుల మధ్యలో స్వామి అవతరించినాడే ! ఈస్వామి కేమగునో" యని ఆళ్వార్లు భయపడినారు. ఆళ్వార్ల భయమును గమనించిన స్వామి తన శౌర్యవీర్యాదులను ప్రదర్శించి మీకేమియు భయము వలదు. నిర్భరులై యుండుడనిరి. ఆశౌర్య గుణమును **"కఞ్జనైత్తగర్త్త శీర్కాళ్"** (కంసుని చంపిన శౌర్యగుణము గలస్వామి) యని కొండాడిరి. (8-1-1)

**మార్గముః** తిరువనంతపురమున స్వామిని సేవించి అటనుండి బయలుదేరి **"వర్కాలా"** స్టేషనులో దిగి **"జనార్థన"** క్షేత్రమును సేవించి అచట నుండి కొట్టార్కరై స్టేషనులో దిగవలెను. ఈ **కొట్టార్కరైకు** 50 కి.మీ. దూరములో బస్సుమార్గమున ఈ శెంగణూర్ కలదు. 'త్రివేంద్రం' 'ఎర్నాకులం' (వయా) కొల్లం రైల్వేలైనులో శెజ్గణూర్ స్టేషన్. అన్ని వసతులు కలవు. ఈ శెంగణూర్ నుండి అయిదు దివ్య దేశములను సేవింపవచ్చును.

శెంగణూర్ నకు తూర్పున 10 కి.మీ దూరమున - తిరువారన్ విళై,
నైఋతి 5 కిమీ దూరమున తిరుప్పులియూర్,
వాయవ్యం 5 కి.మీ దూరమున తిరువణ్ వణ్డూరు

ఉత్తరం 10 కి.మీ దూరమున తిరువల్లాయ్,
25 కి.మీ దూరమున తిరుక్కడిత్తానమ్ క్షేత్రములు గలవు.

పా॥ వార్కడావరువి యానై మామలై యిన్; మరుప్పిణైక్కువడిఉత్తురుట్టి
ఊర్కొళ్ తిణ్పాగ నుయిర్ శెగుత్త రజ్జిన్ మల్లరై క్కొన్ఱు శూழ் పరణ్ మేల్
పోర్ కడావరశర్ పుఱక్కిడ; మాడమీమిశై క్కఙ్ఞై త్తగర్త్త,
శీర్కొళ్ శిత్తాయన్ **తిరుచ్చెజ్గన్నూరిల్;** తిరుచ్చిత్తాఱెజ్గళ్ శెల్ శార్వే.
నమ్మాళ్వార్ - తిరువాయిమొழி 8-4-1

# ❀ 65. తిరునావాయ్ 7 ❀

శ్లో॥ **శ్రీమచ్చెంగమలాభిధాన సరసా యుక్తే పురే సుందరే**
**నావాయ్ నామని వేద మందిర వరే యా మ్యాసనాలంకృతః**
**లక్ష్మీ నాగవరేక్షిత స్స్వముపయన్ దేవీం మలర్ మంగ ఇ**
**త్యాఖ్యే స్తుత్య వపు శ్శఠారి కలిజిత్ యుగ్మేణ నారాయణః ।**

**వివః** నారాయణన్ (నావాయ్ ముకుందన్) మలర్ మంగై తాయార్, శెంగమల పుష్కరిణి-వేద విమానం-దక్షిణముఖము-కూర్చున్నసేవ-లక్ష్మీదేవికి గజేంద్రునకు ప్రత్యక్షము-నమ్మాళ్వార్ తిరుమంగై ఆళ్వార్ కీర్తించినది.

**విశే:** మలైనాడు సన్నిధులలో తాయార్లకు వేరుగా సన్నిధి ఇచట మాత్రమే కలదు. నమ్మాళ్వార్లు ఈ పెరుమాళ్ల విషయమై **'ఆనృశంస్యము'** అనే గుణమును ప్రకాశింపజేసిరి.

సర్వేశ్వరుని వియోగముచే కలిగిన దుఃఖ సముద్రమును దాటించు నావ వంటివాడు ఈస్వామి **'ఆవానడి యానివనెన్నరుళాయే'** వీడు నా దాసుడని నన్ను దయజూడుమా! అని **ఆనృశంస్య గుణమును** (9-8-7) ప్రకాశింపజేరి. ఇచట "నావాయుఱైకిన్ఱ" 'నావగా వసించుచున్నట్టివాడు' అని పేర్కొనుటచే ఈ దేశమునకును తిరునావాయ్ అను తిరునామము కలిగినది.

**మార్గము: షోరానూర్** నుండి **కల్లికోట** పోవు మార్గములో గల **"ఎడకోలమ్"** నకు 1 కి.మీ. దూరమున గలదు. షోరానూర్ నుండి బస్‌లో కుట్టిపురంచేరి అక్కడనుండి వేరుబస్సులోను చేరవచ్చును. వసతులు స్వల్పము.

పా॥ కోవాగియ; మావలియై నిలజ్కొణ్డాయ్
తేవాశురమ్; శెత్తవనే తిరుమాలే!
**నావా యుఱైగిన్ఱ** ఎన్నారణ నమ్బీ;
ఆవా వడియా నివ నెన్ఱరుళాయే.
నమ్మాళ్వారు-తిరువాయిమొழி 9-8-7.



66.కోలప్పిరాన్ - తిరువల్లవాళ్

Kolappiran - Tiruvallaval



65. నారాయణన్ - తిరునావాయ్

Narayanan - Tirunavai




68.ఆదికేశవన్ - తిరువాట్టారు

Adikesavan - Tiruvattaru



67.పాంబణై అప్పన్ - [illegible]

Panbanai Appan - Tiruvan Vandur

# ❀ 66. తిరువల్లవాళ్ - 8 (తిరువల్లాయ్) ❀

## (శ్రీవల్లభక్షేత్రం)

శ్లో॥ ఘంటాకర్ణ సరోవరేణ కలితే శ్రీ వల్లవాళ్ పత్తనే
భాతి ప్రాఙ్ముఖ మండిత స్థితి యుతః కోలప్పిరాన్ నామకః ।
వైమానం చతురంగ మాప్య గృహిణీం శెల్వక్కొళుందాహ్వయాం
ఘంటాకర్ణ నిరీక్షితః కలిజిత స్తుత్య శ్శఠారే ర్మునేః ॥

**వివః** కోలప్పిరాన్-శెల్వత్తిరుక్కొళుందు తాయార్-ఘంటాకర్ణ సరస్సు తూర్పు ముఖము-నిలుచున్నసేవ-చతురంగ కోల విమానము-ఘంటాకర్ణునకు ప్రత్యక్షము. నమ్మాళ్వార్లు-తిరుమంగై ఆళ్వార్లు కీర్తించినది.

**విశేః** ఈక్షేత్రమునకు '**తెన్ నగర్**' సుందరమైన దివ్యదేశము (తి.వా.మొ. 5-9-11) అను విలక్షణమైన తిరునామము కలదు. ఈ క్షేత్రము ద్వాపర యుగమున శ్రీకృష్ణునిచే ప్రతిష్ఠింపబడినదని చెప్పుదురు. చతురంగ విమానమునకు వెనుక చక్రత్తాళ్వార్ వేంచేసియున్నారు. ఈ సన్నిధిలోపలకు స్త్రీలను రానీయరు. వెలుపలనుండియే సేవింపవలెను. కానీ ధనుర్మాసములో ఆర్ద్ర నక్షత్రమునాడు, మేష సంక్రాంతినాడు మాత్రము లోపలకు రానిత్తురు.

సర్వేశ్వరుని పొందుటకు ఉపాయము సర్వేశ్వరుడే. ఆతడే ఉపాయమని మనకు తెలియజేయునది ఆస్వామి కృపాగుణమే. ఆకృపాగుణమునే నమ్మాళ్వార్లు తిరువాయిమొழி (5-6-9)లో **"పెరుమానదు తొల్లరుళే"** (సర్వేశ్వరుని స్వాభావికమైన కృప) యని **కృపాగుణమును** ప్రకాశింపజేసిరి. ఈక్షేత్రమునకు శ్రీవల్లభక్షేత్రమనియు తిరునామము కలదు.

**మార్గముః కొల్లం - ఎర్నాకుళం** రైలు మార్గంలో **తిరువల్లాయ్** స్టేషన్ నుండి 5 కి.మీ. బస్సు వసతికలదు. ఇచట సత్రములో దిగి బస ఏర్పాటు చేసికొని తిరుచ్చెంకున్నూరు వాని సమీప క్షేత్రములు సేవింపవచ్చును. తిరుచ్చెంకున్నూర్‌కు ఉత్తరమున 10 కి.మీ. దూరములో ఈక్షేత్రము కలదు. తిరువణ్ణ్డూరుకు 8 కి.మీ.

పా॥ మానేయ్‌నోక్కు నల్లీర్; వైగలుమ్ వినై యేన్మెలియ,
వానార్ వణ్ కముకుమ్; మ్మత్తు మల్లిగై కమழுమ్
తేనార్ శోలైగళ్ శూழ; **తిరువల్లవాழ** యురైయుమ్
కోనారై ; యడియే; నడికూడువ తెన్తుకొలో ।
నమ్మాళ్వారు-తిరువాయిమొழி 5-9-1,

#  67. తిరువణ్ వండూరు 9 

శ్లో॥ వణ్ వండూర్ పురి పాపనాశ సరసా యుక్తేతు వేదాలయం
వైమానం సమధిశ్రితో వరుణ దిగ్వక్త్ర స్థితిః ప్రీతిమాన్ ।
దేవః పాంబణయప్ప నంబుజలతా నాథ స్సముజ్జృంభతే
మార్కండేయ సునారదాక్షివిషయః కీర్త్యః శఠద్వేషిణః ।

**వివః** పాంబణయప్పన్-కమలవల్లి త్తాయార్-నిలుచున్న సేవ-పాపనాశ పుష్కరిణి-వేదాలయ విమానము-పశ్చిమ ముఖము-నిలుచున్న సేవ-మార్కండేయునకు, నారదునకు ప్రత్యక్షము-నమ్మాళ్వార్ కీర్తించినది.

**విశే:** ఈ క్షేత్రము నకులునిచే ప్రతిష్ఠ చేయబడినదని చెప్పుదురు.

ఆళ్వార్లు అనేక విధముల సర్వేశ్వరుని ప్రార్థించియు అభీష్టము లభింపక "దానికేమి కారణమని" ఆలోచించి "శ్రియఃపతి తిరువణ్వణ్డూరులో వేంచేసియుండి అచటి భోగ్యతా విశేషములకు పరవశుడై తనను మరచి యుండు"ననిభావించి స్వామియొక్క ఆర్తరక్షణ దీక్షను గుర్తుచేయదలచి సముద్రతీరమున సంచరించు పక్షులను శ్రియఃపతి యొద్దకు దూతలుగా పంపుచున్నారు.

ఇది ఆళ్వార్లు సర్వేశ్వరుని విషయమై నాయికా భావముతో దూతప్రేషణము చేసిన దివ్య దేశము. తిరువాయిమొழிలో గల నాల్గు దూతప్రేషణములలోనిది రెండవది. మొదటిది "అఞ్జిఱైయ మడనారాయ్" అనుదశకమున వ్యూహమూర్తి విషయమై దూతప్రేషణ గావింపబడినది. ఈ క్షేత్రస్వామి విషయమైన "వైకల్ పూఙ్గழிవాయ్" అను దశకమున (6-) "**ఏఱు శేవగనార్కు**" (వర్ధిల్లుచున్న శౌర్యము గలవానికి) యని విభవమూర్తి విషయమై దూత ప్రేషణము నెరుపబడినది. ఈ క్షేత్రమునకు పంపోత్తర దేశమను తిరునామము గలదు. పంపానదికి ఉత్తరతీరమందున్న దివ్యదేశము అని అర్థము. (తి.వా.మొ. 6-1-10).

**మార్గము:** శెఙ్గణూర్‌కు వాయువ్యముగా 5 కి.మీ. వసతులు స్వల్పము. తిరువల్లవాళ్ నుండియు సేవింపవచ్చును.

పా॥ వైకల్ పూఙ్గழிవాయ్; వన్దుమేయు ఙ్గురుకినఙ్గాళ్;
శెయ్‌గొళ్ శెన్నెలుయర్; **తిరువణ్వణ్డూరుఱైయుమ్;**
కైగొళ్ శక్కరత్తైన్; కనివాయ్ పెరుమానై క్కణ్డు;
కైగళ్ కూప్పి చ్చొల్లీర్; వినై యాట్టియేన్ కాదన్మైయే
నమ్మాళ్వారు - తిరువాయిమొழி 6-1-1.

## ❀ 68. తిరువాట్టార్ 10 ❀

శ్లో॥ శ్రీవాట్టారు పురే భుజంగ శయన శ్శ్రీరామ తీర్థాంచితే
త్వష్టాంగాహ్వాయ మాదికేశవ విభు ర్వైమాన మాప్త శ్రియమ్ ।
దేవీం మారతకోప పూర్వలతికాం సంప్రాప్య పశ్చాన్ముఖః
స్తుత్యః చంద్ర పరాశరాక్షి విషయో రేజే శఠారేర్మునేః ।

**వివః** ఆదికేశవ పెరుమాళ్ - మరకతవల్లి తాయార్ (పద్మిని) - శ్రీరామ పుష్కరిణి - అష్టాంగ విమానము - పశ్చిమ ముఖము - భుజంగ శయనం - చంద్రునకు, పరాశర మహర్షికి ప్రత్యక్షము - నమ్మాళ్వారు కీర్తించినది.

**విశే:** ఈ క్షేత్రమునకు పరశురామ క్షేత్రమని పేరు. ఈ దివ్య దేశమునకు రెండువైపుల రెండు నదులు ప్రవహించుటచే **తిరువాట్టారు** అనుపేరు గల్గినది. తిరువనంత పురములో వలెనే ఇచటకూడ స్వామి మూడు ద్వారములలో సేవ సాదింతురు. ఇచట సాయంకాల సూర్య కిరణములు స్వామి తిరుముఖ మండలమును స్పృశించును.ఈ క్షేత్రమునకు **"వళమ్ మికునది"** (మిక్కిలి సంపదగల దివ్యదేశము) యను తిరునామము కలదు. ఈ దివ్యదేశ విషయమై నమ్మాళ్వారు 10వ శతకమున **"అరుళ్ పెరువారడియార్"** అను దశకమును అనుగ్రహించిరి. తిరువిరుత్తము మొదలు ఈ దశకము వరకు ఆళ్వార్లు అనుగ్రహించిన ప్రబంధములో స్వామిని పొందుటకై తాను పడిన పాటులను త్వరనుప్రదర్శించిరి. కానీ ఈ దశకము నుండి ఆళ్వార్లును పొందుటకై సర్వేశ్వరుడు పడుపాట్లను ప్రకాశింపజేయుచున్నారు. అనగా **ఆశ్రిత పారతంత్ర్యగుణమును "నమదు విదివగైయే"** నేను విధించినట్లే యగును) అను స్థలమున వివరించిరి. ఈ పాశురమునకు భగవద్రామానుజుల వారి అర్థ నిర్ణయము కలదు.

**మార్గము:** త్రివేండం—నాగర్ కోయిల్ బస్‌లో **"తొడినెట్టి"** వద్ద దిగి వేరు బస్‌లో 10 కి.మీ. దూరములో సన్నిధి చేరవచ్చును. వసతులు స్వల్పము.

పా॥ అరుళ్ పెఱువారడియార్; తమ్మడియనేఱ్కు; ఆళియాన్
అరుళ్ తరువానమై గిన్ఱా; నదు నమదు విదివగై యే;
ఇరుళ్ తరుమాఞాలత్తు; ళినిప్పిఱవియాన్ వేణ్డేన్;
మరుళొళినీ మడనెఞ్జే; **వాట్టత్తా నడివణఙ్గే.**
నణ్ణినమ్ నారాయణనై ; నామఙ్గళ్ పలశొల్లి
మణ్ణులగిల్ వళమ్మిక్క ; **వాట్టాత్తాన్** వన్దిన్దు,
విణ్ణులగమ్ తరువానాయ్; విరైగిన్ఱాన్ విదివగై యే,
ఎణ్ణినవాఱాగా; విక్కరుమఙ్గళెన్నెఞ్జే.

నమ్మాళ్వార్లు - తిరువాయిమొళి 10-6-1,3.



## 69. తిరువిత్తువక్కోడు 11 (తిరువిచ్చిక్కోడు)



శ్లో॥ శ్రీవిత్తువక్కోడు పురే చక్రతీర్థయుతే శ్రితః ।
ఉయ్య వంద ప్రభు ర్దేవీం విత్తువక్కోడు వల్లికామ్ ।
తత్త్వ కాంచన వైమానే దక్షిణస్యారగే శయః
అంబరీషా తిథిర్భాతి కులశేఖర సంస్తుతః ।

**వివః** ఉయ్య వంద పెరుమాళ్ - విత్తువక్కోడువల్లి త్తాయార్ - చక్రతీర్థము - తత్త్వకాంచన విమానము - దక్షిణముఖము - భుజంగశయనం - అంబరీషునకు ప్రత్యక్షము. కులశేఖరాళ్వారు కీర్తించినది.

**మార్గము: షోరానూర్ - గురవాయూర్ బస్‌లో** 15 కి.మీలో బస్‌దిగి 2 కి.మీ నడచియు వెళ్ళవచ్చును. షోరానూర్ - ఎర్నాకులం లైనులో పట్టాంబి స్టేషనుకు 2 కి.మీ.

పా॥ తరుతుయరమ్ తడాయేల్; ఉన్ శరణల్లాల్ శరణిల్లై;
విరై కుழువు మలర్ప్పొழిల్ శూழ்; విత్తువక్కోట్టమ్మానే!
అరశినత్తా శీన్దతాయ్ అగత్తిడినుమ్; మత్తవళ్ తన్
అరుళ్ నినైన్దే యழுழ்గుழవి : అదువే పోన్దిరున్దేనే.

కులశేఖరాళ్వార్లు - పెరుమాళ్ తిరుమొழி 0-5-1



## 70. తిరుక్కడిత్తానమ్ 12



శ్లో॥ **తిరుక్కడిత్తాన పురే ద్భుతాఖ్య నారాయణః కల్పక వల్లి దేవ్యా ।
భూమ్యాఖ్య తీర్థే వరపుణ్యకోటి విమానమాస్థః సురదిఙ్ముఖస్థః ।
రుక్మాంగద మహారాజ ప్రత్యక్షత్వ ముపాగతః ।
పరాంకుశ మునీంద్రేణ స్తుతో విజయతే తరామ్ ।**

**వివః** అద్భుత నారాయణన్ - కల్పకవల్లి త్తాయార్ - భూమి పుష్కరిణి పుణ్యకోటి విమానము - తూర్పుముఖము - నిలుచున్నసేవ - రుక్మాంగద మహారాజునకు ప్రత్యక్షము - నమ్మాళ్వార్లు కీర్తించినది.

**విశే:** ఈక్షేత్రమునకు **"తాయప్పది"** దాయభాగముగా లభించిన క్షేత్రము అను విలక్షణమైన తిరునామము గలదు. (తి.వా.మొ. 8-6-8.)

సర్వేశ్వరునకు భోగ్య భూతములైన వాస స్థానములు అనేకములు కలవు. కానీ " శ్రీవైకుంఠ విరక్తాయ" అనురీతిని వానియందు ఆదరములేనివాడు **"ఎన్నైజ్ఞమ్ తిరుక్కడిత్తాన** నగరుమ్" (8-6-8) (నామనస్సు తిరుక్కడిత్తాన దివ్యదేశము)



70.అద్భుత నారాయణన్ - తిరుక్కడిత్తానం

Adbutanarayan - Tirukkadittanam



69.ఉయ్యవందాళ్ - విత్తువక్కోడు

Uyyavandal - Vittuvakkodu



71. తిరుక్కురళప్పన్ - తిరువారణ్విళై

Tirukkuralappan - Tiruvaranvilai



72.దేవనాథన్ - తిరువహీంద్రపురమ్

Devanadhan - Tiruvaindrapuram

అనునటుల నా హృదయమునందు వాసము చేయుచున్నాడు. అంతేకాక అందుకు కారణమైన తిరుక్కడిత్తాన క్షేత్రమున వేంచేసియున్నాడు. ఈ రెండును స్వామికి దాయప్రాప్తములుగదా !" అని ఆళ్వార్లు సర్వేశ్వరుని **కృతజ్ఞతా గుణమును** ప్రకాశింప జేసిరి. ఈ క్షేత్రము **సహదేవునిచే** ప్రతిష్ఠింపబడినట్లు చెప్పుదురు. చిన్న గ్రామము. సమీపమందలి **శెంగనాంచేరిలో** మకాంచేయవలెను. లేక తిరువల్లవాఝ్ నుండి పోవచ్చును.

పా॥ తాన నగర్ గళ్; తలై చ్చిఱన్దెజ్గెజ్గుమ్;
వానిన్నిలమ్ కడల్; ముత్తు మెమ్మాయత్కే;
ఆనవిడత్తు; మెన్నెఞ్జమ్ **తిరుక్కడిత్**
**తాననగరుమ్; తన తాయప్పదియే.**

నమ్మాళ్వారు - తిరువాయిమొఝి 8-6-8.

## 71. తిరువాఱన్ విళై 13 (ఆరుముళై)

శ్లో॥ **తిరువారన్ విళాఖ్యానే పురేవ్యాస స్సర స్తటే ।**
**కురళప్పనితి శ్రీమాన్ పద్మాసన రమాపతిః ।**
**విమానం వామనం ప్రాప్తః కుబేర హరి దాననః ।**
**బ్రహ్మేక్షితస్థితో రేజే పరాంకుశ మునిస్తుతః ।**

**వివ:** తిరుక్కుఱళప్పన్ - పద్మాసనవల్లి త్తాయార్ - వ్యాస పుష్కరిణి - వామన విమానము - ఉత్తర ముఖము - నిలచున్నసేవ - బ్రహ్మకు ప్రత్యక్షము - నమ్మాళ్వార్ కీర్తించినది.

**విశే:** ఈ క్షేత్రము **అర్జునునిచే** ప్రతిష్ఠింపబడినట్లు చెప్పుదురు. ఇచట మూలవరులకు ప్రతి నిత్యము తిరుమంజనము, పుష్పాలంకరణము కలదు. తప్పక సేవింపదగినది. నమ్మాళ్వారు తిరువాయిమొఝి ఏడవశతకం పదవ దశకమగు 'ఇన్బమ్ పయక్క' అను తిరువాయిమొఝిలో **"ఇన్బమ్ పయక్క ఇనితుడన్‌వీత్తిరున్ధు"** (సుఖము కలుగునట్లుగా ప్రీతితో వేంచేసియుండి) అని సమస్త లోకములకు స్వామియగు సర్వేశ్వరుడు పిరాట్టితో (శ్రీదేవి) పాటు నా తిరువాయిమొఝి వినుటకై తిరువాఱన్ విళై "క్షేత్రమున వేంచేసియున్నాడు." అని సర్వేశ్వరుని **ఆనందాతిశయము** అను గుణమును ప్రకాశింపజేసిరి. ఈ క్షేత్రమునకు **"నీణగర్"** (మహానగరము) అను తిరునామము కలదు. తి.వా.మొ. 7-10-6.

**మార్గము:** శెంగణూర్‌కు తూర్పున 10 కి.మీ. సత్రముకలదు. వసతులు స్వల్పము.

పా॥ ఆగుఙ్గ్కాల్ ఐయమొన్ఱిన్ఱి; యగలిడ ముత్తవుమ్ ఈరడియే
ఆగుమ్ పరిశు నిమిర్న్ద; తిరుక్కుఱళప్ప నమర్న్దుఱై యుమ్;
మాగమ్ తిగ ళ్ కొడిమాడఙ్గళ్; నీడుమదిళ్ **తిరువాలనవిఱై**
మాకన్ద నీర్ కొణ్డు తూవి వలఞ్జెయ్దు; కై తొళ్ కూడుఙ్గొలో.
నమ్మాళ్వార్ - తిరువాయిమొళి 7-10-2.

శ్లో॥ ఇత్థం శ్రీమళయాళస్థ దివ్యదేశా స్త్రయోదశ ।
మయా సంకీర్తితా శ్రీమత్ రామానుజ కృపాబలాత్॥

వివః భగవద్రామానుజులవారి కృపాబలము వలన మళయాళ దేశమున గల పదమూడు క్షేత్రములు వర్ణింపబడినవి.

శ్లో॥ అథద్వే మధ్య దేశస్థా వర్ణ్యతే క్షేత్ర సత్తమౌ ।
రామానుజార్య కరుణా కటాక్ష బలతోమయా !

వివః భగవద్రామానుజులవారి కరుణా కటాక్ష బలముచేత మధ్య దేశమున గల రెండు క్షేత్రరాజములు వర్ణింపబడుచున్నవి.

## ❁ 72. తిరువయిందిర పురమ్ ❁

**శ్లో॥ శ్రీమత్ తార్క్ష్య తరఙ్గిణీ తటతలే శేషాఖ్య తీర్థాంచితే**
**దేవ శ్రీమదహీంద్ర పట్టణ వరే చంద్రాఖ్య వైమానగః ।**
**వైకుంఠాఖ్య రమాయుతో విజయతే శ్రీ దేవనాథ ప్రభుః**
**ప్రాగాస్య స్థితి రిందు తార్క్ష్య విషయ స్తుత్యః కలిద్వేషిణః ।**

వివః దెయ్వనాయకన్ (దేవనాథన్) - వైకుంఠనాయకి (హేమాబ్జవల్లి) గరుడనది - శేషపుష్కరిణి - చంద్రవిమానము - తూర్పుముఖము - నిలచున్నసేవ - చంద్రునకు, గరుత్మంతునుకు ప్రత్యక్షము. తిరుమంగై ఆళ్వార్ కీర్తించినది.

విశేః శ్రీమత్ వేదాంత దేశికులు తపమాచరించిన ప్రదేశము. ఇచటనేవారు గరుడోపాసన చేసి వారి వలన హయగ్రీవులయనుగ్రహము పొందుటకై హయగ్రీవ మంత్రమును పొందిరి. ఇచటగల కొండపై వారు ఆరాధించిన హయగ్రీవుల సన్నిధి కలదు. ఈ కొండకు ఔషధాద్రి యనిపేరు. ఈక్షేత్రమున శ్రీమద్వేదాంతదేశికులు నలుబది సంవత్సరములు వేంచేసియుండిరి. వారి తిరుమాళిగ (ఇల్లు) వారు స్వయముగా స్వహస్తములతో నిర్మించిన కిణర్ (నుయ్యి) ఇప్పటికిని గలవు.

ఈక్షేత్రస్వామి విషయమై శ్రీవేదాంత దేశికులు దేవనాయక పంచాశత్, అచ్యుతశతకం (ప్రాకృతభాష) గరుడదండకం, గరుడపంచాశత్, హయగ్రీవ స్తోత్రములను అనుగ్రహించిరి. ఇచట శ్రీమణవాళమహామునులకును సన్నిధి గలదు. మేషము - పౌర్ణమి తీర్థోత్సవము - కన్యాశ్రవణం వేదాంతదేశికుల తిరునక్షత్ర మహోత్సవం చాలా వైభవముగా జరుగును.

**మార్గం:** మద్రాస్ - తిరుచ్చిరైలు మార్గంలో తిరుప్పాప్పులియూర్ స్టేషన్ నుండి 5 కి.మీ. టౌన్ బస్ కలదు. మద్రాస్ నుండి మిగతా పట్టణముల నుండి "కడలూరు" బస్ గలదు. అక్కడ నుండి టౌన్ బస్ 5 కి.మీ.

పా॥ మిన్ను మాళియఙ్గైయవన్; శెయ్యవళుఱైతరు తిరుమార్వన్;
పన్ను నాన్మఱైప్పల్ పొరుళాగియ; పరనిడమ్ వరైచ్చారల్ ;
పిన్ను మాదవి ప్పన్దలిల్; పెడైవర ప్పిణియవిழ కమలత్తు;
తెన్న వెణ్ణు వణ్డిన్నిశై ముఱల్తరు; తిరువయిన్దిరపురమే.

తిరుమంగై ఆళ్వార్లు - పెరియ తిరుమొழి 3-1-2.

# ❋ 73. తిరుక్కోవలూర్ 2 ❋

## (గోపాలనగరమ్)

**శ్లో॥ శ్రీమత్కృష్ణ సరోవరేణ కలితే శ్రీ కోవలూర్ పట్టణే**
**భాతి శ్రీకర దేవయాన వసతిః పూంకోవలాఖ్యాం రమామ్ ।**
**ప్రాగాస్య స్థితి రాయనారితి విభుః ప్రాప్తోమృకండోర్మునేః**
**ప్రత్యక్షశ్చ బలేః సరః కలిరిపు శ్రీభూతయోగి స్తుతః ।**

**వివ:** ఆయనార్ (త్రివిక్రముడు) పూంగోవల్ నాచ్చియార్ - కృష్ణ పుష్కరిణి శ్రీకర విమానము - తూర్పుముఖము - నిలచున్నసేవ - మృకండుమహర్షికి, బలిచక్రవర్తికిని ప్రత్యక్షము. పొయిగై ఆళ్వార్ - పూదత్తాళ్వార్ - తిరుమంగై ఆళ్వార్ కీర్తించినది.

**విశే:** పంచకృష్ణారణ్య క్షేత్రములలో నొకటి. శ్రీకృష్ణుని నిత్యసాన్నిధ్యము కలక్షేత్రము. ముదలాళ్వార్లని ప్రఖ్యాతులైన పొయిగై ఆళ్వార్, పూదత్తాళ్వార్, పేయాళ్వార్ అను ముగ్గురు ఒకరి వెనుక ఒకరుగా ఈ దివ్యదేశమునకు వేంచేసి ఒక అరుగుపై నిలచుని యుండగా వీరి సంశ్లేషమును గోరిన పెరుమాళ్ళు వీరిమధ్యకు వచ్చి నిలచుండిరి. తమ మధ్య మరియెవరో నుండిరని భావించిన ఆళ్వార్లకు పెరుమాళ్ళు సేవ సాయింపగా ఆళ్వార్లు వరుసగా ముదల్ తిరువందాది, ఇరండాం తిరువందాది మూన్డాం తిరువందాదులు అనుగ్రహించిన స్థలము. ముదలాళ్వార్లు ముప్పురు ఇటనే తిరునాడలంకరించిరి. ఇచట మూలవర్ త్రివిక్రమన్ కుడిపాదము పైకి ఎడమ పాదము క్రిందకు గలదు. మరియు కుడిచేత శంఖము ఎడమచేత చక్రము ధరించియుందురు. మీనం - ఉత్తారా నక్షత్రం తీర్థోత్సవం - వృశ్చిక మాసము కైశికి ఏకాదశి నాడు గొప్ప ఉత్సవం జరుగును. మరునాడు ద్వాదశి రోజున ఎంబెరుమానార్ జీయర్‌కు

బ్రహ్మరథోత్సవం జరుగును. ఈక్షేత్రస్వామి విషయమై వేదాంత దేశికులు **దేహలీశ స్తుతి** యను స్తోత్రమును అనుగ్రహించిరి.

**మార్గం:** పుదుచ్చేరి - బెంగుళూర్, చిత్తూర్ - తిరుచ్చి (వయా) వేలూరు బస్ మార్గము. విల్లుపురం - కాట్పాడి రైలుమార్గం తిరుక్కోవలూర్ స్టేషన్. కడలూర్ నుండి బస్ వసతి గలదు. అన్ని వసతులు గలవు.

పా॥ తూవడివిల్ పార్ మగళ్ పూమజ్గైయోడు
　　　శుడరాళి శజ్గిరుపాల్ పొలిన్దు తోన్ఱ,
　క్కావడివిల్ కఱ్పగమే పోలనిన్ఱు
　　　కలన్దవర్ గట్కరుళ్ పురియుమ్ కరుత్తినానై ;
　చ్చేవడిక్కై త్తిరువాయ్ కణ్ శివన్దవాడై
　　　శెమ్బొన్ శెయ్ తిరువురువ మానాన్ఱన్నై
　త్తీవడివిల్ శివనయనే పోల్వార్ మన్ను
　　　తిరుక్కోవలూర దనుళ్ కణ్డేన్ నానే.
　　　　　　తిరుమంగై ఆళ్వార్లు - పెరియ తిరుమొళి 2-10-9.

తొండమండల తిరుపతులు

శ్లో॥ తుండీర మండలస్థావై దివ్య దేశాః శ్రియః పతేః
　వర్ణ్యంతే యతిరాజాంఘ్రి పంకజాశ్రయ వైభవాత్ ॥

**వివ:** యతిరాజుల వారి శ్రీపాద పద్మములను ఆశ్రయించిన వైభవము వలన తొండ మండలమున గల దివ్యదేశములను వర్ణింతును.

**మంచిమాట**

**విరోధులు**

**భగవద్గుణానుభవమునకు విరోధి శబ్దాది విషయములందుగల ప్రీతి.**

**భగవత్కైంకర్యమునకు విరోధి ఇదినాదియను మమకారము.**

**సాధన విరోధి అజ్ఞానవశమున తానుకర్తను అని భావించుట .**

**ఈమూడు విరోధములకు కారణము అహంకారము .**

**కావున అహంకారమును విడచినచో విరోధులు నశింతురు .**

**- శ్రీనంబిళ్లై**



73.ఆయనార్ - తిరుక్కోవలూర్

Ayanar - Tirukkovalur



74.తేవప్పెరుమాళ్ - కాంచీ

Tevapperumal - Kanchi

## ❁ 74. పెరుమాళ్ కోయిల్ (కాంచీపురము) ❁

శ్లో॥ శ్రీకాంచీ నగరేతు హస్తిగిరి రిత్యాఖ్యేహి సత్యవ్రత
క్షేత్రం వేగవతీ సరస్తటగతేఽనంతాబ్జినీ శోభితే ।
యుక్తే శేష, వరాహ, పద్మ, కుశక, బ్రహ్మాఖ్య తీర్థైస్సదా
సంప్రాప్యాద్భుత పుణ్యకోటి నిలయం పత్నీం పెరుందేవికామ్ ॥
భాతి శ్రీ వరదో విభుర్వరుణ దిక్ వక్త్రాబ్జ సంస్థానగః
శ్రీమన్నారద శేషరాట్ భృగుముని శ్రీ నాగరాజేక్షితః ।

వివః వరదరాజస్వామి - (తేవప్పెరుమాళ్) పెరుందేవి త్తాయార్ - హస్తిగిరి - సత్యవ్రత క్షేత్రము - వేగవతీ నది - అనంత పుష్కరిణి - శేష, వరాహ, పద్మ, కుశక, బ్రహ్మ తీర్థములు - పుణ్యకోటి విమానము - పశ్చిమ ముఖము - నిలుచున్న సేవ - బ్రహ్మకు నారదునకు, ఆదిశేష, భృగు, గజేంద్రులకు ప్రత్యక్షము.

శ్లో॥ దేశే రాజతి తత్ర సుందర హరిస్వామీ హరిద్రా పతి
స్త్వాసీనశ్శుక నామధేయ మతులం వైమన మైంద్రీ ముఖః
ప్రత్యక్షస్తు బృహస్పతేః కలిజిత శ్రీభూత నామ్నో మునేః
స్తోత్రాఖ్యా భరణాభి భూషిత వపు ర్భక్తేష్ట సంపూరకః ॥

వివః అచటనే హస్తిగిరిపై అ ళగియసింగర్ వేంచేసియున్నారు. హరిద్రాదేవి త్తాయార్; శుక(గుహ) విమానము - తూర్పుముఖము, కూర్చున్నసేవ; బృహస్పతికి ప్రత్యక్షము; పూదత్తాళ్వార్ తిరుమంగై ఆళ్వార్ కీర్తించినది.

విశేః శ్లో॥ అయోధ్యా మధురా మాయా కాశీ కాంచీ హ్యవంతికా
పురీ ద్వారవతీ చైవ సప్తైతే మోక్ష దాయికాః ॥ అని

భారతదేశమున ముక్తిప్రద క్షేత్రములుగా కీర్తింపబడిన వానిలో కాంచీపురమొకటి. మిగిలినవి. 1. అయోధ్య 2. మధుర 3. మాయా (హరిద్వార్) 4. కాశీ. 5. అవంతికా (ఉజ్జయినీ) 6.ద్వారవతి (ద్వారక)

శ్రీవైష్ణవులకు అత్యంతము సేవింపదగిన కోయిల్ ( శ్రీరంగం) తిరుమలై పెరుమాళ్ కోయిల్ (కాంచి) తిరునారాయణపురం (మేల్కోటై) అను నాలుగు దివ్యక్షేత్రములలో కాంచీపురము మూడవది.

ఈ క్షేత్రము కృతయుగమున చతుర్ముఖ బ్రహ్మచేతను, త్రేతాయుగమున గజేంద్రుని చేతను, ద్వాపరయుగమున బృహస్పతి చేతను, కలియుగమున ఆదిశేషుని చేతను ఆరాధింపబడినది.

ఆళ్వార్లు ఈ క్షేత్రమును "**అత్తియూర్**" అని సంబోధించినారు. "ఉలకేత్తుమ్

ఆఖ్రియాన్ అత్తియూరాన్ "వరమ్ తరుమ్ మామణివణ్ణన్" (లోకమందలి జనులచే కీర్తింపబడువాడును చక్రహస్తుడును వరప్రదుడును కాంచీ పురవాసుడగు నీలవర్ణుడు) అని ఆళ్వారులచే కీర్తింపబడిన వరదరాజస్వామి

**శ్లో॥ వేగవత్యుత్తరే తీరే పుణ్యకోట్యాం హరి స్స్వయమ్ ।**
**వరద స్సర్వభూతానా మద్యాపి పరిదృశ్యతే ॥**

(వేగవతీ నదీ తీర ఉత్తర భాగమున పుణ్యకోటి విమాన మధ్యమున సర్వప్రాణులకు వరప్రదుడైన శ్రీహరి స్వయముగా వేంచేసియున్నాడు) అనునట్లు వేంచేసియున్నాడు.

**శ్లో॥ వపా పరిమళోల్లాస వాసితాధర పల్లవమ్ ।**
**ముఖం వరదరాజస్య ముగ్ధస్మిత ముపాస్మహే ।** అని మన పెద్దలు త్రికాలములందు ఈ స్వామిని కీర్తించుచున్నారు.

భగవద్రామానుజులు తమ బాల్యమునంతయు కాంచీపురమందే గడిపిరి. అంతియేకాక ఇచట వేంచేసియున్న వరదరాజస్వామికి నిత్యము తీర్థకైంకర్యమును నిర్వహించిరి. ఈ వరదరాజస్వామియే భగవద్రామానుజులను దర్శన ప్రవర్తకులగునట్లు అనుగ్రహించిరి.

శ్రీరంగనాథులకు తిరుప్పాణి ఆళ్వార్లు, తిరుమలై శ్రీనివాసునకు కురుంబరుత్తనంబిగార్లవలె వరదరాజస్వామికి తిరుక్కచ్చినంబిగారు ఆంతరంగిక కైంకర్యపరులు. వీరు చామర కైంకర్యమును నిర్వహించెడివారు.

భగవద్రామానుజుల వారి కోరికపై వీరు వరదరాజస్వామిని ప్రార్థించి వారి వలన తాము వినిన ఆరు వార్తలను ఎంబెరుమానార్లకు తెలియజేసిరి. వీనినే షడ్వార్తలందురు. అవి.

1. నేనే (శ్రీమన్నారాయణుడే) పరతత్త్వము 2. జీవేశ్వరభేదమే దర్శనము 3. ప్రపత్తియే ఉపాయము (భగవంతుని పొందుటకు సాధనము) 4. అంతిమస్మృతి అవసరములేదు. 5. శరీరావసానమందే మోక్షము 6. పెరియనంబిగారిని (మహాపూర్ణులను) ఆశ్రయింపుడు.

ఆచార్యులందరు అభిమానించిన క్షేత్రము కాంచీపురము. ఆళవందారులు (శ్రీయామునమునులు) ఈక్షేత్రమునకు వేంచేసి భగవద్రామానుజులను **"ఆముదల్వన్ ఇవన్"** అని కటాక్షించిరి. ఈప్రదేశమునకు **యమునైత్తుఱైవర్ తిరుముత్తమ్** అనిపేరు. ఆళవందారులు వేంచేసిన ప్రదేశమునకు **కరుమాణిక్కృత్త సోపానము** అనిపేరు.

ఆళవందారుల ఆదేశానుసారము "తిరువరంగ ప్పెరుమాళ్ అరయర్" అను వారు తిరుక్కచ్చినంబిగారి పురుషకారముతో వరదరాజస్వామిని ప్రార్థించి భగవద్రామానుజులను శ్రీరంగమునకు తోడ్కొని పోయిరి. ఈవిధముగా తమకు

కైంకర్యము చేయుచున్న భగవద్రామానుజులను త్యాగము చేయుటచే ఈక్షేత్రమునకు **త్యాగమండపమని** పేరు. ఈ సంఘటన జరిగిన ప్రదేశమునకు **"కచ్చిక్కువాయ్త్తాన్ మండపం"** అనిపేరు.

ఇచట వేంచేసియున్న తాయార్లకు పెరుందేవిత్తాయార్ అని పేరు. వీరిని గూర్చి మన పెద్దలు ప్రతినిత్యము

**"ఆకారత్రయ సంపన్నా మరవింద నివాసినీమ్ ।**
**అశేష జగదీశిత్రీం వందే వరద వల్లభామ్ ॥**

(అనన్యార్హ శేషత్వ, అనన్య శరణత్వ, అనన్య భోగ్యత్వములనే ఆకారత్రయ సంపన్నురాలై, పద్మవాసినియై, సమస్త లోకములకు స్వామినియైన వరదరాజస్వామి దేవేరియగు పెరుందేవి తాయార్లను సేవించు చున్నాను.) అని అనుసంధానము చేతురు.

ఇచట జరుగు బ్రహ్మోత్సవ వైభవము వర్ణనాతీతము. అందు మూడవనాడు ఉషఃకాలమున (వేకువన) జరుగు గరుడసేవ సేవింపవలసినదేకాని చెప్పనలవికాదు. లోకములో కంచి గరుడసేవ యని ప్రసిద్ధి. ప్రసిద్ధ వాగ్గేయకారుడు శ్రీ త్యాగరాజస్వామి "వినతాసుత వాహనుడై వెడలె కాంచీవరదుడు" అని కంచి గరుడ సేవను కీర్తనగా రచించి ధన్యుడైనాడు. ఈగరుడసేవను సేవించుటకు దేశము నలుమూలల నుండి భక్తులు తండోప తండములుగా విచ్చేతురు. ఈ గరుడసేవను గూర్చిన శ్లోకము.

శ్లో॥ **కేచిత్ తత్త్వ విశోధనే పశుపతౌ పారమ్యమాహుః పరే**
**వ్యాజహ్రుః కమలాసనే నయవిదా మన్యే హరిం సాదరమ్ ।**
**ఇత్యేవం చలచేతసాం కరధృతం పాదారవిందం హరేః**
**తత్త్వం దర్శయతీవ సంప్రతినృణాం తార్క్ష్య శ్రుతీనాం నిధిః ।**

మణవాళమామునుల సన్నిధి సేవాక్రమము.

శ్లో॥ **శ్రీమద్వారవరం మహద్ధి బలిపీఠాగ్ర్యం ఫణీన్ద్ర హ్రదం**
**గోపీనాం రమణం వరాహ వపుషం శ్రీభట్ట నాథం తథా**
**శ్రీమన్తం శఠవైరిణం కలిరిపుం శ్రీ భక్తి సారం మునిం**
**పూర్ణం లక్ష్మణ యోగినం మునివరా నాద్యానథ ద్వారపౌ ।**
**శ్రీమన్మజ్జన మణ్డపం సరసిజాం హేతీశభోగీశ్వరౌ**
**రామం నీలమణిం మహానసవరం తార్క్ష్యం నృసింహం ప్రభుమ్ ।**
**సేనాన్యం కరిభూధరం తదుపరి శ్రీ పుణ్య కోటిం తథా**
**తన్మధ్యే వరదం రమాసహచరం వన్దే తదీయైర్వృతమ్॥**

శోభాయుక్తమైన పెద్ద గోపురద్వారమును; బలిపీఠమునకు ముందున్న

తిరువనంత పుష్కరిణిని; గోపికారమణుడైన శ్రీకృష్ణుని సన్నిధిని, వరాహపెరుమాళ్లను, పెరియాళ్వార్లను, నమ్మాళ్వార్లను, తిరుమజ్జై యాళ్వార్లను, తిరుమళిశై ఆళ్వార్లను, పెరియనంబి (మహాపూర్ణులు) గారి సన్నిధిని, ఉడయవరులను, ముదలాళ్వార్లను, తిరువనన్దాళ్వార్లను శ్రీరామచంద్రులను, కరుమాణిక్కవరదులను, తిరుమడపళ్ళిని, గరుడాళ్వార్లను, నృసింహస్వామిని; సేనముదలియాళ్వార్లను, హస్తిగిరిని, దానిపై పుణ్యకోటి విమానమును, ఆవిమాన మధ్యమున శ్రీదేవి భూదేవులతో కలసి వేంచేసియున్న శ్రియః పతియగు వరదాజస్వామిని సేవించుచున్నాను.)

**శ్లో॥ కమల నివేశితాంఘ్రి కమలం కమలారమణం**
**ఘనమణి భూషణద్యుతి కడారిత గాత్రరుచిమ్ ।**
**అభయగదా సుదర్శన సరోరుహచారుకరం**
**కరిగిరి శేఖరం కమపి చేతసి మేనిదధే" ॥**

ఆసనముగానున్న కమలము నందు శ్రీపాదములుంచినవాడును, శ్రియఃపతియు, గొప్పవైన మణిభూషణముల చేత ప్రకాశించిన తిరుమేని గలవాడును. అభయ హస్తము, గదా, సుదర్శనము ధరించినవాడును, హస్తిగిరి శిరోభూషణమునైన వరదరాజస్వామిని మనస్సునందు ధ్యానించుచున్నాను.

ఈక్షేత్రస్వామి విషయమైన కొన్నిస్తోత్రములు
శ్రీదేవరాజాష్టకము - తిరుక్కచ్చినంబి
శ్రీవరదరాజస్తవమ్ - కూరత్తాళ్వాన్
శ్రీవరదరాజ పంచాశత్ - శ్రీమద్వేదాంతదేశికర్
శ్రీహస్తిగిరి మాహాత్మ్యమ్ - శ్రీమద్వేదాంత దేశికర్
శ్రీదేవరాజ మంగళాశాసనము - శ్రీమన్మణవాళమామునులు. వరదాభ్యుదయమ్, హస్తిగిరిచంపువు - శ్రీవేంకటాధ్వరి; వరదరాజస్తవమ్ - అప్పయ్య దీక్షితులు.

**శ్రీకాంచీనగరమున వేంచేసియున్న పెరుమాళ్ల విషయమైన స్తోత్రము**

**దీపప్రకాశ నరకేసరి విద్రుమాభ వైకుంఠవామన యథోక్తకరాష్టబాహూన్ ।**
**అన్యాన్ సుధాభ ఫణి పాణ్డవదూత హేమ వర్ణాదిమాన్ వరగురుః క్రమశస్స్సిషేవే॥**

తిరుత్తణ్‌గా దీప ప్రకాశర్, వేళుక్కై నృసింహస్వామి, పవళవణ్ణమ్ పవళవణ్ణస్వామి, వైకుంఠనాథ పెరుమాళ్, తిరువెఃకా యథోక్తకారి; అష్టభుజం ఆదికేశవన్, నిలాత్తిజ్గళ్ తుండత్తాన్, ఊరగమ్ ఉలగళన్ద పెరుమాళ్, పాడగమ్ పాండవ దూతర్, పచ్చవణ్ణర్ మొదలగు సన్నిధులను వరవరమునులు క్రమముగా సేవించిరి.

**మార్గము:** మద్రాసు నుండి, తిరుపతినుండి బస్ రైలు వసతి కలదు. ప్రసిద్ధ నగరము. సకల సౌకర్యములు కలవు.



75.ఆదికేశవన్ - అష్టభుజం (కాంచి)
Adikesavan - Astabhujam (Kanchi)



76.దీపప్రకాశర్ - తిరుత్తంగా (కాంచీ)
Deepaprakasar - Tiruttanga (Kanchi)



78.పాండవదూత - పాడగమ్ (కాంచీ)

**Pandavaduta - Padagam (Kanchi)**



77.అళగసింగర్ - వేళుక్కై (కాంచీ)

Alagasingar - Velukkai (Kanchi)

పా॥ **అత్తియూ రాన్** పుళ్ళియూరాన్; అణిమణియిన్
తుత్తిశేర్ నాగత్తిన్‌మేల్ తుయిల్వాన్; ముత్తి
మత్తైయావాన్ మాకడల్ నబ్బణ్ణాన్తనక్కుమ్
ఇత్తైయావా నెఙ్గళ్ పిరాన్
పూదత్తాళ్వార్ - ఇరణ్డాన్దిరువన్దాది 96

పా॥ శిఱన్దవెన్ శిన్దైయుమ్ శెఙ్గణరవుమ్
నిఱైన్దశీర్ నీళ్‌కచ్చియుళ్ళుమ్ - ఉఱైన్దదువుమ్
వేఙ్గడముమ్ వెఃకావుమ్ వేళుక్కైప్పాడియుమే,
తామ్‌కడవార్ తణ్డుళాయార్.
పేయాళ్వార్ - మూన్ఱాం తిరువన్దాది 26

# ❋ 75. అష్ట భుజమ్ (కాంచీ)2 ❋

శ్లో॥ తత్రైవాష్ట భుజక్షేత్ర గజేంద్ర సరసీయుతే
గగనాకృతి వైమానే పశ్చాత్వక్త్ర స్థితి ప్రియః ।
**అలర్‌మేల్ మంగై నాయక్యా త్వాదికేశవ నాయకః ।**
**మహాముని కలిఘ్నాభ్యాం కీర్త్యః కరివరార్చితః ।**

**వివ:** ఆదికేశవ పెరుమాళ్ - అలర్‌మేల్ మంగై త్తాయార్ - గజేంద్ర పుష్కరిణి - గగనాకృతి విమానము - పశ్చిమ ముఖము - నిలుచున్న సేవ - గజేంద్రునకు ప్రత్యక్షము - పేయాళ్వార్ - తిరుమంగై ఆళ్వార్ కీర్తించినది.

**విశే:** విష్ణుకంచిలో గల క్షేత్రము. వరదరాజస్వామి సన్నిధికి 1/2 కి.మీ దూరములో గలదు. ఈ క్షేత్రస్వామి విషయమై శ్రీ వేదాంత దేశికులు అష్ట భుజాష్టకమును అనుగ్రహించిరి.

పా॥ తిరిపుర మూన్ఱెరిత్తానుమ్ మఱ్ఱై; మలర్‌మిశై మేలయనుమ్ వియప్ప;
మురితిరై మాకడల్ పోల్ ముఴఙ్గి; మూవులకుమ్ ముఱైయాల్ వణఙ్గ;
ఎరియెన కేశరి వాళె యిఱ్ఱ తోడిరణియనాకమిరణ్డు కూరా
అరియురువా మివరార్ కొలెన్న; **వట్టపుయకరత్తే నెన్ఱారే.**
శమ్ముమ్బనిలఙ్గ ఫలఙ్జ వాళి; తిణ్ శిలై తణ్డొడు శఙ్గమొళ్ వాళ్
ఉమ్బ రిరుశుడ రాళియోడు; కేడక మొణ్ మలర్ పత్తి యెత్తే,
వెమ్బి శినత్తడల్ వేళమ్ వీఴ; వెణ్ మరుప్పొన్ఱు పఱిత్తు, ఇరుణ్డ
అమ్బుదమ్పోన్ఱి వరార్ కొలెన్న ; **వట్టపుయకరత్తే నెన్ఱారే.**
తిరుమంగై ఆళ్వార్లు - పెరియ తిరుమొళి 2-8-1,3.

## ❋ 76. తిరుత్తణ్గా (కాంచీ)3 ❋

శ్లో॥ శ్రీతణ్కా నగరే విళాక్కొళి విభు స్తీర్థం తు సారస్వతం
ప్రాప్త శ్రీకర దేవయాన నిలయః పశ్చాన్ముఖాబ్జ స్థితిః ।
దేవీం మారతకోప పూర్వలతికాం ఆలింగ్య వేధః ప్రియాం
ప్రత్యక్షః కలిజిన్మతో విజయతే దీప ప్రకాశాభిదః ।

**వివః** దీపప్రకాశర్ - మరకతవల్లి త్తాయార్ - సరస్వతీ తీర్థమ్ - శ్రీకర విమానం - పశ్చిమ ముఖము - నిలచున్న సేవ - సరస్వతీదేవికి ప్రత్యక్షము - తిరుమంగై ఆళ్వార్ కీర్తించినది.

**విశే:** శ్రీమద్వేదాంతదేశికులు అవతరించిన స్థలము. వారి అవతారకాల తిరుమేని ఇచట గలదు. దేశికర్ తిరువారాధన శ్రీ లక్ష్మీ హయగ్రీవులు ఇచటనే వేంచేసియున్నారు. ఈ స్వామివిషయమై నిగమాంత మహాదేశికులు **దేహలీశస్తుతి – శరణాగత దీపికా** – అనుగ్రహించిరి.

**మార్గము:** కాంచీపురం అష్టభుజం సన్నిధికి 1/2 కి.మీ. దూరంలోనున్నది.

పా॥ ముళైక్కదిరై క్కుఱుఙ్గుడియుళ్ ముగిలై మూవా; మూవులగమ్ కడన్దప్పాల్ ముదలాయ్ నిన్ఱ;
అళప్పరియ వారముదై యరఙ్గ మేయ; వన్దణనై యన్దణర్ దమ్ శిన్దై యానై ;
విళక్కొళియై మరదగత్తై **త్తిరుత్తణ్ కావిల్;** వెఃకావిల్ తిరుమాలై ప్పాడక్కేట్టు;
వళర్త్తదనాల్ పయన్ పెత్తేన్ వరుగ వెన్ఱు; మడక్కిళియై క్కైకూప్పి వణఙ్గి నాళే.
తిరుమంగై ఆళ్వార్లు - తిరునెడున్దాణ్డగమ్ 14.

## ❋ 77. తిరువేళుక్కై (కాంచీ) 4 ❋

శ్లో॥ శ్రీవేళుక్కా పురే సరః కనక మిత్యాప్తే ముకుంద ప్రభుః
శ్రీవేళుక్కా లతా పతిర్విజయతే ప్రాగాస్య సంస్థానగః ।
ప్రత్యక్షో భృగునామ తాపసపతే స్తుత్యః కలిద్వేషిణః
శ్రీమన్నందక యోగినశ్చ భువనే భక్తార్తి నిస్తారకః (హేమాఖ్య విమానగః)

**వివః** ముకుంద నాయకన్ - వేళుక్కైవల్లి తాయార్ - కనక సరస్సు - హేమ విమానం - నిలచున్న సేవ - తూర్పుముఖము - భృగుమహర్షికి ప్రత్యక్షము. పెరియాళ్వార్ - తిరుమంగై ఆళ్వార్లు కీర్తించినది. శ్రీమద్వేదాంత దేశికుల మంగళా శాసనం **కామాసికాష్టకము** గలదు.

మార్గము: అష్టభుజ స్వామి సన్నిధికి 1 కి.మీ. నైఋతి దిశగా కలదు.

పా॥ అన్తివ్వ్యాలక మళన్ద వ్వళె వేకాల్
నిన్తిరు న్దు వేళుక్కై నీణకర్ వాయ్ – అన్దు
కిడన్దానై క్కేడిల్ శీరానై, మున్నిజ్ఞై
క్కిడన్దానై నెజ్జమే కాణ్

పేయాళ్వార్లు – మూన్డ్రాన్దిరువన్దాది 34



## 78. తిరుప్పాడగమ్ (కాంచీ) 5



శ్లో॥ శ్రీమత్పాడగ నామ్ని పట్టణ వరే మత్స్యాఖ్య తీర్థాంచితే
భద్రాఖ్యాన విమాన మధ్య నిలయ శ్శ్రీ రుక్మిణీనాయకః ।
శ్రీమత్పాండవ దూతనామక విభు స్సత్యాపతి ప్రాఙ్ముఖ
స్త్వా సీనో హరితాఖ్య తాపస వర ప్రత్యక్షతా మాప్తవాన్ ।
శ్రీ భూత మహదాఖ్యాన భక్తిసారైః కలిద్విషా ।
స్తోత్ర పాత్రీకృతో భాతి భక్తరక్షణ దీక్షితః ।

వివః పాండవదూత – రుక్మిణీదేవి – సత్యభామ – మత్స్య తీర్థము – భద్ర విమానము – తూర్పుముఖము – కూర్చున్నసేవ – హారీత మహర్షికి ప్రత్యక్షము – పూదత్తాళ్వార్ – పేయాళ్వార్ – తిరుమళిశై ఆళ్వార్ – తిరుమంగై ఆళ్వార్ కీర్తించినది.

విశే: ఈ సన్నిధిలో "అరుళాళప్పెరుమాళ్ ఎంబెరుమానార్" అర్చావతారముగా వేంచేసి యున్నారు. ఈ దివ్యదేశము ఏకామ్రేశ్వరుని కోవెలకు పశ్చిమముగా సమీపములోనే కలదు.

మార్గం: గంగై కొండ మండపమునకు సమీపమున కలదు.

పా॥ కల్లార్ మదిళ్ శూళ్ ; కచ్చినగరుళ్ నచ్చి; పాడగత్తుళ్
ఎల్లాపులగుమ్ వణజ్గ; విరున్ద వమ్మాన్ ; ఇలజ్గైకోన్
వల్లాళాగమ్ విల్లాల్; మునిన్ద వెన్దై, విబీడణఱ్కు
నల్లానుడై య నామమ్ శొల్లిల్; నమోనారాయణమే.

తిరుమంగై ఆళ్వార్లు – పెరియ తిరుమొళి 6-10-4.

**మంచిమాట**

**శ్రీరామానుజుల వారి శ్రీపాదములు తప్పవేరు రక్షకము లేదు.**
**యెంబెరుమానార్ తిరువడిగళే శరణమ్**
**"ఎంబార్"**



# 79. తిరునీరగమ్ (కాంచీ) 6



శ్లో॥ అక్రూర తీర్థ రుచిచే నీరకాఖ్యాన పట్టణే ।
నిలమంగై లతానాథో జగదీశ విభుస్థితః ॥
జగదీశ్వర వైమానే ప్రాఙ్ముఖో క్రూర గోచరః ।
పరకాల మునీంద్రేణ సన్నుతో భువి రాజతే ॥

వివ: జగదీశ్వర పెరుమాళ్ - నిలమంగై వల్లి త్తాయార్ - అక్రూర తీర్థము - జగదీశ్వర విమానము - తూర్పుముఖము - నిలచున్నసేవ - అక్రూరనకు ప్రత్యక్షము - తిరుమంగై యాళ్వార్ కీర్తించినది.

విశే: మూలవర్ - పుష్కరిణి - సన్నిధి ఎక్కడ మున్నవో తెలియవు. ఉత్సవర్ మాత్రము ఉలగళన్ద పెరుమాళ్ సన్నిధి ఉత్తర ప్రాకారములో చిన్న సన్నిధిలోగలరు.

పా॥ నీరగత్తాయ్ నెడువరై యి నుచ్చి మేలాయ్
నిలాత్తిజ్గళ్ తుణ్డత్తాయ్ నిఱైన్దకచ్చి
ఊరగత్తాయ్, ఓణ్ తుఱై నీర్ వెఃకావుళ్ళాయ్
ఉళ్ళువారుళ్ళత్తాయ్; ఉలగ మేత్తుమ్
కారగత్తాయ్ కార్వానత్తుళ్ళాయ్ కళ్వా
కామరుపూజ్కావిరియిన్ తెన్పాల్ మన్ను
పేరగత్తాయ్, పేరాదెన్నెఞ్జి నుళ్ళాయ్
పెరుమానున్ తిరువడియే పేణినేనే
తిరుమంగై ఆళ్వార్లు - తిరునెడున్దాణ్డగమ్ 8

**మంచిమాట**

**ప్రతిబంధకములు**

**భగవంతుని ఆశ్రయించుటకు ప్రతిబంధకము శరీరము.**

**ఆచార్యుని ఆశ్రయించుటకు ప్రతిబంధకము పుత్రమిత్రాదులు.**

**భాగవతులనాశ్రయించుటకు ప్రతిబంధకము ధనాపేక్ష.**

**కైంకర్య విషయప్రీతికి ప్రతిబంధకము శబ్దాది విషయములందు ప్రీతి.**

**కావున ముముక్షువు ఈప్రతిబంధకములను తొలగించుకొనుటకు ప్రయత్నింపవలెను.**



## 80. నిలాత్తింగళ్ తుండత్తాన్ (కాంచీ) 7



శ్లో॥ నిలాత్తింగళ్ తుండనామ నగరే రుచిరాకృతౌ
నిలాత్తింగళ్ తుండ నాథ శ్చంద్ర పుష్కరిణీయుతే
పురుషసూక్త విమాన మధ్రితో వరుణ దిగ్వదనస్థితి శోభితః
సదృశ శూన్య లతా నయన ప్రియో లసతి రుద్రనుతః కలిజిన్నుతః ॥

వివః నిలాత్తిజ్గళ్ తుండత్తాన్ - వేరొరు వల్లిల్లా తాయార్ - చంద్ర పుష్కరిణి పురుష సూక్త విమానము - పశ్చిమ ముఖము - నిలచున్నసేవ - రుద్రునకు ప్రత్యక్షము - కలియన్ కీర్తించినది.

**మార్గముః** ఇది పెద్ద కంచిలో గల దివ్యదేశము. ఈ సన్నిధి ఏకాంబరేశ్వరుని ఆలయములో గలదు. పుష్కరిణి కానరాదు.

పా॥ నీరగత్తాయ్ నెడువరై యి నుచ్చి మేలాయ్
నిలాత్తిజ్గళ్ తుణ్డత్తాయ్ నిఱైన్దకచ్చి
ఊరగత్తాయ్, ఓణ్ తుఱై నీర్ వెఃకావుళ్ళాయ్
ఉళ్ళువారుళ్ళత్తాయ్; ఉలగ మేత్తుమ్
కారగత్తాయ్ కార్వానత్తుళ్ళాయ్ కళ్వా
కామరుపూఙ్కావిరియిన్ తెన్బాల్ మన్ను
పేరగత్తాయ్, పేరాదెన్నెఞ్జి నుళ్ళాయ్
పెరుమానున్ తిరువడియే పేణినేనే
తిరుమఙ్గై ఆళ్వార్లు - తిరునెడున్దాణ్డగమ్ 8

### మంచిమాట

**దుర్గతి**

**ప్రణవమందలి మధ్యమాక్షరము (ఉ) యొక్క అర్థము (అనన్యార్హ సంబంధము) తెలిసియు ధనవంతులను ఆశ్రయించుచున్నారే! తిరుమంత్రము నందలి మధ్యమపదము (నమః) యొక్క అర్థము (రక్ష్యరక్షక సంబంధము) తెలిసియు తమరక్షణకై తాము ప్రయత్నించుచున్నారే! తిరుమంత్రమునందలి తృతీయ పదము (నారాయణాయ) అర్థము (భోక్తృభోగ్యసంబంధము) తెలిసియు తామే భోక్తలమని భావించుచున్నారే ! ఏమి! ఈ సంసారుల దుర్గతి.**

**- తిరుక్కురుగైప్పిరాన్ పిళ్లాన్.**



# 81. ఊరగమ్ (కాంచీ) 5



శ్లో॥ తిరువూరగాఖ్య నగరే త్రివిక్రమో వరనాగ తీర్థ రుచిరే స్థితి ప్రియః
అమృతాభిధాన లతికా సమన్వితో । జలనాథ దిఙ్ముఖయుతో విరాజతే॥
సారశ్రీకర వైమానం నాగేశాక్ష్యతిధి శ్రితః ।
భక్తిసార కలిద్వేషి స్తుతి భూషణ భూషితః ॥

**వివః** త్రివిక్రముడు – (ఉలగళన్ద పెరుమాళ్) అమృతవల్లి త్తాయార్ – నాగ తీర్థము – పశ్చిమ ముఖము – నిలుచున్నసేవ – సారశ్రీకర విమానము. ఆదిశేషులకు (ఊరగమ్) ప్రత్యక్షము. తిరుమళిశై ఆళ్వార్, తిరుమంగై ఆళ్వార్ కీర్తించినది.

**మార్గము:** ఈ క్షేత్రము కంచిలో కామాక్షి కోవెలకు సమీపములో నున్నది. ఈ సన్నిధిలోనే నీరగమ్, కారగమ్, – కార్వానం సన్నిదులు కలవు.

పా॥ కల్లెడుత్తుక్కల్ మారికాత్తా యెన్టుమ్
కామారుపూఞ్గచ్చి యూరగత్తాయెన్టుమ్
విలిఱుత్తు మెల్లియల్తోళ్ తోయ్న్దా యెన్టుమ్
వెఃకావిల్ తుయిలమర్న్ద వేన్దే యెన్టుమ్
మల్లడర్తు మాకీణ్డ కైత్తలత్తెన్ మైన్దా వెన్టుమ్
శొల్లడుత్త త్తన్ కిళియై చ్చొల్లే యెన్టు
తుణైములై మేల్ తుళిశోరచ్చోర్ గిన్దాళే.

తిరుమంగై ఆళ్వార్ – తిరునెడున్దాణ్డగమ్ 13

## మంచిమాట

బంగారమును పుటము వేసినచో అందలి మాలిన్యము తొలగి తూకము తరగిపోవును. కానీ ప్రకాశము అధికమగును. అట్లే ఈ ఆత్మ కూడ జ్ఞాన సంకోచమను మాలిన్యము తొలగించుకొన్నచో జ్ఞాన వికాసమనెడి కాంతికలుగును. అపుడీ ఆత్మను భగవంతుడు లక్ష్మీదేవితో సమానముగా భావించి ఆదరించును.

"తిరుకోట్టియూర్ నంబి"



80.నిలాత్తిజ్గళ్ తుండత్తాన్ - కాంచీ
Nilattingal Tundattan    Kanchi



79.జగదీశ్వరన్ - నీరగమ్ (కాంచీ)
Jagadeswaran - Neeragam



81. ఉలగళన్ద పెరుమాళ్ - ఊరగమ్ (కాంచీ)

Ulagalanda Perumāl - Uragam (Kanchi)

#  82. తిరువెఃకా (కాంచీ) 9 

శ్లో॥ శ్రీ వెఃకా నగరే భుజంగశయన శ్రీ పొయిగై పద్మాకరో
ద్దీపే తత్ర యథోక్తకారి భగవాన్ శ్రీ వేదసారాహ్వయే
వైమానే వరకోమలాఖ్యలతికా నాథస్తు పశ్చాన్ముఖః
ప్రత్యక్షః కణికృష్ణ ధాతృసరసాం భాతి శ్రితేష్టార్థదః ॥

సరోజాత మహాయోగి భక్తిసార మహర్షిభిః ।
కీర్తితః కలిజిన్నామ మునినాచాపి సాదరమ్ ॥

**విశే:** యథోక్తకారి - (శొన్నవణ్ణం శెయ్ద పెరుమాళ్) కోమలవల్లి - భుజంగ శయనం - పొయిగై పుష్కరిణి - వేదసార విమానము - పశ్చిమముఖము - కణికృష్ణునకు బ్రహ్మకు ప్రత్యక్షము - పొయిగై ఆళ్వార్, పేయాళ్వార్, తిరుమళిశై ఆళ్వార్, తిరుమంగై ఆళ్వార్ కీర్తించినది.

**విశే:** ఇది పొయిగై ఆళ్వార్ అవతరించిన స్థలము - వారు ఈ దివ్యదేశమున గల పుష్కరిణిలో అవతరించిరి. ఈ రాజ్య పాలకుడు తిరుమ ళిశై ఆళ్వార్ శిష్యులగు కణికృష్ణుడు అనువారిపై కోపించి రాజ్యము నుండి వెడలగొట్టెను. అంత శిష్యునితో తిరుమళిశై ఆళ్వారు ఊరువిడచి పోవుచు "కణికణ్ణన్ పోగిన్డ్రాన్ కామరపూమ్‌కచ్చి, మణివణ్ణా నీకిడక్క వేణ్డా" అని అనగానే స్వామికూడా వారితో బాటు బయలుదేరెనట. రాజు భయపడి కణికృష్ణుని ప్రార్థించి వారిని మరల రాజ్యమున ఉండుమని కోరగా ఆళ్వార్లు తిరిగి" కణికణ్ణన్ పోక్కొళిన్దాన్ కామరపూమ్ కచ్చి మణివణ్ణా నీ కిడక్కవేణ్డుమ్" అని అనగానే స్వామి తిరిగి యథా ప్రకారము వేంచేసిరట. ఈ విధముగా తమభక్తులు చెప్పినది చెప్పినట్లుచేయు స్వామి అగుటచే వీరికి **యథోక్త కారియని** తిరునామము వచ్చినది. ఇచట స్వామి ఎడమచేతిమీద శయనించియుందురు. ఇచట పిళ్లైలోకాచార్యుల వారికి ప్రత్యేకముగా సన్నిధి కలదు. ఈ సన్నిధిలోనే మణవాళ మహామునులు శ్రీభాష్యమును సేవించిరి. ఈ క్షేత్రస్వామి విషయమై శ్రీమద్వేదాంత దేశికులు **వేగాసేతు** స్తోత్రమును అనుగ్రహించిరి.

పంగుని (మీనం) రేవతి తీర్థోత్సవంగా బ్రహ్మోత్సవము జరుగును. కంచి వరదరాజస్వామి సన్నిధికి 1 కి.మీ దూరములో ఈ సన్నిధి గలదు

కూన్దలార్ మగిழ;కోవలనాయ్; వెణ్ణెయ్
మాన్దழన్దై యుల్; క్కణ్ణు మకిழన్దు పోయ్
ప్పాన్దళ్ పొழியిల్; పళ్లి విరుమ్బియ
వేన్దనై చ్చెన్ఱు కాణ్డుమ్; వెఃకావిలే

తిరుమంగై ఆళ్వార్లు - పెరియ తిరుమొழி 10-1-7.

#  83. తిరుక్కారగమ్ (కాంచీ)10 

శ్లో॥ అక్రూరాయ సరోరమ్యే కారకాఖ్యాన పట్టణే ।
పద్మామణి రమానాథః కమలాకర నాయకః ॥
వామనం ప్రాప్య వైమానం దక్షిణాముఖ సంస్థితః ।
కారకర్షి తపోలబ్ధ రాజతే కలిజిన్నుతః ॥

వివః కరుణాకర పెరుమాళ్ - పద్మామణి త్తాయార్ - అక్రాయ పుష్కరి వామన విమానము - దక్షిణముఖము - నిలచున్నసేవ - కారక మహర్షికి ప్రత్యక్షమ తిరుమంగై ఆళ్వార్ కీర్తించినది.

విశేః ఈ సన్నిధి ప్రత్యేకముగాలేదు. ఉలగళన్ద పెరుమాళ్ సన్నిధిలో తాయా సన్నిధికి ఎదురుగా నున్నది.

పా॥ నీరగత్తాయ్ నెడువరై యి నుచ్చి మేలాయ్
నిలాత్తిజ్గళ్ తుణ్డత్తాయ్ నిఱైన్దకచ్చి
ఊరగత్తాయ్, ఓణ్ తుఱైనీర్ వెఃకావుళ్ళాయ్
ఉళ్ళువారుళ్ళత్తాయ్; ఉలగ మేత్తుమ్
కారగత్తాయ్ కార్వానత్తుళ్ళాయ్ కళ్వా
కామరుపూజ్కావిరియిన్ తెన్పాల్ మన్ను
పేరగత్తాయ్, పేరాదెన్నెఞ్జి నుళ్ళాయ్
పెరుమానున్ తిరువడియే పేణినేనే
తిరుమంగై ఆళ్వార్లు - తిరునెడున్దాణ్డగమ్ 8

## మంచిమాట

**"మీకు వలదా!"**

ఒకప్పుడు నంజీయర్ అను ఆచార్యులు అనారోగ్యముచే బాధపడుచుండిరి వారికి ప్రాణాపాయము తప్పదని అందరు భావించుచుండిరి. ఆసమయమున "కుట్టక్కుడి యిళైయాళ్వార్" అనువారు వారి యొద్దకు వెళ్ళి ఈసమయమున ఆత్మక హితమైన ద్వయమంత్రమును అనుసంధానము చేయరాదా! అని పలికిరట. దానిని విని నంజీయర్ "మీరు అనుసంధానము చేసికొనరాదా ! నాకేమికావలెను. ఇంకను ఈలోకములో తిరిగే మీకు అవసరములేనిది మంచములోపడియున్న నాక మాత్రమేనా కావలెను!" అని సమాధానమిచ్చిరట. కావున ఇహలోకయాత్ర చేయువారికిని పరమపదయాత్ర చేయువారికిని హితమైనది ద్వయమంత్రము మాత్రమే.



82.యధోక్తకారి - తిరువెఃకా
Yadhoktakari - Tiruvenkha



83.కరుణాకరన్ - కారగమ్
Karunakaran - Karagam

 

## 84. కార్వానమ్ (కాంచీ)11



శ్లో॥ గౌరీ తటాక రుచిరే కార్వాన పురి పుష్కలే
విమానే కళ్వ రిత్యాఖ్యః శ్రితః కమల వల్లికామ్ ॥
పశ్చిమాభి ముఖస్థాయీ పార్వతీ నయనాతిథిః
చతుష్కవిమునీంద్రస్య స్తుతిపాత్రో విరాజతే ॥

వివః కళ్వర్ - కమలవల్లి - గౌరీపుష్కరిణి - పుష్కల విమానము - పశ్చిమముఖము - నిలుచున్నసేవ - పార్వతీదేవికి ప్రత్యక్షము. తిరుమంగై ఆళ్వార్ కీర్తించినది.

విశేః ఈ సన్నిధి ప్రత్యేకముగాలేదు. ఉలగళన్ద పెరుమాళ్ల సన్నిధిలోనే కలదు.

పా॥ నీరగత్తాయ్ నెడువరైయిన్ ఉచ్చి మేలాయ్
నిలాత్తింగళ్ తుణ్డత్తాయ్ నిఱైన్దకచ్చి
ఊరగత్తాయ్, ఒణ్ తుఱైనీర్ వెఃకావుళ్ళాయ్
ఉళ్ళువారుళ్ళత్తాయ్; ఉలగ మేత్తుమ్
కారగత్తాయ్ కార్వానత్తుళ్ళాయ్ కళ్వా
కామరుపూఙ్కావిరియిన్ తెన్పాల్ మన్ను
పేరగత్తాయ్, పేరాదెన్నెఞ్జి నుళ్ళాయ్
పెరుమానున్ తిరువడియే పేణినేనే

తిరుమంగై ఆళ్వార్లు - తిరునెడున్దాణ్డగమ్ 8

### మంచిమాట

**ఆత్మ - శరీరము**

**శరీరమునకు ఆత్మకు గల భేదములను ఈవిధముగా గ్రహింపవచ్చును.**

| శరీరము | ఆత్మ |
|---|---|
| జడము | జ్ఞానమయము |
| దు:ఖాత్మకము | ఆనందమయము |
| మలయుక్తము | నిర్మలము |
| అనిత్యము | నిత్యము |
| పరిణామ శీలముకలది | పరిణామములేనిది |
| విభువు | అణువు |
| తమోమయము | ప్రకాశమానము |

 

# 85. తిరుక్కళ్వనూర్ (కాంచీ) 12



శ్లో॥ నిత్యపుష్కరిణీ యుక్తే కళ్వనూర్ నగరే స్థితః
విమానే వామనే త్వాదివరాహాంజలి వల్లికామ్
ప్రాప్తః పశ్చిమ దిగ్వక్త్రః కలిజన్మని కీర్తితః
అశ్వత్థోప పదఖ్యాత నారాయణ మునీక్షితః ॥

వివః ఆదివరాహపెరుమాళ్ - అఙ్జలై వల్లి త్తాయార్ - నిత్యపుష్కరిణి వామన విమానము - పశ్చిమముఖము - నిలచున్నసేవ - అశ్వత్థ నారాయణునకు ప్రత్యక్షము. తిరుమంగై ఆళ్వార్ కీర్తించినది.

విశే: ఈ సన్నిధి కంచి కామాక్షి అమ్మన్ కోవెలలో ఉన్నది. తాయార్; తీర్థం లేవు. "కళ్వా" అను సంబోధన తప్ప వేరు పాశురం లేదు.

పా॥ నీరగత్తాయ్ నెడువరై యి నుచ్చి మేలాయ్
నిలాత్తిఙ్గళ్ తుణ్డత్తాయ్ నిఱైన్దకచ్చి
ఊరగత్తాయ్, ఒణ్ తుఱై నీర్ వెఃకావుళ్ళాయ్
ఉళ్ళువారుళ్ళత్తాయ్; ఉలగ మేత్తుమ్
కారగత్తాయ్ కార్వానత్తుళ్ళాయ్ కళ్వా
కామరుపూఙ్కావిరియిన్ తెన్బాల్ మన్ను
పేరగత్తాయ్, పేరాదెన్నెఞ్జి నుళ్ళాయ్
పెరుమానున్ తిరువడియే పేణినేనే
తిరుమంగై ఆళ్వార్లు - తిరునెడున్దాణ్డగమ్ 8

## మంచిమాట

జ్ఞానము నిచ్చువాడు ఆచార్యుడు.
ఆ జ్ఞానమును వృద్ధిపొందించువారు శ్రీవైష్ణవులు.
ఆ జ్ఞానమునకు విషయభూతుడు సర్వేశ్వరుడు.
జ్ఞానమునకు ఫలము భగవత్కైంకర్యము.
దానికి భోగ్యత భాగవత కైంకర్యము.



33. పవళవణ్ణన్ - కాంచీ

Pavalavannar - Kanchi



87.వైకుంఠనాథన్ - పరమేశ్వరవిణ్ణగరమ్

Vaikuntanadhan - Kanchi





89.పత్తరావి పెరుమాళ్ - తిరునిన్నవూర్

Bhaktavastalam - Tiruninnavur



90.విజయరాఘవన్ - తిరుప్పుళ్కుళి

Vijaya Raghavan - TiruppulKozi



91.నీర్ వణ్ణన్ - తిరునీర్మలై

Neer Vannan - Tiruneer Malai



90.వీరరాఘవన్ - తిరువళ్లూర్

Veera Raghavan - Tiruallur

#  86. పవళవణ్ణమ్ (కాంచీ) 13 

శ్లో॥ శ్రీమత్ప్రవళవాణ్ణాఖ్యే పురేచక్ర సరోంచితే
ప్రవాళవర్ణ భగవాన్ ప్రవాళాఖ్య విమానగః।
ప్రవాళవల్లీ నాయక్యా పశ్చిమానన సంస్థితః
ఉమాశ్విదేవతా దృష్టో రాజతే కలిహస్తుతః॥

వివః పవళవణ్ణ పెరుమాళ్ - ప్రవాళవల్లి త్తాయార్ - ప్రవాళ విమానము - చక్రపుష్కరిణి - పశ్చిమముఖము - నిలచున్నసేవ - పార్వతీదేవికి అశ్వనీదేవతలకు ప్రత్యక్షము - తిరుమంగై ఆళ్వార్ కీర్తించినది.

కామాక్షి ఆలయమునకు 1 కి.మీ. దూరములో గలదు. ఈ సన్నిధి ఎదురు వీధిలో **పచ్చవణ్ణర్** సన్నిధి కలదు.

వజ్గత్తాల్ మామణి వన్దున్దు మున్నీర్
మల్లైయాయ్; మదిళ్ కచ్చి యూరాయ్ పేరాయ్,
కొజ్గుత్తార్ వళజ్గొన్రై యలజ్గల్ మార్వన్;
కులవరై యన్ మడప్పావై యిడప్పాల్ కొణ్డాన్;
పజ్గత్తాయ్ పాఱ్కడలాయ్ పారిన్ మేలాయ్;
పనివరై యినుచ్చియాయ్ పవళవణ్ణా !,
ఎజ్గుఱ్ఱా యెమ్బెరుమా నున్నైనాడి,
యేఴైయే నిజ్ఞనమే యుழிతరుగేనే

తిరుమంగై యాళ్వార్ - తిరునెడున్దాణ్డగమ్ - 9.

## మంచిమాట

### శిష్య లక్షణము

**సద్బుద్ధి సాదుసేవీ సముచిత చరిత స్తత్వబోధాభిలాషీ**
**శుశ్రూషు స్త్యక్త మాన: ప్రణిపతనపర: ప్రశ్నకాల ప్రతీక్ష:**
**శాన్తో దాన్తోన సూయు: శరణ ముపగత శ్శాస్త్ర విశ్వాస శాలీ**
**శిష్య: ప్రాప్త: పరీక్షాం కృత విదభిమత: తత్త్వత: శిక్షణీయ: ॥**

**మంచి విషయములందు ఆసక్తిగల బుద్ధి కలిగినవాడు, సాధుసేవాతత్పరుడు, సదనుష్ఠాన సంపన్నుడు, తత్త్వజ్ఞానమును పొందగోరువాడు, ఆచార్యశుశ్రూషాతత్పరుడు, దురభిమానమును విడచినవాడు, దండవత్ ప్రణామపరుడు, ప్రశ్నకాలమును నిరీక్షించువాడు, ఇంద్రియనిగ్రహము, మనోనిగ్రహము కలవాడు, అసూయలేనివాడు, శరణాగతుడు, శాస్త్ర విషయములందు విశ్వాసము కలవాడు, నగు శిష్యుడులభించినచో వానిని స్వీకరించి తత్త్వజ్ఞానమును ఉపదేశింపవలెను.**



# 87. పరమేశ్వర విణ్ణగరమ్ (కాంచీ) 14



శ్లో॥ పరమేశ్వర విణ్ణగర్ పురే రుచిరైరంమద తీర్థ సంయుతే ।
జలనాథ దిశా ముఖాసనో వరవైకుంఠ లతా సమన్వితః ॥
విమానేతు ముకుందాఖ్యే శ్రీవైకుంఠ విభుస్సదా
శ్రీమత్పల్లవ రాజాక్షి గోచరః కలిహస్తుతః ॥

**వివః** వైకుంఠపెరుమాళ్ - వైకుంఠ నాయకి - ఐరంమద తీర్థము - పశ్చిమముఖము - కూర్చున్నసేవ - ముకుంద విమానము - పల్లవరాజునకు ప్రత్యక్షము - తిరుమంగై ఆళ్వార్ కీర్తించినది.

**విశే:** ఈ సన్నిధి విమానము మూడు అంతస్థులుగా నున్నది. క్రింది అంతస్తులో వీత్తిరున్ద తిరుక్కోలములో వైకుంఠ పెరుమాళ్ వేంచేసియున్నారు. మొదటి అంతస్థులో శయన తిరుక్కోలమున రంగనాథులు వేంచేసియున్నారు. రెండవ అంతస్థులో నిన్ఱ తిరుక్కోలములో వేంచేసియున్నారు. గొప్ప శిల్ప కళా సంపదగల అత్యద్భుత క్షేత్రము. కంచి రైల్వే స్టేషన్‌కు 1 కి.మీ. దూరములో నున్నది.

శొల్లువన్ శొఱ్పొరుళ్ తానవై యాయ్
　　చ్చువై యూఱొలి నాత్తముమ్ తోత్తముమాయ్
నల్లరన్ నాన్ముగన్ నారణను క్కిడన్దాన్
　　తడఙ్కాఴ్ంన్దఴ్గాయ కచ్చి;
పల్లవన్ విల్లవన్ నెన్ఱులగిల్ పలరాయ్
　　ప్పలవేన్దర్ వణఙ్గు కఴ్ల్
పల్లవన్, మల్లైయర్ కోన్ పణిన్ద
　　**పరమేచ్చుర విణ్ణగర మదువే.**
　　తిరుమంగై ఆఴ్వార్ - పెరియతిరుమొఴ్ 2-9-1.

## మంచిమాట

**దు:ఖములను కలిగించునది ప్రకృతి**

**దు:ఖములను అనుభవించువాడు జీవుడు**

**మన దు:ఖములను చూచి సహించలేనిది లక్ష్మీదేవి**

**మన దు:ఖములను పోగొట్టువాడు సర్వేశ్వరుడు.**

# 88. తిరుప్పుళ్‌కుழி (కాంచీ) 15

శ్లో॥ జటాయు తీర్థ రుచిరే తిరుప్పుళ్ కుళి పట్టణే
శ్రీ మరకత వల్లీతి దేవ్యా విజయరాఘవః ॥
ఉపవిష్టః ప్రాఙ్ముఖస్సన్ జయకోటి విమానగః ।
జటాయు గోచరవపూ రాజతే కలిజిన్నుతః ॥

**వివః** విజయరాఘవప్పెరుమాళ్ - మరకతవల్లి - జటాయుతీర్థం - తూర్పుముఖము - విజయకోటి విమానము - కూర్చున్నసేవ - జటాయువునకు ప్రత్యక్షము. తిరుమంగై ఆళ్వార్ కీర్తించినది.

**విశే:** ఈ స్వామి విషయమై శ్రీమద్వేదాంత దేశికులు షోడశాయుధ స్తోత్రమును అనుగ్రహించిరి. ఈక్షేత్రమునందే యాదవ ప్రకాశులు శిష్యులకు వేదాంత శాస్త్రమును బోధించిరట. పిన్బழగరామ్ పెరుమాళ్ జీయర్ అవతరించిన స్థలము. కోవెలకు ఎదుట జటాయు మహారాజుల సన్నిధి గలదు. కుంభమాసం పునర్వసు తీర్థోత్సవము సంతాన విషయకమైన ప్రార్థనా స్థలము.

**మార్గం:** మద్రాస్ - వేలూర్ బస్ మార్గంలో బాలిశెట్టి సత్రం వద్ద దిగిన 1/4 కి.మీ. దూరములో నున్నది. కాంచీపురం నుండి బాలిశెట్టి సత్రానికి బస్‌కలదు. వసతులేమియులేవు. కంచినుండి పోయి సేవింపవలెను.

పా॥ అలజ్గ్ఴ తడక్కై యాయన్ వాయామ్బల్
కழியుమా లెన్నుళ్ల మెన్నుమ్;
పులజ్గ్ఴ పొరునీర్ ప్పుట్కుழிపాడుమ్
పోదుమో నీర్మలై క్కెన్డుమ్
కులజ్గ్ఴకొల్లి క్కోమళవల్లి
క్కొడియిడై నెడుమழைక్కణ్ణి
ఇలజ్గ్ఴిల్ తోళిక్కెన్నినై న్దిరున్దా
యిడవెన్దై యెన్దై పిరానే.
తిరుమంగై ఆళ్వార్ - పెరియతిరుమొழி 2-7-8.

**మంచిమాట**

**శత్రువులకు భయపడకుము.**

**వారును శ్రియఃపతియగు శ్రీమన్నారాయణునకు శరీరభూతులే.**



# 89. తిరునిన్రవూర్ (16)



శ్లో॥ వృద్ధః క్షీర తరజ్గిణీ తటగతే శ్రీ నిన్రవూర్ పట్టణే
ప్రాప్తే వారుణ పద్మినీ స్థితిలసన్ శ్రీ శ్రీనివాసాలయః ।
ప్రాగాస్యో భువి భక్తవత్సల విభు ర్మన్మాతృదేవీ పతిః
యాదోనాథ నిరీక్షితో విజయతే శ్రీ మత్కలిఘ్నస్తుతః ॥

వివః భక్తవత్సలన్ - (పత్తరావిపెరుమాళ్) నన్ను గన్నతల్లి (ఎన్నపెత్తతాయ్) వృద్ధక్షీరనది. వరుణ పుష్కరిణి - శ్రీనివాస విమానము - తూర్పుముఖము - నిలుచున్నసేవ - వరుణునకు ప్రత్యక్షము - తిరుమంగై ఆళ్వార్ కీర్తించినది.

విశేః తిరుమంగై ఆళ్వార్ తిరునీర్మలై క్షేత్రమును సేవించి ఈ తిరునిన్రవూర్ క్షేత్రమునకు వేంచేసిరి. కానీ ఇచట భక్తవత్సలస్వామి దివ్యమహిషీ ప్రణయ భోగలాలసుడై ఆళ్వార్లను కన్నెత్తియైన కటాక్షించలేదు. వెంటనే ఆళ్వార్లు స్థలశయన క్షేత్రమునకు వేంచేసి అచట స్వామి విషయమై పారాయదు" అను దశకమును (తిరుమొళ్ 2-5) ప్రారంభించిరి. ఇది యింతయు గమనించిన పిరాట్టిమార్లు (తాయార్లు) "ఆళ్వార్లచే స్తుతింపబడు అవకాశము మన క్షేత్రమునకు లేకపోయెనే ! వారెచట వేంచేసి యున్ననూ ఈ క్షేత్రమునకు తోడ్కొనిరండని" స్వామిని పంపగా స్వామి స్థల శయనక్షేత్రమునకు వేంచేసి ఆళ్వార్ల ఎదుట నిలచిరి. ఆళ్వార్లును ఆ క్షేత్రము నందుండియే **"నిన్రవూర్ నిత్తిలత్తై తొత్తార్ శోలై"** అని తిన్నమూర్ స్వామికి మంగళా శాసనము చేసిరి. మీనం శ్రవణం తీర్థోత్సవము - బ్రహ్మోత్సవం మూడవరోజు ఉదయం గరుడసేవ. ఈసన్నిధి తిరుమలై పెద్దజీయర్ స్వామి నిర్వాహములో నున్నది.

**మార్గముః** శైన్నై - అరక్కోణం రైలు మార్గములో ఉన్నది. శైన్నై తిరువళ్ళూరు మార్గములో కలదు. రైల్వే స్టేషన్ నుండి 2 కి.మీ. బండిమీద వెళ్లవలెను.

పా॥ పూణ్డవత్తమ్ పిఱర్క్కడైన్దు తొణ్డుపట్టు
పొయ్ న్నూలై మెయ్న్నూల్ ఎన్ఱెన్ఱు మోది
మాణ్డు; అవత్తమ్ పోగాదే వమ్మినెన్దై
యెన్ వణజ్గప్పడువానై ; క్కణజ్గళేత్తుమ్
నీణ్డవత్తై క్కరుముగిలై యెమ్మాన్తన్నై
నిన్రవూర్ నిత్తిలత్తై త్తొత్తార్ శోలై
కాణ్డవత్తై క్కనలెరివాయ్ పెయ్ విత్తానై
క్కణ్డదునాన్ కడన్మల్లై త్తల శయనత్తే.

తిరుమంగై ఆళ్వార్ - పెరియతిరుమొళ్ 2-5-2.



# 90. తిరువెవ్వుళ్ళూరు 17



## (తిరువళ్ళూరు)

శ్లో॥ శ్రీ హృత్తాప వినాశ తీర్థరుచిరే శ్రీ వెవ్వుళూర్ పట్టణే
వీక్షారణ్య మితి ప్రసిద్ధ విభవే శ్రీ శాలిహోత్రేక్షితః ।
ప్రాగాస్యో వర వీరరాఘవ విభు స్స్వర్ణవల్లీ పతిః
భోగేన్ద్రే జయకోటి మందిరగతః శేతే కలిఘ్నస్స్తుతః ॥

వివః వీరరాఘవ పెరుమాళ్ - కనకవల్లితాయార్ - హృత్తాప నాశతీర్థం వీక్షారణ్యం - తూర్పుముఖము - భుజంగశయనము - విజయకోటి విమానము - శాలిహోత్రులకు ప్రత్యక్షము - తిరుమళ్ళిశై ఆళ్వార్ - తిరుమంగై ఆళ్వార్ కీర్తించినది.

విశేః సర్వేశ్వరుడు శాలిహోత్రమునికి ప్రత్యక్షమై నివసింపదగిన స్థలము ఎచట? అని అడిగిరట. కావుననే ఈక్షేత్రమునకు "తిరు ఎవ్వుళ్వూర్" (కింగృహ) క్షేత్రమని పేరువచ్చినదని పెద్దలు చెప్పుదురు. మేషం పునర్వసు మొదలు పది దినములు బ్రహ్మోత్సవము జరుగును. మకర మాసం పూర్వాభాద్ర అవసానముగా పది దినములు బ్రహ్మోత్సవము జరుగును. ప్రతి అమావాస్యకు ప్రార్థన చెల్లించుటకై భక్తులు వత్తురు. ఈసన్నిధి అహోబిల మఠం జీయర్ స్వామివారి నిర్వాహములో నున్నది. సన్నిధిలో ప్రసాదము లభించును. సన్నిధి వీధిలో అహోబిల మఠము కలదు. సమస్త వసతులు కలవు.

**మార్గముః** శైన్నై - అరక్కోణం రైలుమార్గంలో తిరువళ్లూరు స్టేషన్ నుండి 5 కి.మీ. మద్రాసు నుండి అన్ని ప్రధాన పట్టణముల నుండి బస్ సౌకర్యం కలదు. ఆంధ్రాలో సూళ్లూరుపేట నుండి తిరుపతి నుండి బస్ సౌకర్యం కలదు.

పా॥ పన్దిరుక్కుమ్ మెల్ విరలాళ్; పావై పనిమలరాళ్,
వన్దిరుక్కుమ్మార్; వన్ నీలమేని మణివణ్ణన్;
అన్దరత్తిల్ వాழுమ్ వానోర్; నాయగనాయమైన్ద;
ఇన్దిరళుక్కుమ్ తమ్బెరుమా; నెవ్వుళ్ కిడన్దానే
- తిరుమంగై ఆழ்వార్ - పెరియ తిరుమొழி 2-2-9

### మంచిమాట

**ఆత్మకు అహంకారము ఆవరించి యుండుటచే నిజస్వరూపమును తెలియక మిట్టిపడును. ఆ అహంకారము తొలగినచో "దాసుడను" అని తన సహజ స్వరూపముతోనే వ్యవహరింపబడును.**

**"వడక్కుత్తిరువీధి పిళ్ళై"**

# ❋ 91. తిరునీర్మలై 18 (ఘుండారణ్యక్షేత్రము) ❋

**శ్లో॥** భాతి శ్రీ మణికర్ణికాఖ్య సరసి శ్రీ నీర్మలాఖ్యే పురే
నీర్వణ్ణన్ విభురత్ర తోయగిరి రిత్యాఖ్యాం విమానం శ్రితః ।
నాయక్యా త్వణిమామలర్ పదయుజా మాణిక్య శయ్యాంగతో
లంకా పట్టణ వీక్షితాంచిత వపు స్తుండీర దేశప్రభుః ॥
తొండమాన మహరాజ మార్కండేయ భృగూత్తమైః ।
ప్రత్యక్షితః కలిధ్వంసి శ్రీ భూతముని కీర్తితః ॥

**వివ:** నీర్వణ్ణన్ - అణిమామలర్ మంగై తాయార్ - మణికర్ణిక పుష్కరిణి తోయగిరి విమానము - దక్షిణముఖము - మాణిక్య శయనము - తొండమాన్ చక్రవర్తికి మార్కండేయ భృగుమహర్షులకు ప్రత్యక్షము - కలియన్, పూదత్తాళ్వార్ కీర్తించినది.

**విశే:** తిరునీర్మలై ఒక విలక్షణమైన దివ్యక్షేత్రము. వనములతోను, జలప్రవాహములతోను రమణీయమైనది **"నిన్ఱానిరున్దాన్ కిడన్దాన్ నడన్దా ఱ్కిడమ్ మామలైయావదు నీర్మలైయే"** అని తిరుమఙ్గైయాళ్వార్లు పాడించినట్లుగా ఇక్కడస్వామి నిలుచున్న; కూర్చున్న, శయనించిన, నడుచుచున్న రీతిని వేంచేసియున్నారు. **"నఱైయూర్; తిరువాలి, కుడన్దై తడన్దిగళ్ కోవలర్ నగర్"** (తి.మొ. 2-4-1) అనునట్లు నఱైయూర్‌లో వేంచేసియున్నరీతిని నిలుచుని, తిరువాలి తిరునగరిలో వలెకూర్చుని, తిరుక్కుడన్దైలో వలె శయనించి,తిరుక్కోవలూర్‌లో వలె నడుచుచున్న రీతిని వేంచేసియున్నారు.

ఇచట కొండపై రంగనాథులు శయన తిరుక్కోలములో వేంచేసియుండగా (దక్షిణముఖము) కూర్చున్నసేవగా శాంత నరసింహస్వామి (తూర్పుముఖము) నడుచుచున్న రీతిలో ఉలగళన్దపెరుమాళ్ (తూర్పుముఖము) నిలుచున్న సేవగా చక్రవర్తి తిరుమగన్ వేంచేసియున్నారు. కొండపై శ్రీరంగనాయకి సన్నిధి వేరుగా గలదు. కొండదిగువన నీర్వణ్ణన్ ఉత్సవమూర్తి వేంచేసియుందురు. మణికర్ణిక, క్షీర, కారుణ్య, స్వర్ణ తీర్థములు గలవు. ఈక్షేత్రము చుట్టును నీరు నిలచి యుండెడిదట. తిరుమంగై ఆళ్వార్ ఇచటికి వేంచేసి జలపరివృతమైన సన్నిధిని చేరరాలేక ఆరు మాసములు ఇక్కడనే వేంచేసియున్నారట. అందుచే ఈక్షేత్రమునకు తిరుమఙ్గైయాళ్వార్ పురమ్ అను తిరునామము కూడ కలదు.

**మార్గము:** పల్లావరం స్టేషన్‌కు 4 కి.మీ

పా॥ అన్వాయర్ కులక్కోడియోడు; అణిమామలర్ మజ్జై యోడన్బళని, అవుణర్క్ క్కేన్డాను మిరక్క మిలాదవనక్కు; ఉజై యుమిడ మావదు; ఇరుమ్బొళిల్ శూళ్ నన్వాయపునల్ నజ్జై యూర్ తిరువాలి కుడన్దై తడన్దిగళ్ కోవల్ నగర్ నిన్డానిరున్దాన్ కిడన్దాన్ నడన్దాఱ్కిడమ్; మామలై యావదు నీర్మలైయే.
తిరుమంగై ఆళ్వార్లు - పెరియ తిరుమొళి 2-4-1

# ❀ 92. తిరువిడవెన్దై 19 ❀

శ్లో॥ **కల్యాణే త్విడవెన్ద నామని పురే కల్యాణ తీర్థాంచితే**
**కల్యాణాఖ్య విమాన మధ్యనిలయః కల్యాణ నామాహరిః**
**దేవీం కోమళవల్లికా మనునయన్ ప్రాగాస్య సంస్థానగో**
**మార్కండేయ మునీన్ద్ర వీక్షితతనూ రేజే కలిఘ్నస్తుతః**

**వివః** నిత్యకల్యాణర్ - కోమలవల్లి త్తాయార్ - కల్యాణ తీర్థము - కల్యాణ విమానము - తూర్పుముఖము - నిలచున్నసేవ - మార్కండేయ మహర్షికి ప్రత్యక్షము - తిరుమంగై ఆళ్వార్ కీర్తించినది.

గాలవ మహర్షియొక్క కుమార్తెలు 360 మంది. వీరిని ఒక్కొక్కరిని ఒక్కొక్క దినమున స్వామి వివాహమాడుటచే ఆయనకు నిత్యకల్యాణర్ అనిపేరు వచ్చినది. ఈ మూడువందల అరువది కన్యలను కలిపి ఒకే కన్యగాచేసి స్వామి తనకు ఎడమవైపున ధరించుటచే ఈక్షేత్రమునకు తిరువిడవెన్దై అనియు, తాయార్లకు అఖిలవల్లి అనియు పేరువచ్చెను. ఇచట మూలవర్ తిరుమేనిలో లక్ష్మీదేవి ఎడమ (ఇడదు) భాగమున ఉండుటచే 'ఇడవెన్దై' అని పేరువచ్చెను.

సముద్రతీర క్షేత్రమగుటచే సౌకర్యములు స్వల్పము.

**మార్గముః** మహాబలిపురమునకు 10 కి.మీ. దూరమున కలదు.

పా॥ తుళమ్బడు ముఱువల్ తోళియర్క్కరుళాళ్
తుణైములై శాన్దు కొణ్డడియాళ్
కుళమ్బడు కువళై క్కణ్ణిణై యెళుదాళ్
కోలనన్మలర్ కుళఱ్కణియాళ్;
వళమ్బడు మున్నీర్ వైయమున్నళన్ద
మాలెన్నుమ్ మాలినమొళియాళ్
ఇళమ్బడి యివళుక్కెన్నినైన్దిరున్దా
యిడవెన్దై యెన్దపిరానే !..
తిరుమంగై ఆళ్వార్ - పెరియ తిరుమొళి 2-7-2

#  93. తిరుక్కడల్ మల్లై 20 

**(మహాబలిపురం)**

శ్లో॥ శ్రీమత్తార్క్ష్య తరఙ్గిణీ తటగతే దేశేకడల్ మల్లై ఇ
త్యాఖ్యే శ్రీ నిలమంగ నామయుతయాదేవ్యా భుజఙ్గేశయః
భాతి శ్రీ స్థలశాయి నామకవిభు శ్రీ పుండరీకేక్షితః
ప్రాగాస్యస్తు ఘనాకృతా కలిరిపు శ్రీ భూతచక్రస్తుతః ॥

**వివః** స్థలశయనర్ - నిలమంగై నాచ్చియార్ - తార్క్ష్య నది - తూర్పుముఖము. భుజఙ్గశయనము - గగనాకార విమానము - పుణ్డరీకునకు ప్రత్యక్షము. పూదత్తాళ్వార్. తిరుమంగై ఆళ్వార్ కీర్తించినది.

ఇది పూదత్తాళ్వార్ అవతరించిన స్థలము. ఆళ్వార్లు మంగళాశాసనం చేసిన సన్నిధి శిథిలమై సముద్రతీరమున కలదు. ఇది శిథిలముకాగా కొంత దూరములో మరియొక సన్నిధిని నిర్మించారు. స్వామి స్థలశయనముగా సేవసాయించు క్షేత్రము ఇదియొక్కటియే.

పుండరీకమహర్షి తామర పుష్పములతో స్వామిని అర్చింపబోయెనట. ఆసమయమున స్వామి ఒక వృద్ధ బ్రాహ్మణుని రూపముతోవచ్చి ఆకలిగానున్నది. ఆహారమునీయుమని అడిగెను. అంతట పుండరీకుడు ఆహారమును తీసికొని వచ్చుటకు వెడలెను. ఇంతలో స్వామి ఆ తామరపుష్పములను అలంకరించుకొని పుండరీకమహర్షి తలచిన రూపముతో శయనించెను. మహర్షి తిరిగివచ్చి స్వామిని సేవించి ఆశ్చర్యపడి వారిని స్థలశయనర్ అని సంబోధించిరి.

ఈ క్షేత్రమునగల జ్ఞానప్పిరాన్ (వరాహస్వామి) సన్నిధి తప్పక సేవింపవలెను. ఇచటస్వామి తిరుమేనిలో తాయార్లు కుడివైపున ఉండుటచే ఈసన్నిధికి వలవెన్దై అనిపేరు.

ఇది అతిమనోహరములైన శిల్పసంపదతో అలరారు క్షేత్రము. తిరుమంగై ఆళ్వారు ఈక్షేత్రస్వామిని కీర్తించుచుండ తిన్ననూర్ భక్తవత్సలస్వామి ప్రత్యక్షముకాగా వారికిని ఇచటి నుండియే మంగళాశాసనం చేసిరి.

**మార్గముః** మద్రాసు నుండి 65 కి.మీ. దూరమున కలదు. సకల సదుపాయములు కలవు.

పా॥ పారాయదుణ్డు మిழ్న్ద పవళత్తూణై;
ప్పడు కడలిలముదత్తై ప్పరివాయ్ కీణ్డ
శీరానై; యెమ్మానై త్తొణ్డర్ తఙ్గళ్;



94. A. పార్ధసారధి - తిరువల్లిక్కేణి

Pardhasaradhi - Triplicane



94. B. పార్థసారథి - తిరువల్లిక్కేణి
Pardhasaradhi - Triplicane



94. C. మన్నాధర్ - తిరువల్లిక్కేణి
Mannathar - Triplicane



94. D. నరసింహర్ - తిరువల్లిక్కేణి



94.E. చక్రవర్తితిరుమగన్ - తిరువల్లిక్కేణి -

**Ramar - Triplicane**

శిన్దైయుళ్ళే ముళై త్తెళున్ద తీజ్గరుమ్బినై ;
పోర్రానై కొమ్బొశిత్త పోరేత్ తినై ;
ప్పుణర్ మరుద మిఱునడన్ద పొఱ్కున్ఱినై ;
క్కార్రానై యిడర్ కడిన్ద కఱ్పగత్తై
క్కణ్డదునాన్ కడన్మల్లై త్తలశయనత్తే.
తిరుమంగై ఆళ్వార్ - పెరియతిరుమొళి 2-5-1.

##  94. తిరువల్లిక్కేణి (చెన్నై) 21 

శ్లో॥ శ్రీమత్కైరవిణీ సరోవర లసత్ బృందావనాఖ్యాయుతే
వల్లిక్కేణి పురే స్థిత స్స్వర దిశా వక్త్రాంబుజో రాజతే।
రుక్మిణ్యా త్వనిరుద్ధ సాత్య బల ప్రద్యుమ్న సేవ్యో త్రిణా
సంపూజ్యో భువి పార్థసారథి విభుః పార్థాక్షి యుగ్మాతిథిః॥
తత్రైవ రంగనాథాఖ్యో వేదవల్ల్యా ఫణీంద్రగః।
భృగుణా కన్యకాదానం ప్రాపిత స్స్వర దిఙ్ముఖః॥
తత్రైవ నరసింహాఖ్యః పశ్చిమాభిముఖాననః
జాబాల్యత్రి మునీంద్రాభ్యాం సేవితో మోక్షదస్తయోః॥
సీతాలక్ష్మణ శత్రుఘ్న భరతై స్తత్ర రాఘవః
దక్షిణాభి ముఖస్తిష్ఠన్ మధుమున్మని వీక్షితః॥
గజేంద్ర వరద స్తత్ర సప్తరోమ మునీక్షితః।
ప్రాఙ్ముఖో గరుడా రూఢ శ్శేషాహ్వయ విమానగః॥
ఇంద్రాగ్ని సోమ మీనాఖ్య విష్ణు తీర్థాతి సుందరే
శ్రీమత్కైరవిణీ తీరే రాజంతే పంచమూర్తయః॥
మార్కండేయాత్రి సుమతి మరీచి భృగు యోగినః।
జాబాలి సర్ప రోమాణౌ తేపురత్ర పరం తపః॥
పరకాల మహాయోగి భక్తిసార పరిస్తుతః॥
తిరువల్లిక్కేణి నగరే పంచదేవాశ్చ వాసతే॥

వివః బృందావన క్షేత్రము. పార్థసారథి పెరుమాళ్ - రుక్మిణీదేవి తాయార్, బలరామ, సాత్యకి, అనిరుద్ధ, ప్రద్యుమ్నులు వేంచేసియున్నారు. కైరవిణీ పుష్కరిణి. తూర్పుముఖము - నిలుచున్నసేవ - ఆనన్దవిమానము - అత్రిమహామునికి తిరువారాధనము - అర్జునునకు ప్రత్యక్షము.

అచటనే మన్నాధర్. (ఎన్నైయాళుడై యప్పన్; రంగనాథులు) వేదవల్లిత్తాయార్ తూర్పుముఖము - భుజంగశయనము - భృగుమహర్షిచే కన్యాదానము

పొందినారు. తెళ్ళి అఝకియసింగర్ (నరసింహస్వామి) పశ్చిమ ముఖము - కూర్చున్నసేవ - జాబాలికి అత్రిమహర్షికి ప్రత్యక్షము.

చక్రవర్తి తిరుమగన్ ( శ్రీరామచంద్రులు) సీతాలక్ష్మణ భరత శత్రుఘ్నులు దక్షిణముఖము - శశపదుని కుమారుడగు మధుమానునకు ప్రత్యక్షము.

తేవప్పెరుమాళ్ (గజేంద్రవరదన్) తూర్పుముఖము - గరుడా రూఢులు - శేష విమానము - ఇంద్ర అగ్ని సోమ మీన - విష్ణు తీర్థములు. వీనిచే చుట్టబడిన కైరవిణీ సరస్సు. ఆకైరవిణీ తీరమున పార్థసారథి రంగనాథ నరసింహ శ్రీరామచంద్ర గజేంద్రవరదులుగా వేంచేసియున్నారు. మార్కండేయ, అత్రి, సుమతి, మరీచి, భృగు, జాబాలి, సర్వరోములకు ప్రత్యక్షము. పేయాళ్వార్ - తిరుమఝిశై ఆళ్వార్, తిరుమంగై ఆళ్వార్ కీర్తించినది. ఈతిరువల్లి క్కేణిలో స్వామి పంచమూర్తులుగా వేంచేసియున్నారు.

**విశే:** తమిళములో కలువపువ్వును "అల్లి" అందురు. కలువపూవులు మెండుగాగల పుష్కరిణి యగుటచే "తిరు అల్లిక్కేణి" అని ప్రసిద్ధి చెందినది. ఈ క్షేత్రము మైలాపూరునకు సమీపమునందుండుటచే మయిలై తిరువల్లిక్కేణి యనియు తిరునామము గలదు. బృందారణ్య క్షేత్రమనియు పేరు కలదు. తొండమాన్ చక్రవర్తి ప్రార్థనచే తిరుమలై తిరువేంగడముడైయాన్ ( శ్రీనివాసుడు) కృష్ణావతారముగా సకుటుంబముగా సేవ సేయించిన ప్రదేశము. కావున స్వామి వేంకటేశ్వరుని తిరునామముతో "వేంకటకృష్ణన్" అను తిరునామమేర్పడినది. ఈ దివ్యదేశమున స్వామి రుక్మిణీదేవితోను, బలరాముడు సాత్యకి (సోదరులు) ప్రద్యుమ్నుడు (కుమారుడు) అనిరుద్ధుడు (మనుమడు) వీరితో కలసి సకుటుంబముగా సేవ సాయించును.ఇట్టి సన్నివేశమును మరియొకచోట దర్శింపలేము. అట్లే శ్రీరంగనాధులు (శయనించిన) చక్రవర్తి తిరుమగన్(నిలచున్న) గజేంద్రవరదన్(పయనించుచున్న) అఝగియశింగర్ (కూర్చున్న) విధము సేవింపదగినది. (ఒకే దివ్యదేశమున నిన్ద, ఇరున్ద; కిడన్ద, నడన్ద తిరుక్కోలములు).

ఇచటనే ఆసూరి కేశవాచార్యులవారు పుత్రకామేష్టి చేసి "భగవద్రామానుజులను" పుత్రులుగా పొందిరి.

**మార్గము:** మద్రాసులోని తిరువల్లిక్కేణి

పా॥ విఱ్ఱ్పెరు విఝవుమ్ కఞ్జనుమ్ మల్లుమ్; వేఝముమ్ పాగనుమ్ వీఝ;
శెత్తవన్ తన్నై పురమెరిశెయ్‌ద; శివనుఱుతుయర్ కళై తేవై ;
పత్తలర్ వీయకో్కల్ కై యిల్ కొణ్డు; పార్త్తన్ తేర్మున్ నిన్ఱానై
శిత్తమై పణియాల్ ముడితుఱన్దానై ; త్తిరువల్లిక్కేణి క్కణ్డేనే
తిరుమంగై ఆఝ్వార్ - పెరియ తిరుమొఝి 2-3-1



94. F. గజేంద్రవరదన్ - తిరువల్లిక్కేణి

Gajendravaradan - Triplicane

 

95.A. యోగనరసింహర్ - అమృతవల్లి - షోలింగర్

YogaNarasimhar - Amrutavalli - Sholingar

## ❋ 95. తిరుక్కడిగై (చోళసింహపురము) 22 ❋

శ్లో॥ చోళ సింహ పురే యోగ సింహనామా విరాజతే ।
అమృతాహ్వయ తీర్థాఢ్యే సింహకోష్ఠ విమానగః ॥
దేవీమమృత వల్ల్యాఖ్యా మాశ్రితః ప్రాఙ్ముఖాసనః ।
ప్రత్యక్షో మారుతై శార్ఙ్గ నందకాంశ మునిస్తుతః ॥

వివః యోగ నరసింహ స్వామి (అక్కారక్కన్) అమృతవల్లి త్తాయార్. అమృత తీర్థము - సింహకోష్ట విమానము - తూర్పుముఖము - కూర్చున్నసేవ - ఆంజనేయస్వామికి ప్రత్యక్షము - కలియన్; పేయాళ్వార్ కీర్తించినది.

విశే: చోళ సింహపురమునకు (చోళంగిపురము) 3 కి.మీ దూరములో కొండపాలెము కలదు. ఇచట పెద్దకొండ పై నృసింహస్వామి, అమృతవల్లి తాయార్ల సన్నిధి కలదు. ప్రతి శుక్రవారము స్వామికి విశేషముగా తిరుమంజనము జరుగును. చిన్నకొండపై ఆంజనేయస్వామి వేంచేసియున్నారు. ఇచట ఆంజనేయస్వామివారు చతుర్భుజములతో శంఖచక్రములతో యోగ ముద్రతో వేంచేసి యుండుట విశేషము. ఈక్షేత్రము విశేషప్రార్థనా స్థలము. దీర్ఘవ్యాధులు కలవారు, గ్రహపీడితులు, మానసిక రోగులు వేలాదిగా వచ్చి ప్రార్థనలు చేతురు. చోళసింహపురములో భక్తవత్సలన్ (ఉత్సవమూర్తి) వేంచేసియున్నారు. వీరి సన్నిధి వెనుక అదికేశవర్ వేంచేసి యున్నారు. ఎఱుంబి అప్పా అవతార స్థలము అగు ఎరుంబి అగ్రహారము ఈ క్షేత్రమునకు సమీపముననే కలదు. మణవాళమామునులు ఈ క్షేత్రమునకు వడ శ్రీరంగమునియు ఇచ్చుటగల పుష్కరిణికి తిరుక్కావేరి అనియు తిరునామముంచిరి.

**మార్గముః** తిరుత్తణి / అరక్కోణంకు 30 కి.మీ.

పా॥ మిక్కానై మఱైయాయ్ విరిన్ద విళక్కై; ఎన్నుళ్
పుక్కానై ప్పుగழ్శేర్ పొలిగిన్ఱ పొన్ మలైయై ;
తక్కానై క్కడిగై త్తడఙ్కున్ఱిన్ మిశైయిరున్ద;
అక్కారక్కనియై ; అడైన్దుయ్న్దు పోనేనే.

తిరుమంగై ఆழ்వార్ - పెరియ తిరుమొழி 8-9-4.

### ఉత్తరదేశ తిరుపతులు

శ్లో॥ ఇదానీ ముత్తరే దేశే స్థితా దేశాః రమాపతేః ।
వర్ణ్యంతే యతిరాజాంఘ్రి ప్రభావాత్సన్మదే మయా ॥

శ్రీభగవత్ రామానుజుల వారి శ్రీపాద ప్రభావముచే ఇకపై ఉత్తరదేశమున గలదివ్యదేశములను వర్ణింతును.

# (మంచిమాట)

## బ్రహ్మవిద్యలు

సంసార సాగరమునబడి దరిగానక దుఃఖించు చేతనులను జూచి సర్వేశ్వరుడు కృపతో ఉద్ధరింపదలచి వేదమును అనుగ్రహించెను. అందు వేద ఉత్తర భాగమున అధికారానుగుణ్యముగా బ్రహ్మవిద్యాత్మకములైన ఉపాసనములు తెలుపబడినవి. ఇవి ముప్పది రెండు. ఈముప్పది రెండు ఉపాసనములు వ్యాస మహర్షిచే బ్రహ్మసూత్రము లందు పేర్కొనబడినవి.

| | |
|---|---|
| 1. ఈశావాస్య విద్య | 17. సత్యకామ విద్య |
| 2. సద్విద్య | 18. దహర విద్య |
| 3. ఆనందమయవిద్య | 19. అంగుష్ఠ ప్రమిత విద్య |
| 4. అంతరాదిత్యవిద్య | 20. మధు విద్య |
| 5. ఆకాశవిద్య | 21. సంవర్గ విద్య |
| 6. ప్రాణ విద్య | 22. అజా విద్య |
| 7. పరంజ్యోతి విద్య | 23. జ్యోతిషాంజ్యోతిర్విద్య |
| 8. ప్రతర్దన విద్య | 24. బాలాకి విద్య |
| 9. శాండిల్య విద్య | 25. మైత్రేయీ విద్య |
| 10. నాచికేత విద్య | 26. రుద్రవిద్య |
| 11. ఉపకోసల విద్య | 27. చతుర్ముక విద్య |
| 12. ఉద్దాలకాంతర్యామి విద్య | 28. పంచాగ్ని విద్య |
| 13. అక్షరపర విద్య | 29. ఆదిత్య మండలస్థ సత్యబ్రహ్మవిద్య |
| 14. వైశ్వానర విద్య | 30. అక్షిస్థ సత్య బ్రహ్మవిద్య |
| 15. భూమ విద్య | 31. పురుషవిద్య |
| 16. గార్గ్యక్షర విద్య | 32. ఉషస్తికహోళ విద్య |

ఇవియును గాక ఇంకా కొన్ని కామవిద్యలు కూడా నిందు ప్రస్తావించబడినవి.



95.C. యోగాంజనేయర్ - తిరుక్కడిగై

Yoganjaneyar - sholingar



95.B. భక్తవత్సలన్ - తిరుక్కడిగై

Bhaktavastalan - Sholinger



96.A. తిరువేఙ్గడముడయాన్ - అలర్మేల్మంగై - తిరుమలై

Tiruvengadamudayan- Alarmel mangei - Tirumalai

## ❀ 96. తిరువేంగడమ్ (తిరుమలై - తిరుపతి)1 ❀

శ్లో॥ శ్రీమద్వేంకట శైలరాజ శిఖరే శ్రీ శ్రీనివాసో హరిః
శ్రీమత్ స్వామి సరోవర ప్రభృతిభిః పుణ్యైరనేకైర్యుతే
తీర్థైః ప్రాఙ్ముఖ సంస్థితి ర్విజయతే శ్రీ తొండమానాదిభి :
దృష్టః శ్రీ నవసూరి సంస్తుత వపు స్త్వాలింగ్య పద్మావతీమ్ ॥
శ్రీ వేంకట గిరీశోయం అలర్ మేల్ మంగనాయకీమ్ ।
ఆశ్రితో రాజతే నిత్యం ఆనంద నిలయాలయః ॥

**వివః** శ్రీవేంకటేశ్వరుడు (తిరువేంగడ ముడయాన్) అలర్మేల్ మంగై తాయార్ (పద్మావతి) స్వామి పుష్కరిణి మున్నగు పలుతీర్థములు. తూర్పుముఖము - నిలుచున్నసేవ - ఆనంద నిలయ విమానము. తొండమాన్ చక్రవర్తి మున్నగువారికి ప్రత్యక్షము. తొండరడిప్పొడి యాళ్వార్ తప్ప మిగిలిన యాళ్వార్లు ఆండాళ్ కీర్తించిన స్థలము.

**విశే:** "కలౌవేంకటనాయకః" అని ప్రసిద్ధి చెందిన క్షేత్రము. **వడవాలై** (ఉత్తర దిగ్గజము) అని తిరుమంగై యాళ్వార్ల వర్ణనము - **"వడక్కుత్తిరుమలై"** యని (వడ తిరువేంగడం) **"మణ్ణోర్ విణ్ణోర్ వైప్పు"** అని సాంప్రదాయక తిరునామములు గలవు. ఈక్షేత్రమునకు పుష్పమంటపమనియు తిరునామము కలదు. అనంతాళ్వాన్ అను మహాత్ములు పుష్కరిణిని నిర్మించిరి. కురుబరుత్తనంబి స్వామికి అంతరంగికులు. పెరియ తిరుమలై నంబి గారు ఈమలై మీద వేంచేసి స్వామి కైంకర్యము నిర్వహించెడివారు.

అష్ట స్వయం వ్యక్త క్షేత్రములలో తిరుమల యొకటి. శ్రీ వైష్ణవులు అత్యంతము అభిమానించి సేవించు నాల్గుక్షేత్రములలో "తిరుమలై" రెండవది.

**మాయావీ పరమానందం త్యక్త్వా వైకుంఠ ముత్తమమ్**
**స్వామిపుష్కరిణీ తీరే రమయా సహమోదతే.**

శ్రీమన్నారాయణుడు పరమానంద స్వరూపమైన శ్రీవైకుంఠమును విడచి స్వామి పుష్కరిణీ తీరమున లక్ష్మీదేవితో కలసి ఆనందించుచున్నాడు, అనియు,

**"శ్రీవైకుంఠవిరక్తాయ స్వామిపుష్కరిణీ తటే**
**రమయా రమమాణాయ వేఙ్కటేశాయ మంగళమ్"**

("శ్రీవైకుంఠమున విరక్తుడైన స్వామి, స్వామి పుష్కరిణీ తీరమున లక్ష్మీ దేవితో కలసి ఆనందించుచున్నాడు") అనియు చెప్పినట్లుగా శ్రీవైకుంఠనికేతనుడైన స్వామి భక్త సంరక్షణ దీక్షితుడై తిరుమలపై వేంచేసియున్నాడు.

**"కృతేయుగే నారసింహః త్రేతాయాంరఘునందనః**
**ద్వాపరే వాసుదేవశ్చ కలౌవేంకటనాయకః "**

అని చెప్పినట్లుగా కృతయుగమున నరసింహస్వామి, త్రేతాయుగమున శ్రీరామచంద్రులు, ద్వాపరయుగమున శ్రీకృష్ణపరమాత్మ; కలియుగమున శ్రీవేంకటేశ్వరస్వామి భక్తరక్షణ దీక్షితులై యున్నారు.

స్వామి వేంచేసియున్న ఈ వేంకటాద్రి శ్రీవైకుంఠము నుండి గరుడాళ్వార్లచే భూమికి తీసికొనిరాబడినది. కావున వైకుంఠాద్రి యనియు, ఆదిశేషావతారమై, శేషాకారముగా నుండుటచే శేషాద్రియని, గరుడాళ్వార్ తీసికొని వచ్చుటచే గరుడాద్రియని; పేరువచ్చినది. మరియు ఈ వేంకటాచలమునకు

**"అంజనాద్రిః వృషాద్రిశ్చ శేషాద్రిః గరుడాచలః**
**తీర్థాద్రిః శ్రీనివాసాద్రిః చిన్తామణి గిరిస్తథా**
**వృషభాద్రిః వరాహాద్రిః జ్ఞానాద్రిః కనకాచలః**
**ఆనన్దాద్రిశ్చ నీలాద్రిః సుమేరు శిఖరాచలః**

**వైకుంఠాద్రిః పుష్కరాద్రిః "ఇతినామాని వింశతిః"** ॥ యని యిరువది పేర్లు కలవు. ఏమైనను

**"వేఙ్కటాద్రి సమం స్థానం బ్రహ్మాండే నాస్తి కించన వేఙ్కటేశ సమోదేవో నభూతో నభవిష్యతి"** యని భక్తులచే సేవింపబడుచున్నదీ క్షేత్రము.

భోగమంటపాదులుగా ప్రసిద్ధములైన క్షేత్రములలో తిరుమలై పుష్పమండపము మిగిలినవి శ్రీరంగము (భోగమండపము) కాంచీపురము (త్యాగ మండపము)

| **దివ్యదేశము –** | **మండపము –** | **మంత్రము –** | **ప్రమాత** |
|---|---|---|---|
| శ్రీరంగము | భోగమండపము | తిరుమంత్రము | తిరుప్పాణన్ |
| కాంచీపురము | త్యాగమండపము | ద్వయము | తిరుకచ్చినంబి |
| తిరుమలై | పుష్పమండపము | చరమశ్లోకము" | కురుంబరుత్తనంబి |

అని ఆళవందారుల శ్రీసూక్తి.

"నమ్మాళ్వార్ ఈ క్షేత్రమును **"మణ్ణోర్ విణ్ణోర్ వైప్పు** (భూలోకవాసులకును పరమపదవాసులకును సమానుడు") అని అభివర్ణించియున్నారు. (కణ్ణావా నెణ్ణుమ్ మణ్ణోర్ విణ్ణోర్కు" తి.వా.మొ 1-8-3) తిరుమఙ్గైయాళ్వార్ **"వడవానై"** (ఉత్తర దిశాదిగ్గజము తిరునెడున్దాణ్డగమ్ 10) అనిస్తోత్రము చేసియున్నారు. మరియు ఈ క్షేత్రమునకు **"వడక్కుత్తిరుమలై"** యని సంప్రదాయక తిరునామము. తెఱ్కుత్తిరుమలై తిరుమాలిరుఞ్జోలమలై.

# ఆళ్వార్ల కీర్తనలలో తిరుమల

తొలుత దేశభాషయైన తమిళభాషలో తిరుమలేశుని కీర్తించి ఆతని మహిమను లోకమున చాటిచెప్పినవారు ఆళ్వార్లు. **"వడతిరు వేఙ్గడమ్; తిరుమలై"** అని వారు ఈ పర్వతరాజమును కీర్తించారు. ఇచటి స్వామిని **"తిరువేంగడత్తాన్; తిరువేంగడముడైయాన్; అలర్‌మేల్ మఙ్గై యుఱై మార్పన్"** అని ప్రస్తుతించారు.

భగవన్తుడు వేంచేసియుండు దివ్యదేశముల కన్నింటికి "తిరుప్పది" అనియే పేరు "పది" అనగా స్థానము అని అర్థము. 108 తిరుప్పదులు ఆళ్వార్లచే కీర్తింపబడినవి. అవి అన్నియు తిరుప్పదులే. కానీ కాలక్రమంలో "తిరుప్పది" అనుపేరు ఈ క్షేత్రమునకు మాత్రమే వాచకంగా రూఢమైనది. "తిరుప్పది"యే తిరుపతిగా మారింది. "తిరుమాల్" అనగా శ్రియఃపతి. ఆయనకు నిత్యనివాసస్థానమైన తిరుమలై తమిళదేశానికి ఆనాటి ఉత్తర సరిహద్దుగా "తొల్‌కాప్పియం" అను ప్రాచీన తమిళ గ్రంథమున పేర్కొనబడినది.

ప్రపన్నజన కూటస్థులైన నమ్మాళ్వార్లు ఈ శ్రీనివాసుని పాదారవిందముల యందే **"అలర్‌మేల్ మఙ్గై యుఱైమార్పా.... పుగలొన్ఱిల్లా వడియేన్ ఉన్నడి క్కీఴ్ అమర్న్దు పుకున్దేనే"** అంటూ పిరాట్టిని (లక్ష్మీదేవిని) పురుషకారంగా చేసికొని శరణాగతి చేసినారు. మఱియు **"అలర్‌మేల్ మఙ్గై యుఱైమార్పా"** అని ప్రస్తుతించి లక్ష్మీ పతిత్వమును ప్రకటించినారు.

మరియు **"ఒழివిల్ కాలమెల్లామ్"** అను దశకమున సర్వదేశ సర్వకాల సర్వావస్థలయందును ఈస్వామి తిరువడిఘళ్ళలో (శ్రీపాదములయందు) కైంకర్యము చేయుటయే పరమ పురుషార్థమని ప్రవచించినారు. అంతేకాక ఈ దశకంలోనే **"ఎఙ్గళ్ పాశంవైత్త"** అనుచోట స్వామియొక్క **వాత్సల్యగుణమును** ప్రకాశింపచేసినారు.

శ్రీగోదాదేవి తమ నాచ్చియార్ తిరుమొழிలో **"విణ్ణీలమేలాప్పు"** అను దశకమున ఈస్వామివార్కి మేఘములద్వారా తమ సందేశాన్ని వినిపిస్తారు. ఇట్లే ప్రథమ దశకములో **"వేంగడవర్క్కెన్నై విదిక్కిత్తియే"** అంటూ "మన్మథా! నన్ను వేఙ్కటాచలపతితో కలపవూ" అని ప్రాధేయ పడతారు.

ఈస్వామిముందల **"పడియాయ్ కిడన్దు ఉన్ పవళవాయ్ కాణ్బేనే"** కడపరాయిగా పడియుండి స్వామి దివ్యాధరమును సర్వదా సేవించు చుందును గాక! అని శ్రీకులశేఖరాళ్వార్లు తమ పెరుమాళ్ తిరుమొழிలోని **ఊనేఱుశెల్వత్తు** అను దశకములో ప్రార్థిస్తారు. కావుననే ఇచట గర్భ గృహద్వారమున గల గడపకు "కులశేఖరప్పడి" అనిపేరు.

"**మన్నిపాయ్ వడవేంగడమామలై; వానవర్గళ్ శన్దిశెయ్య నిన్రాన్**" అంటూ తిరుప్పాణి ఆళ్వార్ జ్ఞానులు అజ్ఞానులు అనుభేదం లేక ఊర్ధ్వలోక వాసులు భూలోకవాసులు సేవించునట్లు దయార్ద్రహృదయుడైన స్వామి తిరువేంగడమున వేంచేసియున్నాడు అని అభివర్ణించిరి.

తిరుమంగై ఆళ్వార్లును "**తిరువేంగడ ముడై నెంజమే**" ఓ మనస్సా ! తిరువేంగడమును ఆశ్రయింపుమని భావించి; "**నాయేన్ వన్దడైన్దేన్ నల్గియాళ్ఎన్నై క్కొణ్డరుళే**" అంతట సంచరించి అన్నిబాధలను అనుభవించి అగతికుడనై నిహీన జంతువువలె నీసన్నిధికి వచ్చి నిన్ను ఆశ్రయించితిని. ఆదరముతో నన్ను అనుగ్రహింపుము" అని దీనంగా ప్రార్థిస్తారు. (పెరియ తిరుమొళి)

## ఆచార్యుల అనుభవాలలో తిరుమల

భగవద్రామానుజులకు ఆచార్యులైన పెరియ తిరుమల నంబిగారు తమ ఆచార్యులైన ఆళవన్దారుల ఆదేశానుసారం ఇక్కడే వేంచేసియుండి తీర్థకైంకర్యంతోపాటు అనేక కైంకర్యాలను స్వామి సన్నిధిలో చేయుచుండెడివారు.ఒక నాడు వీరు పాపనాశనం నుండి తిరుమంజన తీర్థం తెచ్చుచుండగా స్వామి మారువేషంలో వచ్చి "తాతా! దాహంగా ఉంది కాస్త తీర్థం ఇవ్వవూ" అని ప్రార్థించి వీరొసంగిన తీర్థం కడుపార త్రావి నిజరూపంతో సాక్షాత్కరించాడు. కావుననే వీరిని "**పితామహస్యాపి పితామహాయ**" అంటారు సంప్రదాయ వేత్తలు (అహంహి సర్వలోకానాం మాతాధాతా పితామహః అని చెప్పిన సర్వేశ్వరునిచే "తాత" అని పిలువబడుటచే పితామహునకు కూడ పితామహుడైనారు)

**తిరుమలై అనన్దాళ్వాన్** అను మహనీయులు రామానుజుల వారి శిష్యులు. వీరు ఆచార్యాజ్ఞను శిరసావహించి తిరుమలైలో వేంచేసి యుండి నందనవనమును పెంచి పెరుమాళ్లకు పుష్పకైంకర్యము చేసెడివారు. ఆవనమునకు "రామానుశన్" అనిపేరు. వీరు ఆనాడు పెంచి పోషించిన నన్దనవనం నేటికిని అనన్తాళ్వాన్ తోటగా ప్రసిద్ధమై నానాపుష్పలతా గుల్మతరుశోభితమై అలరారు చున్నది. వీరి యీ కైంకర్యమునకు సంతసించిన భగవద్రామానుజులు వీరిని **అనన్దాన్ పిళ్ళై**" అని అనేవారట. ఒక పర్యాయం పద్మావతీ శ్రీనివాసులు రాజకుమారిక రాజకుమారుల వేషంలో అనన్దాళ్వాన్ తోటలోని పుష్పములను కోసికొని అలంకరించుకొంటున్నారు. ఇంతలో అనన్దాళ్వాన్ రావడం చూచి వారు సన్నిధికి అప్రదక్షిణంగా పరుగెత్తి ఉద్యానవనం దగ్గర అంతర్ధానమైనారట. దీనికి సూచకంగా బ్రహ్మోత్సవాలలో ఏడవరోజు స్వామివారు అప్రదక్షిణంగా ఉద్యానవనంలోనికి వేంచేస్తారట..

## భగవద్రామానుజుల కైంకర్యములు

భగవద్రామానుజులు ఈ సన్నిధిలో గావించిన కైంకర్యములు అనేకములు. అవినేటికిని మనకు దర్శనీయములై యున్నవి. వీరు వేంకటాచలపతికి శంఖచక్రములను ప్రసాదించినారు. స్వామి వక్షస్థలమున ద్విభుజయగు వ్యూహ లక్ష్మిని శుక్రవారం ద్వాదశి ఉత్తర ఫల్గునీ నక్షత్రముతో కూడిన రత్నమాలికా యోగమున సమర్పింప జేసినారు. కావుననే ప్రతి శుక్రవారం స్వామికి తిరుమంజనం జరుపుచున్నారు. ఈ సమయంలో పిరాట్టి ప్రీతికొఱకు నాచ్చియార్ తిరుమొழிని అనుసంధింతురు.

పూర్వం ఈస్వామి బ్రహ్మోత్సవములు "తిరుచ్చానూరు" (తిరుచ్చుగనూరు)లో జరిగేవట - కానీ రామానుజులవారు ఈ ఉత్సవాలు కొండమీదనే జరిగేలాగున అచటి సన్నిధి చుట్టు వీధులను నిర్మింపజేసి భక్తులకు ఆవాసయోగ్యము గావించి అది మొదలు స్వామి వారి బ్రహ్మోత్సవాలు అక్కడే జరిగేటట్లు చేశారు.

ఈ సన్నిధిలో కౌతుక బేరంగా ఉండిన **"మలైకునియా నిన్ఱపెరుమాళ్ళను"** ఉత్సవమూర్తిగాను అప్పటివరకు ఉత్సవమూర్తిగా ఉండిన **"వేంగడత్తుఱైవార్"** అనువారిని కౌతుక బేరంగాను ఆలయ వైభవాభివృద్ధికై మార్పుచేయించినారట రామానుజులవారు. ఈ **మలైకునియా నిన్ఱ పెరుమాళ్లనే" మలైయప్పన్** అని అంటారు.

ఇట్లే ఈ సన్నిధిలో అర్చకులుగా **"శేంగనిరాయన్"** అను వైఖానస ఆచార్య సత్తముల వంశీయులే ఉండవలయునని నియమించినారు. స్వామి పుష్కరిణీ తీరమునగల వరాహప్పెరుమాళ్ల సన్నిధిలో ఉత్సవమూర్తిని ప్రతిష్ఠించి తులా(అల్పిశి) మాసం శ్రవణంనాడు తిరునక్షత్రోత్సవమును నిత్య తిరువారాధనమును యథావిధిగా జరుగునట్లు కట్టడి చేసినారు.

ఒకప్పుడు ఈ ఆలయం శత్రు సమాక్రాన్తం కాగా పర పురుష స్పర్శనొల్లని పెరియపిరాట్టి (శ్రీదేవి) స్వామి వక్షస్థలమును చేరగా భూపిరాట్టి (భూదేవి) ఉద్యానవనమున గల **"అழగప్పిరానార్"** అను బావియందు ప్రవేశించినారట.

శ్రీఆళవందారులు తిరుమలైకి వేంచేసినపుడు ఒక సందర్భంలో **"మారిమాఱాద తణ్ణమ్మలై"** అనునట్లు సంతత వర్షాతిశయమును చూచి ఇట్టి వర్షాతిశయ సమయములలో తిరుమంజన తీర్థము పాపవినాశం నుండి తేనవసరం లేదని ఈ నందనోద్యానమునగల **"అழగప్పిరానార్"** అను ఈ బావితీర్థమును వినియోగింప వచ్చునని ఆనతిచ్చినారట. ఈ బావికి "అழగప్పిరానార్" అను దివ్యనామము నుంచినవారు శ్రీఆళవందారులే. స్వామి రామానుజులు ఆనామమునే స్థిరపరచి దాని సమీపంలో భూదేవిని శ్రీనివాసమూర్తిని ప్రతిష్ఠింపజేసినారు.

ఈ బావిని త్రవ్వించినవాడు రంగదాసు అను గొప్ప భక్తుడు. అతడు స్వామివారికి ఆలయ ప్రాకార గోపురాదులను నిర్మింప సంకల్పించి ప్రాకార నిర్మాణమునకు అడ్డుగా ఉన్న తింత్రిణీ వృక్షమును; (ఈ నిర్నిద్ర తింత్రిణీ వృక్షము క్రిందినే స్వామి వేంచేసి యుండేవారు) స్వామి దక్షిణ పార్శ్వమున అమ్మవారు వేంచేసియున్న చంపక వృక్షమును అడ్డుతొలగవలసినదని సవినయంగా భక్తితో ప్రార్థించారట. ఆరాత్రి ఆరెండు వృక్షములు వెనుకకు తగ్గగా కట్టడములను నిర్మింపజేశారట. నేడు ఈవృక్షములు గలప్రాకారాన్ని **చంపక ప్రాకారమని** ఆబావిని **పూలబావియని** వ్యవహరిస్తున్నారు. రామానుజులవారు ఈ వృత్తాన్తాన్ని విని ఆరెండు వృక్షములు ఆదిశేషాంశములని భావించి వానికిని నిత్య తిరువారాధన జరిగేలా నియమించినారట.

మరియొకప్పుడు "వీరనరసింహదేవరాయలు" అను రాజు తిరుమలైకు యాత్రగా వచ్చి స్వామిని సేవించి స్వామికి గోపురం నిర్మించాలని సంకల్పించి పెద్దల అనుమతితో గోపురం కట్టనారంభించినారట. ఒకరోజు రాత్రి ఒక సర్పం ఆరాజు కలలో కనిపించి "రాజా! నీవు ఈగోపురం నిర్మిస్తుంటే నాశరీరం నానా బాధలు పడుతున్నది" అని పలికిందట. రాజు ఆశ్చర్యపడి మరునాడు స్వామిని సేవింపగా ఆ సర్పం స్వామియొక్క వైకుంఠ హస్తమును చుట్టుకొని దర్శనమిచ్చి అంతర్ధానమైనదట. ఆ సన్నివేశం చూచిన రాజు ఆ పర్వతం ఆదిశేషుడే యని విశ్వసించి గోపుర నిర్మాణమును అంతటితో ఆపివేసినాడు. ఆ వృత్తాన్తమును విన్నపెద్దలు స్మారకంగా స్వామివారికి స్వర్ణనాగాభరణమును సమర్పించినారట. రామానుజులవారు దానిని విని రెండవ శ్రీహస్తమునకును నాగాభరణం సమర్పింపజేసినారట.

స్వామి పుష్కరిణీ తీరంలో శ్రీశంకరాచార్యులవారికి శ్రీనరసింహస్వామి సాక్షాత్కరించినందువలన అచట శ్రీనరసింహస్వామి సన్నిధియుండెడిది. కానీ లక్ష్మీసాహచర్యం లేనందువలన ఆస్వామి మహోగ్రంగా సేవ సాయించేవారట. అందుచే వారిని ఆరాధింపరాదని కొందరు పలుకగా రామానుజులవారు అదిసరికాదని భావించి ఆస్వామిని శ్రీవేఙ్కటాచలపతి సన్నిధి ప్రాకారములోనే ఈశాన్య దిక్కున విమానాభిముఖముగా ప్రతిష్ఠింపజేసి వారికి నిత్య తిరువారాధన జరిగేలా ఆదేశించినారట. ఇట్లే పురాణ ప్రసిద్ధి ననుసరించి కొండనెక్కే మార్గంలోను నరసింహమూర్తిని ప్రతిష్ఠింపజేసి వారికి నిత్య తిరువారాధన జరిగేలా ఆదేశించారట.

శత్రువుల వలన కలిగిన ఒక మహోపద్రవ సమయంలో తిల్లై తిరుచ్చిత్తర కూడమున (చిదంబరం) వేంచేసియున్న గోవిందరాజస్వామి ఉభయదేవేరులతో

తిరుపతికి వేంచేసి మలై అడివారంతో కొంతకాలం ఆరాధింపబడినారట.

అట్లే శ్రీరంగము నుండ నంబరుమాళ్ళు (శ్రీరంగనాథులు) దేవేరులతో తిరుమలైకు వేంచేసి ధ్వజస్తంభమున కెదురుగనుండు రంగమండపమున కొంతకాలం భక్తులకు సేవసాయించినారట. ఆ కారణంగానే **"కజ్గులుమ్ పగలుమ్."** అను శ్రీరంగనాథుని గూర్చియుండు దశకము (తిరువాయిమొழி 7-2-) ఇక్కడ అనుసంధింపబడుచున్నది.

ఈ సన్నిధిలో స్నపన బేరముగా నున్న **"అழగప్పిరానార్"** అనుమూర్తియే శయ్యా బేరముగను సేవలనందుకొనుచున్నారు. కాని ధనుర్మాసం నెలరోజులు మాత్రం శ్రీవైఖానసాగమం ప్రకారం **శ్రీ కృష్ణమూర్తియే** శయ్యా బేరముగ శయనసేవను అనుగ్రహించుచుండును.

ఈ సన్నిధిలో శ్రీరామచన్ద్రుడు సీతా లక్ష్మణులతో సేవ సాయించుచున్నారు. ఇందుకు కారణమేమనగా;

దక్షిణ మధురకు సమీపమునగల "కురువిత్తురై" అను గ్రామమున "విశ్వంభరుడు" అనుమహర్షికి సాక్షాత్కరించినట్టి అభయప్రద శ్రీరామచంద్రుని (విభీషణునకు అభయమిచ్చిన శ్రీరామచంద్రుని) ఆలయం ఉండేది. ఆ ఆలయంలో రామలక్ష్మణుల విగ్రహములు మాత్రము ఉండేవి. కొన్ని ఉపద్రవముల వలన ఆ విగ్రహములను అచటి భక్తులు తిరుపతికి తీసికొనిపోయి భగవద్రామానుజులకు నివేదించినారట. ఆసమయంలో శ్రీమద్రామాయణమున అభయప్రదాన ఘట్టం కాలక్షేపం జరుగుచుండినందు వలన ఆస్వామియే స్వయముగా వేంచేసినాడని తలచి రామానుజులు సీతాదేవి యొక్క అర్చామూర్తిని కూడ వారి ప్రక్కనే ప్రతిష్ఠింపజేసి తిరుక్కల్యాణ మహోత్సవం జరిపించి తిరుమలైలోని తిరువేంగడ ముడైయాన్ సన్నిధిలో వేంచేపింప చేసినారు. ఆ మూర్తులను నేడు మనం సేవింపవచ్చును. తప్పక సేవించాలి.

ఇట్లే తిరుపతిలోని గోవిందరాజ స్వామి సన్నిధిలో "ఆండాళ్" అర్చా విగ్రహాన్ని ప్రతిష్ఠింపచేసినారు. గోవిందరాజస్వామి వారి ఉత్తరమాడ వీధిలో ఒక అగ్రహారాన్ని నిర్మించారు. దీనికి "శ్రీరామానుజపురం" అనిపేరు. తమ ప్రతినిధిగా సన్నిధికైంకర్యములు పర్యవేక్షించుటకు "సేనాపతిజీయర్" అనువారికి హనుమన్ముద్రిక నిచ్చి నియమించినారు. ఆముద్రికతోనే నేటికిని రాత్రిభాగమున సన్నిధి తాళములకు సీలు వేయబడుచున్నది.

ఇట్లే **"తిరుక్కురుపై"** అనే గ్రామంలో **"కురువైనంబి"** అనుకుమ్మరి శ్రీవేఙ్కటాచలపతిని అనన్య భక్తితో సేవించుచుండెడివాడు. అతడు పరమపదించు

సమయమున ఇచట స్వామి తిరుమంజనమునకై కిరీటాద్యాభరణములను తొలగించుకొని యుండి సహజ రూపంతోనే ఆభక్తునకు దర్శనిమిచ్చి పరమపదం అనుగ్రహించినాడట. ఈవృత్తాన్తాన్ని విని భగవద్రామానుజులు ఆ గ్రామంలో ఒక ఆలయం నిర్మించి అందు కిరీటాదులు లేక సహజరూపంలో ఉండు శ్రీవేఙ్కటా చలపతిని, ఆప్రక్కనే "కురువై నంబి" విగ్రహాన్ని ప్రతిష్ఠించారట. ఈకురువై నంబి స్వామికి అంతరంగికులు.

శ్రీఆళవన్దారుల ఆజ్ఞానుసారం పెరియతిరుమలనంబిగారు భగవద్రామానుజులకు తిరుమల అడివారంలో శ్రీమద్రామాయణ కాలక్షేపం సాయించేవారట. ప్రతినిత్యం తిరుమలలో తీర్థ కైంకర్యాదికం పూర్తిచేసికొని కొండదిగివచ్చి కాలక్షేపం సాయించు చుండుట చేత మాధ్యాహ్నిక సేవ లభించుట లేదే అనివారు ఒక రోజు చింతించుచుండగా స్వామి ఆరాత్రి వారికి స్వప్నంలో ఇదిగో మీకు సేవ సాయించుచున్నాము చూడండి అనిపలికినారట. మరునాడు తీర్థ కైంకర్యం పూర్తి చేసికొని అడివారమునకు రాగానే అక్కడ ఒక చింతచెట్టు క్రింద ఒక బండమీద స్వామిపాదములు దర్శనమిచ్చినవి. శ్రీరామానుజులు తమ ఆచార్యులద్వారా ఆ అద్భుత వృత్తాన్తాన్ని విని అచట ఆలయాన్ని నిర్మించి ఆళ్వార్లను కూడ అందు ప్రతిష్ఠింపజేసి నిత్యారాధన జరిగేలాగున ఆదేశించారట. అందే శ్రీమద్రామాయణ కాలక్షేపం పూర్తిగావించినారు.

## మణవాళమామునుల సన్నిధి సేవాక్రమము

**శ్రీమతి మహతిద్వారే చిఞ్చాం కాఞ్చన మయం చ బలిపీఠమ్**
**స్థాన మథ యామునేయం చమ్పకతరు సమ్పదం ప్రతీహారమ్**
**వినతా తనయ మహానస మణి మణ్డపం కనక మయ విమానవరమ్**
**పృతనాపతి యతిధుర్యౌ నరహరి మథ నమత జానకీ జానిమ్ ।**
**అథపునరనఘ మణిద్యుతి కవచిత కమలా నివాసభుజ మధ్యమ్ ।**
**కలయత కమల విలోచన మంజనగిరి నిధి మనంజనం పురుషమ్ ।**

సంపత్కరమైన గోపుర ద్వారమును; అత్తాళిప్పుళిని (చింతచెట్టు) బంగారు బలిపీఠము; యమునైత్తుఱైవర్ అనుపుష్పమండపమును; సంపంగి చెట్లతో నిండిన ప్రాకారమును, గరుడాళ్వార్లను; తిరుమడప్పళ్లిని (వంటశాల) తిరుమామణి మండపమును; స్వర్ణమయమైన ఆనందనిలయ విమానమును; సేనమొదలియాళ్వార్లను; యెంబెరుమానార్లను; నరసింహస్వామిని శ్రీరామచంద్రులను సేవించిరి. అటుపిమ్మట ధరించిన మణికాంతులచే ప్రకాశితమైన లక్ష్మీదేవికి నిత్యనివాసమైన వక్షస్థలము గలవాడును, అంజనాద్రికి నిధి వంటివాడును; అఖిలహేయ ప్రత్యనీకుడును; పరమపురుషుడునగు శ్రీనివాసుని కనులార సేవించిరి.

## తిరుమలలో అధ్యయన ఉత్సవమ్

తిరుమలై లో అధ్యయనోత్సవములు ఇయఱ్పాతో ప్రారంభమై 23 దినములు నాలాయిరం సేవతో పూర్తి అవుతాయి. ఆపైన ఒక్కరోజు వరాహప్పెరుమాళ్ సన్నిధిలో అధ్యయనోత్సవం జరుగును. అధ్యయనోత్సవ శాత్తుముఱై రోజున తిరుమామణి మణ్డపంలో తిరువాయిమొழி శాత్తుముఱై పూర్తి అయి తీర్థ ప్రసాద గోష్ఠి అవడంతోనే భగవద్రామానుజులు సన్నిధికి ప్రదక్షిణంగా తిరువేంగడముడై యాన్ సన్నిధికి వేంచేసి పెరుమాళ్ల యెదుట "వెన్నుమాలై యిట్టాన్" మండపంలో ఉండగా జీయంగార్లు, ఆచార్యపురుషులు తిరుప్పల్లాండులోని రెండు పాశురములను, "ఒழிవిల్ కాలమెల్లాం, ఉలగముణ్డ పెరువాయా, తాయే తన్దైయెన్నుమ్, అనేపాశురాలను "అఖిల భువన జన్మ స్థేమ" ఇత్యాది శ్లోకాన్ని శరణాగతి గద్యంలోని పూర్వ ఖండాన్ని అనుసంధానం చేస్తారు. అంతట భగవద్రామానుజులకు శ్రీనివాసుని పుష్పమాలా శఠగోపాదులతో మర్యాదలు జరుగును. ఆపైన తిరిగి పై పాశురములను అను సంధింతురు. ఇట్లు మంగళాశాసన కార్యక్రమం పూర్తికాగానే భగవద్రామానుజులు సన్నిధికి ప్రదక్షిణంగా తమ సన్నిధికి వేంచేయుదురు.

"చివరి రోజున తణ్ణీరముదువళి తిరుత్తుఱై" అను ఉత్సవం జరుగును. ఆరోజు భగవద్రామానుజులు పాపవినాశం వేంచేసి తీర్థం తీసికొనిరాగా ఆతీర్థంతో పెరుమాళ్లకు తిరుమంజనం జరుగుతుంది. ఇది పెరియ తిరుమలనంబిగారి కైంకర్యానికి స్మారకము.

ఆపైన తిరుపతిలో గోవిందరాజ స్వామివారిసన్నిధిలో అధ్యయనోత్సవములు జరుగును. చివర రోజున నమ్మాళ్వార్లకు పరమ పదోత్సవం జరుపబడుతుంది. ఈ అధ్యయనోత్సవములు పూర్తి అయిన తరువాతనే తిరుమల తిరుపతులలోని సన్నిధులలోను, ఆచార్య పురుషుల తిరుమాళిగలలోను దివ్యప్రబంధాను సన్ధానం ప్రారంభమగును.

## తిరుమల తిరుపతులలోని క్షేత్రములు

దిగువతిరుపతిలో గోవిందరాజస్వామి సన్నిధి, చక్రవర్తి తిరుమగన్ (శ్రీరాములవారి) సన్నిధి ప్రముఖముగా తప్పక సేవింపవలసినవి. ఈ సన్నిధులలో గల ఆళ్వారాచార్యుల సన్నిధులును తప్పక సేవింపవలెను. ఈమధ్యే తిరుమల తిరుపతి దేవస్థానముల ధర్మాధికారులైన (శిరియకేళ్వి) శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యేత్యాది శ్రీ శ్రీ శ్రీ చిన్నజీయర్ స్వామి నిర్మించిన సన్నిధియు, యాత్రికులకు అవశ్యము దర్శనీయమై యున్నది. ఈ సన్నిధిలో వేంచేసియున్న శ్రీసుదర్శన నారసింహమూర్తి భక్తులపాలిట కల్పవృక్షము.

తిరుచానూర్‌లోని శ్రీపద్మావతీ అమ్మవారి ఆలయము తప్పక సేవింపదగినది. యాత్రికులు తొలుత శ్రీపద్మావతీ అమ్మవారిని సేవించి ఆపై తిరుమలకు వెళ్ళి స్వామిని సేవించడం సంప్రదాయం.

## "తిరుమల శ్రీనివాసునిపై ప్రముఖ గ్రంథములు"

భగవద్రామానుజులు తిరుమల శ్రీనివాసుని యెదుటనే వేదార్థసంగ్రహమును ఉపన్యసించినారు.

**అఖిల భువన జన్మ స్థేమ భంగాది లీలే**
**వినత వివిధభూత వ్రాత రక్షైక దీక్షే**
**శ్రుతి శిరసి విదీప్తే బ్రహ్మణి శ్రీనివాసే**
**భవతు మమ పరస్మిన్ శేముషీ భక్తిరూపా ।**

అని ఈస్వామి ప్రార్థనతో శ్రీభాష్య రచనకు ఇచటనే శ్రీకారం చుట్టారు. కావుననే శ్రీభాష్యకారుల ఆలయం ఈఆలయప్రాకారంలో ఉన్నతంగా దర్శనమిచ్చుచున్నది. మరియు ఇచట వారు జ్ఞానముద్రతో వేంచేసియున్నారు. వీరు శ్రీవేంకటాచలాధీశ శంఖచక్ర ప్రదాయకులు గదా!

ఈస్వామిని స్తుతించు స్తోత్రాలలో శ్రీవేంకటేశ ఘంటావతారంగా ప్రసిద్ధులైన శ్రీవేదాన్త దేశికులవారి **"దయాశతకమ్"** అగ్రగణ్యమైనది. తొలుత శ్రీవేదాన్త దేశికుల వారికిని, తర్వాత మణవాళ మహామునులకునుకరుణైక పాత్రమ్" అని కీర్తింపబడుచు శ్రీమన్మణవాళమహామునుల అష్టదిగ్గజములలో నొకరైన " శ్రీప్రతివాది భయంకరం అణ్ణన్" అను ఆచార్య తల్లజులు ఈస్వామినిగూర్చి సుప్రభాత, స్తోత్ర, ప్రపత్తి; మంగళాశాసన శ్లోకాలను అనుగ్రహించినారు. ఇవినేడును అనుదినం ఉషఃకాలసేవలో స్వామియొద్ద అనుసంధింపబడుచు బహుళప్రచారం పొందియున్నవి.

శ్రీ గోవిందరాజాచార్యులు అనే మహనీయులు, శ్రీమద్రామాయణమునకు "గోవిందరాజీయమ్" అనే వ్యాఖ్యను ఇచటనే వ్రాసినారు. శ్రీమత్పరమ హంసేత్యాది శ్రీ శ్రీ శ్రీ పరకాల మఠం జీయర్‌స్వామివారు (మైసూర్) "అలంకారమణిహారం" అనే అలంకార శాస్త్ర గ్రంథాన్ని అనుగ్రహించారు. అందు ఉదాహరణ శ్లోకాలను శ్రీ శ్రీనివాసుని స్తుతించునట్లు వ్రాసియున్నారు. పదకవితా పితామహుడైన శ్రీతాళ్లపాక అన్నమాచార్యులవారు తమగేయాలలో శ్రీవేంకటాచలపతిని మైమరచి తనివి తీర కీర్తించారు. తామ్రపత్రములపై లిఖింపబడిన ఆగీతాలను తి.తి. దేవస్థానం వారు స్వరపరచి చక్కగా ముద్రించి ప్రజలకు అందించారు. ఇట్లే అన్నమాచార్యుల వారి కుటుంబ సభ్యులును వేంకటా చలపతిని వేనోళ్ళ కీర్తించినారు. పురందరదాసు, త్యాగరాజు మున్నగు గాయక సార్వభౌములెందరో తమ తమ మాతృభాషలలో స్వామిని కీర్తించి తరించినారు.

మహాభక్తురాలగు తరిగొండ వేంగమాంబ యీస్వామి వై భవమును కావ్యముగా రచించుటయునకు [illegible] లను ప్రత్యక్షముగా నిరూపించినది.

## తిరుమల తిరుపతి దేవస్థానం వారి సేవలు

శ్రీవేంకటాచలపతి యావద్భారతమున ఆరాధింపబడు దేవాధిదేవుడు. కావుననే "**వేఙ్కటాద్రి సమం స్థానం బ్రహ్మాండే నాస్తి కించన**

**వేఙ్కటేశ సమో దేవో నభూతో నభవిష్యతి ।** అని

ప్రస్తుతించారు మన పెద్దలు.

అట్టి ఈ క్షేత్రాన్ని నేడు తిరుమల తిరుపతి దేవస్థానం పాలకవర్గమువారు అధికారులు అనన్యాదృశమైన రీతిలో తీర్చిదిద్దుతున్నారు. నానాటికీ యాత్రికుల రద్దీ పెరుగుతుండడంతో ఆధునిక సౌకర్యాలతో, అనేక సత్రములను కాటేజీలను, కల్యాణ కట్టలను ఉచిత భోజనశాలలను, ప్రసాద వినియోగములను; ఉచిత వైద్యశాలలను, ఉపన్యాస వేదికలను, క్యూ కాంప్లెక్సులను, వానిలో టీవీల ద్వారా సన్నిధి కార్యక్రమాలను మున్నగు వానిని ఏర్పాటుచేసి చక్కగా నిర్వహించు చున్నారు. నేడు తిరుమలయాత్ర పరమాహ్లాదకర యాత్రగా నున్నది. తిరుపతిలో తి.తి. దేవస్థానం వారు నిర్వహించుచున్న పురావస్తు ప్రదర్శనశాల; ఓరియంటల్ మానిస్క్రిప్టు లైబ్రరీ, ప్రాచీన ఓరియంటల్ కళాశాల, వేద ఆగమ, దివ్య ప్రబన్ధ పాఠశాల, శిల్ప సంగీత నృత్య కళాశాల, అనేక కళాశాలలు, ఉన్నత పాఠశాలలు ప్రాచీన నవీన విజ్ఞాన వికాసములకు తోడ్పడుచున్నవి.

ఇట్లే వీరు నిర్వహించుచున్న శ్రీ అన్నమాచార్య ప్రాజెక్టు; ఆళ్వార్ దివ్యప్రబన్ధ ప్రాజెక్టు; భాగవత ప్రాజెక్టు; ధార్మిక గ్రంధముల ముద్రణకు సహాయము మున్నగునవి బహుముఖములుగా ధర్మ ప్రచారమునకు తోడ్పడుచున్నవి. అనేక నగరములలో కల్యాణ మండపములు నిర్మించి శిథిలములైన దేవాలయములను జీర్ణోద్ధరణగావించి ఆయాప్రాంత వాసులకు మహోపకారము చేయుచున్నారు.

"వృక్షోరక్షతి రక్షితః" అనే నినాదంతో తిరుమల పరిసర ప్రాంతములను ఘనవన శ్యామలములను గావించుచున్నారు. వీరేర్పాటుచేసిన జంతువుల పార్కులు, అభయారణ్యములు, అనాథశరణాలయాలు మున్నగునవి జీవకారుణ్యానికి నిదర్శనం.

**మార్గము:** ఈ క్షేత్రమునకు భారతదేశపు నలుమూలలనుండి ప్రయాణ వసతి కలదు. ఇంతటి ప్రయాణ సౌకర్యములు మరియే క్షేత్రమునకును లేవు.

# తిరుమల యాత్రకు వెళ్ళే భక్తులకు విజ్ఞప్తి

భక్తులారా ! భాగవతోత్తములారా!

శక్తి సామర్థ్యములు గల స్త్రీ పురుషులు ఆబాలగోపాలము గోవింద నామోచ్చారణం చేస్తూ కాలినడకతో కొండనెక్కి వెళ్ళండి అవసరమైతే తిరిగివచ్చేటప్పుడు బస్‌లో రావచ్చును.

స్నానంచేసి భారతీయ సంప్రదాయం ప్రకారం శుచి శుభ్రమైన వస్త్రములను ధరించి వారి వారి సంప్రదాయానుసారం బొట్టు పెట్టుకొని ( శ్రీవేంకటేశ్వరుని సన్నిధానమున ఊర్ధ్వ పుండ్రమును ధరించుట (నామము) సంప్రదాయము) శ్రద్ధా భక్తులతో సేవించండి.

స్వామివారిని సేవింపనిదే భుజింపకండి. ఆలస్యమగు పక్షమున శక్తిలేనిచో పండ్లు పాలు వంటివి తగుమాత్రం తీసికొనండి. ధ్వజస్తంభం వద్ద నమస్కరించి మనస్సులో శ్రీహరి రూపాన్ని ధ్యానిస్తూ గోవింద నామం జపిస్తూ లోనికి వెళ్ళండి .ప్రధాన ద్వారం దగ్గరకురాగానే గరుడాళ్వార్లకు నమస్కరించండి. ద్వారపాలకులకు అంజలి ఘటించి వారి అనుమతిని తీసికొని ఎదురుగాసేవ సాయించుచుండు స్వామివారి దివ్యమంగళ విగ్రహమును కండ్లు చెమర్చగా, శరీరం పులకరింపగా; గద్గదమగు కంఠముతో, పారవశ్యంతో దర్శించండి.

శ్రీవారి పాదారవిందములు; పీతాంబరము, శ్రీహస్తములు; వక్షస్థలమునగల శ్రీభూదేవులను శంఖచక్రములను, ముఖారవిందమును; రత్నఖచిత కిరీటమును దర్శించి తిరిగి పాదారవింద పర్యంతము సేవించండి. అంజలి ఘటించి ఈక్రింది శ్లోకాలను,పాశురాలను పఠించండి.

**పార్థాయ తత్సదృశ సారథినా త్వయైవ**
**యౌ దర్శితౌ స్వ చరణౌ శరణం వ్రజేతి**
**భూయోఽపి మహ్య మిహతౌ కరర్శితౌతే**
**శ్రీ వేంకటేశ చరణౌ శరణం ప్రపద్యే**
**వినావేంకటేశం ననాథో ననాథః**
**సదావేంకటేశం స్మరామి స్మరామి**
**హరే వేంకటేశ ప్రసీద ప్రసీద**
**ప్రియం వేంకటేశ ప్రయచ్ఛ ప్రయచ్ఛ.**

ఈ శ్లోకాలను అనుసంధానం చేయండి.

దివ్యప్రబన్ధంవచ్చినవారు "అగలిగ్గిల్లేన్ ఇఱైయుమెన్ఱు" తాయేత్తన్దై యెన్ఱుమ్ అనే పాశురాలను అనుసంధానం చేయండి.

తిరిగివచ్చునపుడు స్వామికి వెన్నుచూపరాదు. ఈ నియమాలను పాటించి ఈ చెప్పిన విధంగా స్వామిని దర్శిస్తే భగవదనుగ్రహం తప్పక కలుగుతుంది. కావున ప్రతియొక్కరు తిరుమల యాత్ర చేయండి. స్వామి అనుగ్రహాన్ని పొందండి.

పా॥ ఉళన్ కణ్డాయ్ నన్నెఞ్జే; ఉత్తమ నెన్ఱు
ముళన్ కణ్డాయ్; ఉళ్ళువారుళ్ళ - త్తుళన్ కణ్డాయ్
వెళ్ళత్తి నుళ్ళానుమ్; **వేఙ్గడత్తు మేయానుమ్**
ఉళ్ళత్తి నుళ్ళా నెన్ఱోర్

పొయిగై ఆళ్వార్ - ముదల్ తిరువన్దాది 99

పా॥ మనత్తుళ్ళాన్; **వేఙ్గడత్తాన్** మాకడలాన్; మత్తుమ్
నినైప్పరియ; నీళరఙ్గత్తుళ్ళాన్ - ఎనైప్పలరుమ్
తేవాతిదేవ; నెనప్పడువాన్; మున్నొరునాళ్
మావాయ్ పిళన్ద మకన్.

పూదత్తాళ్వార్ - ఇరణ్డాన్దిరువన్దాది 28

పా॥ ఇఱైయాయ్ నిలనాకి; యెణ్డిశైయున్దానాయ్
మఱైయాయ్; మఱైప్పొరుళాయ్ వానాయ్ - పిఱైవాయ్న్ద
వెళ్ళత్తురువి విళఙ్గొలినీర్; **వేఙ్గడత్తాన్**
ఉళ్ళత్తి నుళ్ళే యుళన్.

పేయాళ్వార్లు - మూన్ఱాన్దిరు వన్దాది 39.

పా॥ కడైన్ద పాఱ్కడఱ్కిడన్దు; కాలనేమియై క్కడిన్దు,
ఉడైన్ద వాలి తన్దనుక్కు; ఉదవవన్ది రామనాయ్,
మిడైన్ద వేழ మరఙ్గళుమ్; అడఙ్గవెయ్దు, **వేఙ్గడ**
మడైన్ద మాలపాదమే; అడైన్దు నాళుముయ్మినో

తిరుమழிశై ఆళ్వారు - తిరుచ్చన్ద విరుత్తమ్ 81

పా॥ అగలకిల్లే నిఱైయుమెన్ఱు అలర్ మేల్ మఙ్గైయుఱై మార్పా;
నిగరిల్ పుగழా యులగమూన్ఱుడైయా; యెన్నైయాళ్ వానే,
నిగరిల మరర్ మునిక్కణఙ్గళ్ విరుమ్బుమ్; **తిరువేఙ్గడత్తానే**
పుగలొన్ఱిల్లా వడియే; నున్నడిక్కీழ் అమర్న్దు పుగున్దేనే ॥

నమ్మాళ్వార్లు - తిరువాయిమొழி 6-10-10

పా॥ శెడియాయ వల్ వినైగళ్ తీర్కుమ్ తిరుమాలే
నెడియానే **వేఙ్గడవా** నిన్ కోయిలిన్ వాశల్
అడియారుమ్ వానవరుమ్ అరమ్బైయరుమ్ కిడన్దియఙ్గుమ్
పడియాయ్ క్కిడన్దు ఉన్ పవళవాయ్ కాణ్బేనే

కులశేఖరాళ్వార్లు - పెరుమాళ్ తిరుమొழி 4-9

పా॥ శెన్నియోఙ్గు; **తణ్ తిరువేఙ్గడ ముడైయాయ్;** ఉలకు
తన్నై వాழనిన్ఱనమ్బి !; తామోదరా ! శదిరా !;
ఎన్నైయు మెన్నుడై మైయ్యై యు; మున్ శక్కరప్పొఱి యొత్తికొణ్డు;
నిన్నరుళే పురిన్దిరున్దేన్; ఇనియెన్ ? తిరుక్కుఱిప్పే.

పెరియాழ్వార్లు - పెరియాழ్వార్ తిరుమొழి 5-4-1.

పా॥ విణ్ణీల మేలాప్పు; విరిత్తాఱ్పోల్ మేగఙ్గాళ్;
తెణ్ణీర్పాయ్ **వేఙ్గడత్తెన్;** తిరుమాలుమ్ పోన్దానే;
కణ్ణీర్గళ్ ములై క్కువట్టిల్; తుళిశోర చ్చోర్వేనై
పెణ్ణీర్మై యీడழిక్కుమ్;మిదు తమక్కోర్ పెరుమైయే.

ఆణ్డాళ్ - నాచ్చియార్ తిరుమొழి 8-1.

పా॥ మన్దిపాయ్; **వడవేఙ్గడమామలై;** వానవర్గళ్
శన్ది శెయ్యనిన్ఱాన్; అరఙ్గత్తరవినణైయాన్;
అన్దిపోల్ నిఱత్తాడైయుమ్; అదన్మేలయనై పడైత్తదోరెழిల్
ఉన్దిమేల దన్ఱో అడియే నుళ్ళత్తి న్నుయిరే.

తిరుప్పాణి ఆழ్వార్లు - అమలనాది పిరాన్ 3

పా॥ తాయే తన్దై యెన్ఱుమ్; తారమేక్కిళై మక్కళెన్ఱుమ్;
నోయే పట్టొழిన్దే; న్నున్నై క్కాణ్బదోరాశైయినాల్;
వేయేయ్ పూమ్బొழిల్ శూழ్;విరయార్ **తిరువేఙ్గడవా**
నాయేన్ వన్దడైన్దేన్; నల్గియాళెన్నై కొణ్డరుళే ॥

తిరుమంగై యాழ్వార్లు - పెరియతిరుమొழి 1-9-1

ప్రశమిత కలిదోషాం ప్రాజ్యభోగానుబన్ధాం
సముదితగుణజాతాం సమ్యగాచారయుక్తామ్,
శ్రితజన బహుమాన్యాం శ్రేయసీం వేంకటాద్రౌ
శ్రియముపచిను నిత్యం శ్రీనివాస త్వమేవ.

సమస్తజననీం వందే చైతన్య స్తన్యదాయినీమ్
శ్రేయసీం శ్రీనివాసస్య కరుణామివ రూపిణీమ్ ॥
"శ్రీమద్వేదాన్తదేశికులు"



96.B. శ్రీనివాసర్ - తిరుమలై

Malayappan - Tirumalai

# ❀ 97. శింగవేళ కున్ఱమ్ (అహోబిలం) 2 ❀

శ్లో॥ తీర్థై రింద్ర సుపాపనాశ నరసింహాఖ్యానకై రంచితే
లక్ష్మీం ప్రాప్య గుహం విమాన ముపయన్ శ్రీనారసింహో హరిః ।
దివ్యే హోబిల పట్టణే విజయతే ప్రాచీదిశాస్యాననో
ప్రహ్లాదాక్షి పదం గతః కలిరిపు శ్రీమచ్ఛఠారి స్తుతః ॥

వివః శ్రీ నరసింహస్వామి - లక్ష్మీదేవి - ఇంద్ర - పాపనాశ - నరసింహ తీర్థములు - గుహ విమానము - తూర్పుముఖము - కూర్చున్నసేవ - ప్రహ్లాదునకు ప్రత్యక్షము - నమ్మాళ్వార్ - తిరుమంగై ఆళ్వార్ కీర్తించినది.

విశే: ఈక్షేత్రమున నవనారసింహులు కలరు. ఇక్కడగల అహోబిల మఠములోను లక్ష్మీనరసింహర్ వేంచేసియున్నారు.

**లక్ష్మీనరసింహం** - దిగువ అహోబిలం

**సత్తిరాంత నరసింహం,**

**యోగనరసింహం** :- తేరువీధిలో 2 కి.మీ. దూరమున

**కారంగి నరసింహం** :- పై అహోబిలం

**ఉగ్రనరసింహం** :- దిగువ అహోబిలం

**భార్గవ నరసింహం** :- గరుడాద్రి

**పర్మిలిధి నరసింహం** :- వేదాద్రి

**వరాహ నరసింహం**

**ప్రహ్లాద నరసింహం** :- గంధాద్రి

అహోబిల పర్వతము చుట్టును అనేక సన్నిధులు తీర్థములు కలవు.

**మార్గము:** శైన్నై - బొంబాయి రేల్వేమార్గంలో గల కడప స్టేషన్‌లోదిగి అక్కడనుండి బస్‌లో 90 కి.మీ దూరంలోని "అర్లకట్ట" అనేచోటదిగి అక్కడ నుండి వేరుబస్‌లో 25 కి.మీ దూరంలో ఈక్షేత్రం చేరవచ్చును. నంద్యాల నుండి 45 కి.మీ. బస్ సౌకర్యం కలదు. అన్నివసతులు కలవు.

పా॥ అజ్గణ్ ఞాలమఞ్జ అజ్గోరాళరియాయ్, అవుణన్
పొజ్గవాగమ్ వళ్ళుగిరాల్; పోఴ్న్ద పునిద నిడమ్;
పైజ్గణ్ణై క్కొమ్బుకొణ్డు; పత్తిమై యాల్; అడిక్కీఴ్చ్
చెజ్గణాళియిట్టిఱైఞ్జుమ్ శిజ్గవేఴ్; కున్ఱమే
తిరుమంగై ఆழ్వార్లు - పెరియ తిరుమొழి 1-7-1.

# ❀ 98. తిరువయోధ్యై - 3 ❀

శ్లో॥ భాతి శ్రీ సరయూ సరిత్తట గతే శ్రీమానయోధ్యా పురే
శ్రీమత్పుష్కల దేవయాన నిలయ సత్యాఖ్య కాసారకే ।
సీతాలిఙ్గిత మూర్తిరుత్తర ముఖ శ్రీరామ నామా హరి
స్త్వాసీనో భరతాభిర్మౌని గణై ర్దేవ్యైచ దృష్ట స్సదా ।
పరాంకుశ కలిధ్వంసి కులశేఖర సూరిభిః
విష్ణుచిత్తేన మునినా మంగళై రభి సంస్తుతః ।

**వివ:** శ్రీరామచంద్రులు (రఘునాయకన్) సీతాదేవి - సరయూనది - పుష్కల విమానము - సత్యపుష్కరిణి - ఉత్తరముఖము - కూర్చున్నసేవ - భరతునకు దేవతల్లకు ప్రత్యక్షము. నమ్మాళ్వార్ - కలియన్ - కులశేఖరాళ్వార్ - పెరియాళ్వార్ - తొండరడిప్పొడి యాళ్వార్ కీర్తించినది.

**విశే:** ముక్తి ప్రద క్షేత్రములలో నొకటిగా కీర్తింపబడినది. సరయూనదికి సమీపమున శ్రీరంగనాథుల సన్నిధి కలదు. ఇచట దక్షిణ దేశ అర్చక స్వాములు గలరు.

**తిరునక్షత్ర తనియన్:**

చైత్రేమాసే సితే పక్షే నవమ్యాంచ పునర్వసౌ
మధ్యాహ్నే కర్కటేలగ్నే రామోజాత స్స్వయంహరిః

**మార్గము:** కాశి - వారణాసి - లక్నో రైలుమార్గంలో ఫైజాబాద్ స్టేషన్‌లో దిగి బస్‌లో 10 కి.మీ వెళ్ళి ఈ క్షేత్రం చేరవచ్చును. ఇచట అన్ని సౌకర్యాలు కలవు.

పా॥ అఙ్గణెడుమదిళ్ పుడై **శూழ் యోత్తి యెన్నుమ్**
అణినగరత్తులగనైత్తుమ్ విళక్కుమ్ శోది
వెఙ్గదిరోన్ కులత్తుక్కోర్ విళక్కాయ్‌త్తోన్ఱి
విణ్ముழுదు ముయ్యక్కొణ్డ వీరన్ఱన్నై
శెఙ్గణెడుమ్ కరుముగిలై యిరామన్ఱన్నై
త్తిల్లై నగర్ తిరుచ్చిత్తిర కూడన్దన్నుళ్
ఎఙ్గళ్ తనిముదల్వనై యెమ్బెరుమాన్ఱన్నై
యెన్ఱుకొలో కణ్‌కుళిర క్కాణునాళే
కులశేఖరాழ்వార్లు - పెరుమాళ్ తిరుమొழி 10-1.

# ❋ 99. నైమిశారణ్యం - 4 ❋

**శ్లో॥** దివ్య విశ్రాంత తీర్థాఢ్యే నైమిశారణ్య పట్టణే ।
**పుండరీక లతా నాథో దేవరాజాహ్వయో హరిః ।**
**విమానం శ్రీహరిం ప్రాప్య ప్రాచీ వక్త్ర స్థితి ప్రియః ।**
**దేవర్షీంద్ర సుధర్మాక్షి ప్రత్యక్షః కలిజిన్నుతః ।**

**వివ:** దేవరాజన్ - పుండరీక వల్లి - దివ్య విశ్రాంత తీర్థము - శ్రీహరి విమానము - తూర్పుముఖము - నిలచున్నసేవ - దేవర్షులకు ఇంద్రునకు - సుధర్మునకు ప్రత్యక్షము. తిరుమంగై ఆళ్వార్ కీర్తించినది.

**విశే:** ఇచట మఠములు, రామానుజ కూటములు కలవు. వనరూపిగా నున్న స్వామికే ఆరాధనము ఆళ్వార్లు కీర్తించిన సన్నిధిగాని పెరుమాళ్లు గాని యిచటలేరు. తిరుమంగై ఆళ్వార్లు వనరూపిగా నున్నస్వామినే కీర్తించిరని కొందరు పెద్దలు చెప్పుదురు. స్వయం వ్యక్త క్షేత్రము. వ్యాస - శుక - సూతులకు సన్నిధులు గలవు. సూత పౌరాణికుల మఠమున అనేక తాళ పత్ర గ్రంధములు గలవు.

ఒకప్పుడు మునులు బ్రహ్మవద్దకు పోయి భూమండలమున తపము చేయుటకు తగిన స్థలమేదని ప్రశ్నింపగా బ్రహ్మ దర్భతో నొక వలయము చేసి భూమిపై విడచి ఇదిపడిన చోటు తపము చేయదగిన స్థలమని చెప్పెనట. ఆపడిన చోటు నైమిశారణ్యము. ఇచట గోమతీనది ప్రవహించుచున్నది. ఇచట మహర్షులు అనేక యజ్ఞయాగాదులు చేసియున్నారు. ఆ సమయములో సూతుడు అష్టాదశ పురాణములను వినిపించెను.

**మార్గము:** లక్నో - బాలాము మధ్యగల శాండిలా స్టేషన్‌కు 35 కి.మీ కలకత్తా - డెహ్రాడూన్ రైలు మార్గములో బాలమార్ జంక్షన్ నుండి సీతాపూర్ రైలులో నైమిశారణ్యం స్టేషన్. అక్కడ నుండి 3 కి.మీ బండిలోగాని నడచిగాని వెళ్లవచ్చును. అహోబిల మఠం రామానుజ కూటం ఉన్నాయి.

**పా॥** వాణిలాముఱువల్ శిఱునుదల్ పెరున్దోళ్; మాదరార్ వనములై ప్పయనే
పేణినేన్; అదనై ప్పిఱ ప్పెనక్కరుది ప్పేదై యేన్ పిఱవినో యఱుప్పాన్
ఏణిలే నిరున్దే నెణ్ణినే నెణ్ణి; యిళై యవర్ కలవియిన్దిఱత్తై
నాణినేన్ వన్దున్ తిరువడి యడైన్దేన్; **నైమిశారణియత్తుళెన్దాయ్.**

తిరుమంగై ఆళ్వార్లు - పెరియతిరుమొழி 1-6-1

## ❋ 100. శాళక్కిఱామం (సాలగ్రామమ్) - 5 ❋

శ్లో॥ గండకీ సరసస్తీరే చంద్ర తీర్థేన శోభితే ।
సాలగ్రామ పురశ్రేష్ఠే కనకాఖ్య విమానగః ॥
శ్రీ మూర్తిదేవ శ్శ్రీ దేవ్యా కుబేరోముఖ సంస్థితః ।
గండకీ గణికా రుద్ర బ్రహ్మణా మక్షిగోచరః
శ్రీ విష్ణుచిత్త కలిజిత్ స్తుతి భూషిత విగ్రహః ॥

వివః శ్రీమూర్తి పెరుమాళ్ - శ్రీదేవి తాయార్ - గండకీ నది - చంద్ర తీర్థము - కనక విమానము - ఉత్తరముఖము - నిలచున్నసేవ - గండకీ అనువేశ్యకు - శివునకు - బ్రహ్మకు ప్రత్యక్షము - పెరియాళ్వార్ తిరుమంగై ఆళ్వార్ కీర్తించినది.

విశేః స్వయం వ్యక్తక్షేత్రము. నేపాల్ దేశమున గలదు. ఖాట్మండుకు 175 మైళ్ళ దూరమున గల ముక్తినాథ్ క్షేత్రమే సాలగ్రామము. (ఖాట్మండుకు 65 మైళ్ళ దూరమున గల దామోదర కుండమే సాలగ్రామమని కొందరి అభిప్రాయము) గండకీ నది జన్మస్థానము. ఈనదిలోనే మనము ప్రతినిత్యము ఆరాధన చేయు సాలగ్రామములు లభించును.

మార్గముః నేపాల్ రాజధాని ఖాట్మాండుకు 100 కి.మీ.

పా॥ కలైయుమ్ కరియుమ్ పరిమావుమ్; తిరియుమ్ కానమ్ కడన్దుపోయ్,
శిలైయుమ్ కణైయుమ్ తుణైయాగ; చెన్డ్రాన్ వెన్డ్రిచ్చెరుక్కళత్తు;
మలైకొణ్డలై నీరణైకట్టి; మదిళ్ నీరిలజ్గై వాళరక్కర్
తలైవన్, తలై పత్తుఅఱుత్తుగన్దాన్; శాళక్కిరామ మడైనెఞ్జే.
తిరుమంగై ఆళ్వార్ - పెరియతిరుమొழி 1-5-1.

**మంచిమాట**

**ఒకనాడు ఒక శ్రీవైష్ణవులు నంబిళ్ల గారిని ఇట్లు అడిగెరి. "కాకాసురుడు పాదములపైబడి శరణువేడినను శ్రీరామచంద్రమూర్తి ఆతని కంటి నొకదానిని పోగొట్టెను గదా ! కావున శరణాగతుడైనను పూర్వకర్మను అనుభవించియే తీరవలెనా? "సాధ్య భక్తి స్తు సాహన్త్రీ ప్రారబ్ధస్యాపి భూయసీ" అనునట్లు సాధ్య భక్తి ప్రారబ్ధమునుకూడ పోగొట్టవలదా!"అందుకు నంబిళ్లైగారి సమాధానము. "నిజమే. కానీ అంతటి అపరాధియైన కాకాసురుని క్షమించి విడిచిన దానికి గుర్తుగా అట్లు చేసిరి. అంతేకాదు రెండు కళ్లతో చేయు పనిని ఒక్కకంటితోనే చేయగల ఉపకారమును సైతము చేసిరి కావున అది దండించుటయు కాదు."**



99. దేవరాజన్ - నైమిశారణ్యం
Devarajan- Naimisaranyam



శ్రీమూర్తి - సాలగ్రామం
Sri Murthy - Salagramam



101.బదరీ నారాయణన్ - బదరి

Badarinadh - Badari



102.నీలమేఘన్ - కండమెన్నుంకడినగర్

Neelameghan - Devaprayaga



# 101. బదరికాశ్రమం (బదరీనాథ్)6

శ్లో॥ శ్రీ తప్త కుండ తీర్థాఢ్యే బదర్యాశ్రమ పట్టణే ।
అరవింద లతానాథో నారాయణ సమాహ్వయః ॥
తప్తకాంచన వైమానే సురనాథ దిశాముఖః ।
పద్మాసన జ్ఞాన ముద్రా లంకృతో జపశీలవాన్ ॥
మంత్రోపదేశం కృతవాన్ నరాఖ్యస్య మునేః పురా ।
రథాంశ యోగి కలిజిత్ స్తుతో విజయతే తరామ్ ॥

**వివ:** బదరీ నారాయణుడు – అరవిందవల్లి – తప్తకుండ తీర్థము – తప్తకాంచన విమానము – తూర్పుముఖము – పద్మాసనము – జ్ఞానముద్ర – నరునకు మంత్రోపదేశము చేసిన స్థలము – పెరియాళ్వార్ తిరుమంగై ఆళ్వార్ కీర్తించినది.

**విశే:** స్వయం వ్యక్తక్షేత్రము. తిరు అష్టాక్షరీ మంత్రము అవతరించిన స్థలము. విశాలపురి యనియు తిరునామము గలదు. ఇచట స్వామి అగ్నితప్త కుండముగా వేంచేసియున్నారు. ముందుగా నారద కుండములో స్నానముచేసి పిమ్మట అగ్నికుండములో స్నానమాచరింపవలెను. ఇచట పెరుమాళ్లు మాత్రమే ధ్రువమూర్తిగా వేంచేసియున్నారు. మిగతావారు ఉత్సవమూర్తులు. ఈస్వామి ఎదుట తెరవేయరు. తిరుమంజనాదులన్నియు బహిరంగముగనే జరుగును. మంచు పడుటవలన తులామాసం పౌర్ణమినాడు (వెణ్ణకాప్పు) వెన్న సమర్పించి తలుపులు వేయుదురు. తిరిగి మేషమాసం పౌర్ణమినాడు తలుపులు తీయుదురు. సన్నిధికి వెనుకగల లక్ష్మీనృసింహ మందిరమున ఉడయవర్ వేదాంత దేశికులు మొదలగువారు వేంచేసియున్నారు. ఈ క్షేత్రమున మన శ్రీమత్ పరమహంస పరివ్రాజకాచార్య శ్రీ శ్రీ శ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయర్ స్వామివారిచే నిర్మింపబడిన సన్నిధి గలదు. ఇచటకు 1 కి.మీ. దూరములో బ్రహ్మకపాలము గలదు. ఇచటకు 8 కి.మీ. దూరమున గల వసుధార కలదు. ఇందు జలము పుణ్యులైన వారిమీదనే పడునని ప్రతీతి.

**మార్గము:** హరిద్వార్ (కలకత్తా-డెహ్రాడూన్ మార్గము) నుండి హృషీకేశ్ చేరి అట నుండి 300 కి.మీ బస్‌లో ప్రయాణించి బదరీచేరవలెను.

పా॥ పణ్డుకామరానవాఱుమ్; పావైయర్ వాయముదమ్
ఉణ్డవారుమ్, వాళ్నద వాఱుమొక్క పురై త్తిరుమి,
తణ్డుకాలావూన్ఱి యూన్ఱి; త్తళ్ళి నడవామున్;
వణ్డుపాడుమ్ తణ్డుళాయాన్ వదరివణఙ్గుదుమే

తిరుమంగై ఆళ్వార్ – పెరియతిరుమొళి 1-3-5

# ❀ 102. కండమెన్నుం కడినగర్ ❀

**(దేవప్రయాగ) 7**

శ్లో॥ శ్రీ మన్మంగళ పుణ్యతీర్థ రుచిరే క్షేత్రే ప్రయాగాభిదే
త్వాలింగ్య ప్రియ పుండరీక లతికాం శ్రీ నీలమేఘో విభుః ।
రేజే మంగళ దేవయాన నిలయః ప్రాగ్వక్త్ర సంస్థానగః
భారద్వాజ మునీక్షితః కలిరిపు శ్రీ విష్ణుచిత్త స్తుతః ॥

**వివ:** నీలమేఘ పెరుమాళ్ - పుండరీకవల్లి - మంగళతీర్థం - మంగళ విమానం - తూర్పుముఖము - నిలుచున్నసేవ - భరద్వాజమహర్షికి ప్రత్యక్షము - పెరియాళ్వార్ - తిరుమంగై ఆళ్వార్ కీర్తించినది.

**విశే:** ఈ క్షేత్రము హరిద్వారమునుండి హిమవద్గిరికి పోవుదారిలో నున్నది. హరిద్వారము నుండి ఈక్షేత్రమునకు పోవుమార్గములోనే హృషీకేశము కలదు. తపోవనము, లక్ష్మణస్వామి సన్నిధి (లక్ష్మణఝూలా) వ్యాసఘాట్- శ్రీసీతారాముల సన్నిధి కలదు. హరిద్వారమునుండి 100 కి.మీ. దూరములో ఈ కండమెన్నుం కడినగర్ క్షేత్రము కలదు. దీనినే దేవప్రయాగ యందురు. కోవెలకు వెనుక హనుమాన్ సన్నిధి గలదు. అలకనందా నది ప్రవహించు దేశము - ఆళ్వార్ కీర్తించిన పెరుమాళ్లను రఘునాథ్‌జీ అందురు.

**మార్గము:** హృషీకేశ్ నుండి బదరీమార్గంలో 70 కి.మీ దూరంలోను హరిద్వార్ - బదరీ మార్గంలో 95 కి.మీ దూరంలోను గలదు.

పా॥ తణ్డైయై మూక్కుమ్ తమయనై త్తలయుమ్ తడన్దవెన్ దాశరదిపోయ్
ఎజ్గుమ్ తన్ పుకళ్గా విరున్దరశాణ్డ; వెమ్బురుడోత్తమ నిరుక్కై,
కజ్గై కజ్గై యెన్ఱ వాశకత్తాలే; కడువినై కళైన్దిడు కిఱ్కుమ్
కజ్గైయిన్ కరైమేల్ కై తొళ్నిన్ఱ కణ్డమెన్నుమ్ కడినకరే ॥

పెరియాళ్వార్లు - పెరియాళ్వార్ తిరుమొళి 4-7-1

**మంచిమాట**

**1. ఆశ్రయింప వలసిన వానిని అన్నిటిని ఆశ్రయించి భగవంతుని కూడ ఆశ్రయించుట "భక్తి".**

**2. విడువ వలసిన వాటి నన్నింటిని విడచి తనను కూడ విడుచుట "ప్రపత్తి".**

# 103. తిరుప్పిరిది (నన్దప్రయాగ) (జోషిమఠ్) 8

శ్లో॥ పరిమళ లతికాఖ్యాం నాయకీం వీక్షమాణః
పరమ పురుషనామా భోగి భోగే శయానః ।
కలిరిపు మునికీర్త్యః పార్వతీగోచరాంగో
హిమవతి గిరిరాజే రాజతే ప్రాఙ్ముఖాఖ్యః ॥
గోవర్ధనేంద్ర తీర్థాఢ్యే తిరుప్పిరిది పట్టణే ।
మానసాఖ్య సరస్తీరే గోవర్ధన విమానగః ॥

**వివః** పరమ పురుషన్ - పరిమళ వల్లి - గోవర్ధన - ఇంద్ర తీర్థములు. మానస సరస్సు - గోవర్ధన విమానము - తూర్పుముఖము - భుజంగ శయనము - హిమపత్పర్వతము - పార్వతీదేవికి ప్రత్యక్షము. తిరుమంగై ఆళ్వార్ కీర్తించినది.

**విశేః** జోషిమఠ్‌నే తిరుప్పిరిది యందురు. ఈ క్షేత్రము దేవప్రయాగ నుండి 170 కి.మీ దూరములో నున్నది. మధ్యలో గల నందప్రయాగలో విష్ణుగంగ మందాకినీ నదులు కలయుచున్నవి. అచట నందగోపులు, యశోద కణ్ణన్ సన్నిధులు గలవు.

కుబేరుడు తపమాచరించిన ప్రదేశమే తిరుప్పిరిది. ఇచట ఆది శంకరాచార్యుల వారిచే ప్రతిష్ఠింపబడినట్లుగా ప్రసిద్ధమైన నృసింహస్వామి సన్నిధి కలదు. వాసుదేవుల సన్నిధి కలదు. వాసుదేవులు నిన్న తిరుక్కోలములో వేంచేసియున్నారు. వీరినే ఆళ్వార్లు కీర్తించినట్లుగా కొందరు చెప్పుదురు.

ఈ జోషీమఠ్ సమీపముననే విష్ణు ప్రయాగ కలదు. అచట నారదునిచే ప్రతిష్ఠింపబడిన సన్నిధి కలదు. దీనికి సమీపముననే పాండుకేశ్వరం గలదు. బదరీ సన్నిధి మూసియుంచు నపుడు ఉత్సవమూర్తులను ఈపాండికేశ్వరములోని వాసుదేవుల సన్నిధిలో నుంచి తిరువారాధన చేతురు. ఈపాండికేశ్వరమునకు 25 కి.మీ దూరమున బదరికాశ్రమము గలదు.

**మార్గముః** దేవప్రయాగనుండి 170 కి.మీ

పా॥ వాలి మావలత్తొరువనదుడల్; కెడవరి శిలై వళై విత్తన్ను;
వేలనాఱు తణ్డమ్ పొరిలిడమ్బేఱ; విరున్ద నల్లిమయత్తుళ్
ఆలిమా ముగిలదిర్ దరపరువరై; యగడుఱ ముగడేఱి;
పీలిమామయిల్ నడఞ్జెయుమ్; తడఞ్జునై ప్పిరిది శెన్నడైనెఞ్జే
తిరుమంగై ఆళ్వార్ - పెరియతిరుమొழி 1-2-1.

# ❁ 104. వడమధురై (ఉత్తరమధురి) 9 ❁

**శ్లో॥** యమునా సరితస్తీరే హ్యుత్తరే మథురా పురే
భద్రాఖ్యాన విమానస్థః శ్రీ కృష్ణః ప్రాఙ్ముఖ స్థితిః ॥
రుక్మిణీ సత్య భామాభ్యాం వసుదేవామరేక్షితః ।
శ్రీ విష్ణుచిత్త తత్సూను శఠజిత్ కలిహస్తుతః ॥

**వివ:** శ్రీకృష్ణుడు - రుక్మిణీ సత్యభామ - యమునా నది - భద్ర విమానము - తూర్పుముఖము - నిలచున్నసేవ - వసుదేవునకు; దేవతలకు ప్రత్యక్షము - పెరియాళ్వార్; ఆండాళ్; నమ్మాళ్వార్; తిరుమంగై ఆళ్వార్ కీర్తించినది.

**విశే:** ఈ క్షేత్రము ముక్తి ప్రద క్షేత్రములలో నొకటి. ఢిల్లీకి దక్షిణమున 140 కి.మీ దూరమున గల "మధురా" స్టేషన్ సమీపమున యమునానదీ తీరమున శ్రీకృష్ణుని అవతార స్థలము కలదు. దీ కి ఉత్తరం 10 కి.మీ దూరమున బృందావనము; తూర్పున 6 కి.మీ దూరమున గోకులము, దక్షిణమున 10 కి.మీ దూరములో గోవర్థనము కలవు. ఆళ్వార్లు కీర్తించిన క్షేత్రమిపుడు కానరాదు. మధురానాథ, ద్వారకానాథ సన్నిధులు ప్రసిద్ధిచెందినవి. (ఇచట ఉ.వే. శ్రీమాన్ గోవర్ధనం రంగాచార్యస్వామి వారిచే నిర్మింపబడిన సప్త ప్రాకారములు గల రంగమందిరం దాక్షిణాత్య సంప్రదాయముతో పాంచరాత్రాగ మోక్తముగా నిర్వహింపబడుచున్నది. ఇచట అన్ని సన్నిధులు కలవు.)

సర్వ సౌకర్యములు కలవు. ఈ క్షేత్రమున గల ముఖ్యమైన స్నానఘట్టము విశ్రాంత్ ఘాట్. ఇచటనొక సన్నిధి నిర్మించి గోపుర శిఖరమున గంటలను కట్టియున్నారు. ప్రతిదినము సాయంకాలము 6 గంటలకు ఇచట నుండి యమునానదికి దీపారాధన జరిపింతురు.

కంసునికోట, కేశవాలయము, (బందే ఖనా) శ్రీకృష్ణుని జన్మస్థానము సేవింపదగినవి.

**మార్గము:** మధుర జంక్షన్ నుండి (ఢిల్లీ - ఆగ్రామార్గం) 3 కి.మీ

**పా॥** ఇదువో పొరుత్త మిన్నాళ్ళి ప్పదై యా; యేఱుమిరుమ్ శిఱై ప్పుళ్
అదువే కొడియా వుయర్ త్తానే; యెన్ఱెన్ఱేజ్గి యళ్ళదక్కాల్
ఎదువే యాగ క్కరుదజ్గో; లిమ్మానిలమ్ పొఱై తీర్పాన్
మదువార్ శోలై **యుత్తరమదురై;** ప్పిఱన్దమాయనే ॥
నమ్మాళ్వార్ - తిరువాయిమొళి 8-5-9.



104.శ్రీకృష్ణన్ - వడమదురై

Sri Krishnan - Vadamadhurai



103.పరమపురుషన్ - తిరుప్పిరిది

Paramapurushan - Tiruppiridi



105. కళ్యాణ నారాయణన్ - ద్వారక

Kalyana Narayanan - Dwaraka



106.నవమోహనకృష్ణన్ - తిరువాయ్ప్పాడి

Navamohana Krishnan - Tiruvaippadi

# ❀ 105. శ్రీ ద్వారక 10 ❀

శ్లో॥ శ్రీ గోమతీ పుణ్య సరస్తటస్థే శ్రీ ద్వారకాఖ్య నగరే విరాజన్
కల్యాణ నారాయణ నామధేయః కళ్యాణదేవ్యా పరిభూషితాఙ్గః ॥
దివ్యాష్ట మహిషీ నాథో ద్రౌపదీ దృష్టి గోచరః
హేమకూట విమానస్థః పశ్చిమాభి ముఖాననః ।
పరాంకుశ కలిధ్వంసి గోదావిష్ణు మనస్తుతః ॥

**వివః** కల్యాణ నారాయణన్ - కల్యాణదేవి - గోమతీదేవి - అష్టమహిషులు హేమకూట విమానము - పశ్చిమ ముఖము - నిలచున్నసేవ - ద్రౌపదికి ప్రత్యక్షము - నమ్మాళ్వార్ - తిరుమంగై ఆళ్వార్, ఆండాళ్ - పెరియాళ్వార్ కీర్తించినది.

**విశేః** ఇయ్యది ముక్తి ప్రద క్షేత్రములలో నొకటి. సన్నిధికి సమీపముననే గోమతీ నది సముద్రములో కలియుచున్నది. అక్కడ నుండి బస్సుమార్గమున పోయి **బేట్ ద్వారక** చేరవలెను. ఇది శ్రీకృష్ణుని నివాస స్థలము. ఇచట 1500 గృహములు కలవు. ఇచట మూలవరులు శంఖ చక్రధారియై వేంచేసియున్నారు. దీనికి 5 కి.మీ దూరమున **శంఖతీర్థము** కలదు. ఇచట పెరుమాళ్ళ వక్షస్థలమున పిరాట్టి వేంచేసియున్నారు. రుక్మిణీదేవి ఉత్సవ తాయార్. అనేక సన్నిధులు కలవు. ప్రతిదినము తిరుమంజనము జరుగును. పసిపిల్లవానివలె - రాజువలె - వైదికోత్తమునివలె అలంకారములు జరుగును.

ద్వారక నుండి ఓఖ పోవు మార్గములో 5 కి.మీ దూరమున రుక్మిణీదేవి సన్నిధి గలదు. ఇదియే రుక్మిణీ కల్యాణము జరిగిన ప్రదేశము. ద్వారక సమీపమున తోతాద్రి మఠము కలదు. విరావన్ స్టేషన్‌లో దిగి 160 కి.మీ దూరమునగల రైవతక పర్వతమును చేరవచ్చును. ఇట అనేక సన్నిధులు గలవు. కృష్ణావతారమునకు ముందుగానే సేవసాయించిన ప్రదేశము. శయనతిరుక్కోలము.

**మార్గముః**బొంబాయి - ఓగా రైలుమార్గంలో ఓగారేవు ముఖద్వారానికి 35 కి.మీ దూరము అహమ్మదాబాద్ నుండి బస్‌లు గలవు. అన్నివసతులు కలవు.

పా॥ కూట్టిలిరున్దు కిళియెప్పోదుమ్ కోవిన్దా ! కోవిన్దా ! ఎన్ఱళైక్కుమ్
ఊట్టక్కొడాదు శెఱుప్పనాగిల్ ఉలగళన్దాన్ ! ఎన్ఱు ఉయరక్కూవుమ్;
నాట్టిల్ తలైప్పళియెయ్‌ది యుఙ్గళ్ నన్మైయిళన్దు తళియిడాదే
శూట్టుయర్ మాడఙ్గళ్ శూళ్న్దు తోన్ఱుమ్ **తువరాపదిక్కెన్నై**యుయ్ త్తిడుమిన్
ఆణ్డాళ్ - నాచ్చియార్ తిరుమొళి 0-12-9.

## ❋ 106. తిరువాయిప్పాడి (గోకులము)11 ❋

శ్లో॥ గోకులే యమునా తీరే ప్రాచీముఖ లసత్ స్థితిః
రుక్మిణీ సత్యభామాభ్యాం హేమకూట విమానగః ।
నవమోహన కృష్ణః శ్రీనంద గోప్యక్షి గోచరః ।
రథాంశ కలిజిత్ గోదా కులశేఖర సంస్తుతః ॥

వివః నవమోహన కృష్ణన్ - రుక్మిణి - సత్యభామ - గోకులము - యమునానది తూర్పుముఖము - నిలచున్నసేవ - హేమకూట విమానము - నందగోపునకు ప్రత్యక్షము - కులశేఖరాళ్వార్ - పెరియాళ్వార్ - ఆండాళ్‌కీర్తించినది.

విశే: ఆళ్వార్లు కీర్తించిన కోవెలగాని పెరుమాళ్లుగాని యిపుడుకానరారు. ఇపుడున్న సన్నిధులు తర్వాత నిర్మించినవే. గోకులమునకు 1 కి.మీ దూరములో పురాణ గోకులము గలదు. అచట ఆలయమునకు మందుభాగమున యమునానది ప్రవహించును. నందగోపులు, యశోద, బలరాములు - ఊయలలో శ్రీ కృష్ణుడు సేవ సాదింతురు. ఇచట రెండు సన్నిధులు - కలవు. రెండును సేవింప దగినవి. ఇది శ్రీకృష్ణుడు పెరిగిన స్థలము - బలరాముని అవతార స్థలము. ప్రతి ఆదివారము రాసక్రీడ, జలక్రీడ ఉత్సవములు జరుగును. తప్పక సేవింపదగిన ఉత్సవములు.

**మార్గము:** మధురకు 12 కి.మీ దూరములో కలదు.

పా॥ నాణి యినియోర్ కరుమ మిల్లై నాలయలారు మఱీన్డొళిన్దార్
పాణియాదెన్నై మరున్దు శెయ్‌దు పణ్డుపణ్డాక్కవుఱుదిరాగిల్
మాణియురువా యులగళన్ద మాయనై క్కాణిల్ తలై మఱియుమ్;
ఆణైయాల్ నీరెన్నై క్కాక్కవేణ్డిల్‌ఆయ్‌ప్పాడిక్కే యెన్నైయుయ్‌త్తిడుమిన్
ఆణ్డాళ్ - నాచ్చియార్ తిరుమొழி 0-12-2

### మంచిమాటలు

1.శిష్యుని హితముగోరువాడు ఆచార్యుడు. మనోవాక్కాయముల ఆచార్య కైంకర్యము చేయువాడు శిష్యుడు.

2.ఆకలిగొన్నవానికి అమృతపానము వంటిది ద్వయాను సంధానము.

## ❋ 107. తిరుప్పార్ కడల్ (క్షీర సముద్రము)12 ❋

శ్లో॥ క్షీరాబ్ధా వమృతాఖ్య తీర్థ రుచిరే శ్రీవ్యూహమూర్తి ప్రభుః
నాయక్యాతు కడల్ మకళ్ పదయుజా త్వష్టాంగ వైమానగః ।
లంకా వీక్షణ భాక్ భుజంగ శయనః పద్మాసనేశాదిభిః
దృష్టాంగోఖిల దివ్యసూరి వచసాం పాత్రంచ నీళాస్తుతేః ।
రామకృష్ణాది మూర్తీనాం మూలకారణ విగ్రహః ।
శరణాగత గీర్వాణ రక్షణార్థం విరాజతే ।

**వివః** క్షీరాబ్ధి నాథన్ - (వ్యూహమూర్తి) క్షీరాబ్ధిపుత్రి - అమృత తీర్థం - అష్టాంగ విమానము - దక్షిణముఖము - భుజంగ శయనమ్ - బ్రహ్మ రుద్రాదులకు ప్రత్యక్షము - ఆళ్వార్లు, ఆండాళ్ కీర్తించినది. రామకృష్ణాది విభవావతారములకు మూలకందమైన రూపము. శరణాగతులను, దేవతలను రక్షించుటకై వేంచేసియున్నారు.

**మార్గముః** దేవతలకు, సనకసనందనాది యోగులకు మాత్రము దర్శింపవీలైనది.

పా॥ తిరుమగళుమ్ మణ్మగళుమ్; ఆయ్మగళుమ్ శేర్న్దాల్,
తిరుమగట్కే తీర్న్దవాఱెన్కొల్ - తిరుమగళ్మేల్
పాలోదమ్ శిన్దప్పడ నాకణైక్కిడన్ద;
మాలోద వణ్ణర్ మనమ్

పొయిగై ఆళ్వార్ - ముదల్ తిరువన్దాది 42

పా॥ పామ్బణైమే ఱ్పాఱ్కడలుళ్; పళ్ళియమర్న్దదువుమ్,
కామ్బణైత్తోళ్ పిన్నైక్కా; యేఱుడనేழ் శెత్తవుమ్
తేమ్బణైయ శోలై; మరామరమేழெయ్దదువుమ్
పూమ్బిణైయ తణ్డుழாయ్ ప్పొన్ముడియమ్మోరేఱే ॥

నమ్మాళ్వార్ - తిరువాయిమొழி 2-5-7.

**మంచిమాట**

**సంసారమనెడి పాము కరచినచో అందులకు**
**తగిన ఔషదము ద్వయ మంత్రము**

# 108. పరమపదమ్ (తిరునాడు)13

శ్లో॥ శ్రీవైకుంఠే పరమ పదమిత్యార్య సందోహగీతే
మాయాతీతే త్రిగుణ రహితే శుద్ధ సత్త్వ స్వరూపే ।
నిత్యైర్ముక్తై ర్లసతి విరజా దివ్య నద్యా సమేతే
ప్రోక్తైచైరం మద పదసరో వేదమౌళి ప్రసిద్ధే ॥
లక్ష్మీ నీళా వనిముఖ శతై ర్దివ్య పత్నీ సమూహై
ర్నిత్యం సేవ్యః పరమపదరా డ్వాసు దేవాపరాఖ్యః ।
యామ్యాఖ్యాశా వదన యుగ నంతాఖ్య వైమాన శోభే
దివ్యైః కీర్త్య స్వగుణ విభవ స్సూరిభి ర్భాతి నిత్యమ్ ॥
దివ్యాస్థానే మణిమయ మహాస్తంభ సాహస్ర రమ్యే
శేషే దివ్యే దశశత ఫణా మండలాఖండ శోభే ।
శ్రీమద్రామానుజముని..ప ప్రోక్త సిద్ధాన్త తత్త్వ
ప్రేమోద్ఘుష్ట స్వ విషయ జగత్కారణత్వాది ధర్మః ॥

వివః పరమ పదనాథన్ – పెరియ పిరాట్టి – మాయాతీతము – శుద్ధ సత్త్వమయ దేశము – నిత్యముక్త సంసేవ్యము – విరజానది – ఐరం మద సరస్సు – శ్రీ భూ నీళాది దివ్యపత్నీ సమేతము – పరవాసుదేవ తిరునామము – దక్షిణముఖము – అనంతవిమానము కూర్చున్నసేవ – మణిమయ సహస్ర స్తంభ శోభిత తిరుమామణి మంటపము – భగవద్రామునజ సిద్ధాంతమున ప్రేమాతిశయము గలమూర్తి – జగత్కారణత్వాది ధర్మములు గలవాడు. ఆళ్వార్లు కీర్తించిన మూర్తి. భగవదనుగ్రహమున మోక్షము నందిన వారలకు మాత్రమే ప్రాప్యుడు.

పా॥ విణ్ కడన్ద శోదియాయ్ విళఙ్గు ఞానమూర్తియాయ్
పణ్ కడన్ద తేశమేవు పావనాశనాదనే
ఎణ్ కడన్ద యోగినోడు ఇరున్దు శెన్రు మాణియాయ్
మణ్ కడన్ద వణ్ణ నిన్నై యార్ మదిక్కవల్లరే ॥

తిరుమழிశై ఆழ்వార్లు – తిరుచ్చన్ద విరుత్తమ్ 27.

పా॥ శూழ் విశుమ్బణి ముగిల్ తూరియ ముழக్కిన
ఆழ் కడలలై తిరై కైయెడుత్తాడిన
ఏழ் పొழிలుమ్ వళమేన్దియ ఎన్నప్పన్
వాழ் పుగழ் నారణన్ తమరైక్కణ్డుగన్దే.

నమ్మాళ్వారు – తిరువాయిమొழி 10–9–1.

శ్రీరస్తు

# పౌరాణిక క్షేత్రములు

శ్లో॥ అథ పౌరాణికై ర్గీతా దివ్యదేశా శ్రియః ఏతేః। యద్వాద్రి పూర్వా వర్ణ్యంతే యతీశ్వర కటాక్షతః।

## 1. బృన్దావనమ్

**శ్లో॥ శ్రీ వత్సాప హరాఖ్య తీర్థ రుచిరే బృందావనాఖ్యే పురే**
**రాధా వల్లభ నాయకో విజయతే రాధా రమా సంయుతః।**
**రాధాయా నయన ద్వయా తిథి వపుః ప్రాగాస్య సంస్థానగో**
**దివ్యై ర్మంగళ చేష్టితై ర్గుణ గణై రామోద ముత్పాదయన్॥**

**వివః** రాధా వల్లభ పెరుమాళ్; రాధాదేవి; వత్సాపహార తీర్థము; యమునానది; తూర్పు తిరుముఖ మండలము; నిన్ఱతిరుక్కోలము; రాధాదేవికి ప్రత్యక్షము. ఈ సన్నిధి కాళీయ మర్దన ఘట్టమునకు సమీపమున గలదు.

**విశేః** శ్రీకృష్ణ భగవానుడు యాదవ ప్రముఖులతో నివసించిన ప్రదేశము బృందావనము. ఇచట ప్రధానముగా సేవింపదగినవి యమునానదీ తీరమున గల ముప్పది రెండు స్నానఘట్టములు; కాళీయమడుగు; కదంబ వృక్షము; వస్త్రాపహార ఘట్టము అతిసుందరముగా మలచబడిన క్షీరఘాట్; కేశఘాట్, బిల్వవనము (లక్ష్మినిలయం) రాధా నివాసమైన మధువనము.

ఇచట ఉ.వే. శ్రీమాన్ గోవర్ధనం రంగాచార్య స్వామి వారిచే నిర్మింపబడిన శ్రీరంగమందిరముకలదు. ఇది శ్రీరంగమువలె సప్త ప్రాకారములతో దాక్షిణాత్య సంప్రదాయమున పాంచరాత్రగ మోక్త ప్రకారముగా నిర్వహింపబడుచున్నది. ఇచట సేవార్థులకు సర్వసౌకర్యములు కలవు. సన్నిధిలో ప్రసాదము లభించును.

ఈ క్షేత్రస్వామి విషయమై శ్రీవేదాంత దేశికులు గోపాలవింశతిని అనుగ్రహించిరి.

పా॥ పట్టిమేయ్న్దోర్ కారేఱు; పలదేవఱ్కోర్ కీழ்క్కన్ఱాయ్;
ఇట్టీరిట్టు విళైయాడు; యిఙ్గేపోదక్కణ్డీరే? ।;
ఇట్టమాన పశుక్కళై; యినిదుమఱిత్తు నీరూట్టి;
**విట్టుక్కొణ్డు విళైయాడు విరున్దావనత్తే కణ్డోమే.**

పా॥ మాదవ నెన్ మణియినై వలైయిల్ పిழைత్త పన్ఱిపోల్
ఏదుమొన్ఱుమ్ కొళత్తారా వీశన్ఱన్నై క్కణ్డీరే !
పీదగవాడై యుడైత్తా ప్పెరుజ్గార్ మేగక్కన్ఱేపోల్
**వీదియార వరువానై విరున్దావనత్తే కణ్డోమే!!.**

ఆణ్డాళ్ - నాచ్చియార్ తిరుమొழி 14 - 1, 5

## 2. శ్రీ ముష్ణమ్

శ్లో॥ శ్రీ ముష్ణే పురి నిత్యపుష్కరిణికా సంశోభితే వామనం
వైమానం సమధిశ్రితోంబు జలతా నాథోంబు రాద్ధి ఋ్మఖః ।
శ్రీ మానాది వరాహనామ విదితో హ్యశ్వత్థనారాయణః
ప్రత్యక్షో భువి రాజతేఽ నవరతం సత్స్వజ్ఞ కల్పద్రుమః ॥

**వివః** ఆది వరాహపెరుమాళ్ - అంబుజవల్లి నాచ్చియార్; వామన (వేద) విమానము; నిత్యపుష్కరిణి ; తూర్పు తిరుముఖ మండలము; నిలచున్న సేవ. అశ్వత్థ నారాయణునకు ప్రత్యక్షము.

ఇది అష్టస్వయంవ్యక్త క్షేత్రములలో నొకటి. ఉత్సవరులకు యజ్ఞ వరాహన్ అనిపేరు. హిరణ్యాక్షుని సంహరించి భూదేవిని యుద్ధరించి అర్చామూర్తిగా అవతరించుటచే ఆదివరాహమనిపేరు. ఇచట తాయార్లకు చెలికత్తెలుగా నలుగురు కన్యలుగలరు.

కమఠన్, ఝల్లికా; సుద్యుమ్న; భూదేవి, సుధర్మలకు ప్రత్యక్షము.

**మార్గముః—** చిదంబరం నుండి 25 కి.మీ. వృద్ధాచలం నుండి కూడ బస్ వసతి కలదు.



**భూ వరాహ స్వామి**

**BHOOVARAHA SWAMY**

# 3. పాప వినాశనమ్

శ్లో॥ శ్రీ మత్పాప వినాశ నామని పురే శ్రీ పుండరీ కాఖ్య స
త్తీర్థే పాప వినాశ మధ్య నిలయః ప్రాచీముఖ స్సంస్థితః ।
ప్రత్యక్షో జయ చోళనామ నృపతే శ్శ్రీ పాపనాశ ప్రభు
ర్దేవ్యా పంకజ వల్లికాహ్వయ యుజా సంశోభితే సంతతః ॥

**విశే:** పాపవినాశ పెరుమాళ్; పంకజవల్లి తాయర్; పాపవినాశ విమానము; పుండరీక పుష్కరిణి; తూర్పుముఖమండలము; నిలచున్నసేవ; జయచోళునకు ప్రత్యక్షము.

**మార్గము:** ఈ క్షేత్రము తంజావూరునకు 24 కి.మీ దూరమున గలదు. సమస్త సౌకర్యములు గలవు. కుంభకోణము నుండి టౌన్‌బస్ కలదు. ఈక్షేత్రమునకు 3 కి.మీ దూరమున కపిస్థలమను దివ్యదేశము కలదు.

## మంచిమాట

భగవంతునకు భక్తునకు మధ్య భేదము చూపరాదు. భాగవతోత్తముల యందు భగవదనుగ్రహము కలదని భావింపవలెను. భగవంతుని శ్రీపాదములను ఆశ్రయించినట్లుగనే భక్తులను కూడా ఆశ్రయింపవలెను. వారివద్ద తీర్థ స్వీకారము చేయునపుడు తమ ఆచార్యులను స్మరింపవలెను. తాను ఇతరులకు తీర్థమును ప్రసాదించునపుడు తమ ఆచార్యుని స్మరించుచు ద్వయమంత్రాను సంధానము చేయవలెను. ఇట్లుచేయుట తీర్థమిచ్చువారికిని తీసుకొనువారికిని స్వరూపానురూపమై యుండును. ఈ విధముగా కాక అర్థ కామ పరవశులైనచో స్వరూపహాని సంభవించును.

"యామునమునులు"

# 4. తిరునారాయణపురమ్ (మేల్‌కోట్టై)

శ్లో॥ కల్యాణీ సరసా పరాశర ధనుష్కోట్యాఖ్య వైకుంఠకైః
తీర్థైః యాదవ లోకపావన ముఖైః పుణ్యైస్సదా శోభితే
శ్రీమద్యాదవ భూధరేంద్ర శిఖరే నారాయణాఖ్యే పురే
శ్రీనారాయణ నామకో విజయతే సంపత్కుమారో హరిః ॥
యదుగిరి పదపూర్వాం నాయకీ మీక్ష మాణః
స్థితియుగ్ర భుదిగా స్యో నంత వైమాన మాప్తః ।
మణిమకుట నిమిత్తం పక్షిరాజాక్షి సేవ్యో
యతిపతి కరుణాప్తో రక్షితో రాజరాజః ॥

వివః తిరునారాయణన్ - ఉత్సవరులకు శెల్వప్పిళ్లై, సంపత్కుమారన్, శ్రీరామప్రియర్ అనుతిరునామములు కలవు. తాయార్ యదుగిరి నాచ్చియార్ పెరుమాళ్ల శ్రీపాదములలో భూదేవి వేంచేసి యున్నారు.

కల్యాణి, వైకుంఠ, పరాశర, మైత్రేయ, ధనుష్కోటి, యాదవ, లోకపావన పాండవ తీర్థములు. తూర్పు తిరుముఖ మండలము; నిలచున్నసేవ; వేద పుష్కరిణి, శ్రీరామతీర్థము, నారాయణతీర్థము, గరుత్మంతునకు వైరముడి నిమిత్తము ప్రత్యక్షము. ప్రతినిత్యము అనుసంధానముచేయు శ్రీరంగాది క్షేత్రములలో తిరునారాయణపురము నాల్గవది. ఈక్షేత్రమునకు జ్ఞానమండపమనిపేరు.

విశేః కృతయుగమున సనత్కుమారులు సత్యలోకమునుండి ఆనందమయ విమానముతో తీసికొనివచ్చి ఇచ్చట శ్రీమన్నారాయణుని ప్రతిష్ఠించుటచే నీక్షేత్రమునకు నారాయణాద్రియనిపేరు. త్రేతాయుగమున దత్తాత్రేయుడు నల్గురు వేదపురుషులతో వేద పుష్కరిణి సమీపమున సదా వేదాధ్యయనము చేయుటచే వేదాద్రియనియు, ద్వాపరయుగమున నమ్బిమూర్త్తిపెరాన్ అనువారు; యదుశేఖరుడైన శ్రీకృష్ణభగవానుడు ఆరాధించుటచే యాదవాద్రి యనియు; కలియుగమున యతి శేఖరులైన భగవద్రామానుజులు వేంచేసి జీర్ణోద్ధారణచేయుటచే "యతిశైల"మనియు పేరువచ్చెను. దక్షిణ బదరికాశ్రమమనియు తిరునామము కలదు.

భగవద్రామానుజులు చోళోపద్రవకాలమున ఈక్షేత్రమునకు వేంచేసి ఈ ప్రాంత్రమును పాలించుచున్న రాజును కటాక్షించి వానికి విష్ణువర్ధనుడని దాస్యనామ ముంచిరి. మరియు భూమియందు నిక్షిప్తమై యున్న ఈ క్షేత్రమును స్వామి ఆజ్ఞ ప్రకారము పునరుద్ధరణగావించిరి. ఇచట వేంచేసియున్న ఉత్సవమూర్తి ఆనాడు ఢిల్లీ పాదుషా అంతః పురము నందుండుటచే భగవద్రామానుజులు ఢిల్లీచేరి పాదుషాచే



3. రాజగోపాలన్ - [illegible] మన్నార్గుడి

Rajagopalan - Mannargudi



4. రాజగోపాలన్ - కాట్టుమన్నార్‌కోయిల్

Rajagopalan - Kattumannar Koil

సత్కృతులై అంతఃపురమందలి శ్రీరామప్రియలను సేవింపగానే వారు ఆశ్రిత వాత్సల్యముతో వచ్చి ఉడయవరుల ఒడిలో కూర్చుండ ఉడయవరులు ఆనందముతో "ఎన్నుడైయ శెల్వప్పిళ్ళయో?" అని పలుకుటచే తదాదిగా వారికి శెల్వప్పిళ్ళైయను తిరునామమేర్పడినది.

స్వామి యెంబెరుమానారులు తిరువాయిమొழிని పెంచిన తల్లియగుటచే నాల్గవ దశకమున మొదటి తిరువాయిమొழிయగు "ఒరునాయకమాయ్ అను దశకమును ఈక్షేత్రస్వామి విషయముగా సమర్పించిరి.

పెరుమాళ్ళ ఆజ్ఞచే గరుడాళ్వారు శ్వేతద్వీపమందలి "మృత్తికను" తీసికొని వచ్చి ఈ క్షేత్రమునందుంచుటచే నిచటి తిరుమణి ప్రభావ సంపన్నమైనది. ఇచట ఉడయవరులు పండ్రెండు సంవత్సరములు వేంచేసియుండిరి. ఆకాలముననే వారి తిరుమేనిని (అర్చావిగ్రహమును) భక్తులు ప్రతిష్ఠించిరి.

ఇచటి కొండమీద నరసింహస్వామి, ఉడయవర్, వేదాన్త దేశికుల సన్నిధులు గలవు. శ్రీపరాశర భట్టారకుల శిష్యులగు నంజీయరు అనువారు ఇచటనే అవతరించిరి.

**మార్గము:** బెంగుళూరునకు 60 కి.మీ. మేల్కోట్టైయనియే చెప్పాలి.

శ్లో ॥ ఆరుహ్యోఽప్యుల యాదవాద్రి శిఖరం కల్యాణ తీర్థే తతః
స్నాత్వా లక్ష్మణయోగినః పదయుగం నత్వాతు గత్వాతతః
శ్రీనారాయణ మేత్య తత్ర ధరణీ పద్మాలయా మధ్యగం
పశ్యేయం యది కిన్తపః ఫల మతస్సంపత్కుమారం హరిమ్ ॥

పా ॥ ఒరునాయకమా యోడ వులగుడనాణ్డవర్
కరునాయ్ కవర్న్ద కాలర్ శిదైగియపానైయర్
పెరునాడుకాణ విమ్మైయిలే పిచ్చైత్తామ్ కొళ్వర్
తిరునారణన్తాళ్ కాలమ్బెఱ చ్చిన్దిత్తుయ్మినో

నమ్మాళ్వార్లు - తిరువాయిమొழி 4-1-1

## మంచిమాట

ఎంబెరుమాన్ తాళ్తొழுవార్ ఎప్పొழுదుమ్ ఎన్మనత్తే ఇఱుక్కిన్దారే

"శ్రీమన్నారాయణుని పాదపద్మములకు నమస్కరించువారు ఎల్లప్పుడు నామనస్సులో నిలచియుందురు." అను తిరుమంగైయాళ్వార్ల శ్రీసూక్తిని మరువక స్మరింపుడు. భాగవత అభిమానమే ఉత్తారకము.

" ఆళవందారులు"

# 5. రాజమన్నార్ కోయిల్

శ్లో॥ దివ్యే హరిద్రాఖ్య తరంగవల్యాః
స్థితేతుమన్నార్ నగరే ప్రతీరే
శ్రీ శంఖ చక్రాఖ్య గజేంద్ర కృష్ణ
ముఖైస్సు తీర్థే రపి శోభమానే ।

రమ్యాబ్జవల్లీ ప్రియయాసమేతః
ప్రాచీముఖో గోబిల యోగిదృష్టః
శ్రీరాజగోపాల విభు స్స్వయంభూ
వైమాన సంస్థానయుతో విభాతి ।

**వివః–** రాజగోపాలన్ – రమ్యాబ్జ(హేమాబ్జ) వల్లితాయార్ – హరిద్రానది – స్వయంభూవిమానము. శంఖ,చక్ర, గజేంద్ర, కృష్ణ మున్నగు తీర్థములు; తూర్పుముఖము, నిలచున్నసేవ – గోబిలమునికి ప్రత్యక్షం.

**విశే–** ఈ క్షేత్రమునకు చంపకారణ్యక్షేత్రమనిపేరు. ఈ సన్నిధి శ్రీరంగమువలె ఏడు ప్రాకారములతో విలసిల్లుచున్నది. రాజగోపాలస్వామి ముగ్ధమనోహరులై సేవించు వారి హృదయములను అపహరింతురు. మూలవరులకు "వాసుదేవర్" అని తిరునామము. గోప్రళయమహర్షికి స్వామితన (కృష్ణ) లీలలను ఇచట అనుగ్రహించి నందున ఈ క్షేత్రమునకు దక్షిణద్వారకయని పేరువచ్చెను. మీనం మాసమున 18 రోజులు బ్రహ్మోత్సవం జరుగును. మిధునమాసములో 10 దినములు తెప్ప ఉత్సవము జరుగును.

**మార్గం:** తంజవూరుకు 35 కి.మీ. కుంభకోణం నుండియు పోవచ్చును. ఈక్షేత్ర సమీపమున వడువూర్ అనుక్షేత్రము తప్పక సేవింపవలెను.

పా॥ ఉన్నిత్తు మత్తొరు తెయ్వ; న్తొழுగాళవనై యల్లాల్;
నుమ్మిచ్చై శొల్లి; నుమ్‌తోళ్ కుళై క్కప్పడు మన్నైమీర్;
మన్నప్పడు మఱై వాణనై, వణ్డువరావతి
మన్ననై, ఏత్తుమినేత్తుదలుమ్ తొழுదాడుమే।

తిరువాయిమొழி 4-6-10

# 6. కాట్టుమన్నార్ కోయిల్

శ్లో॥ వేదపుష్కరిణీ తీరే విమానే పుణ్యనామకే
వీరనారాయణోభాతి మన్యక్షేత్రే శ్రియాసహ ॥

**వివ:** వీరనారాయణప్పెరుమాళ్ - మరతకవల్లి తాయార్ - శెంగమంవల్లి తాయార్ - వేదపుష్కరిణి - పుణ్యవిమానము - తూర్పుముఖము - నిలచున్నసేవ - కావేరీనది. మతంగ మహర్షికి ప్రత్యక్షము. శ్రీవైష్ణవ సంప్రదాయ ప్రవర్తకులగు శ్రీమన్నాథమునులు, ఆళవన్దారులు అవతరించిన స్థలము.

**విశే:** ఈ క్షేత్రమునకు కాట్టుమన్నార్ కోయిల్ అనియు మన్యు క్షేత్రమనియు నామాంతరములు కలవు. వీరానారాయణప్పెరుమాళ్ వేంచేసియుండుటచే వీరనారాయణపురమనియు, మన్ననార్ (రాజగోపాలన్) వేంచేసియుండుటచే మన్నార్కోయిల్ అనియు పేర్లు కలవు. కాట్టుమ్ అనగా "చూపించునది" అని అర్థము. నామ్మాళ్వార్లయొక్క సంప్రదాయమును చూపుటచే కాట్టుమన్నార్ కోయిల్ అనిపేరువచ్చెను.

శ్రీమన్నాథమునులు ఆళ్వార్ తిరునగరిలో నమ్మాళ్వార్లను సాక్షాత్కరింప చేసుకొని నాలాయిర దివ్య ప్రబంధమును పొందిరి. మన్ననార్‌స్వామి నాథమునులకు స్వప్నము సాక్షాత్కరించి దివ్యప్రబంధమును తమ సన్నిధిలో అనుసంధింపుడనికోరిరి. ఆళ్వార్లును, నాథమునులను అట్లే ఆజ్ఞాపించిరి. వారి ఆజ్ఞా ప్రకారము నాథమునులు కాట్టుమన్నార్ కోయిల్‌కు వేంచేసి దివ్యప్రబంధమును విన్నవించిరి. ఈ విధముగా నాలాయిర దివ్య ప్రబంధము మొట్టమొదట ఈసన్నిధిలోనే అనుసంధానము చేయబడినది.

తిరునెడుందాండగమ్ ప్రబంధములోని పొన్నానాయ్ అను పాశురములోని **కుణపాల మదయానాయ్** అనుదానిని పెరియవాచ్చాన్‌పిళ్లై గారు ఈక్షేత్రస్వామి విషయముగా వ్యాఖ్యానించిరి.

**మార్గము:** వృద్ధాచలం నుండి, చిదంబరం నుండి 25 కి.మీ.

పొన్నానాయ్ పొழிలేழுమ్ కావల్‌పూణ్డ,
పుగழாనాయిగழ் వాయతొణ్డనేన్ నాన్;
ఎన్నానాయెన్నానా యెన్నిలల్లాల్
ఎన్నఱివనే ఱழியేన్, ఉలగమేత్తుమ్
తెన్నానాయ్ వడవానాయ్ కుడపాలానాయ్
**కుణపాల మదయానాయ్** ఇమైయో రేత్తుమ్
మున్నానాయ్; పిన్నానార్ పణఙ్గుమ్‌శోది
తిరుమూழிక్కళత్తానాయ్ ముదలానాయే.

తిరునెడున్దాణ్డగమ్ - 10

# 7. శ్రీ పెరుంబూదూరు

శ్లో॥ శ్రీ రామానుజ నామ పుష్కరిణికా తీరేస్థితః ప్రాఙ్ముఖ
శ్రీమద్భూతపురే యతీంద్ర కరుణా సంధుక్షిత శ్రీయుతే।
నాయక్యా యతిరాజ వల్ల్యభిదయా శ్రీ కేశవార్యేక్షితో
నిత్యం రాజతి చాదికేశవ విభు శ్రీవైష్ణవేష్ట ప్రదః॥

**వివ:** ఆదికేశవప్పెరుమాళ్ - యతిరాజనాథవల్లి తాయార్ - శ్రీరామానుజ పుష్కరిణి; తూర్పుముఖము; నిలచున్నసేవ – భగవద్రామానుజులు అర్చారూపముగా తానభిమానించి వేంచేసిన దివ్యదేశము. శ్రీ కేశవార్యులకు ప్రత్యక్షము – భూతపురియను ప్రసిద్ధ తిరునామము.

**విశే:** విశిష్టాద్వైత సిద్ధాన్త ప్రవర్తకులగు భగవద్రామానుజులవారు అవతరించిన దివ్యదేశము - వారు అభిమానించి అనుగ్రహించిన అర్చామూర్తిని వారి అవతార కాలముననే సన్నిధిలో ప్రతిష్ఠించిరి. పూర్వాచార్యులందరు అభిమానించి సేవించిన దివ్యదేశము. ఇచట వేంచేసియున్న ఆదికేశవ ప్పెరుమాళ్ వరప్రసాది. వారి కటాక్షము వలన ఆ సూరికేశవాచార్యులు కాంతిమతీ దంపతులకు భగవద్రామానుజులు అవతరించిరి. శ్రీవైష్ణవులు తప్పక సేవింపవలసిన దివ్యదేశము.

**మార్గము:** మద్రాసునుండి బెంగుళూరు పోవుమార్గములో మద్రాసు నుండి 30 కి.మీ.

పా॥ కేశవన్ తమర్ కీ ழ் మేలెమ రేமிழ்ఱ్పిఅప్పుమ్
మాశదిరు పెత్తు నమ్ముడై య వాழ்వు వాయ్క్కిన్ఱవా
ఈశనెన్ కరుమాణిక్క మెన్ శెజ్కోలక్కణ్ణన్ విణ్ణోర్
నాయకన్ ఎమ్బిరానెమ్మాన్ నారాయణనాలే.

నమ్మాழ்వారు తిరువాయిమొழி 2-7-1

పూమన్ను మాదుపొరున్దియమార్పన్; పుగழ்మలిన్ద
పామన్ను మాఱనడిపణిన్దుయ్న్దవన్; పల్ కలై యోర్
తామ్ మన్న వన్ద యిరామానుశన్ శరణారవిన్దమ్,
నామ్మన్నివాழ, నెంజే! శొల్లువోం అవన్నా మజ్గళే

ఇరామానుశనూత్ తన్దాది - 1

## నిగమన శ్లోకాః

జయతు జయతు తుంగం మంగళం రంగ మస్మ
త్కుల ధన మథజీయాత్ రంగనాథాంఘ్రి యుగ్మమ్
శఠరిపు యతిరాజౌ సౌమ్యాజామాతృ యోగీ
ప్రవర శుభ గుణాఢ్యా స్సంతతం తేజయంతు ॥

శుభగుణ పరివారః శేషదివ్యావతారః
సరస ఫణితిధారః కామకోపాదిదూరః
శ్రుతిపరిచితచారః కాంతిమత్యాః కుమారః
కలిబలవినికారస్సోవతాత్ భాష్యకారః ॥

ఆత్రేయాభిద వంశమౌక్తిక మణేః రామానుజార్యాద్గురోః
జాతస్తత్పదపద్మ సంశ్రయణతో లబ్ధాత్మబోధోదయః ।
శ్రీ రామానుజ యోగిరాజ కరుణా సంవీక్షణా త్సన్ముదే
ప్రాతానీదితి దివ్యదేశ విభవం గోపాలకృష్ణః కవిః ॥

– దివ్యదేశ వైభవ ప్రకాశికా సంపూర్ణా –



## మధురాన్తకమ్ -1

కరుణాకరప్పెరుమాళ్(ఏరికాత్తరామన్) జనకజవల్లి త్తాయార్ - తూర్పు ముఖము - నిలచున్నసేవ. పెరియనంబిగారు (మహాపూర్ణులు) భగవద్రామానుజులకు పంచ సంస్కారములు గావించిన ప్రదేశము.

**విశే:** ఈ ఊరిలోని పెద్దచెఱువు పొంగివచ్చుచుండగా స్వామి రామలక్ష్మణులుగా కావలి కాయుటచే స్వామికి ఏరికాత్తరామన్ అని పేరు వచ్చెను.

**మార్గము:** మద్రాసు విళ్లుపురమ్ బస్. రైలు మార్గం చెంగల్పట్టు నుండి విళ్లుపురం మార్గంలో సుమారు 25 కి.మీ.

## కురుగై క్కావలప్పన్ సన్నిధి -2

శ్రీమన్నాథమునుల శిష్యులగు కురుగై క్కావలప్పన్ అవతరించిన స్థలము. వీరు యోగనిష్ఠులగుటచే యోగ దశలో పెరుమాళ్లను సేవించెడివారు. నాథమునుల నుండి యోగరహస్యములను గ్రహించిరి. వానిని యామునమునులకు ఉపదేశింప నియమనము పొందిరి. కానీ కారణాంతరముల వలన యామునులు ఆ రహస్యములును పొందలేకపోయిరి.

**మార్గము:** శ్రీముష్ణమునకు 12 కి.మీ.

## గుణశీలమ్ -3

శ్రీనివాస పెరుమాళ్ - పద్మావతీ దేవిత్తాయార్ - నిలచున్న సేవ - తూర్పుముఖము - ఈస్వామి వరప్రసాది. తిరుమలలో వలెనే ఇచటను జనసందోహము మెండుగా కలదు.

**మార్గము:** శ్రీరంగము నుండి పోయి సేవింపవచ్చును 25 కి.మీ.

## మణ్ణంగుడి -4

ఇది తొండరడిప్పొడి యాళ్వార్ల అవతార స్థలము. కుంభకోణమునుండి పోయి సేవింపవచ్చును.

## వడువూర్ -5

కోదండరామస్వామి - జనకజవల్లి తాయార్- నిన్నతిరుక్కోలము తూర్పుముఖము. ఇచటస్వామి "పుంసాంమోహనరూపాయ" అనునట్లు వేంచేసి యుందురు.

**మార్గము:** రాజమన్నార్ గుడి నుండి 10 కి.మీ ॥

# పచ్చైప్పెరుమాళ్ కోయిల్ - (పేట్టై) -6

పచ్చైవణ్ణ పెరుమాళ్ - హారీతవారణ పెరుమాళ్ - అమృతవల్లి త్తాయర్ దాశరథి అనే ముదలియాండాన్ అవతారస్థలము. వీరు భగవద్రామానుజులకు భాగినేయులు మరియు పాదుకాస్థానీయులు.

**మార్గము:-** మద్రాసు - కాంచీపురం మార్గంలో పూన్దమల్లికి సమీపమున గలదు.

# కూరమ్ -7

స్వామి యెంబెరుమానార్ల శ్రీపాదములాశ్రయించిన వారిలో ప్రధానులగు కూరత్తాళ్వాన్ అవతరించిన దివ్యదేశము.

**మార్గము:-** కాంచీపురమునకు 10 కి.మీ.

# పూన్దమల్లి - (పూనమల్లి) -8

వరదరాజప్పెరుమాళ్ - పెరుందేవిత్తాయార్ - శ్రీనివాస పెరుమాళ్ - పుష్పకవల్లి త్తాయార్ - తిరుక్కచ్చినంబిగారి అవతారస్థలం.

**మార్గము:** మద్రాసులోని ఆవడికి 10 కి.మీ ఇచట నుండిపోయి పచ్చైపెరుమాళ్ కోయిల్ సేవింపవచ్చును.

# మధుర మంగలమ్ -9

ఆదికేశవప్పెరుమాళ్ సన్నిధి. గోవిందభట్టర్ అనే ఎంబార్ అవతార స్థలము. వీరు భగవద్రామానుజులకు పినతల్లి కుమారులు. భగవద్రామానుజుల తర్వాత వీరు దర్శన స్థాపకులుగా వేంచేసియుండిరి.

**మార్గము:-** శ్రీపెరుంబుదూరు - కాంచీపురం మార్గంలో సంకువారి చావడికి 12 కి.మీ.

# మయూరపురి (మైలాపూర్) -10

ఇది మద్రాసులోని ఒక భాగము. మైలాపూర్ అని వ్యవహరింపబడుచున్నది. ఆదికేశవప్పెరుమాళ్ - మాధవప్పెరుమాళ్ సన్నిధులు కలవు. కైరవిణీపుష్కరిణి. ముదలాళ్వార్లలో చివరివారైన పేయాళ్వార్లు అవతరించిన స్థలము. వీరు ఈసన్నిధిలోని మణికైరవమనెడి బావియందు అవతరించిరి. కేశవప్పెరుమాళ్ సన్నిధిలో సుదర్శనాళ్వార్ సన్నిధి కలదు. వీరుమిక్కిలి ప్రభావసంపన్నులు. ఈ సన్నిధి సమీపమునందే శ్రీనివాస పెరుమాళ్ సన్నిధి కలదు. ఇచట హయగ్రీవర్, నరసింహస్వామి వేంచేసియున్నారు. పెరుమాళ్లు సౌందర్యాతిశయముతో వేంచేసియుందురు.

## శింగరి కోయిల్ –11

ఇచట నరసింహస్వామి హిరణ్యకశిపుని సంహరించురీతిని వేంచేసియుందురు. మిక్కిలి ప్రభావముగల సన్నిధి.

**మార్గము:** తిరువహీంద్ర పురమును సేవించునపుడు పోయి సేవింపవచ్చును. కడలూర్‌కు 25 కి.మీ.



శింగర్ కోయిల్
SINGER COIL

## తిరుమళ్లిశై –12

జగన్నాథపెరుమాళ్ – తిరుమంగవల్లి త్తాయ్యార్ – తూర్పుముఖము – నిలచున్నసేవ. తిరుమళ్లిశై ఆళ్వార్ అవతారస్థలం.

**మార్గం:–** మద్రాసు – పూన్దమల్లి – తిరువళ్లూరు మార్గంలో పూన్దమల్లికి సమీపంలో కలదు.

## హంపి –13

సీతారాముల సన్నిధి, నరసింహస్వామి సన్నిధి కలవు – ఋష్యమూక పర్వతము – పంపాసరోవరము – శబరి ఆశ్రమము సేవింపదగినవి. శ్రీరామచంద్రుడు ఇచటనే సుగ్రీవుని ద్వారా వానరసైన్యమును సీతాన్వేషణకై సమావేశపరచినాడు.

**మార్గము:** బెంగుళూరు నుండి హుబ్లీ పోవు మార్గములో హొస్పేట స్టేషన్ నుండి 12 కి.మీ.





10. వరాహలక్ష్మీ నరసింహర్ - సింహాచలం

Varahalakshmi Narasimhar - Simhachalam

# శ్రీరంగపట్టము -14

శ్రీరంగనాథస్వామి - శ్రీరంగనాయకి - శయనించినసేవ - కావేరినది. ఈ క్షేత్రము శ్రీరంగమువలె కావేరీ మధ్య భాగమునందు కలదు. మధ్యరంగమని పేరు. **ఆదిరంగం** - శ్రీరంగం - **మధ్యరంగం** - శ్రీరంగ పట్టణం - **అంత్యరంగం** - పినాకినీ తీరమున గల తల్పగిరి శ్రీరంగనాథులు (నెల్లూరు)

**మార్గము:-** మైసూరునుండి 15 కి.మీ.

# శింజన్‌కోట -15

శ్రీరామచంద్రులు - సీతాదేవి - సీతాదేవి స్నాన ఘట్టము. శ్రీరంగపట్టణం నుండి 40 కి.మీ (ఇలివాలా మార్గంలో)

# మిధున సాలగ్రామం -16

నరసింహస్వామి సన్నిధి కలదు. భగవద్రామానుజుల శ్రీపాద తీర్థము గల నడబావిని భక్తులు తప్పక సేవింపవలెను.

**మార్గము:** ఎడత్తురై నుండి 12 కి.మీ

# ఢేంకిణికోట -17

**శ్లో॥** **శ్రీ శైలాద్రివరా త్సమేత్య మునినా కణ్వేన సంప్రార్థితః**
**జిత్వా తత్పరిపంధినం మునికృతం నిర్వర్తయన్ సంయమం**
**ఆస్తే ఢేంకిణి నామకే పురవరే పశ్చాద్ధనుర్భూభృతః**
**దేవోనశ్శుభ మాతనోతు నితరాం శ్రీ బేటనాథో హరిః**

**వివ:** బేటరాయస్వామి - సౌందర్యవల్లిత్తాయార్ - ఆనందయోగ విమానము - చక్రతీర్థము - నృసింహగిరి - కణ్వమహర్షికి ప్రత్యక్షము. తిరునారాయణపురం ఆయి అని ప్రసిద్ధులైన జనన్యాచార్యుల వారి మంగళాశాసనం గల దివ్యస్థలము. ఇచట శ్రీవేంకటేశ్వరస్వామి సన్నిధి కూడా కలదు.

**మార్గము:** ధర్మపురి జిల్లా హెూసూరుకు సమీపమున గలదు.

**మంచిమాట**

**శ్రీరంగనాథుని ఆపాదచూడము సేవించుచు ఆయన చరణారవిందముల యందు వీణాపాణియై నోరార కీర్తించుచుండు తిరుప్పాణి ఆళ్వారులను సేవించుచు జీవితమును ధన్యమును చేసికొనుడు.**

## తొండనూరు –18

నంబినారాయణ్ పెరుమాళ్ - పార్థసారధి - అరవిందవల్లి త్తాయార్ రుక్మిణీదేవి తూర్పుముఖము - నిలచున్నసేవ. భాష్యకారర్‌నది మిట్టపై నరసింహ స్వామి సన్నిధి కలదు.

విష్ణువర్ధన మహారాజు కుమార్తెకు పట్టిన బ్రహ్మరక్షస్సును భగవద్రామానుజులు పోగొట్టిన స్థలము.

**మార్గము:** ప్రెంబి రాక్స్ నుండి 6 కి.మీ. మేల్కోట్టై నుండి 30 కి.మీ.

## సింహాచలము –19

**శ్లో॥ త్రాహీతి వ్యాహరంతం త్రిదశరిపు సుతం త్రాతుకామోరహస్యే**
**విస్రస్తం పీతవస్త్రం నిజకటియుగళే సవ్యహస్తేన గృహ్ణన్**
**వేగక్రాంతం నితాంతం ఖగపతిమమృతం పాయయన్నన్యపాణౌ**
**సింహాద్రౌ శ్రీఘ్రపాత క్షితిపిహితపదః పాతుమాం నారసింహః ॥**

వరాహ లక్ష్మీ నరసింహస్వామి, వక్షస్థలమున లక్ష్మి - లక్ష్మీతీర్థం - నృసింహధార - తార్క్ష్యాద్రి విమానము - ప్రహ్లాదునకు, పురూరవ చక్రవర్తికి, దేవతలకు, సనకాదులకు ప్రత్యక్షము.

ప్రతి సంవత్సరం వైశాఖశుద్ధ తదియనాడు జరుగు చందనోత్సవము సేవింపవలెను. ఆరోజున స్వామి నిజరూపముతో దర్శనమిత్తురు. మిగిలిన దినములలో స్వామి చందనక్కాప్పుతో వేంచేసియుందురు. ఇచట కృష్ణమాచార్యులు అనుభక్తులు స్వామికి అంతరంగికులుగా నుండెడివారు.

భగవద్రామానుజులు ఈక్షేత్రమునకు వేంచేసి మంగళా శాసనం కృపచేసిరి.

**మార్గం:** ఆంధ్రప్రదేశ్‌లోని విశాఖపట్టణానికి 10 కి.మీ

## శ్రీ కూర్మము –20

కూర్మనాథస్వామి, కూర్మనాయకి, కూర్మవిమానము, తూర్పుముఖము నిలచున్నసేవ - చక్రతీర్థం - లాంగల తీర్థం, వంశధారానది. శ్వేతమహారాజునకు తిలోత్తమ, వక్రాంక మహర్షులకు ప్రత్యక్షము. శ్వేతభూమి. భగవద్రామానుజులు ఇచటకు వేంచేసి శ్వేత మృత్తికను స్వీకరించినారు.

**మార్గము:** శ్రీకాకుళం స్టేషన్ రోడ్డు నుండి 25 కి.మీ. శ్రీకాకుళం నుండి బస్ వసతి గలదు.

# అభినవ భూతపురి (నరసాపురము) -21

శ్లో॥ శ్రీ కేశవం కరతలోద్ధృత రమ్య పద్మం
చంద్రప్రభా విశద నిర్మల పాంచజన్యం
మార్తాండకోటి రుచిరోజ్జ్వల చక్రరాజం
వందే గదాధర మహం సురబృందవంద్యమ్ .
శ్రీ మతేఽవాప్త కామాయ కల్యాణగుణ సింధవే
బంధవే సర్వలోకానాం కేశవాయ నమో నమః .

ఆదికేశవప్పెరుమాళ్ – యతిరాజనాథవల్లి త్తాయార్ – అనంతపుష్కరిణి అనంతవిమానము – నిలచున్నసేవ – తూర్పుముఖము – వసిష్ఠగోదావరి. భగవద్రామానుజుల సౌందర్యము వర్ణనాతీతము. వీరు శ్రీపెరుంబూదూరులో ప్రతిష్ఠింపబడి అచటస్వామితో ఏకాసనాసీనులై ఆరుమాసములు అర్చనాదులు స్వీకరించి అచటనుండి నరసాపురము వేంచేసిరి. అట్లు వేంచేయునపుడు స్వామితోపాటు అచటవేంచేసియున్న ముదలియాండాన్ (పాదుకలు) కూడా ఇచటకు వేంచేసిరి.

ఇచటగల సన్నిధి పెరుమాళ్లు ఉత్సవాదులు అన్నియు శ్రీపెరుంబుదూరు సన్నిధిని పోలియుండుటచే దీనికి "అభినవభూతపురి" యనిపేరు వచ్చెను. మేషమాసములో శ్రవణం తీర్థోత్సవముగా తొమ్మిది దినములు బ్రహ్మోత్సవము; మేషం ఆర్ద్రానక్షత్రం తిరునక్షత్రోత్సవంగా పదిదినములు ఉడయవరుల తిరునక్షత్రోత్సవములు అతివైభవముగా జరుగును. ఈ సమయములో వచ్చు భక్తులకు తదీయారాధన సౌకర్యము కూడకలదు.

నూరుసంవత్సరములకు పూర్వము నూజివీడు సంస్థాన ఆస్థాన మహా విద్వాన్ ఉ.వే. శ్రీమాన్ కిడాంబి గోపాలకృష్ణమాచార్యస్వామి వారు ఈసన్నిధి వైభవమును ఉత్సవములను కావ్యముగా రచించుటయేగాక ఉత్సవములను వైభవముగా జరిపించి తదీయారాధనాదుల నేర్పాటుచేసిరి. అదినేటికిని జరుగుచుండుట ముదావహము. ఇచట నుండి పోయి అంతర్వేదిసేవింపవచ్చును.

**మార్గము:–** ఇది పశ్చిమగోదావరి జిల్లాలో కలదు. విజయవాడ, రాజమండ్రి మొదలగు చోటనుండి బస్ రైలు వసతులు కలవు.

పా॥ **కేశవన్** తమర్ కీழ మేలెమ రేழెழుపిఱప్పుమ్
మాశదిరు పెత్త్రు నమ్ముడై య వాழ్వు వాయ్క్కిన్ఱవా
ఈశనెన్ కరుమాణిక్క మెన్ శెజ్కోలక్కణ్ణన్ విణ్ణోర్
నాయకన్ ఎమ్పిరానెమ్మాన్ నారాయణనాలే.

నమ్మాழ్వారు తిరువాయిమొழி 2-7-1

# పూరీ జగన్నాథము -22

నీలాచలనివాసాయ నిత్యాయ పరమాత్మనే

**సుభద్రా ప్రాణనాథాయ జగన్నాథాయ మంగళమ్ ॥**

జగన్నాథస్వామి - సుభద్రాదేవి - బలరాముడు-నిలచున్నసేవ తూర్పుముఖము - ఇంద్రవిమానము; స్థలవృక్షము మర్రిచెట్టు, మార్కండేయ, వరుణ, రోహిణులకు, ఇంద్రద్యుమ్న మహారాజునకు ప్రత్యక్షము. ప్రసాదపావనమూర్తి. ఇచట ప్రసాదమును స్పర్శ దోషము పాటింపక అతిపావనముగా భావించి స్వీకరింతురు. దానిని బట్టియే సర్వం జగన్నాథం అనుసామెత పుట్టినది. ఆషాడ శుద్ధ పాడ్యమినాడు జరుగు రథోత్సవము జగత్ప్రసిద్ధము. ఈస్వామి భారతదేశము యొక్క తూర్పుతీరమున వేంచేసి సర్వులను రక్షించుచున్నాడు. ఈ క్షేత్రమునకు నీలాచలమనిపేరు.

ప్రాచ్యాం దేవం జగన్నాథం భుక్తిముక్తి ప్రదాయకం

**మార్గము:** ఇది ఒరిస్సా రాష్ట్రములోనిది.



**పూరీ జగన్నాధ స్వామి**
**POORI JAGANNADHA SWAMY**

# పురుషోత్తమము -23

**సప్త సప్తసు లోకేషు లోకాఽలోకేచరా చరే ।**

**నాస్తి నాస్తి సమంక్షేత్రం ఉత్తమం పురుషోత్తమం**

పురుషోత్తమన్ - శ్రీకృష్ణ బలరాములు - మార్కండేయ మహర్షికి ప్రత్యక్షము . వరుణునిచే ప్రతిష్ఠింపబడిన దివ్యస్థలము. నాథమునులు భగవద్రామానుజులు. ఈ క్షేత్రమునకు వేంచేసి మంగళాశాసనం కృపచేసిరి.

**మార్గము:** పూరీ జగన్నాధ క్షేత్రమునకు మిక్కిలి సమీపములో కలదు.



14.వేణుగోపాలన్ - మంగళంపాడు
Venugopalan Mangalampadu



13. రంగనాథన్ - నెల్లూరు
Ranganadhan -Nellore

# పెంచలకోన –27

నరసింహస్వామి – ఆదిలక్ష్మి తాయార్– కూర్చున్నసేవ – తూర్పుముఖము.

**వివః–** ఈక్షేత్రమునకు చత్రవటియనిపేరు. ప్రహ్లాదవరదుడగు నృసింహస్వామి వేంచేసియున్నాడు. నవనారసింహములలో పెంచలకోన యొకటి. ఇదినెల్లూరుకు 80 కి.మీ దూరమున రాపూరుమండలమున కలదు.



**పెంచల కోన**

**PENCHALA CONA**

**శ్రీమన్నృసింహ విభవే గరుడ ధ్వజాయ**
**తాపత్రయోప శమనాయ భవేషధాయ**
**తృష్ణారి వృశ్చిక జలాగ్ని భుజంగ రోగ**
**క్లేశవ్యయాయ హరయే గురవే నమోస్తు.**

# పెంటపాడు –28

బాలవేంకటేశ్వరస్వామి - ఆనందవిమానము - స్వామిపుష్కరిణి - తూర్పుముఖము - నిలచున్నసేవ.

**వివః–** రఃస్వామివరప్రదుడు. ఈఃఅగ్రహారము ఒకప్పుడు శ్రీవైష్ణవమత ప్రచారమునకు ప్రముఖస్థానమై విరాజిల్లినది. ఈఃస్వామి సన్నిధానములో జరిగిన ఉభయ వేదాంత సభలలో ప్రసిద్ధులైన పండితులు పలువురు పాల్గొనెడివారు. శ్రీవైష్ణవపత్రిక ఇచటి నుండియే వెలువడుచుండినది. ఇటీవల "శ్రీమత్పరమహంసేత్యాది" శ్రీశ్రీత్రిదండి చినశ్రీమన్నారాయణ రామానుజ జీయర్ స్వామివారి మంగళా శాసనములతో "ఉభయవేదాన్త సభ స్థాపింపబడి "ఉభయవేదాన్త సభలను నిర్వహించుచు, "భక్తామృతమును" పత్రికను సంప్రదాయమునకు సంబంధించిన పుస్తక ప్రచురణమును చేపట్టినది. ఆకృషి ఫలితమే ఈఃదివ్యదేశ వైభవ ప్రకాశిక.

**మార్గముః** మద్రాసు - కలకత్తా రైలుమార్గములో తాడేపల్లిగూడెం రైల్వే స్టేషన్‌కు (పశ్చిమగోదావరిజిల్లా) 4 కి.మీ.



పెంటపాడు సభలు

PENTAPADU SABHALU

## పండరీపుర ... -29

ఇది ప్రసిద్ధ పుణ్యక్షేత్రము - ఇచట స్వామిపేరు పాండురంగ విఠలుడు రుక్మిణీదేవి - చంద్రభాగానది - భీమతీర్థం - శ్రీకృష్ణతీర్థం - జ్ఞానానంద విమానం - నిలచున్నసేవ - తూర్పుముఖము - పుండరీక మహర్షికి ప్రత్యక్షము.

ఇచట స్వామి ఒక యిటుక రాతిమీద వేంచేసియుందురు. భక్తులు శ్రీస్వామివారి పాదములను స్పృశించి సేవింపవచ్చును. సన్నిధి చంద్రభాగానది యొడ్డున కలదు. నదియొడ్డున గల "రామ్‌బాగ్" వసతిగృహము వసతికి అనుకూలముగా నుండును.

**మార్గము:** ఇది మహారాష్ట్రలోనిది - షోలాపూర్ నుండి బస్‌లో వెళ్లవచ్చును.



**పాండు రంగ స్వామి**

**PANDURANGA SWAMY**

## నాసిక్ - పంచవటి -30

శ్రీరాములవారి సన్నిధి - సీతాదేవి - గోదావరినది.

లక్ష్మణస్వామి శూర్పణఖ యొక్క ముక్కు చెవులు కోసిన ప్రదేశము శ్రీరామచంద్రుడు సీతాదేవితో విహరించిన పుణ్యస్థలము - మారీచవధ ఇక్కడనే జరిగినది. ఇచటగల శంకరమఠము వసతికి అనుకూలము. ఐదుమఱ్ఱిచెట్లు గుంపుగా నుండుటచే పంచవటియనిపేరు. వీని మధ్య సొరంగము కలదు. ఖరదూషణ వధ సమయమున శ్రీరాముడు సీతను ఈసొరంగములో నుంచెనట.

**మార్గం:-** ఇది మహారాష్ట్రలోనిది. బొంబాయినుండి - నాసిక్ రోడ్ స్టేషన్‌దిగి అచట నుండి 10 కి.మీ. బస్‌లో వెళ్లి ఈక్షేత్రమును చేరవచ్చును.

## గయాక్షేత్రము -31

ఇది సుప్రసిద్ధ పుణ్యక్షేత్రము - ఇచట వేంచేసియున్న స్వామిపేరు గదాధరుడు, వైకుంఠ విమానము - నిలచున్నసేవ - ఉత్తరముఖము; ఫల్గునీనది - గయాసురునకు ప్రత్యక్షము. విష్ణుపాదము - స్థలవృక్షము అక్షయ వటము.

ఇటుగల శ్రీవిష్ణుపాదము; అక్షయవటము ప్రతిభారతీయునకు తప్పకసేవింపదగినవి.

**శ్లో॥ జీవతో ర్వాక్యకరణాత్ ప్రత్యబ్దం భూరి భోజనాత్**
**గయాయాం పిండదానాచ్చ త్రిభిః పుత్రస్యపుత్రతా ॥**

అనిచెప్పినట్లు పుత్రకృత్యములలో గయా శ్రాద్ధమొకటి. ఈ గయా శ్రాద్ధమును అవశ్యకర్తవ్యంగా ధర్మశాస్త్రం బోధించింది. అంతేకాక మనగృహాదులలో శ్రాద్ధక్రియలు నిర్వహించేటప్పుడు ఈ గయా క్షేత్రాన్ని, ఇచటి అక్షయవటాన్ని స్మరించడం సంప్రదాయం. ఇట్టి ఈక్షేత్రాన్ని ప్రతిభారతీయుడు తప్పక సేవించాలి. దీనికి 10 కి.మీ. దూరంలో చంపకరాణ్యం కలదు.

**మార్గం:–** కాశీనుండి 320 కి.మీ. గయారైల్వేస్టేషన్.



గయాయాం ఫల్గునీ తీరే
పితౄణాం ముక్తిదాయకమ్
వందేఽక్షయ వటచ్ఛాయా
మాస్థితం శ్రీ గదాధరమ్

**గదా ధరుడు**
**GADA DHARUDU**

# వారణాసి (కాశీ)-32

మోక్షప్రద నగరము లేడింటలో కాశీయొకటి. ఇచటవేంచేసియున్న బిందుమాధవ స్వామి మోక్షప్రదాత. ఇచట శ్రీకేశవస్వామి ఆలయము ప్రాచీనమైనది. లక్ష్మీదేవి తాయార్- నిలచున్నసేవ - తూర్పుముఖము - చక్రతీర్థము - గంగానది అవిముక్త విమానము పరమశివునకు ప్రత్యక్షము. ఇది ప్రసిద్ధ శివక్షేత్రము. అయినను విష్ణుమహిమలకు కొదువలేదు. ఈక్షేత్రమున చనిపోయినవారి చెవిలో పరమశివుడు రామతారక మంత్రమునుపదేశించునట ఆమంత్ర ప్రభావము వలన మోక్షము లభించును. కావుననే ఇచట శవవాహకులు. "రామనామ్‌సత్యహై" అని ఎలుగెత్తి చాటుతారు. ఇచటి గంగానది ప్రతిభారతీయులకు తప్పక సేవింపదగినది. "కష్టై కష్టైయెన్ను" గంగ గంగ అనుటతోడనే మన కల్మషములన్నియు తొలగిపోవును.
**మార్గము:** ప్రధాన నగరముల నుండి రైలు వసతి కలదు.

# పుష్కరక్షేత్రము -33

పరమ పురుషన్ - పుండరీక వల్లి తాయార్ - మంగళవిమానము - పద్మ సరస్సు - నిలచున్నసేవ - తూర్పుముఖము - నృసింహ ఘట్టం - చతుర్ముఖ బ్రహ్మకు ప్రత్యక్షము.

ఇది అష్టస్వయం వ్యక్త క్షేత్రములలో నొకటి. స్వామి నైమిశారణ్యములో వనరూపిగా నున్న విధమున, ఇచట తీర్థరూపముగా నున్నాడు. ఇచట తీర్థమాడుటయే (స్నానము చేయుట) ప్రధానము ఇచట లక్ష్మీనరసింహస్వామి సన్నిధియు కలదు. ఉ.వే. శ్రీమాన్ ప్రతివాది భయంకరం ఆద్య అనంతాచార్యస్వామి వారి రంగాజీ మందిరం వసతికి అనుకూలము.
**మార్గము:** ఈ క్షేత్రము అజ్మీర్‌కు 10 కి.మీ దూరమున గలదు. ఉత్తరప్రదేశ్ రాష్ట్రములోనిది.

# గోవర్ధనము -34

గోకులనాథుడు - శ్రీహరినాథన్ - రాధాదేవి, పర్వత విమానము - మానసగంగ, బ్రహ్మతీర్థము - రాధాతీర్థము - కాళింది మడుగు - నిలచున్నసేవ - తూర్పుముఖము - బ్రహ్మకు, కాళీయునకు ప్రత్యక్షము. ఈగోవర్ధన పర్వతమునే శ్రీకృష్ణుడు చిటికెన వ్రేలితో పైకి ఎత్తెను.
**మార్గము:** ఈక్షేత్రము బృందావనమునకు సమీపమున గలదు.

## పళ్ళికొండ –35

రంగనాథస్వామి – శ్రీరంగనాయకి – వ్యాస పుష్కరిణి – శేషశయనం; శయనించిన మూర్తి; అంబరీష మహారాజుకు ప్రత్యక్షం.

**మార్గము:** తమిళనాడులో గుడియాత్తం స్టేషన్ నుండి 3 కి.మీ.

## పింజూర్ –36

వరదరాజస్వామి – పెరుందేవిత్తాయార్ – అనంత సరస్సు – రోమపాద మహర్షికి ప్రత్యక్షము.

**మార్గం:** మద్రాసుకు 30 కి.మీ.

## పొన్నేరి –37

హరికృష్ణ పెరుమాళ్ – సుందరవల్లి త్తాయార్ – సుందరపుష్కరిణి సుందరవిమానము – అరణినది – భరద్వాజ మహర్షికి ప్రత్యక్షము.

**మార్గం:–** పొన్నేరి స్టేషన్ నుండి 3.కి.మీ.

## నాగలాపురం –38

వేదనారాయణస్వామి – వేదవల్లిత్తాయార్, వేద విమానము, మత్స్య తీర్థము.

**విశే:** ఫాల్గుణమాసములో మూడు దినములు సూర్యరశ్మి పెరుమాళ్లపై ప్రసరించును. మిగతాదినములలో ఈవిధముగా ప్రసరించదు.

**మార్గము:–** తిరువళ్లూరు నుండి 25 కి.మీ.

## పుష్పగిరి –39

చెన్నకేశవస్వామి – రాఘవస్వామి – పెన్నానది.

**విశే:** ఇది పెన్నానదీ తీరమునగల పుణ్యక్షేత్రము. ఆది శంకరాచార్యుల మఠము కలదు.

**మార్గం:–** కడపకు 15 కి.మీ

## కదిరి –40

నరసింహస్వామి – లక్ష్మీత్తాయార్ – కదిరివృక్షము.

**విశే:** ఇది మిక్కిలి ప్రాచీనమైన క్షేత్రము. పదకవితా పితామహుడగు అన్నమాచార్యుల వారు కీర్తించిన క్షేత్రరాజము.

**మార్గం:–** ధర్మవరం – పాకాలలైనులో కదిరిస్టేషన్.

# గూడూరు -41

అళగనాథస్వామి - రాజ్యలక్ష్మి త్తాయార్.

**విశే:**మిక్కిలి ప్రాచీనమైన సన్నిధి పెరుమాళ్లు తిరుమాలిరుంశోలై పెరుమాళ్ల వలె వేంచేసియుందురు.

**మార్గం:-** మద్రాసు - విజయవ్వాడ మార్గములో గూడూరు స్టేషన్.

# సింగరాయకొండ -42

విజయవాడ - గూడూరు రైల్వేలైనులో సింగరాయకొండ రైల్వేస్టేషన్. స్టేషన్ నుండి 1 మైలు దూరములో కొండగలదు. ఈకొండమీద వరాహలక్ష్మి నరసింహస్వామి వేంచేసియున్నారు. చాలా ప్రాచీనమైన సన్నిధి. స్వామి వరప్రదుడు.

# కావలి -43

ఇది మద్రాసు - విజయవాడ మార్గములో నెల్లూరు తర్వాత స్టేషన్. మిక్కిలి ప్రాచీనమైన లక్ష్మీకాంతస్వామి సన్నిధి గలదు. ఈ సన్నిధిలో వేంచేసియున్న పెరుమాళ్ళు, ఉడయవరులు భక్తుల హృదయములను దోచుకొందురనుటలో అతిశయోక్తిలేదు.

# ఒంగోలు -44

ఇదిప్రకాశం జిల్లా ముఖ్య పట్టణము. రంగమన్నార్ - ఆండాళ్ సన్నిధి చక్రవర్తి తిరుమగన్ సన్నిధి కలదు. శ్రీవైష్ణ సంప్రదాయమునకు నిలయమై విరాజిల్లుచున్నది.



రంగమన్నార్ ఆండాళ్ (శ్రీవిల్లిపుత్తూర్)

RANGAMANNAR ANDAL (SRI VILLIPUTTUR)

## నడిగడ్డపాలెం – 45

సీతారామస్వామిసన్నిధి - శ్రీమత్పరమహంసేత్యాది శ్రీ శ్రీ శ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయర్‌స్వామివారి సన్నిధి కలవు.

**విశే:–** శ్రీమద్రామాయణ మందరమును రచించిన పరమ భక్తాగ్రేసరులగు శ్రీవాసుదాస స్వామివారు నిర్మించుకొన్న ఆశ్రమం. ఇది శ్రీమత్పరమహంసేత్యాది శ్రీ శ్రీ శ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయర్ స్వామివారికి సమర్పింపబడినది. వారిని తిరుప్పళ్లిచేర్చి అర్చారూపముగా వేంచేపు చేయుటచేత పవిత్రమైన స్థలము. ఆంధ్ర దేశమున శ్రీవైష్ణవ ప్రచారమునకై యావజ్జీవితము శ్రమించి అసంఖ్యాకులకు ఆచార్యులై శతాధిక గ్రంథకర్తలైన కులపతులు ఉ.వే. శ్రీమాన్ తె.కం. గోపాలచార్యస్వామి వారు ఇటీవల వరకు నిర్వహించిన క్షేత్రరాజము.

**మార్గం:–** గుంటూరుజిల్లా చుండూరు స్టేషన్‌కు 5 కి.మీ.



**శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జియ్యరు స్వామి**

**SRI SRI SRI THRITHANDI SRIMAN NARAYANA RAMANUJA JEEYAR SWAMI**

## మంగళగిరి - 46

పానకాల నరసింహస్వామి - మహాలక్ష్మి త్తాయార్ - కల్యాణ తీర్థము.

**విశే:** ఇచట కొండపై నరసింహస్వామి సన్నిధి కలదు. వీరు పానకమును విశేషముగా ఆరగింతురు. భక్తులు సమర్పించిన పానకమును స్వామి సగము మాత్రము స్వీకరించి మిగిలిన దానిని భక్తులకు అనుగ్రహింతురు. కొండదిగువ సన్నిధిలో ఉత్సవమూర్తి వేంచేసియుందురు. ఇది మిక్కిలి ప్రాచీనమైన క్షేత్రము.

**మార్గం–** విజయవాడ - గుంటూరు మధ్యగలదు.



**పానకాల నృసింహస్వామి (మంగళగిరి)**

**PANAKALA NRISIMHA SWAMY (MANGALAGIRI)**

# సీతానగరం -47

ఇది జగత్ ప్రసిద్ధులైన శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య శ్రీ శ్రీ శ్రీ త్రిదండి చినశ్రీమన్నారాయణ రామానుజ జీయర్‌స్వామివారి ప్రధాన ఆశ్రమము. శ్రీస్వామివారి తిరువారాధన చక్రవర్తి తిరుమగన్ వేంచేసిన పుణ్యస్థలము. "యం యం స్పృశ్యతి పాణిభ్యాం యం యం పశ్యతి చక్షుషా స్థావరాణ్యాపి ముచ్యంతే" అనువిధమున తమ శ్రీపాదస్పర్శచేతను; హస్తస్పర్శచేతను, దివ్యమందహాసాంచిత కృపాకటాక్షముచేతను స్థావర జంగమాది భేదము లేక సర్వులను అనుగ్రహించి భగవత్కృపా పాత్రులను చేయు పరమోదారులు, అభినవ భగవద్రామానుజులైన శ్రీ శ్రీ శ్రీ జీయర్ స్వామివారి ఆశ్రమమును సేవించి ధన్యులగుట ప్రతి భక్తునకు అవశ్యకర్తవ్యము.

**మార్గము:** విజయవాడకు 5 కి.మీ.



సీతా రామచంద్రస్వామి

SEETHANAGARAM

# భద్రాచలం –48

ఆంధ్రదేశమునగల సుప్రసిద్ధక్షేత్రము. సీతారాముల సన్నిధి - గోదావరినది. భక్తరామదాసుచే అనేక విధముల అభివృద్ధి చేయబడినది. రామదాసు కీర్తనలచే స్తుతింపబడినది. ఇచట ప్రతి సంవత్సరము చైత్రశుద్ధ నవమి నాడు జరుగు శ్రీసీతారామ కల్యాణము జగద్విఖ్యాతమైనది. ఈక్షేత్రమును తిరుమంగై ఆళ్వార్లు సేవించినట్లు పెద్దలు చెప్పుదురు.

**మార్గము:** ఇది ఆంధ్రప్రదేశ్ ఖమ్మం జిల్లాలోని కొత్తగూడెం పట్టణానికి 40 కి.మీ.



**సీతారామ చంద్ర స్వామి (భద్రాచలం)**

**SEETHARAMCHANDRA SWAMY (BHADRA CHALAM)**

# విజయవాడ -49

ఇది ప్రసిద్ధ నగరము. కొత్తగుళ్ళు అనేపేరుతో ప్రసిద్ధమైన శ్రీవేంకటేశ్వర స్వామి సన్నిధి సేవింపవలెను. ఇచట కృష్ణానదీ స్నానము విశేషము. పండ్రెండు సంవత్సరములకు ఒకసారి గురువు కన్యారాశిలో ప్రవేశించినపుడువచ్చు కృష్ణాపుష్కర సంరంభము తప్పక సేవింపవలెను.

**మార్గము:** మద్రాసు - విశాఖ రైలుమార్గములో విజయవాడ ప్రముఖ స్టేషన్.

# పెదముత్తేవి -50

ఇది కృష్ణాజిల్లాలోనిదే. విజయవాడ నుండి పోవచ్చును. సుప్రసిద్ధులైన శ్రీ శ్రీ శ్రీ సీతారామ యతీంద్రులు వారి అంతే వాసులు శ్రీ శ్రీ లక్షణయతీంద్రులు నివసించిన ప్రదేశము - వారి ఆశ్రమము లక్ష్మీనారాయణుల సన్నిధి కలవు.-



**వ్యాఘ్ర నృసింహస్వామి (ఆగిరిపల్లి)**

**VYAGRA NRISIMHA SWAMY (AGIRIPALLI)**

# శోభనాచలము (ఆగిరిపల్లి) -51

వ్యాఘ్ర నరసింహస్వామి - రాజ్యలక్ష్మి త్తాయార్.

విశే:- కొండమీద స్వామి సన్నిధి గలదు. స్వామి మిక్కిలి ప్రభావ సంపన్నులు. నూజివీడు ఆస్థాన మహావిద్వాన్ ఉ.వే. శ్రీమాన్ కిడాంబి గోపాల కృష్ణమాచార్యుల వారు ఈస్వామిని ఉద్దేశించి "శోభనాద్రీశవైభవము" అను బృహత్తర చంపూప్రబంధమును (సంస్కృతభాషలో) అనుగ్రహించినారు. ఇందు రామాయణ భారత భాగవతాదులతోపాటు బ్రిటిష్‌పరిపాలన వరకు గల భారతదేశ చరిత్ర సమీక్షింపబడినది.

మార్గము: కృష్ణా జిల్లా నూజవీడుకు సమీపము.



**శోభనాద్రీశ్వర స్వామి (ఆగిరిపల్లి)**

**SOBHANADRISWARA SWAMY (AGIRIPALLI)**

# ద్వారకా తిరుమల -52

శ్రీవేంకటేశ్వరస్వామి - సుదర్శన తీర్థము - నిలుచున్నసేవ - తూర్పుముఖము - ద్వారక మహర్షికి ప్రత్యక్షము.

**విశే:** ద్వారక మహర్షి కోరికపై స్వామి కొండపై వెలసినాడు. మిక్కిలి ప్రాచీనమైన సన్నిధి. తిరుపతి క్షేత్రమును సేవింపలేనివారు ఈ స్వామిని సేవించి కానుకలర్పింతురు. ప్రసిద్ధ ప్రార్థనా స్థలము - ఈస్వామి భక్తులపాలిటి కొంగుబంగారము.

**మార్గము:** విజయవాడ - రాజమండ్రి స్టేషనుల మధ్య భీమడోలు స్టేషన్ నుండి 20 కి.మీ. ఏలూరు, తాడేపల్లిగూడెం, విజయవాడ నుండి బస్‌వసతి కలదు.



**వేంకటేశ్వరస్వామి (ద్వారకాతిరుమల)**

**VENKATESWARA SWAMY (DWARAKATIRUMALA)**

# అంతర్వేది -53

లక్ష్మీనరసింహస్వామి - రాజ్యలక్ష్మీత్తాయర్ - కూర్చున్నసేవ - తూర్పుముఖము సాగర సంగమము. వసిష్ఠమహర్షికి ప్రత్యక్షము.

**విశే:** ఇది నరసాపురం పట్టణమునకు 10 కి.మీ దూరములో సముద్రతీరమున గల పుణ్యక్షేత్రము. సముద్రస్నానము విశేషము. మాఘశుద్ధ దశమినాడు జరుగు కల్యాణము ఏకాదశినాటి రథోత్సవమును సేవించుటకు లక్షలాదిగా భక్తులు వత్తురు. ఈ స్వామి సన్నిధిలో సుదర్శనాళ్వాన్ వేంచేసియున్నారు. ప్రముఖ ప్రార్థనా స్థలము. ప్రసిద్ధ నృసింహక్షేత్రములలో ప్రధానమైనది అంతర్వేది.

**మార్గము:** నరసాపురం నుండి లాంచీమీదను, గోదావరి దాటి బస్ మీదను చేరవచ్చును.



**నృసింహస్వామి (అంతర్వేది)**

**NRISIMHA SWAMY (ANTARVEDI)**

## ర్యాలి - 54

ఇది అతి పురాతనమైన సన్నిధి. స్వామి జగన్మోహినీ కేశవస్వామి. పరమశివునకు ప్రత్యక్షము.

**విశే:** మోహినీ అవతారమును చూచి మోహించిన పరమశివునకు తన నిజస్వరూపమును ప్రదర్శించిన స్థలము. కావుననే స్వామి ముందుభాగము కేశవుడుగా, వెనుక భాగము జగన్మోహినిగా వేంచేసియుందురు. ఈదృశ్యము అతిమనోహరమైనది. స్వామి శ్రీపాదముల నుండి సదా గంగా ప్రవహించుచునేయుండును. మకరతోరణముపై దశావతారములు కలవు.

**మార్గము:** తూర్పుగోదావరి జిల్లా రావులపాలెంకు 10 కి.మీ దూరము.





**జగన్మోహినీ కేశవ స్వామి (ర్యాలి)**

**JAGANMOHINI KESAVA SWAMY (RYALY)**

## పాలకొల్లు –55

అష్టభుజస్వామి సన్నిధి కలదు. సన్నిధి ప్రాచీనమైనది. స్వామి అష్టభుజములతో వేంచేసియున్న కారణమున అష్టభుజస్వామియని పేరువచ్చెను. కాంచీపురములోని అష్టభుజస్వామి తరువాత ఆ రీతిలో వేంచేసియున్న దివ్యస్థలము. ఇది సుప్రసిద్ధ వ్యాపారకేంద్రము. ఇచట ప్రతి వత్సరము ఉభయవేదాన్త సభలు జరుగుచున్నవి. దీనికి 10 కి.మీ. అభినవభూతపురి (నరసాపురము) కలదు.

**మార్గము:** భీమవరం – నరసాపురం రైల్వే మార్గంలో పాలకొల్లు స్టేషన్.

## కొరాలపల్లు –56

ఆదికేశవ ప్పెరుమాళ్లు – యతిరాజవల్లి త్తాయార్ – అనంత విమానము – తూర్పుముఖము – నిలుచున్నసేవ.

**విశే:** ఇదియు ప్రాచీనమైన సన్నిధి – సన్నిధిలో నరసాపురం సన్నిధిలోవలె కైంకర్యములు జరుగును. ఇచట శ్రీవైష్ణవ గోష్ఠి అతిశయముగా కలదు. స్వామి వరప్రదుడు.

**మార్గము:** పశ్చిమగోదావరి జిల్లాలోని పెనుగొండనుండి 5 కి.మీ.

## రాజమహేంద్రవరము –57

ఇది అతిప్రాచీనమైన నగరము. ఆదికవినన్నయ మహాభారతము నాంధ్రీకరించిన ప్రదేశము. గోదావరీ నదీ తరంగాలతో సుశీతలమైన నగరము. గురుడు సింహరాశిలో ప్రవేశించునపుడు జరుగు పుష్కర సంరంభములు జగద్విఖ్యాతములు. ఇచట గోదావరీ స్నానము విశేషము. గోదావరి సమీపముననే ప్రాచీనమైన వేణుగోపాలస్వామి దేవాలయము కలదు. నగరములోని తులసీ రామానుజకూటము భక్తులకు వాసయోగ్యము.

**మార్గము:** విజయవాడ – విశాఖ రైలు మార్గములో రాజమండ్రి స్టేషన్. అన్ని ప్రధాన నగరముల నుండి బస్సు వసతి కలదు.

## కోరుకొండ –58

ఇచటకొండమీద ప్రాచీనమైన నరసింహస్వామి సన్నిధి గలదు. శ్రీరంగం పరాశర సుదర్శన్ భట్టర్ వంశీకులైన భట్టర్‌స్వామివారి నిర్వాహములోగల క్షేత్రము. స్వామి వరప్రదుడు – ప్రతి సంవత్సరము ఉభయ వేదాంత సభలు వైభవముగా జరుగుచుండును.

**మార్గము:** రాజమహేంద్రవరమునకు 20 కి.మీ

## పిఠాపురం –59

ఇది ప్రాచీనమైన నగరము. పీఠికాపురియనిపేరు. ఇచట కుంతీ మాధవ స్వామి సన్నిధికలదు. దీనిని మణవాళమహామునులు ప్రతిష్ఠించినట్లు చెప్పుదురు.

## పద్మనాభం, రామతీర్థం –60

ఈ రెండును విజయనగరం సమీపములోనివి. పద్మనాభస్వామి, కోదండరామ స్వాముల సన్నిధులు కలవు. ప్రాచీనమైనవి. ఇచట శ్రీవైష్ణవ గోష్ఠి మిక్కుటముగా గలదు.

## కాకినాడ –61

ఇది ప్రసిద్ధ నగరము. తూర్పుగోదావరి జిల్లా ముఖ్యపట్టణము. ఈనగరమునకు 10 కి.మీ దూరములో జి.వేమవరం అనే గ్రామంలో అష్టాక్షరీ క్షేత్రము కలదు. ఇచట వేంచేసియున్న వైకుంఠనారాయణ పెరుమాళ్ అతిశయమైన సౌందర్యముతో భక్తుల హృదయాలను దోచుకొందురు. ఇచట ప్రతి నిత్యము అష్టాక్షరీ జప తర్పణ హెూమాదులు జరుగును. దీని నిర్వాహకులు ఉపనిషత్ సిద్ధాంతాచార్య పీఠాధిపతులు శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య శ్రీ శ్రీ శ్రీత్రిదండి శ్రీరంగరామానుజ జీయర్ స్వామివారు.



శ్రీ వైకుంఠ నారాయణులు
SRI VYKUNTA NARAYANULU

## ధర్మపురి -62

ఇది కరీంనగర్ జిల్లాలోనిది. నరసింహస్వామి సన్నిధి గోదావరీ నదీతీరమున గలదు. ప్రాచీన దేవాలయములలో ధర్మపురి యొకటి. ఈ క్షేత్రస్వామి విషయమై శేషప్పకవి నృసింహ శతకమును రచించెను. తురుష్కులవలన బాధలుపడిన శేషప్పకవి స్వామిని నిందాస్తుతి గర్భముగ స్తుతించెను.

## నల్గొండ -63

ఇదిజిల్లా కేంద్రము. ఇచటరామగిరిలో శ్రీసీతారామస్వామి సన్నిధి ఆండాళ్ సన్నిధి కలదు. శ్రీరామనవమి, ధనుర్మాసము మిక్కిలి వైభవముగా జరుగును. పలు ప్రాంతముల నుండి భక్తులు వచ్చి దర్శింతురు.

## యాదగిరిగుట్ట -64

లక్ష్మీనరసింహస్వామి సన్నిధి కొండమీద గలదు. భక్తులకు వరప్రసాది. ప్రసిద్ధ పుణ్యక్షేత్రము. పలుప్రాంతముల నుండి భక్తులు వచ్చి సేవింతురు.
**మార్గము:** విజయవాడ రైలు మార్గంలో రాయగిరి స్టేషన్‌కు 10 కి.మీ.



నరసింహస్వామి
(యాదగిరి గుట్ట)
NARASIMHA SWAMY
(YADAGIRIGUTTA)

## సికిందరాబాద్ - హైదరాబాద్ -65

ఇది ప్రసిద్ధనగరము. ఇచట గల లక్ష్మీనారాయణ మందిరము, శ్రీరంగనాథ స్వామి సన్నిధి సేవింపవలెను. ధనుర్మాసము మిక్కిలి వైభవముగా జరుగును. ఈనగరములోనే గల సీతారాంబాగ్‌లోను ప్రాచీనమైన లక్ష్మీనారాయణుల సన్నిధి వరదరాజస్వామి సన్నిధి కలదు. ఎందరో మహనీయులు ఇచటకు వేంచేసి మంగళా శాసనం కృపచేసిన స్థలము. బిర్లాసంస్థ నిర్మించిన శ్రీవేంకటేశ్వరస్వామి సన్నిధి మనోహరమైనది.

ఈనగరములోనే మరియొక సన్నిధి శ్రీవేంకటేశ్వరస్వామి సన్నిధి. ఇది అల్వాలలో కలదు. (సికిందరాబాద్ - బొలారం మార్గము) దీనికి దేవుని అల్వాల అనియేపేరు. వందల సంవత్సరముల నాటి సన్నిధి శిధిలముకాగా దానిని ప్రస్తుతం పునర్నిర్మించుచున్నారు.

## స్తంభాద్రి -66

ఇది ఖమ్మం మెట్టకు 2 కి.మీ దూరంలో గలదు. ఇచటగల నరసింహస్వామి సన్నిధి ప్రాచీనమైనది. ఈస్వామి భక్తుల పాలిటి కల్పవృక్షము.

## వేదాద్రి -67

ఆంధ్రదేశమున సుప్రసిద్ధమైన నృసింహ క్షేత్రములలో వేదాద్రియొకటి. ఇచట ఒక చిన్నపర్వతముపై స్వామివేంచేసియున్నాడు. చతుర్ముఖబ్రహ్మ నారదాదులకు ఈ పర్వతము మీదనే వేదపురాణాదులను ఉపదేశించెననియు వారి ప్రార్థనపై స్వామి అర్చారూపముగా ఇచటవేంచేసెనని చెప్పుదురు. కావుననే ఈపర్వతమునకు వేదాద్రియని పేరువచ్చినది.

**మార్గము:** హైదరాబాద్ విజయవాడ బస్సు మార్గములో జగ్గయ్యపేటకు సమీపములో కలదు.

## బుచ్చిరెడ్డి పాలెం -68

కోదండరామస్వామి - సీతాదేవి - లక్ష్మీ నృసింహస్వామి - ప్రాచీనమైన దివ్యస్థలము. శ్రీరామనవమికి బ్రహ్మోత్సవము అతివైభవముగా జరుగును.

మార్గము: నెల్లూరుకు 15 కి.మీ దూరములో కలదు.

## శ్రీకాకుళం –69

శ్రీకాకుళాంధ్ర మహావిష్ణువు. ఇది కృష్ణాతీరమునగల ప్రాచీన దేవాలయము. ఈస్వామి శ్రీకృష్ణదేవరాయలకు స్వప్నమున సాక్షాత్కరించి ఆముక్త మాల్యదను రచింపుమని ఆదేశించినట్లు రాయలు తన ఆముక్తమాల్యద పీఠికలో తెలియజేసెను.
మార్గముః కృష్ణాజిల్లా చల్లపల్లికి సమీపములో గలదు.

## భీమవరం –70

శ్రీరామకోటి క్షేత్రము. ఇది శ్రీమత్పరమహంసేత్యాది శ్రీ శ్రీ శ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయర్ స్వాముల వారి శ్రీహస్తములచే ప్రతిష్ఠింపబడిన రామకోటిక్షేత్రము. దీనిని భగవద్రామానుజ దర్శన కైంకర్య సమితివారు నిర్వహించుచున్నారు. నిత్య కల్యాణము, నిత్య తదీయారాధనము జరుగుచున్నవి. ఉభయవేదాన్త సభలను నిర్వహించుచున్నారు.
మార్గముః ఇది పశ్చిమగోదావరి జిల్లాలోని ప్రధాన నగరములలో ఒకటి.



శ్రీ రామకోటి క్షేత్రము,
భీమవరం
SRI RAMAKOTI KSHETRAM, BHIMAVARAM.

## గుమ్మడదల –71

ఇది ప్రాచీనమైన క్షేత్రము.కళ్యాణ రామచంద్ర స్వామి దేవస్థానము కలదు. ఈ సన్నిధిలో జరుగు అధ్యయనోత్సవమును శ్రీ ఘంటంభట్ల వేంకట భుజంగరాయశర్మ గారు మనోహర కావ్యముగా రూపొందించినారు.
**మార్గముః** మెదక్ జిల్లా నరాసాపూర్‌కు సమీపములో కలదు.



శ్రీరస్తు

శ్రీమతే రామానుజాయనమః

# ఆళ్వార్ల వైభవము

## 1. పొయ్‌గై యాళ్వార్

తిరునక్షత్ర తనియన్ :-

తులాయాం శ్రవణేజాతం కాంచ్యాం కాంచన వారిజాత్
ద్వాపరే పాంచజన్యాంశం సరోయోగిన మాశ్రయే ॥

నిత్య తనియన్:-

**కాంచ్యాం సరసి హేమాబ్జే జాతం కాసారయోగినమ్ ।**
**కలయే యశ్శ్రియః పత్యూ రవిన్దీప మకల్పయత్ ॥**

వీరు ద్వాపర యుగాది 8,60,900 సంవత్సరమైన సిద్ధార్ధి నామ సంవత్సర అల్పిశి (తుల) నెల శుద్ధ అష్టమీ జయవారం (మంగళ) శ్రవణా నక్షత్రమందు కాంచీపురం యథోక్తకారి సన్నిధి యందుగల పుష్కరిణిలో స్వర్ణమయమైన తామర పుష్పమునందు అయోనిజులై అవతరించిరి. వీరికి సరోయోగి యనియు, కాసారయోగి యనియు నామాంతరములు. ఆచార్యులు సేనముతలియార్.

వీరు పాంచజన్యాంశ సంభూతులు. వీరు నిస్పృహులై గ్రామైక రాత్రముగా తిరుగుచు భగవద్గుణానుభవమే ధారక పోషక భోగ్యములు కాగా వేంచేసియుండిరి. ఒకనాడు 'తిరుక్కోవలూర్' అను దివ్యదేశము వేంచేసి పెరుమాళ్లకు మంగళాశాసనముచేసి ఒక తిన్నెమీద వేంచేసి యుండగా పూదత్తాళ్వార్ వేంచేసినారు. అపుడు ఇద్దరును కూర్చుండిరి. కొంతసేపటికి పేయాళ్వార్లు అక్కడకు వేంచేసిరి. ముగ్గురకు కూర్చుండుటకు స్థలము లేకుండుటచే నిలుచుండిరి. వీరి సంశ్లేషమును గోరిన సర్వేశ్వరుడు వీరిమధ్య ప్రవేశించెను.

నిలిచియుండుటకును స్థలము చాలనందున వారు అందుకు కారణమేమా! యని యోగ దృష్టిచే చూడగా శ్రియః పతి సాక్షాత్కరించెను. అపుడు వారి అనుభవ పరీవాహరూపముగా అవతరించిన దివ్య ప్రబన్ధములే ముదల్ తిరువన్దాది, ఇరండాం తిరువన్దాది, మూన్ఱాం తిరువందాదులు. ప్రతిపాశురాంతపదము పాశురాది యందు వచ్చుటచే ఈ ప్రబంధములకు అన్దాది యని పేరు కలిగెను.

ఆళ్వార్ - పొయిగై యాళ్వార్. తిరునక్షత్రం: తుల - శ్రవణం
తిరువవతారస్థలం: కాంచీ తిరువెఃకా (యథోక్తకారి సన్నిధి) పొయ్‌గై పుష్కరిణి యందలి స్వర్ణ కమలము.

ఆచార్యులు:- సేనముదలి యాళ్వార్
అనుగ్రహించిన ప్రబంధము: ముదల్ తిరువందాది 100 పాశురములు.
మంగళాశాసన దివ్యదేశములు: 6

### నాళ్‌పాట్టు

ఐప్పశియల్ ఓణం; అవిట్టం శదయమివై ;
ఒప్పిలవానాళ్‌గళ్; ఉలగత్తీర్ - ఎప్పువియుమ్
పేశుపుగళ్ పొయ్‌గై యార్ పూదత్తార్; పేయాళ్వార్;
తేశుడనే; తోన్ఱు శిరప్పాల్.

### వాళితిరునామజ్గళ్

శెయ్య తులా వోణత్తిల్ శగత్తు దిత్తాన్ వాళియే
తిరుక్కచ్చి మానగరుమ్ శెళిక్క వందోన్ వాళియే
వైయన్దగళి నూఱుమ్ వగుత్తురైత్తాన్ వాళియే
వనశమలర్ క్కరువదనిల్ వన్దమైన్దాన్ వాళియే
వెయ్య కదిరోన్ దన్నై విళక్కిట్టాన్ వాళియే
వేఙ్గడవర్ తిరుమలైయై విరుమ్బుమవన్ వాళియే
పొయ్‌గై ముని వడివళగుమ్ పొఱ్పదముమ్ వాళియే
పొన్ ముడియుమ్ తిరుముగముమ్ పూతలత్తిల్ వాళియే.





**ముదలాళ్వార్లు**

**MUDALARVARLU**

# 2. పూదత్తాళ్వార్

**తిరునక్షత్ర తనియన్ః**

**తులా ధనిష్ఠా సంభూతం భూతం కల్లోల మాలినః ।**

**తీరేపుల్లోత్పలే మల్లాపుర్యామీడే గదాంశజమ్ ॥**

**నిత్యతనియన్ః**

**మల్లావర పురాధీశం మాధవీ కుసుమోద్భవమ్ ।**

**భూతం నమామి యోవిష్ణోః జ్ఞానదీప మకల్పయత్ ॥**

వీరు పొయిగై యాళ్వార్ అవతరించిన మరునాడు అనగా సిద్ధార్థి నామ సంవత్సర తులామాసం శుద్ధ నవమీ బుధవారం ధనిష్ఠా నక్షత్రమున తిరుక్కడల్ మల్లై (మహాబలిపురం) దివ్యదేశమందు మాధవీ పుష్పమునందు అయోనిజులై యవతరించిరి. పూతమ్ అనగా ఆత్మ. సర్వేశ్వరునకు ఆత్మగా నుండుట వలన వీరికి పూదత్తాళ్వార్ అనుపేరు వచ్చెను. వీరు గదాంజశులు.మిగిలిన వివరము పొయ్గై ఆళ్వార్ చరిత్రలో చూడవచ్చును.

ఆళ్వార్ః పూదత్తాళ్వార్, తిరునక్షత్రంః- తుల, ధనిష్ఠ
అవతార స్థలంః- "తిరుక్కడల్మల్లై", ఆచార్యులుః - సేనముదలియాళ్వార్
అనుగ్రహించిన ప్రబంధముః- ఇరణ్డాన్దిరువన్దాది 100 పా ॥
మంగళాశాసన దివ్యదేశములుః 13

## నాళ్‌పాట్టు

ఐప్పశియల్ ఓణం; అవిట్టం శదయమివై ;
ఒప్పిలవానాళ్‌గళ్; ఉలగత్తీర్ - ఎప్పువియుమ్
పేశుపుగళ్ పొయ్గై యార్ పూదత్తార్; పేయాళ్వార్;
తేశుడనే; తోన్ఱు శిరప్పాల్.

## వాళితిరునామజ్గళ్

అన్బేదగళినూఱు మరుళినాన్ వాళియే
ఐప్పశియల్ అవిట్టత్తిల్ అవదరిత్తాన్ వాళియే
నన్బుకళ్ శేర్ కురుక్కత్తి నాణ్మలరోన్ వాళియే
నల్ల తిరుక్కడల్ మల్లై నాదనార్ వాళియే
ఇన్బురుగు శిన్దై తిరియిట్ట పిరాన్ వాళియే
ఎళిల్ ఞానచ్చుడర్ విళక్కే యేత్తినాన్ వాళియే
పొన్బురై యుమ్ తిరుపరజ్గర్ పుగళురై ప్పోన్ వాళియే
పూదత్తార్ తాళిణై ఇప్పూదలత్తిల్ వాళియే.

# 3. పేయాళ్వార్

తిరునక్షత్ర తనియన్:-

తులా శతభిషగ్జాతం మయూర పురి కైరవాత్
మహాన్తం మహదాఖ్యాతం వన్దే శ్రీ నన్దకాంశజమ్ ॥

నిత్య తనియన్:-

దృష్టాని తుష్టావ యో విష్ణుం రమయా మయిలాధిపమ్
కూపే రక్తోత్పలే జాతం మహదాహ్వయ మాశ్రయే ॥

వీరు ముదలాళ్వార్లు ముగ్గురిలో మూడవవారు. మదరాసులోని మయూరపురి (మైలాపూర్) యందు మణికైరవమనెడి బావియందవతరించిరి. వీరు మహాయోగులై లోకరీతిని వ్యవహరింపక సదా సర్వేశ్వరునే ధ్యానించుచు ఉన్మత్తుల వలె నుండుటచే పేయాళ్వార్ అని ప్రసిద్ధులైరి. వీరు ద్వాపరయుగాది 8,60,900 సంవత్సరమున సిద్ధార్థినామ సంవత్సరమున తులా మాసం శుద్ధ దశమీ గురువారం శతభిషానక్షత్రము నందవతరించిరి. మిగిలిన చరిత్ర పొయిగైయాళ్వార్ చరిత్రలో చూడనగును. వీరునందకాంశజులు.

ఆళ్వార్లు: పూదత్తాళ్వార్. తిరునక్షత్రం: తుల - శతభిషమ్ అవతారస్థలం:- మయూరపురి. ఆచార్యులు:- సేనముదలియాళ్వార్:- తిరువారాధన: ఆళ్వార్కళ్నై నార్ ప్రబంధము: మూన్ఱాం తిరువన్దాది. 100 పా; మంగళాశాసన దివ్యదేశములు: 15

**నాళ్‌పాట్టు**

ఐప్పిశియల్ ఓణం; అవిట్టం శదయమిప్పై ;
ఒప్పిలవానాళ్‌గళ్; ఉలగత్తీర్ - ఎప్పువియుమ్
పేశుపుగఝ్ ప్పొయ్‌గై యార్ పూదత్తార్; పేయాళ్వార్;
తేశుడనే; తోన్ఱు శిరప్పాల్.

**వాళ్ఱితిరునామజ్గళ్**

తిరుక్కణ్డే నెననూఱుమ్ శెప్పినాన్ వాళ్ఱియే
శిఱన్ద ఐప్పిశియిల్ శదయమ్ శెనిత్త వళ్ళల్ వాళ్ఱియే
మరుక్కమళ్ఱుమ్ మయిలై నగర్ వాళవన్దోన్ వాళ్ఱియే
మలర్కరియ నెయ్‌దన్ తనిల్ వన్దుదిత్తాన్ వాళ్ఱియే
నెరుక్కిడవే యిడై కళ్ఱియిల్ నిన్ఱ శెల్వన్ వాళ్ఱియే
నేమి శఙ్గం వడివళ్ఱగై నెఞ్జిల్‌వై ప్పోన్ వాళ్ఱియే
పెరుక్కముడన్ తిరుమళ్ఱిశై ప్పిరాన్ తొళ్ఱువోన్ వాళ్ఱియే
పేయాళ్వార్ తాళిణై యెప్పొరు నిలత్తిల్ వాళ్ఱియే.

# 4. తిరుమழிశై యాழ்వార్

తిరునక్షత్రతనియన్:–

మఖాయాం మకరేమాసి చక్రాంశం భార్గవోద్భవమ్
మహీసార పురాధీశం భక్తిసార మహం భజే ।

నిత్యతనియన్:–

శక్తి పఞ్చమయ విగ్రహాత్మనే, శుక్తిహారజిత చిత్తహారిణే
ముక్తిదాయక మురారి పాదయోః భక్తిసారమునయే నమోనమః ॥

వీరు తొణ్డమణ్డలములో చేరిన "తిరుమழிశై" అను క్షేత్రమునందు ద్వాపరాంతమున విభవనామ సంవత్సర మకరమాసమున కృష్ణదశమీ గురువారం మఖా నక్షత్రమునందవతిరించిరి. వీరుభార్గవమహర్షికి కనకాంగి యను అప్సర స్త్రీవలన జన్మించిరి. తిరుమழிశై యను క్షేత్రము నందవతరించుటచే తిరుమழிశై యాళ్వార్ అనిప్రసిద్ధినొందిరి. వీరు చక్రాంశజులు.

వీరుమొదట శైవ సిద్ధాన్తమునందు ప్రవేశించిరి. వీరి వృత్తాన్తమును తెలిసిన పేయాழ்వార్లు వీరున్నచోటునకుపోయి వారికి శ్రీవైష్ణవ సిద్ధాన్తము నందు రుచి కలుగజేసి పంచ సంస్కారములననుగ్రహించిరి. వీరిప్రభావము అమితమైనది. దానిని గురుపరంపరాప్రభావాది గ్రంథములలో చూడనగును.

ఆழ்వార్లు: తిరుమழிశై ఆழ்వార్, భక్తిసారులు. తిరునక్షత్రం: మకరమాసం – మఖానక్షత్రం
ఆచార్యులు: పేయాழ்వార్; అవతారస్థలం: తిరుమழிశై :పరమపదము: తిరుక్కుడన్దై.
ప్రబంధము: నాన్ముగన్ తిరువన్దాది 96 పా; తిరుచ్చన్దవిరుత్తము 120 పా
మంగళాశాసన దివ్యదేశములు – 16

## నాళ్‌పాట్టు

తైయిల్ మకం ఇన్ఱు; తారణియీర్! ఏత్తం – ఇన్ద
త్తైయిల్ మగత్తుక్కు; చాత్తు గిన్ఱేన్ – తుయ్యమది
పెత్త మழிశై ప్పిరాన్; పిఱన్ద నాళెన్ఱు;
నల్తవరగళ్; కొణ్డాడుం నాళ్

## వాழி తిరునామమ్

అన్బుడ నన్దాది తొణ్ణూత్తాఱురైత్తాన్ వాழிయే
అழగారుం తిరుమழிశై యమర్న్ద శెల్వన్ వాழிయే
ఇన్బమిగు తైయిల్ మగత్తిఙ్గువన్దాన్ వాழிయే
ఎழிల్ చన్ద విరుత్తం నూత్తిరుపత్తీన్దాన్ వాழிయే
మున్బుగత్తిల్ వన్దుతిత్త మునివనార్ వాழிయే
ముழுప్పెరుక్కిల్ పొన్నియెదిర్ మిదన్ద శొల్లోన్ వాழிయే
నన్బువియల్ నాలాయిరత్తెழு నూత్తాన్ వాழிయే
నఙ్గళ్ పత్తిశారర్ ఇఱునఱ్పదఙ్గళ్ వాழிయే.

# నమ్మాళ్వార్

**తిరునక్షత్ర తనియన్:-**

**వృషభేతు విశాఖాయాం కురికాపురి కారిజమ్**

**పాండ్యదేశే కలేరాదౌ శఠారిం సైన్యపం భజే ।**

**నిత్యతనియన్:-**

**మాతాపితా యువతయ స్తనయా విభూతి**

**స్సర్వం యదేవ నియమేన మదన్వయానామ్ ।**

**ఆద్యస్యనః కులపతే ర్వకుళాభి రామం**

**శ్రీ మత్తదంఘ్రి యుగళం ప్రణమామి మూర్ధ్నా ।**

ప్రపన్న జనకూటస్థులగు నమ్మాళ్వార్లు కలియుగాది 43వ దినమగు ప్రమాది నామ సం॥ర వైశాఖ శుక్ల చతుర్దశీ శుక్రవారం విశాఖా నక్షత్రయుక్త కర్కాటక లగ్నమున ఉడై యనంగై యార్(నాథనాయకి) కారియార్ అను దంపతులకు పుత్రులుగా తిరుక్కురుగూర్ నందవతిరించిరి. వీరు విష్వక్సేనుల యవతారము.

వీరు జన్మించిన దాదిగా స్తన్యపానము చేయక భగవద్గుణానుభవముతో కాలము గడుపుచుండగా తల్లిదండ్రులాశ్చర్యపడి వీరిని "పొలిన్ద నిన్ఱపిరాన్" అను పెరుమాళ్ల సన్నిధికి తీసికొనిపోయిరి. వీరును నేత్రములు తెఱచి పెరుమాళ్లను సేవించి శేషాంశము నందవతరించిన "తిరుప్పుళియాళ్వార్" (నిద్రపోని చింతమాను) క్రింద యోగనిష్ఠులై వేంచేసిరి. వీరికి శఠగోపులనియు, వకుళాభరణులు అనియు, పరాంకుశులు అనియు తిరునామములు కలవు.

మధుర కవి యాళ్వార్లు ఉత్తరదేశయాత్ర చేయుచు అయోధ్యలో నుండగా నొకనాటి రాత్రి దక్షిణదేశమునుండి ఒక కాంతిపుంజము కనుపింపగా దానిననుసరించి తిరుక్కురుగూర్ చేరి ఆళ్వార్లను సేవించిరి. వారు యోగనిష్ఠలో నుండుటచే వారిని మేల్కొలుపుటకై పెద్దరాతిని పడవేసి శబ్దముచేసిరి. అంతట కనులు తెఱచి చూచిన ఆళ్వార్లను, స్వామీ! ప్రకృతిలో జన్మించిన జీవుడు దేనిని తిని యెచట పరుండునని ప్రశ్నింపగా ఆళ్వార్లు దానినే తిని అచటనే పడియుండునని సమాధానము చెప్పిరి. మధుర కవులు సంతసించి ఆళ్వార్లకు శిష్యులైరి. వీరి వైభవము వాచామ గోచరము. గురుపరంపరా ప్రభావాదులలో సేవింప వచ్చును.

అవతారస్థలం: తిరుక్కురుగూర్ (ఆళ్వార్ తిరునగరి); తిరునక్షత్రం: వృషభం, విశాఖ ఆచార్యులు:-సేనముతలియార్; ప్రబంధము: తిరువిరుత్తం 100, తిరువాశరియం7,

పెరియతిరువన్దాది, 87 తిరువాయి మొఴి 1102.

మంగళాశాసన దివ్యదేశములుః 38

## నాళ్‌పాట్టు

పా॥ ఏరార్ వైగాశి విశాగత్తి నే ఱ్ఱత్తై
ప్పారోరఱియ ప్పగర్గిన్దేన్ - శీరారుమ్
వేదం తమిఴ్ శెయ్‌ద మెయ్యన్ ఎఴిల్‌కురుగై
నాదన్ అవదరిత్త నాళ్.

పా॥ ఉణ్డో వైగాశి విశాగత్తుక్కు ఒప్పొరునాళ్?
ఉణ్డో శడగోపర్‌క్కు ఒప్పొరువర్ - ఉణ్డో
తిరువాయిమొఴిక్కొప్పు? తెన్‌కురుగై క్కు ఉణ్డో
ఒరు పార్ దన్ని లొక్కుమూర్?

## వాఴి తిరునామజ్గళ్

తిరుక్కురుగై ప్పెరుమాళ్ తన్ తిరుత్తాళ్‌కళ్ వాఴియే,
తిరువాన తిరుముకత్తు చ్చెవియెన్ఱుమ్ వాఴియే,
ఇరుక్కుమొఴి యెన్నెఞ్జిల్ తేక్కినాన్ వాఴియే,
ఎన్దై యెతిరాశర్ క్కిఱైయవనార్ వాఴియే,
కరుక్కుఴియిల్ పుకావణ్ణమ్ కాత్తరుళ్‌వోన్ వాఴియే,
కాశినియిల్ ఆరియనాయ్ క్కాట్టినాన్ వాఴియే,
వరుత్త మఱవెన్దన్నై వాఴ్‌విత్తాన్ వాఴియే
మతురకవి తమ్బిరాన్ వాఴి వాఴి వాఴియే

ఆన తిరువిరుత్తం నూఱు మఱులినాన్ వాఴియే
ఆశిరియ మేఴ్పాట్టు అళిత్త పిరాన్ వాఴియే
ఈనమఱ వన్దాది యెణ్బత్తేఴిన్దాన్ వాఴియే
ఇలగు తిరువాయిమొఴి యాయిరత్తొరు నూత్తిరణ్డురైత్తాన్ వాఴియే
వానణియుమ్ మామాడక్కురుగై మన్నన్ వాఴియే
వైగాశి విశాగత్తిల్ వన్దుదిత్తాన్ వాఴియే
శేనై యర్‌కో నవతారం శెయ్‌ద వళ్ళల్ వాఴియే
తిరుక్కురుగై చ్చడగోపర్ తిరువడిగళ్ వాఴియే

మేదినియిల్ వైయాశి విశాగత్తోన్ వాళియే
వేదత్తై శెన్దమిళాయ్ విరిత్తురైత్తాన్ వాళియే
ఆదిగురువాయ్ ప్పువియిల్ అవదరిత్తాన్ వాళియే
అనవరతమ్ శేనైయర్కోన్ అడితొళువోన్ వాళియే
నాదనుక్కు నాలాయిరం ఉరైత్తాన్ వాళియే
నన్ మదురకవి వణజ్గుమ్ నావీరన్ వాళియే
మాదవన్ పొఱ్పాదుకైయాయ్ వళర్న్దరుళ్వోన్ వాళియే
మగిళ్మాఱన్ శడగోపన్ వైయగత్తిల్ వాళియే


నమ్మాళ్వార్

NAMMALVAR

ఋషిం జుషామహే కృష్ణ తృష్ణా తత్త్వ మివోదితమ్
సహస్ర శాఖాం యోద్రాక్షీత్ ద్రావిడీం బ్రహ్మ సంహితామ్.

# మధుర కవియాళ్వార్

**తిరునక్షత్ర తనియన్:-**

మేషే చిత్తా సముద్భూతం పాండ్య దేశే గణాంశకమ్

శ్రీ పరాంకుశ సద్భక్తం మధురం కవి మాశ్రయే ॥

హస్త స్థ తాళద్వితయం ప్రపద్యే శఠారి వా గ్వ్యాసముదారకీర్తిమ్।

మాధుర్య సంశ్లిష్ట కవిత్వయుక్తం మహత్వ సమ్భావిత బుద్ధి తత్త్వమ్ ॥

**నిత్యతనియన్:-**

**అవిదిత విషయాంతర శఠారేః**

**ఉపనిషదాముపగానమాత్మభోగః**

**అపిచగుణవశాత్తదేక శేషీ**

**మధురకవిః హృదయే మమావిరస్తు**

వీరు పాండ్య దేశమందలి తిరుక్కోళూరు అను దివ్య దేశమున కుముద గణేశాంశమున వకుళభూషణ భాస్కరోదయమునకు ముందు (నమ్మాళ్వార్ల అవతారమునకు) అరుణోదయమువలె మేషమాసమున చిత్తా నక్షత్రమునందవతరించిరి.

వీరు ఉత్తర దివ్యదేశయాత్ర చేయుచు ఒకనాడు అయోధ్యలో వేంచేసియుండగా నాటిరాత్రి దక్షిణ దిశనుండి అప్రాకృత దివ్యతేజః పుంజమును చూచి ఆశ్చర్యచకితులై రాత్రి భాగమునందు దాని ననుసరించుచుపోయి క్రమముగా ఆళ్వార్ తిరునగరి చేరిరి. అచట తింత్రిణీ మూలమున పద్మాసనోపవిష్టులై వేంచేసియున్న నమ్మాళ్వార్లను సేవించిరి.

వారు ముకుళితనేత్రులై యుండుటచే వారి శ్రవణేంద్రియ పాటవమును పరికింప నొకరాతినియెత్తి పడవైచిరి. ఆశబ్దమునువిని ఆళ్వార్లు కనులు విప్పిజూడగా 'ప్రకృతి సంబంధముగల జీవుడు దేనిని తిని యెచట పడియుండు" నని ప్రశ్నింపగా ఆళ్వార్లు "దానినే తిని యచటనే పడియుండునని" సమాధానమిచ్చిరి.

ఆ సమాధానమును వినిన మధురకవులు ఆళ్వార్ల జ్ఞాన విశేషమున కాశ్చర్యపడి వారిని ఆచార్యులుగా వరించిరి. ఆళ్వార్లును వీరినభిమానించి తామనుగ్రహించిన దివ్య ప్రబంధమును వీరికినుపదేశించిరి. మధురకవులును తమయాచార్యుల యందలి ప్రావణ్యముచే "కణ్ణినుణ్ శిరుత్తాంబు" అనుదివ్య ప్రబంధము ననుగ్రహించిరి.

ఆళ్వార్లు: మధురకవియాళ్వార్. తిరునక్షత్రం: మేషం - చిత్త.

అవతారస్థలం: తిరుక్కోళూరు

ఆచార్యులు: నమ్మాళ్వార్

అనుగ్రహించిన ప్రబంధము: కణ్ణినుణ్ శిరుత్తాంబు. 11 పాశురములు.

**నాళ్‌పాట్టు**

ఏరార్ మధురకవి; ఇవ్వులగిల్ వన్దుదిత్త,
శీరారుం శిత్తిరై యిల్ శిత్తిరై నాళ్ - పారులగిల్
మత్తుళ్ల ఆళ్వార్గళ్; వన్దుదిత్తనాళ్ గళిలుమ్
ఉత్తదమక్కెన్రు నెఞ్జే ! ఓర్.

**వాళితిరునామఙ్గళ్**

శిత్తిరయిల్ శిత్తిరై నాళ్ శిఱక్క వందోన్ వాళియే
తిరుక్కోళూరవదరిత్త శెల్వనార్ వాళియే
ఉత్తర కఙ్గాతీరత్తుయర్ తవత్తోన్ వాళియే
ఒళి కదిరోన్ తెఱ్కు తిక్క వుగన్దు వన్దాన్ వాళియే
పత్తి యొడు పదినొన్రుమ్ పాడినాన్ వాళియే
పరాంకుశనే పరనెన్రుపత్తి నాన్ వాళియే
మత్తిమమాం పదప్పొరుళై వాళు విత్తాన్ వాళియే
మదురకవి తిరువడిగళ్ వాళి వాళి వాళియే.



మధురకవి ఆళ్వార్
MADHURA KAVI

# కులశేఖరాళ్వార్లు

**తిరునక్షత్రతనియన్:-**

**కుంభే పునర్వసౌ జాతం కేరళే చోళ పట్టణే**

**కౌస్తుభాంశం ధరాధీశం కులశేఖర మాశ్రయే ।**

**నిత్యతనియన్:-**

**ఘుష్యతే యస్య నగరే రంగయాత్రా దినే దినే**

**తమహం శిరసా వందే రాజానం కులశేఖరమ్ ।**

వీరు చేరదేశమున (కేరళ) తిరువంజిక్కళం (కొల్లి)యను దివ్యదేశమున క్షత్రియ వర్ణమున కలియుగాది ఇరువది యెనిమిదవ సంవత్సరమగు పరాభవనామ సంవత్సర **కుంభ (మాఘ)** మాసము శుద్ధ ఏకాదశీ గురువాసరము పునర్వసు **నక్షత్రమున కౌ**స్తుభాంశమున అవతరించిరి.

[redacted] "కూరార్న్ద వేల్ వలవన్ కొల్లియర్కోన్ కుడైక్కులశేకరన్" **(**వాడియైన వేల్ అను ఆయుధ ప్రయోగమున దక్షులును, కొల్లి నగర ప్రభువులును, ఛత్రధారులును అగు కులశేఖరాళ్వార్లు) అనునట్లు క్షత్రియోచితముగ రాజ్యపాలన చేసెడివారు.

పిమ్మట సర్వేశ్వరుని నిర్హేతుక జాయమాన కటాక్షలబ్ధ దివ్యజ్ఞాన సంపన్నులై "ఇన్బమరుమ్ శెల్వముమ్ ఇవ్వరశుమ్ యాన్ వేణ్డేన్" (భోగ సమృద్ధమైన యీ సంపద, రాజ్యము నాకు వలదని విరక్తులై శ్రీరంగనాథులను సేవింపవలెనను ఆశచే ప్రతినిత్యము శ్రీరంగయాత్రా ప్రయత్నము చేయుచుండెడివారు.

వీరికి శ్రీరామచంద్రుల యందు ప్రేమాతిశయమధికము. ఒక పర్యాయము వీరు శ్రీరామాయణ కాలక్షేపమున "జన స్థానమునగల పదునాల్గు వేల రాక్షస పరివార సహితులగు ఖరదూషణ త్రిశిరులను శ్రీరామచంద్రుడెదుర్కొనె"నను ఘట్టమునువిని తన్మయులై సర్వేశ్వరుని యందుగల ప్రేమాతిశయమున శ్రీరామచంద్రులకు సహాయపడుటకై పరివార సమేతముగా బయల్వెడలిరి. ఇదిగాంచిన మంత్రులు పౌరాణికులచే శ్రీరామచంద్రుల విజయమును వినిపింపగా సంతృప్తులై వెనుదిరిగిరి.

శ్రీవైష్ణవ సంప్రదాయమున శ్రీరామచంద్రునకు "పెరుమాళ్" అని తిరునామము. వారియందు అత్యంత ప్రీతి కలిగి వారి నక్షత్రము నందవతరించిన ఈ ఆళ్వార్లకును పెరుమాళ్ అనుతిరు నామమేర్పడినది. వీరనుగ్రహించిన దివ్య ప్రబంధము

పెరుమాళ్ తిరుమొழி. వీరి వైభవమును గురుపరంపరా ప్రభావమున సేవింపవచ్చును.

అవతార స్థలం: కేరళదేశమున కోழிయను నగరము

తిరునక్షత్రం: కుంభం, పునర్వసు

ప్రబంధము: పెరుమాళ్ తిరుమొழி (105 పా)

మంగళాశాసన దివ్యదేశములు - 10

## నాళ్‌పాట్టు

మాశిప్పునర్ పూశం; కాణ్మిన్ ఇన్ఱు మణ్ణులగీర్ !
తేశిత్తివశత్తుక్కేదెన్నిల్ - పేశుగిన్ఱేన్
కొల్లినగర్‌కోన్; కులశేకరన్ పిఱప్పాల్
నల్లవర్గళ్; కొణ్డాడుం నాళ్

## వాழிతిరునామజ్గళ్

అఞ్జన మామలై ప్పిఱవి యాదరిత్తోన్ వాழிయే
అణియరజ్గర్ మణత్తూణై యడైన్దుయన్దోన్ వాழிయే
వఞ్జినగరన్దన్నిల్ వాழవన్దోన్ వాழிయే
మాశిదనిర్ పునర్పూశం వన్దుదిత్తాన్ వాழிయే
అఞ్జలెన కుడప్పామ్బిలమ్ కైయిట్టాన్ వాழிయే
అనవరత మిరామకదై అరుళుమవన్ వాழிయే
శెఞ్జొల్ మొழி నూత్తఞ్జమ్ శెప్పినాన్ వాழிయే
శేరలర్కోన్ శెజ్గమల త్తిరువడిగళ్ వాழிయే.



కులశేఖరాళ్వార్

KULASEKHARALWAR

# పెరియాళ్వార్లు

**తిరునక్షత్ర తనియన్:-**

**మిథునే స్వాతిజం విష్ణోః రథాంశం ధన్వినః పురే ।**
**ప్రపద్యే శ్వశురం విష్ణోః విష్ణుచిత్తం పురశ్శిఖమ్ ॥**
**గురుముఖ మనధీత్య ప్రాహవేదానశేషాన్**
**నరపతి పరిక్లప్తం శుల్కమాదాతుకామః**
**శ్వశురమమర వంద్యం రంగనాథస్య సాక్షాత్**
**ద్విజకుల తిలకం తం విష్ణు చిత్తం నమామి**

వీరు పాండ్యదేశమునందలి "శ్రీవిల్లిపుత్తూరు" అను దివ్యదేశమున కలియుగాది 47వ సంవత్సరమైన క్రోధన నామ సంవత్సర మిథున (ఆషాఢ) మాసము శుక్ల ఏకాదశీ భానువాసరమున స్వాతీ నక్షత్రమున పెరియ తిరువడి అంశమున (గరుత్మంతుల అంశ) శ్రీముకున్దాచార్యుల వారికి "పద్మైయార్" అను దేవియందు అవతరించిరి. వీరికి తండ్రిగారు పెట్టినపేరు రామాండార్. భట్టనాథులనియు; విష్ణుచిత్తులనియు నామాంతరములు. వీరు సకల శాస్త్ర పారంగతులు. వైదిక నిష్ఠాగరిష్ఠులు కావుననే వీరికి భట్టనాథులనియు, పట్టర్ పిరాన్ అనియు పేరువచ్చినది. "వేదప్పయన్ కొళ్ళువల్ల విట్టుశిత్తన్;" మున్నగు వాక్యములు వీరి వైదిక నిష్ఠను తెలియజేయుచున్నవి. "పీతకవాడ పిరానార్ పిరమ గురువాగివన్దు' (పీతాంబరుడే పరమాచార్యుడై వచ్చి) అనువీరి వాక్యము వలన సర్వేశ్వరునే ఆచార్యులుగా వరించి సమస్త శాస్త్రములను అధికరించిరని తెలియుచున్నది . మఱియు ఆపస్తంభ ధర్మసూత్రములకు ధూర్తస్వామి రచించిన వృత్తికి వీరు వ్యాఖ్యానము చేసినట్లు పెద్దలు చెప్పుదురు.

"ప్రహ్లాదో జన్మవైష్ణవః" అనునట్లు వీరు బాల్యము నుండి శ్రీమన్నారాయణుని పాద పద్మములందు ప్రావణ్యము కలిగియుండిరి. శ్రీవిల్లి పుత్తూరులో పెరుమాళ్లకు నిత్యము పుష్పకైంకర్యము నిర్వహించెడివారు.

పాండ్యదేశమును పరిపాలించు వల్లభదేవుని ఆస్థానమున జరిగిన విద్వద్గోష్ఠిలో శ్రీమన్నారాయణుడే పరతత్త్వమని సిద్ధాంతస్థాపన చేసి వల్లభదేవుని వైష్ణవోత్తమునిగా తీర్చిరి. తన భక్తుని కార్యమునకు మెచ్చిన సర్వేశ్వరుడు గరుడ వాహనారూఢుడై వేంచేయగా "సర్వేశ్వరుని దివ్యమంగళ విగ్రహమును సేవించిన ఆళ్వార్లు "అతిస్నేహః పాపశంకీ" అనునట్లు ప్రేమాతిశయముచే సర్వేశ్వరునకు ప్రాకృతుల వలన ఏమిచేటగునోయని భయపడి వారికి పల్లాండుపాడిరి. (మంగళాశాసనం చేసిరి) ఆకారణమున వీరిని పెరియాళ్వార్లు అని అందురు.

వీరికి శ్రీకృష్ణావతారమున ప్రావణ్యమధికవణజ్ఞుము. వీరనుగ్రహించిన

దివ్య ప్రబంధములు రెండు. మొదటిది తిరుప్పల్లాండు. వేదపారాయణకు ప్రారంభమున ప్రణవము వలె దివ్య ప్రబంధపారాయణకు తిరుప్పల్లాండు మొదటిది. రెండవ ప్రబంధము పెరియాళ్వార్ తిరుమొழి. వీరి కుమార్తె ఆండాళ్. ఆమెను శ్రీరంగనాథుల కిచ్చి వివాహము చేయుటచే వీరు శ్రీరంగనాథులకు మామగారైరి.

అవతార స్థలంః శ్రీవిల్లిపుత్తూర్; తిరునక్షత్రంః ఆని (మిధున) మాసం స్వాతి.

దివ్య ప్రబంధముః తిరుప్పల్లాండు - 12; పెరియాழ్వార్ తిరుమొழి 429 పాశురములు

మంగళాశాసన దివ్యదేశములుః 19

## నాళ్‌పాట్టు

పా॥ ఇన్ఱై ప్పెరుమై అఱిన్దిలైయో ఏழை నెంజే!
ఇన్ఱై క్కెన్నేత్ తమెనిల్ ఉరైక్కేన్ - నన్ఱిపునై
పల్లాణ్డు పాడియ నం పట్టర్ పిరాన్ వన్దుదిత్త
నాల్లానియిల్ శోదినాళ్.

పా॥ మానిలత్తిల్ మున్ నం పెరియాழ்వార్ వన్దుదిత్త
ఆనిదన్నిర్ శోది యెన్ఱాల్ ఆదరిక్కుం-ఞానియర్‌కు
ఒప్పోరిల్లై ఇవ్వులగుదనిల్ ఎన్ఱు నెంజే
ఎప్పోదుం శిన్దిత్తిరు.

పా॥ మజ్గళా శాసనత్తిన్ మత్తుళ్ల ఆழ్వార్ కళ్
తజ్గళార్వత్తళవు దానన్ఱి - పొజ్గుమ్
పరివాలే విల్లిపుత్తూర్ పట్టర్ పిరాన్ పెత్తాన్
పెరియాழ్వారెన్ఱుం పెయర్.

## వాழி తిరునామజ్గళ్

నల్ల తిరుప్పల్లాణ్డు నాన్ మూన్ఱోన్ వాழியే
నానూత్తిఱుపత్తొన్ఱుమ్ నమక్కురైత్తాన్ వాழியే
శొల్లరియ వానిదనిఱ్సోది వన్దాన్ వాழியే
తొడై శూడిక్కొడుత్తాళ్ తొழுదమప్పన్ వాழியే
శెల్వనమ్బిదనై పోల శిఱప్పుత్తాన్ వాழியే
శెన్ఱు కిళియఱుత్తుమాల్ తెయ్‌వమెన్ఱాన్ వాழியే
విల్లిపుత్తూర్ నగరత్తై విళక్కినాన్ వాழியే
వేదియర్కోన్ పట్టర్ పిరాన్ మేదినియిల్ వాழியే

**తిరునక్షత్రతనియన్:–**

**కర్కాటే పూర్వ ఫల్గున్యాం తులసీ కాననోద్భవామ్**
**పాండ్యే విశ్వంభరాం గోదాం వందే శ్రీరఙ్గనాయకీమ్ ॥**

**నిత్యతనియన్:–**

**నీళాతుఙ్గ స్తన గిరి తటీ సుప్త ముద్బోధ్యకృష్ణం**
**పారార్థ్యం స్వం శ్రుతి శత శిర స్సిద్ధ మధ్యాపయన్తీ ।**
**స్వోచ్ఛిష్టాయాం స్రజినిగళితం యా బలాత్కృత్య భుఙ్క్తే**
**గోదా తస్యై నమ ఇదమిదం భూయయేవాస్తు భూయః ॥**

వీరు కలియుగాది తొంబది యెనిమిదవ సంవత్సరమగు నళనామ సంవత్సర కర్కాటక శుద్ధ (శ్రావణశుక్ల) చతుర్దశీ మంగళవారము పూర్వఫల్గునీ నక్షత్రమున జనకచక్రవర్తికి సీతాదేవివలె భూదేవి అంశమున పెరియాళ్వార్లకు కుమార్తెగా అయోనిజగా తులసీ వనమందవతరించిరి. తండ్రిగారు వీరి రూపలావణ్యాదులు చూచి "కోదై" యను తిరునామముంచిరి.

వీరు బాల్యమునుండి తండ్రిగారి యనుష్ఠానమును చూచి వారు వినిపించు శ్రీవిష్ణుపురాణ భాగవతాది కథలను విని శ్రీరంగనాథుని యందు మిక్కిలి ప్రావణ్యము కలవారై యుండిరి. తమ తండ్రిగారు పెరుమాళ్ళకై కూర్చిన మాలికలను ముందు తాము ధరించి అద్దములో చూచుకొని తాను "శ్రీరంగనాథులకు తగియుంటినా లేదా" అని పరీక్షించుకొను చుండెను.

ఇట్లుండగా ఒకనాడు పెరియాళ్వార్లు ఈ దృశ్యముచూచి అపచారమని నాడు పెరుమాళ్ళకు పుష్పకైంకర్యమును నిలిపివేసిరి. వటపత్రశాయి పెరియాళ్వార్లకు స్వప్నమున సాక్షాత్కరించి గోదాదేవి ప్రభావమును తెలిపి ఆమె ధరించిన పుష్పములే తనకు ప్రీతికరములనియు వానినే సమర్పింపుమనియు ఆనతిచ్చిరి.

గోదాదేవియు పరమపురుషుని భర్తగాగోరి ద్వాపరయుగమున గోపికలాచరించిన కాత్యాయనీ వ్రతము నాదర్శముగా ధనుర్మాస వ్రతమాచరించి శ్రీరంగనాథుని వివాహము చేసికొనిరి. వీరనుగ్రహించిన దివ్యప్రబంధములు రెండు. 1 తిరుప్పావై 30 పా 2. నాచ్చియార్ తిరుమొழி. వీరి ప్రభావము గురుపరంపరా ప్రభావాదులలో చూడవచ్చును.

అవతారస్థలంః శ్రీవిల్లిపుత్తూరు
తిరునక్షత్రంః కర్కాటకం, పుబ్బ
ప్రబంధములుః తిరుప్పావై, నాచ్చియార్ తిరుమొళి 143 పాశురములు
మంగళాశాసన దివ్యదేవములుః 11

**నాళ్‌పాట్టు**

పా॥ ఇన్ఱో తిరువాడి ప్పూరమ్ - ఎమక్కాగ
వన్ఱో; ఇజ్గు ఆణ్డాళ్ అవదరిత్తాళ్ - కున్ఱాద
వాళ్వాన వైగున్దవాన్; పోగన్దనై ఇగళ్న్దు
ఆళ్వార్ తిరుమగళారాయ్.

పా॥ పెరియాళ్వార్ పెణ్పిళ్ళైయాయ్; ఆణ్డాళ్‌పిఱన్ద
తిరువాడి ప్పూరత్తిన్ శీర్మై - ఒరునాళైక్కు
ఉణ్డో మనమే! ఉణర్న్దుపార్ - ఆణ్డాళుక్కు
ఉణ్డాగిల్ ఒప్పు ఇదుక్కుం ఉణ్డు.

పా॥ అఞ్జుక్కుడిక్కు ఒరు శన్దదియాయ్ - ఆళ్వార్గళ్
తంశయలై; విఞ్జి నిఱ్కుం తన్మైయళాయ్ - పిఞ్జాయ్
ప్పళుత్తాళై యాణ్డాళై ప్పత్తియుడన్ నాళుమ్
వళుత్తాయ్ మనమే! మగి ళ్న్దు

**వాళి తిరునామజ్గళ్**

తిరువాడి ప్పూరత్తిల్ శెగత్తుదిత్తాళ్ వాళియే
తిరుప్పావై ముప్పదుమ్ శెప్పినాళ్ వాళియే
పెరియాళ్వార్ పెత్తెడుత్త పెణ్పిళ్ళై వాళియే
పెరుమ్బూదూర్ మామునిక్కు ప్పిన్నానాళ్ వాళియే
ఒరునూత్తు నాఱ్పత్తు మూన్ఱురైత్తాళ్ వాళియే
ఉయర రజ్గర్కే కణ్ణి యుగన్దళిత్తాళ్ వాళియే
మరువారుం తిరుమల్లి వళనాడు వాళియే
వణ్ పుదువై నగర్ కోదై మలర్ పదజ్గళ్ వాళియే

శ్రీ విష్ణుచిత్త కులనందన కల్పవల్లీం
శ్రీ రంగ రాజహరిచన్దనయోగదృశ్యామ్ ।
సాక్షాత్ క్షమాం కరుణయా కమలామివాన్యాం
గోదామనన్య శరణశ్శరణం ప్రపద్యే ॥

# —తొండరడిప్పొడి ఆళ్వార్

తిరునక్షత్రతనియన్:—

కోదండే జ్యేష్ఠ నక్షత్రే మండంగుడి కులోద్భవమ్ ।
చోళోర్వ్యాం వనమాలాంశం భక్తపద్రేణు మాశ్రయే ॥

నిత్య తనియన్:—

తమేవ మత్వా పరవాసుదేవం రంగేశయం రాజవదర్హణీయమ్
ప్రాబోధకీం యోఽకృత సూక్తిమాలాం భక్తాంఘ్రిరేణుం భగవంత మీడే ॥

వీరు కుంభఘోణమునకు సమీపమునగల మండంగుడియను దివ్యదేశమున కలియుగాది రెండు వందల తొంబదియెనిమిది సంవత్సరమునకు సమమైన ప్రభవ నామ సంవత్సర ధనుర్మాసమున (మార్గశిరము) కృష్ణపక్ష చతుర్దశీ మంగళవారము జ్యేష్ఠా నక్షత్రమున వనమాలాంశమున అవతరించిరి.

వీరికి తండ్రిగారు "విప్రనారాయణు"లను తిరునామమునుంచిరి. వీరొకానొక పర్యాయము శ్రీరంగము వేంచేసి ఉభయ కావేరీ పరీవాహమధ్యమున పవళించియున్న శ్రీరంగనాథులను సేవించి ఆనందనిర్భరులై అందే నిత్య నివాసము చేయుచుండిరి.

వీరును పెరియాళ్వార్లవలె ప్రతినిత్యము పుష్పమాలా కైంకర్యము చేయుచుండెడివారు. అందులకై యొక నందన వనమును కల్పించిరి. వీరు కొంతకాలము "దేవదేవి" యను స్త్రీసాంగత్యము వలన మోహపరవశులై యుండియు భగవదనుగ్రహమువలన జ్ఞానోదయముకాగా సవాసనగా నితర సంబంధములన్నియు వదలి తదేక ధ్యానపరులై స్వామికైంకర్యము చేయుచుండిరి. వీరనుగ్రహించిన దివ్యప్రబంధములు రెండు 1. తిరుప్పళ్ళి యెழுచ్చి 2. తిరుమాలై

ఆழ்వార్లు: తొండరడిప్పొడి ఆళ్వార్లు; అవతారము: ధనుర్మాసము, జ్యేష్ఠానక్షత్రము
అనుగ్రహించిన ప్రబంధము: తిరుప్పళ్ళియెழுచ్చి 10 పా; తిరుమాలై 45 పా
మంగళాశాసన దివ్యదేశములు:3

## నాళ్‌పాట్టు

మన్నియశీర్ మార్గழியిల్ కేట్టై యిన్ఱు మానిలత్తీర్ !
ఎన్నిదను క్కేత్తమెనిల్ ఉరైక్కేన్ - తున్నుపుగழ
మామఱైయోన్; తొణ్డరడిప్పొడియాழ்వార్ పిఱప్పాల్
నాన్మఱైయోర్; కొణ్డాడుంనాళ్.

## వాళితిరునామఙ్గళ్

మణ్ణంగుడి యదనై వాళ్విత్తాన్ వాళియే
    మార్గళియిల్ కేట్టైదనిల్ వన్దుదిత్తాన్ వాళియే
తెణ్ణిరై శూళరఙ్గరై యే దెయ్వ మెన్ఱాన్ వాళియే
    తిరుమాలై·యొన్ఱ తఙ్గమ్ శెప్పినాన్ వాళియే
పణ్డు తిరుప్పళ్ళియెళుచ్చి ప్పత్తురైత్తాన్ వాళియే
    పావై యర్గళ్ కలవితనై పళిత్త శెల్వన్ వాళియే
తొణ్డుశెయ్దు తుళబత్తాల్ తులఙ్గినాన్ వాళియే
తొణ్డరడిప్పొడి యాళ్వార్ తుణైప్పదఙ్గళ్ వాళియే



**తొండరడిప్పొడి ఆళ్వార్**
**TONDARADIPPODI ALWAR**
**మండంగుడి**

# తిరుప్పాణియాళ్వార్

**తిరునక్షత్ర తనియన్:-**

**వృశ్చికే రోహిణీ జాతం శ్రీపాణం నిచుళాపురే ।**
**శ్రీవత్సాంశం గాయకేంద్రం మునివాహన మాశ్రయే ।**

**నిత్యతనియన్:-**

**శ్రీ లోకసారంగ మహామునీంద్ర స్కన్ధాధి రూఢం కలయామి నిత్యమ్**
**కళంక హీనం కమనీయ భక్తం కవీశ్వరం గాయక సార్వభౌమమ్ ।**
**ఆపాదచూడ మనుభూయ హరిం శయానం,**
**మధ్యే కవేర దుహితుర్ముదితాన్తరాత్మా।**
**అద్రష్టతాం నయనయో ర్విషయాన్తరాణాం**
**యోనిశ్చికాయ మనవై మునివాహనం తమ్ ॥**

వీరు శ్రీరంగమునకు సమీపమున గల ఉఱైయూర్ అను దివ్య దేశమున కలియుగాది 342 సంవత్సరమునకు సరియగు దుర్మతి నామ సం॥ర వృశ్చిక మాస (కార్తీక) కృష్ణపక్ష విదియా బుధవారమున రోహిణీ నక్షత్రమున ఒక బ్రాహ్మణుని క్షేత్రమున (పొలమున) వ్రీహి సస్యమున శ్రీవత్సాంశమున అయోనిజులై అవతరించిరి. ఆ త్రోవను పోవుచున్న ఒక మాలదాసరి వీరిని చూచి సంతాన హీనుడగుటచే వారిని భగవత్ప్రసాదముగా భావించి తనగృహమునకు తీసికొని పోయి పెంచుచుండెను.

వీరును అంత్యవర్ణమున పెరుగుటచే తమ అపకర్షమును దలంచి శ్రీరంగక్షేత్రమును చేరక దక్షిణ తీరమునందే యుండి ఏకతారను మీటుచు శ్రీరంగనాథుని స్తుతించుచు ఆనంద నిర్భరులై యుండిరి.

శ్రీరంగనాథులును వీరి భక్తి జ్ఞాన వైరాగ్యములకు సంతసించి వారిని తోడ్కొని రమ్మని శ్రీలోకసారంగ మహామునీంద్రులను పంపిరి. వారును ఆళ్వార్లను పరిపరివిధముల ప్రార్థించినను ఆళ్వార్లు తమ నైచ్యమును తలచి శ్రీరంగ ప్రవేశము చేయుటకు అంగీకరింపలేదు. అంతట లోకసారంగమునీంద్రులు శ్రీరంగనాథులపై "ఆన"పెట్టి ఆళ్వార్లను తమభుజములపై వేంచేపుచేసికొని వచ్చి శ్రీరంగనాథుని సేవింపజేసిరి. ఆళ్వార్లను శ్రీరంగనాథుని సేవించి ఆనంద నిర్భరులై "అమలనాది పిరాన్" అనుదివ్యప్రబంధముననుగ్రహించిరి. "అణియరంగన్ ఎన్నముదినై కణ్డకణ్గళ్ మత్తొన్ఱినై క్కాణావే" శ్రీరంగనాథులను సేవించిన నా నేత్రములు ఇతర విషయములను జూడజాలవు) అని శ్రీరంగనాథులలో నైక్యము చెందిరి.

తిరునక్షత్రము: వృశ్చికమాసం, రోహిణి.

అవతారస్థలం: ఉఱై యూర్
దివ్యప్రబంధం: అమలనాదిపిరాన్ 10 పా
మంగళాశాసన దివ్యదేశములు:3

### నాళ్పాట్టు

కార్తిగై యిల్ రోహిణినాళ్, కాణ్మిన్ ఇన్ఱు కాశినియీర్
వాయ్త్త పుగళ్పాణర్ వన్దుదిప్పాల్ - ఆత్తియర్ గళ్
అన్బుడనేదాన్; అమలనాది పిరాన్ కత్తదఱ్పిన్;
నన్గుడనే కొణ్డాడుం నాళ్.

### వాళితిరునామమ్

ఉమ్బర్ తొళుం మెయ్జ్ఞాన ముఱై యూరాన్ వాళియే
        ఉరోగిణినాళ్ కార్తిగై యిల్ ఉదిత్త వళ్లల్ వాళియే
వమ్బవిళ్తార్ మునితోళిల్ వగుత్తపిరాన్ వాళియే
        మలర్క్కణ్ణిల్ వేఱొన్ఱుం వై యాదాన్ వాళియే.
అమ్బువియిల్ మదిళరఙ్గ రగం పుగున్దాన్ వాళియే
        అమలనాది పిరాన్ పత్తు మరుళినాన్ వాళియే
శెమ్బుతుమై యరుళ్ కూఱుం శెల్వనార్ వాళియే
        తిరుప్పాణన్ పాఱ్పదఙ్గళ్ శగతలత్తిల్ వాళియే



**తిరుప్పాణన్**
**THIRUPPANAN**

# తిరుమంగై ఆళ్వార్లు

తిరునక్షత్ర తనియన్:-

వృశ్చికే కృత్తికా జాతం చతుష్కవి శిఖామణిమ్ ।
షట్ప్రబంధ కృతం శార్ఙ్గమూర్తిం కలిహ మాశ్రయే ॥

నిత్య తనియన్:-

కలయామి కలిధ్వంసిం కవిం లోక దివాకరమ్
యస్య గోభిః ప్రకాశాభి రావిద్యం నిహతం తమః ॥

వీరు కలియుగాది 397 సం॥నకు సరియగు "నళ" నామ సం॥ర వృశ్చిక (కార్తీక) మాస శుక్ల పక్ష పూర్ణిమా గురువాసరమున కృత్తికా నక్షత్రమున శార్ఙ్గాంశమున "తిరుక్కురైయలూర్" అను దివ్యదేశమునందవతరించిరి. వీరికి తండ్రిగారుంచిన తిరునామము "నీలనిఱైత్తర్"

వీరు పద్మాంశమున జన్మించిన కుముదవల్లి నాచ్చియార్లను వివాహము చేసికొనిరి. అందులకై వీరు శ్రీవైష్ణవ తదీయారాధన నిర్వహించుచు ద్రవ్యమునకై చౌర్యమును చేయదొడగిరి. వీరి అధ్యవసాయమును పరీక్షింపదలచి పెండ్లి కుమారుని వేషమున వచ్చిన శ్రియఃపతిని గూడ దోచి స్వామి శ్రీపాద స్పర్శచే జ్ఞానోదయముకాగా "నాన్కణ్డు కొణ్డేన్ నారాయణా వెన్నుమ్ నామమ్" అని తిరుమంత్రమును ప్రకాశింపజేసిరి.

వీరు తమ శిష్యులతో కలసి దివ్యదేశ సంచారముచేయుచు పెరుమాళ్లకు మంగళాశాసనము చేయుచుండిరి. మరియు వేదబాహ్యులైన జైన బౌద్ధాదులను జయించి ఆద్రవ్యముతో శ్రీరంగనాథులకు మణి మంటప ప్రాకారాదులు నిర్మించిరి.

వీరు నమ్మాళ్వార్లు అనుగ్రహించిన చతుర్వేద సారభూతమైన నాల్గు ప్రబంధములకు షడంగములుగా ఆరుప్రబంధములను అనుగ్రహించిరి. వీరి వైభవము వాచామగోచరము. దానిని గురుపరంపరా ప్రభావాది గ్రంథములలో సేవింపవచ్చును.

ఆళ్వార్లు: తిరుమంగై ఆళ్వార్లు - తిరునక్షత్రం వృశ్చికమాసం - కృత్తిక

అవతార స్థలం: తిరుక్కురైయలూర్

ప్రబంధములు: 1 పెరియ తిరుమొழி 2 తిరుక్కురున్దాణ్డగమ్ 3 తిరునెడున్దాణ్డగమ్ 4.తిరువెழுక్కూత్తిఱుక్కై 5. పెరియ తిరుమడల్ 6. శిఱియ తిరుమడల్.

మంగళాశాసనంచేసిన దివ్యదేశములు. 86

పా॥ పేదై నెఞ్జే! ఇన్ఱై ప్పెరుమై అఱిన్దిలై యో!
ఏదు ప్పెరుమై ; ఇన్ఱై క్కెన్నెన్నిల్? - ఓదుగిన్ఱేన్
వాయ్‌త్త పుగళ్ మఙ్గై యర్‌కోన్; మానిలత్తిల్ వన్దుదిత్త;
కార్తిగై యిల్; కార్తిగై నాళ్ కాణ్

పా॥ మాఱన్ పణిత్త తమిళ్ మఱైక్కు, మఙ్గైయర్‌కోన్
ఆఱఙ్గం కూఱ అవదరిత్త - వీఱుడై య
కార్తిగై యిల్ కార్తిగై నాళ్ ఎన్ఱెన్ఱు కాదలిప్పార్
వాయ్‌త్త మలర్ త్తాళ్‌గళ్ నెఞ్జే ! వాళ్‌త్తు

వాళి తిరునామమ్

ఐయనరుళ్‌మారి శెయ్యపడియిణైకళ్ వాళియే
అన్దుకిలుమ్ శీరావుమ్ అణైయుమరై వాళియే
మై యిలకు వేలణైత్త వనై్మమిక వాళియే
మాఱామలఙ్జలిశెయ్ మలర్‌క్కరఙ్గళ్ వా ళియే
శెయ్య కలనుడనలఙ్గల్ శేర్‌మార్పుమ్ వాళియే
తిణ్బాయముమ్ పణిమలర్‌న్ద త్తిరుక్కళుత్తుమ్ వాళియే
మై యల్ శెయ్యుముక ముఱువల్ మలర్ క్కణ్గళ్ వాళియే
మన్నుముడితొప్పారుమ్ వలయుముడన్ వాళియే.
కలన్ద తిరుకార్‌త్తిగై యిల్ కార్తిగై వన్దోన్ వాళియే
కాశినియిలోణ్ కురై యలూర్ క్కావలోన్ వా ళియే
నలం తిగళాయిరత్తు ఎణ్బత్తు నాలురై త్తాన్ వా ళియే
నాలై న్దు మాఱై న్దుం నమక్కురై త్తాన్ వాళియే
ఇలఙ్గెళుకూత్ తిరుక్కై యిరుమడ లీన్దాన్ వా ళియే
ఇమ్మూన్నిల్ పాట్టిరునూత్‌తిరుపత్తేళ్ శై త్తాన్ వా ళియే
వలం తిగళుం కుముదవల్లి మణవాళన్ వాళియే
వాట్కలియన్ పరకాలన్ మఙ్గై యర్కోన్ వాళియే

శ్రీ మదాలి శ్రీ నగరీ నాథాయ కలివైరిణే
చతుష్కవి ప్రధానాయ పరకాలాయ మంగళమ్.

శ్రీరస్తు
శ్రీమతే రామానుజాయనమః

# ఆచార్యవైభవము

# శ్రీ మన్నాథమునులు

( శ్రీ రంగనాథమునులు)

తిరునక్షత్రతనియన్:-

జ్యేష్ఠ మాసే త్వనూరాధా జాతం నాథమునిం భజే ।
యచ్ఛ్రీ శఠారే శ్శ్రుతవాన్ ప్రబన్ధ మఖిలం గురోః ॥

నిత్య తనియన్:-

నమోఽచిన్త్యా ద్భుతాక్లిష్ట జ్ఞాన వైరాగ్య రాశయే
నాథాయ మునయేఽ గాధ భగవద్భక్తి సిన్ధవే ॥

పూర్వాచార్య పరంపరలో ప్రథములు శ్రీమన్నాథమునులు. వీరు వీరనారాయణ పురమున (కాట్టుమన్నార్ కోయిల్) "శోభకృత్" నామ సంవత్సర మిధునమాసమున (జ్యేష్ఠమాసమున) అనూరాధా నక్షత్రమున బుధవారమున గణేశాంశమున ఈశ్వరభట్టర్ అనువారికి కుమారులుగా నవతరించిరి.

ఒకనాడు ఆళ్వార్ తిరునగరి నుండి వేంచేసిన కొందరు స్వాములు మన్నార్ పెరుమాళ్లను సేవించి నమ్మాళ్వార్ అనుగ్రహించిన తిరువాయిమొళిలోని "ఆరావముదే" అను దశకమును అనుగ్రహింపగా నాథమునులు విని ఆనందనిర్భరులై తిరువాయిమొళిని పూర్తిగా వినవలెనని కుతూహలపడి స్వాములను ప్రార్థించిరి. స్వాములును తిరువాయిమొళి ఈ పది పాశురములు తక్క మిగిలిన భాగము ప్రణష్టమైనదని తెలుపగా చింతించి నాథమునులు ఎట్లైనను తిరువాయిమొళిని సంపాదింపవలెనని యెంచి ఆళ్వార్ తిరునగరిని చేరిరి.

అచట నిర్నిద్ర తింత్రిణీ వృక్షముక్రింద సుఖాసీనులై వేంచేసియున్న ఆళ్వార్లను సేవించి వారి విషయమై మధురకవి యాళ్వార్లనుగ్రహించిన "కణ్ణినుణ్ శిరుత్తాంబు" ప్రబంధమును పన్రెండువేల పర్యాయములు జపించిరి. అంత నమ్మాళ్వార్లు యోగమున నాథమునులకు సాక్షాత్కరించి నాలాయిర దివ్య ప్రబంధముల ననుగ్రహించిరి.

నాథమునులును సంతుష్టాంతరంగులై కాట్టుమన్నార్ కోయిల్‌చేరి తమమేనల్లుళ్ళగు "కీళయకత్తాళ్వార్" "మేలైయకత్తాళ్వార్" అనువారలకు నేర్పి

వారిచే గానము చేయించిరి. ఆవంశమువారే నేటికిని శ్రీరంగనాథుని మ్రోల దివ్యప్రబంధమును గానము చేయు అరయరు స్వాములు.

వీరికుమారులు ఈశ్వరమునులు. వారికి కుమారులుదయింతురనియు వారికి "యమునైత్తుఱైవర్" అను తిరునామముంచవలయుననియు నియమించిరి. వారికి ద్వయమంత్రమును దివ్యప్రబంధములను చెప్పుమని తమ శిష్యులగు ఉయ్యక్కొండార్‌ను, యోగరహస్యములనుపదేశింపుడని "కురుగైక్కావలప్పన్ అనువారిని నియమించిరి. వీరికి చక్రవర్తి తిరుమగన్( శ్రీరామచంద్రులు) యందు ప్రేమాతిశయము మించగా వారిని వెదకుచు గంగైకొండ చోళపురముచేరి అచట పరమపదించిరి.

వీరి తిరునక్షత్రం: మిథునం. అనురాధ - అవతార స్థలం: కాట్టుమన్నార్ కోయిల్
అనుగ్రహించిన గ్రంథములు: న్యాయతత్త్వము-యోగరహస్యమ్ - పురుషనిర్ణయమ్.?
శిష్యులు: ఉయ్యక్కొండార్, కురుగైక్కావలప్పన్, తిరుక్కణ్ణమఙ్గై యాణ్డాన్ మొదలగువారు.

వాழிతిరునామఙ్గళ్

ఆనిదనిల్ అనుడత్తిల్ అవదరిత్తాన్ వాழிయే
ఆళవందార్క్కుపదేశమ్ అరుళివైత్తాన్ వాழிయే
పానుతెర్కిఱ్ కణ్డవన్ శొల్ పలవురైత్తాన్ వాழிయే
పరాఙ్కుశనార్ శొర్ పిరపన్దమ్ పరిన్దుకత్తాన్ వాழிయే
గానముర తాళత్తిల్ కణ్డిశైత్తాన్ వాழிయే
కరుణైయినాల్ ఉపదేశక్కదియళిత్తాన్ వాழிయే
నానిలత్తిల్ గురువరైయై నాట్టినాన్ వాழிయే
వలన్దిగழ் నాదముని నఱ్పదఙ్గళ్ వాழிయే.



**నాథేన మునినాథేన**
**భవేయం నాథవానహమ్।**
**యస్య నైగమికం తత్త్వం**
**హస్తామలకతాం గతమ్॥**

**నాదముని**
**NADAMUNI**
**కాట్టుమన్నార్ కోయిల్**

# ఉయ్యక్కొండార్
## (పుండరీకాక్షులు)

తిరునక్షత్రతనియన్:-

మేషమాసే సరోజాక్షం కృత్తికా జాత మాశ్రయే
నాథయోగి పదామ్భోజ ద్వన్ద్వ ప్రవణ మానసమ్ ॥
నమస్యామ్యరవిన్దాక్షం నాథభావే వ్యవస్థితమ్ ।
శుద్ధ సత్త్వమయం శౌరే రవతార మివాపరమ్ ॥

నిత్యతనియన్:-

నమః పంకజనేత్రాయ నాథ శ్రీ పాద పఙ్కజే ।
న్యస్త సర్వభరాయాస్మత్ కులనాథాయ ధీమతే ॥

నాథమునుల శిష్యులు ఉయ్యక్కొండార్, పుండరీకాక్షులనునది వీరి తిరునామము. వీరు మేషమాసమున కృత్తికా నక్షత్రమునందు తిరువెళ్ళరై క్షేత్రమునందవతరించిరి. వీరు సేనమొదలి యాళ్వార్ల మంత్రియగు జయత్సేనుని అంశము.

నాథమునుల మామగారు వంగిపురత్తు నంబి. వారి కుమార్తె అరవిందా ప్పావై యాళ్. ఆమెనుచూడగోరి పిలువ నంపగా నాథమునులు ఆమెకు ఉయ్య క్కొండారును సహాయముగా పంపిరి. అచట వీరిని పురశ్చూడులుగా చూచినవారు వీరికి వేరుగా భోజనము పెట్టిరి. ఉయ్యక్కొండారును సంతోషముతో భుజించి తిరిగి వీరనారాయణపురము చేరిరి.

విషయము తెలిసిన నాథమునులు ఉయ్యక్కొండారును ప్రశ్నింపగా వారు "మీ శిష్యునిగా నన్ను గౌరవింపక నాలోని నైచ్యమును గుర్తించినందులకు" నాకు పరమ సంతోషమైనదని పలికిరి. వారి నైచ్యాను సంధానమునకు ఆశ్చర్యపడిన నాథమునులు వారిని చూచి "ఎన్నై ఉయ్యక్కొండేరో" ((నన్ను ఉజ్జీవింప వచ్చినారా) అని పలికిరి. తదాదిగావీరికి ఉయ్యక్కొండార్ అను తిరునామమేర్పడినది.

నాథమునులు యోగరహస్యములు తెలిసినవారు - కానీవీరు "పిణం కిడక్క మణంపురి వారుండో!" శవము ఉండగా వాసన చూచువారుందురా! అనితలచి అష్టాంగ యోగమును వదలి అర్చావతారవైభవమును ప్రతిపాదించు దివ్య ప్రబంధములను నాథమునులవద్ద అధ్యయనముచేసి వాని అర్థములు తెలిసికొని లోకమునకు అనుగ్రహించుటచే వీరికి "ఉలగై ఉయ్యక్కొండార్" (లోకములను రక్షింప వచ్చినవారు) అనిపేరువచ్చెను.

వీరునాథమునుల తరువాత దర్శన ప్రవర్తకులుగా వేంచేసియుండిరి. వీరి

శిష్యులు 1. "మణక్కాల్ నమ్బి" 2. తిరువల్లి క్కేణిపాణ్ పెరుమాళ్ అరయర్ 3 శెట్టి ప్పూశి శెణ్ణలజ్గరర్ 4. శ్రీపుణ్డరీకదాసర్, 5. ఉలకుపెరుమాళ్ నజ్జై యనువారు.

తిరునక్షత్రము: మేషమాసము - కృత్తికా నక్షత్రము.

అవతార స్థలము:- తిరువెళ్లరై - ఆచార్యులు : నాథమునులు.

### వాழி తిరునామమ్

వాలవెయ్యోన్దనై వెన్ద వడివ ழగన్ వాழియే
మాల్ మణక్కాల్ నమ్బి తొழுమలర్పదత్తోన్ వాழியే
శీలమిగు నాదముని శీర్ఱురై ప్పోన్ వాழியే
శిత్తిరై యిల్ కార్తిగై నాళ్ శిఱక్కవన్దోన్ వాழியే
నాలిరణ్డు మైన్దుం నమక్కురై త్తాన్ వాழியే
నాలెట్టి నుళ్ పొర్ఱుళై నడత్తినాన్ వాழியే
మాలరజ్గర్ మణవాళర్ వళమురై ప్పోన్ వాழியే
వైయ ముయ్యక్కొణ్డవర్ తాళ్ వైయగత్తిల్ వాழியే



ఉయ్యకొండార్
VUYYAKONDAR
తిరువెళ్ళరై

# మణక్కాల్ నంబి
## (శ్రీ రామమిశ్రులు)

తిరునక్షత్ర తనియన్:–

కుంభ మాసే మఖోద్భూతం రామమిశ్ర ముపాస్మహే
పుణ్డరీకాక్ష పాదాబ్జ సమాశ్రయణ శాలినమ్ ॥

నిత్యతనియన్:–

అయత్నతో యామున మాత్మదాస మలర్క పత్రార్పణ నిష్క్రయేణ ।
యః క్రీతవా నాస్థిత యౌవరాజ్యం నమామి తం రామ మమేయ సత్వం ॥

వీరు విరోధినామ సంవత్సర కుంభమాసమున శుద్ధ చతుర్దశి మఖా నక్షత్రం బుధవారమున చోళదేశమందలి తిరుకావేరీతీర గ్రామమైన మణక్కాల్ అనుదివ్య దేశమునందు కుముదాక్షాంశముతో నవతరించిరి.

వీరు ఉయ్యక్కొండారుల ప్రధానశిష్యులు. వారి తర్వాత సంప్రదాయ ప్రవర్తకులుగా వేంచేసియున్నవారు. వీరికి ఆచార్యాభిమానము మెండు: ఉయ్యక్కొండారుల దేవిమారులు (భార్య) పరమపదించగా వీరు ఆచార్య గృహకృత్యములన్నింటిని నెరవేర్చెడివారు. ఒకనాడు ఆచార్యుల కుమార్తెలు ఒక కాలువ దాటవలసివచ్చెను. వీరు వారిని తమ భుజములపై నిడికొని కాలువ దాటించిరి. ఉయ్యక్కొణ్డారులీ విషయము తెలిసి వీరిని విశేషముగా కృపచేసిరి.

వీరు ఆళవందారులకు ఆచార్యులు. రాజ్యపదమునందున్న ఆళవందారులను ఉపాయముగా వశీకరించుకొని వారికి మంత్ర త్రయమును దివ్య ప్రబంధములను సకల రహస్యములను ఉపదేశించిన మహనీయులు. వీరి చరితమును గురుపరంపరా ప్రభావాదులలో చూడవచ్చును.

తిరునక్షత్రము: కుంభమాసం, మఖానక్షత్రం; అవతారస్థలం: మణ్ణైక్కాల్; ఆచార్యులు: ఉయ్యక్కొణ్డార్; శిష్యులు: ఆళవన్దార్ మొదలగువారు.

### వాழிతిరునామజ్గళ్

తేశముయ్య క్కొణ్డవర్తాళ్ శెన్నివై ప్పోన్ వాழிయే
తెన్నరజ్గర్ శీరరుళై చ్చేర్న్దిరుప్పోన్ వాழிయే
దాశరది తిరునామమ్ తழைక్కవన్దోన్ వాழிయే
తమిழ் నాదముని యుగప్పై త్తాపిత్తాన్ వాழிయే
నేశముడ నారియనై నియమిత్తాన్ వాழிయే
నీణిలత్తిల్ పతిన్ మర్క్కలై నిఱుత్తినాన్ వాழிయే
మాశిమగన్తన్నిల్ విళజ్గ వన్దుదిత్తాన్ వాழிయే
మాల్మణక్కాల్ నమ్బి పదమ్ వైయగత్తిల్ వాழிయే

# ఆళవందార్

## (యామునమునులు)

తిరునక్షత్ర తనియన్:-

శుచౌ మాస్యుత్తరాషాఢా జాతాం యామున దేశికం ।
శ్రీ రామమిశ్ర చరణ సరోజాశ్రిత మాశ్రయే ।

నిత్యతనియన్:-

యత్పదాంభోరుహధ్యాన విధ్వస్తా శేష కల్మషః ।
వస్తుతా ముపయాతోఽహం యామునేయం నమామితమ్ ॥

వీరు నాథమునుల పౌత్రులు. ఉడయవరులకు పరమాచార్యులు. వీరు ధాతృనామ సంవత్సర కర్కాటక మాసము ఉత్తరాషాఢా నక్షత్రమున విష్వక్సేనుల మంత్రులలో నొకరగు సింహముఖుని అంశమున ఈశ్వరమునులకు కుమారులుగా వీరనారాయణపురము నందవతరించిరి. వీరికి తండ్రిగారుంచిన తిరునామము యుమునై త్తుఱవర్.

ఆనాటి చోళరాజు ఆస్థానమున నుండిన విద్వజ్జన కోలాహలుడను పండితుని వాదమున జయించి అర్ధరాజ్యమును సంపాదించి రాజ్యసుఖములనుభవించు చుండిరి.అంతట శ్రీరామమిశ్రులు (మణక్కాల్ నంబి) తమ ఆచార్యాజ్ఞానుసారము యామునమునులను అనుసరించి వారిని వశీకరించుకొని మంత్ర మంత్రార్థములను దివ్య ప్రబంధములను సకలరహస్యములను అనుగ్రహించిరి.

కాంచీపురమున వరదరాజస్వామి సన్నిధిలో స్వామి ఎంబెరుమానారులను చూచి వారిని దర్శన ప్రవర్తకులుగా కటాక్షించిరి. ఎంబెరుమానారులు వీరిని సేవించుటకు శ్రీరంగమునకు వేంచేయగా అప్పటికే వీరు పరమపదించిరి. ఆ సమయమున మూడు వ్రేళ్లు ముడుచుకొనియుండగా ఉడయవరులు మూడు ప్రతిజ్ఞలుచేసి మూడువ్రేళ్లను తెరిపించిరి.

వీరి సన్నిధిని ఆశ్రయించిన వారు 1. పెరియనంబి 2. తిరుక్కోట్టియూర్ నంబి 3. పెరియ తిరుమలై నంబి 4 మారనేరినంబి 5 తిరుక్కచ్చి నంబి 6 ఆళవన్దారాళ్వాన్7 తిరుమాలై యాణ్డాన్ 8. వానమామలై ఆణ్డాన్9 తెయ్వవారియణ్డాన్ 10. ఈనాణ్డాన్11. జీయరాణ్డాన్12. తిరుక్కురుగూరప్పన్13.తిరుమోక్కరప్పన్ 14. తిరుమోక్కర్ నిన్రాన్15. తెయ్వపెరుమాళ్16. వకుళాభరణసోమయాజియార్ 17. తిరుక్కురుగూర్ దాసర్ 18. తిరుమాలిరుంశోలై దాసర్ 19. వడమదురై పిరన్దాన్ 20. ఆళ్కొణ్డి అమ్మంగి అనువారలు.

అనుగ్రహించిన గ్రంథములు: 1 స్తోత్రరత్నము; 2.చతుశ్లోకి 3. సిద్ధిత్రయము 4. ఆగమప్రామాణ్యము. గీతార్థ సంగ్రహమ్.

తిరునక్షత్రము: కర్కటకమాసం - ఉత్తరాషాఢా నక్షత్రం.
అవతార స్థలము: కాట్టు మన్నార్ కోయిల్
ఆచార్యులు: మణక్కాల్ నంబి

వాళ్ళి తిరునామజ్జళ్

మచ్చణియుమ్ మదిళరజ్గమ్ వాళ విత్తాన్ వాళ్ళియే
మఱ్ఱై నాన్గు మోరురవిల్ మగిళ్ళున్దుకత్తాన్ వాళ్ళియే
పచ్చైయిట్ట రామమ్ పదమ్ పగరుమవన్ వాళ్ళియే
పాషియైత్తో నీడేఱ ప్పార్త్తై శెయ్దోన్ వాళ్ళియే
కచ్చినగర్ మాయ నిరుకళల్ పణిన్దోన్ వాళ్ళియే
కడగ ఉత్తిరాడత్తుక్కాలు దిత్తాన్ వాళ్ళియే
అచ్చుమఱ మనమగిళ్ళచ్చి యణ్ణైన్దిట్టాన్ వాళ్ళియే
ఆళవన్దార్ తాళిణైగళ్ అనవరతమ్ వాళ్ళియే



యామున మునులు
YAMUNA MUNULU

విగాహే యామునం తీర్థం సాధు బృన్దావనే స్థితమ్ ।
నిరస్తజిహ్మగస్పర్శే యత్ర కృష్ణః కృతాదరః ॥

## పెరియనంబి

### (మహాపూర్ణులు)

తిరునక్షత్ర తనియన్:-

ధనుర్జ్యేష్ఠే సముద్భూతం యామునాఙ్ఘ్రి సమాశ్రితం ।
మహాపూర్ణం యతీన్ద్రార్య మన్త్రరత్న ప్రదమ్భజే ॥
దయా నిఘ్నం యతీన్ద్రస్య దేశికం పూర్ణమాశ్రయే ।
యేనవిశ్వసృజో విష్ణో రపూర్యత మనోరథః ॥

నిత్యతనియన్:-

**కమలాపతి కల్యాణ గుణామృత నిషేవయా ।**
**పూర్ణకామాయ సతతం పూర్ణాయ మహతే నమః ॥**

పెరియనంబిగారు హేవళంబినామ సంవత్సరమున ధనుర్మాసమున శుద్ధ పంచమీ గురువారం జ్యేష్ఠా నక్షత్రమున శ్రీరంగమునందవతరించిరి. వీరు విష్వక్సేనుని పరివారములోని కుముదాంశ సంభూతులు. వీరికి పెరియనంబి, మహాపూర్ణులు; పరాంకుశ దాసులు మొదలగు తిరునామములు కలవు. వీరి కుమారులు పుణ్డరీకాక్షులు. కుమార్తె అత్తుళ్లాయమ్మగారు. వీరు శ్రీ ఆళవన్దారుల శ్రీపాదములాశ్రయించి సకలరహస్యార్థములను పొందిరి. తమ సతీర్థులయిన మాఱనేర్ నంబిగారికి బ్రహ్మమేధ సంస్కారమును చేసిరి.

వీరు భగవద్రామానుజులకు ప్రధాన ఆచార్యులు. మధురాన్తకమున చక్రవర్తి తిరుమగన్ సన్నిధిలో భగవద్రామానుజులకు పంచ సంస్కారములను అనుగ్రహించిరి. కొంత భాగము దివ్య ప్రబంధము కృపచేసరి. చోళరాజోపద్రవమున కూరత్తాళ్వాన్లతో కలసి చోళరాజ సభకు పోయి దర్శన స్థాపన చేసి తమ దర్శనములు (కన్నులను) పోగొట్టుకొనినారు. తిరిగివచ్చునపుడు మధ్యే మార్గమున కూరత్తాళ్వాన్ ఒడిలో శిరస్సును కుమార్తె అత్తుళాయమ్మగారి ఒడిలో పాదములను ఉంచుకొని పరమపదించిరి. వీరనుగ్రహించిన గ్రంథము "తిరుప్పతి కోవై".

**వాழி తిరునామఙ్గళ్**

అమ్బువియిల్ పదిన్మర్ కలై ఆయ్న్దురైప్పోన్ వాழியే
ఆళవన్దార్ తాళిణైయై యడైన్దుయ్న్దోన్ వాழியే
ఉమ్బర్ తొழுమరఙ్గేశర్ క్కుగప్పుడైయోన్ వాழியే
ఓఙ్గుతను క్కేట్టైదని లుదిత్తపిరాన్ వాழியే
వమ్బవిழுతార్ వరదరురై వాழி శెయ్దాన్ వాழியే
మాఱనేర్ నమ్బిక్కు వాழ்వళిత్తాన్ వాழியే
ఎమ్బెరుమానార్ మునివర్క్కిதமురైత్తాన్ వాழியే
ఎழிల్ పెరియనమ్బిశరణ్ ఇనితూழி వాழியే

# తిరుమలై నంబి

## ( శ్రీశైలపూర్ణులు)

తిరునక్షత్రతనియన్:-

> శ్రీమల్లక్ష్మణయోగీంద్ర శ్రీరామాయణ దేశికమ్ ।
> శ్రీశైలపూర్ణం వృషభ స్వాతి సంజాత మాశ్రయే ॥

నిత్యతనియన్:-

> పితామహస్యాపి పితామహాయ
> ప్రాచేతసాదేశ ఫలప్రదాయ
> శ్రీభాష్యకారోత్తమ దేశికాయ
> శ్రీ శైలపూర్ణాయ నమో నమస్తాత్ ॥

వీరు విష్వక్సేనుని పరివారములోని సుముఖుని అంశతో నవతరించిన మహనీయులు. వృషభ మాసమున చిత్రానక్షత్రమున ప్రసిద్ధ దివ్యదేశమైన "తిరుమలై" శ్రీనివాసుని వరప్రసాదిగా నవతరించుటచే వీరికి తిరుమలై నంబియను తిరునామమేర్పడినది. శ్రీశైలపూర్ణులనునది నామాంతరము. వీరికుమారులు పిళ్లై తిరుమల నంబిగారు.

వీరు ఆళవందారుల శ్రీపాదములాశ్రయించి సకల వేదాంతార్థములను అధికరించిరి. "వేంగడత్తై ప్పతియాక వాల్వీర్ కాళ్" అనునట్లు శ్రీవేంకటాచలపతినే ధారకముగా భావించి సదా స్వామి కైంకర్యము నందే నిమగ్నులైన మహనీయులు.

వీరికి తోడబుట్టిన సోదరీమణులిరువురు. వారిలో పెద్దవారగు శ్రీభూమి పిరాట్టి (వీరికే కాంతిమతీ దేవియనిపేరు) కుమారులే భగవద్రామానుజులు. రెండవవారగు పెరియపిరాట్టి కుమారులు ఎమ్బార్ అనే గోవిందభట్టర్, శిరయగోవింద ప్పెరుమాళ్.

వీరిలో ఎమ్బార్ మతాంతర ప్రవిష్టులుకాగా వారిని దిద్దుబాటు చేసి శ్రీవైష్ణవ సిద్ధాన్త ప్రవర్తకులుగా తీర్చిదిద్దిరి. భగవద్రామానుజులకు శ్రీరామాయణ రహస్యములను ఒక సంవత్సరకాలము అనుగ్రహించిరి.

వీరు తిరుమలై శ్రీనివాసునకు తీర్థ కైంకర్యము చేయు సమయము నందొకనాడు శ్రీనివాసుడు వృద్ధ బ్రాహ్మణుని రూపమునవచ్చి తాతా! దాహముగా నున్నది తీర్థమునిమ్మ"ని కోరి వీరిచ్చిన తీర్థమును స్వీకరించిరి. ఈ సందర్భములో శ్రీనివాసుడు తాతా! అనిపిలుచుటచే వీరు పితామహులకు కూడ పితామహులైరి. వీరి వైభవము గురుపరంపరా ప్రభావములో సేవింపవచ్చును.

తిరునక్షత్రం:- వృషభం, చిత్త; ఆచార్యులు:- ఆళవన్దార్
శిష్యులు:- భగవద్రామానుజులు మొదలగువారు.

### వాழ்ితిరునామమ్

వైయాశి చ్చోతియినాళ్ వందు దిత్తాన్ వాழ்ియే
వణ్ తిరువేంగడ ముడైయాన్ వరపుత్తిరన్ వాழ்ియే
అయ్యన్ శ్రీఆళవందార్ అడితొழுవోన్ వాழ்ియే
అనవరతం మలైకునియర్ కడిమై శెయ్‌వోన్ వాழ்ియే
మెయ్యనిరామానుజార్యర్ విరుంబుమవన్ వాழ்ియే
మిక్కతిరుమలైయార్ కెల్లాం మేలావాన్ వాழ்ియే
శెయ్య తమిழ் కాదత్తిన్ శిఱప్పుఱిందోన్ వాழ்ియే
తిరుమల నంబిగళ్ ఉబయ తిరువడిగళ్ వాழ்ియే



తిరుమలై నంబి
TIRUMALAI NAMBI

# "తిరుక్కోట్టియూర్ నంబి"

## (గోష్ఠీపూర్ణులు)

తిరునక్షత్ర తనియన్:-

వైశాఖ రోహిణ్యుదితం గోష్ఠీపూర్ణం సమాశ్రయే ।
చరమశ్లోక తాత్పర్యం యతిరాజాయయోఽవదత్ ॥
శమదమ గుణపూర్ణం యామునార్య ప్రసాదాత్
అధిగత పరమార్థం జ్ఞాన భక్త్యాది సిన్ధుమ్ ।
యతిపతినతపాదం శ్లోకతత్త్వార్థ నిష్ఠం
శ్రితదురితహరం శ్రీ గోష్ఠిపూర్ణం నమామి॥

నిత్యతనియన్:-

శ్రీ వల్లభ పదాంభోజ ధీభక్త్య మృత సాగరమ్ ।
శ్రీ మద్గోష్ఠీపురీ పూర్ణం దేశికేన్ద్రం భజామహే ॥

శ్రీ పుండరీకాంశ సంభూతులైన తిరుక్కోట్టియూర్ నంబిగారు తిరుక్కోట్టియూర్ అనుదివ్యదేశమున సర్వజిత్ నామ సంవత్సర వృషభమాసమున రోహిణీ నక్షత్రమునందవతరించిరి. వీరికి గోష్ఠీపూర్ణులనునది నామాంతరము. వీరు పూర్వశిఖులు – ద్రాహ్యాయన సూత్రులు. వీరి కుమారులు తెఱ్ఱాళ్వాన్. కుమార్తెదేవకి పిరాట్టి.

వీరు శ్రీ ఆళవన్దారుల శ్రీ పాదములాశ్రయించి రహస్యార్థములను అధికరించిరి. భగవద్రామానుజులు వీరి సన్నిధికి పదునెనిమిది పర్యాయములు అనువర్తించి తిరుమంత్రార్థమును, చరమశ్లోకార్థమును సేవించిరి. తాము తెలిసికొన్న తిరుమంత్రార్థమును తిరుక్కోట్టియూర్ గోపురము పై నుండి సర్వులకు తెలియజేసిరి. వారి పరసమృద్ధి ప్రియత్వమునకు సంతుష్టులైన గోష్ఠీపూర్ణులు వీరిని "ఎంబెరుమానార్" అనిసంబోధించిరి. తదాది భగవద్రామానుజులకు "ఎంబెరుమానార్" అనుతిరునామ మేర్పడినది.

### వాళ్తిరునామమ్

అరియన్ నాళ్ రోహిణి వైయాశి వందోన్ వాళియే
ఆళవన్దార్ తాళిణై యిల్ అడిమై శెయ్వోన్ వాళియే
పరమనవన్ తెర్కాళ్వాన్ పదం పణిన్దోన్ వాళియే
బాష్యకారర్ క్కతిరహస్యం పగరమవన్ వాళియే
తిరుక్కోట్టియూరదనిల్ శేర్న్దిరుప్పోన్ వాళియే
తెఱెకాళ్వాన్ తమప్పనెన్ఱు తిశైమకిళ్వోన్ వాళియే
తిరుమాగుం తెన్మొళియిన్ తిరంతెరిన్దోన్ వాళియే
తిరుక్కోట్టియూర్ నంబి యిరుతిరుపడిగళ్ వాళియే

# తిరుమాలైయాణ్డాన్
## ( శ్రీ మాలాధరులు)

తిరునక్షత్రతనియన్:

కుంభమాసే మఖోద్భూతం మాలాధర ముపాస్మహే
యామునార్య పదాంభోజ సమాశ్రయణ శాలినమ్॥
రామానుజ మునీంద్రాయ ద్రావిడీ సంహితార్థదమ్
మాలాధర గురుం వందే వావదూకం విపశ్చితమ్

నిత్యతనియన్:

భక్తామృతం వాంఛిత పారిజాతం
మాలాధరం యామున పాదభక్తమ్ ।
శ్రీ భాష్య కారస్య హితోపదేశమ్
శ్రీ జ్ఞానపూర్ణం శిరసానమామి ॥

వామనాంశ సంభూతులైన తిరుమాలై యాణ్డాన్ తిరుమాలిరుంశోలై మలై అను దివ్యదేశమున సర్వధారి నామ సంవత్సర కుంభమాసమున మఖానక్షత్రమున నందవతరించిరి. మాలాధరులను నది వీరికి సంస్కృత తిరునామము. వీరు శ్రీఆళవన్దారుల శ్రీపాదముల నాశ్రయించి వేదవేదాంత రహస్యములను, దివ్యప్రబంధ విశేషార్థములనుగ్రహించిరి.

వీరు తిరుక్కోట్టియూర్ నంబిగారి ఆదేశానుసారము భగవద్రామానుజులకు తిరువాయిమొళ్ళి అర్థ విశేషములను అనుగ్రహించిరి. ఆసందర్భములో భగవద్రామానుజులు పలు సందర్భములలో ఆళవందారులు చెప్పిన తాత్పర్యార్థ మిట్లుండునని చెప్పి ఆళవందారుల శ్రీసూక్తులను వినిపింపగా ఆశ్చర్యపడిన మాలాధరులు ఇదియు ఒక అవతార విశేషమా! అని ఆశ్చర్యపడి దండము సమర్పించి తమ కుమారులు సుందరత్తోళుడైయాన్ అనువారిని ఉడయవరులకు శిష్యులనుగా చేసిరి. వీరి వైభవము గురుపరంపరా ప్రభావాదులలో సేవింపవచ్చును.



తిరుమాలై ఆండాన్
THIRUMALAI ANDAN

# తిరువరంగప్పెరుమాళ్ అరయర్

## ( శ్రీ రంగదేశికులు)

తిరునక్షత్రతనియన్

వృషభే జ్యేష్ఠ నక్షత్రే జాతం శ్రీ రంగదేశికమ్
యామునార్య సుతం వన్దే శంఖ కర్ణాంశ సంభవమ్
శ్రీ రామమిశ్ర పదపంకజ చంచరీకం
శ్రీ యామునార్య వరపుత్ర మహం గుణాఢ్యమ్
శ్రీ భాష్యకార శరణం వరరంగమీడే ॥

నిత్యతనియన్:

అధ్యాపయ ద్యతీంద్రాయ పరాంకుశ సహస్రికామ్ ।
తన్నాథ వంశ్యం వన్దేహం శ్రీ రంగాధిపదేశికమ్

వీరు ఆళవందారుల తిరుకుమారులు. వీరితల్లిగారు శ్రీరంగ నాచ్చియార్ తెయ్వత్తుక్కరసునంబి, పిళ్లైయరసునంబి; శొట్టైనంబి అనువారు ఆచార్యులు మణక్కాల్నంబిగారు.

తిరువరంగప్పెరుమాళ్ అరయర్ ప్రతినిత్యము శ్రీరంగనాథుల సన్నిధిలో దివ్యప్రబంధమును గానము చేసెడివారు. ఆళవందారుల ఆజ్ఞచే కాంచీపురమునకు పోయివరదరాజస్వామిని ప్రసన్నుని చేసికొని భగవద్రామానుజులను శ్రీరంగమునకు తీసికొనివెళ్లిరి. వీరి సన్నిధిలో ఎంబెరుమానార్లు దివ్య ప్రబంధములను, చరమ పర్వనిష్ఠా రహస్యములను ( ఆచార్యుల యందు భక్తి కలిగియుండుటయే ఉత్తారకము) తెలిసికొనిరి.



తిరువరంగ పెరుమాళ్ అరయర్

THIRUVARANGA PERUMAL ARAYAR

## ఉడయవర్

### (భగవద్రామానుజులు)

తిరునక్షత్రతనియన్:—

మేషార్ద్రా సంభవం విష్ణోర్దర్శన స్థాపనోత్సుకమ్
తుండీర మండలే శేషమూర్తిం రామానుజం భజే ॥

నిత్యతనియన్:—

యోనిత్య మచ్యుత పదాంబుజ యుగ్మరుక్మ
వ్యామోహత స్తదితరాణి తృణాయ మేనే ।
అస్మద్గురో ర్భగవతోస్య దయైక సిన్ధో:
రామానుజస్య చరణౌ శరణం ప్రపద్యే ॥

వీరు తొండమండలమునగల శ్రీపెరుంబూదూరు అను దివ్య దేశమున హారీతగోత్రులగు ఆసూరి కేశవ సోమయాజుల వారికి కాంతిమతీ దేవి యందు కుమారులుగా పింగళనామ సంవత్సర చైత్ర (మేష) శుక్ల పంచమీ గురువాసరము ఆర్ద్రా నక్షత్రయుక్త కర్కాటక లగ్నము నందవతరించిరి.

వీరికి తండ్రిగారు యథోచితమగు జాతకర్మాదుల నొనర్చి "ఇళైయాళ్వార్" అను తిరునామముంచిరి. వీరు శాస్త్రాభ్యాసము చేయుసమయమునందే ఒక మూగవానికి, బ్రహ్మరక్షస్సుకు మోక్షమునను గ్రహించిరి. ఉపనిషదర్థ విచారమున యాదవప్రకాశులతో విభేదించిరి.

తిరుక్కచ్చినంబిగారి ద్వారా షడ్వార్తలనువిని **ఆళవందారుల** శ్రీపాదము లాశ్రయించిన **పెరియనంబిగారిని** ఆశ్రయించి మధురాంతకమున పంచ సంస్కార ములనుప్రొందిరి. పిమ్మట అనంత సరసీ తటమున వరదరాజ స్వామి సన్నిధిలో తురీయాశ్రమమును స్వీకరించిరి.

పిమ్మట శ్రీరంగముచేరి శ్రీరంగనాథుల కైంకర్యము చేయుచుండిరి. తమ మేనమామగారైన **పెరియ తిరుమల నంబి**గారిని వద్ద శ్రీరామాయణమును సేవించిరి. వారును తమ కుమారులగు **పిళ్ల తిరుమలనంబి**గారి, మేనల్లుడగు **"ఎమ్బార్లను"** (గోవిందభట్టర్) వీరి శ్రీపాదములాశ్రయింపజేసి **"కోయిలణ్ణన్"** అను తిరునామముంచిరి.

**తిరువరఙ్గప్పెరుమాళ్ అరయర్** అనువారి వద్ద దివ్యప్రబంధములు సేవించిరి. వారును వీరికి **లక్ష్మణమునులు** అనుతిరునామముంచి తమసోదరులగు **శొట్టనమ్బి**గారిని వీరి తిరువడిలో నాశ్రయింపజేసిరి.

**తిరుక్కోట్టియూర్** నంబిగారివద్ద రహస్య త్రయార్థమును సేవించి వారి

వలన **"ఎమ్బెరుమానార్"** అను బిరుదమును పొంది వారి తిరుక్కుమారులైన **తెల్కాళ్వార్** అనువారిని శిష్యులుగా స్వీకరించిరి.

**తిరుమాలైయాణ్డాన్** అనువారివద్ద దివ్యప్రబంధవ్యాఖ్యానములను సేవించి **శఠగోపన్ పొన్నడి** అనుతిరునామముపొంది వారి కుమారులు **సుందరత్తోళుడైయాన్** అనువారిని శిష్యులుగా స్వీకరించిరి.

అద్వైత సంప్రదాయమునకు చెందిన **"యజ్ఞమూర్తి"** అనువారిని వాదమున జయించి శిష్యులుగా స్వీకరించి **"అరుళాళప్పెరుమాళ్ ఎంబెరుమానార్"** అను తిరునామముంచిరి. తమ మేనల్లుడగు **మొదలియాండాన్‌ను** సగోత్రులగు కూరత్తాళ్వాన్‌ను శిష్యులుగా ననుగ్రహించిరి.

తిరుమల శ్రీనివాసునకు శంఖచక్రములు ప్రసాదించిరి. శ్రీవారి వక్షస్థలమున అలర్ మేల్‌మంగై ను ప్రతిష్ఠించి "శ్రీవేంకటేశ శ్వశురః" అను బిరుదము వహించిరి. తిరుక్కురుజ్గుడి నమ్బికి ద్వయమంత్రము నుపదేశించి "శ్రీవైష్ణవనంబి" యని తిరునామముంచిరి.

చోళరాజోపద్రవమున మేల్‌నాడు (మేల్‌కోట్టై ప్రాంతము) వేంచేసిరి. ఢిల్లీ పాదుషా వద్దనుండి "శెల్వపిళ్ళై" అనుఉత్సవమూర్తిని తీసికొనివచ్చి తిరునారాయణ పురమున ప్రతిష్ఠించిరి. అచటవారి ప్రార్థనచే తమ అర్చామూర్తిని ప్రతిష్ఠించుటకు అనుమతించిరి. తమ శ్రీపాదములాశ్రయించిన వడుగ నంబికి మిధున సాలగ్రామమున శ్రీపాద తీర్థము ననుగ్రహించిరి.

బ్రహ్మ సూత్రములకు పూర్వాచార్య సురక్షితమైన యర్థముతో శ్రీభాష్యముననుగ్రహించి కాశ్మీరు శారదాపీఠమున **శ్రీ భాష్యకారులను** బిరుదము వహించిరి. వీరనుగ్రహించిన గ్రంథములు 1. శ్రీ భాష్యము 2. వేదాంతసారము 3. వేదాంతదీపము. 4. వేదార్థ సంగ్రహము 5. గద్యత్రయము 6 గీతాభాష్యము. 7. నిత్యగ్రంథము.

శ్రీరంగనాథులచే "అత్రైవ శ్రీరఙ్గేసుఖమాస్స్వ" అను అనుజ్ఞవడసి వారిచే ఉభయ విభూతి సామ్రాజ్య పట్టాభిషిక్తులై నూటయిరువది సంవత్సరములు లీలా విభూతిలో వేంచేసియుండిరి.

వీరు అవతరించిన కాలమునందే "తిరునారాయణపురము, శ్రీపెరుంబుదూరు లలో వీరి అర్చా విగ్రహములు ప్రతిష్ఠింపబడెను. వీరి చరమతిరుమేని శ్రీరంగమున ప్రతిష్ఠింపబడెను.

ఈ విధముగా తమ ప్రభావముచే విశిష్టాద్వైత సిద్ధాంతమును స్థాపించి తమ శ్రీపాదములాశ్రయించిన వారి నందరిని అనుగ్రహించిన కృపామాత్ర ప్రసన్నాచార్యులు

భగవద్రామానుజులు. వీరి చరిత్ర గురుపరంపరా ప్రభావములో విశదముగా సేవింపవచ్చును.

తిరునక్షత్రము: మేషమాసము; ఆర్ద్ర నక్షత్రము.

అవతారస్థలము: శ్రీపెరంబూదూర్

ఆచార్యులు: పెరియనంబి

శిష్యులు: - కూరత్తాళ్వాన్ మొదలగువారు.

**నాళ్‌పాట్టు**

ఇన్ఱులగీర్ ! శిత్తిరైయిల్ ఏయ్న్ద తిరువాదిరై నాళ్
ఎన్ఱైయినుం ఇన్ఱిదనుక్కేత్త మెత్తాన్ - ఎన్ఱవర్కు
చ్చాత్తు గిన్ఱేన్ కేణ్మిన్ ఎతిరాశర్‌దం పిఱప్పాల్
నాల్ దిశైయుం కొణ్డాడుం నాళ్.

ఆళ్వార్‌గళ్ తాజ్గళ్ అవదరిత్త నాళ్ గళిలుమ్
వాళ్వానవాళ్ నమక్కు మణ్ణులగీర్? - ఏళ్ పారుమ్
ఉయ్య ఎతిరాశరుదిత్తరుళుమ్, శిత్తిరైయిల్
శెయ్య తిరువాదిరై.

ఎన్దై ఎతిరాశర్ ఇవ్వులగిల్ ఎన్దమక్కా
వన్దు దిత్త నాళెన్నుం వాశియనాల్ - వన్ద
త్తిరువాదిరై దన్నిన్ శీర్మైదనై నెంజే !
ఒరువామల్ ఎప్పొళుదుమ్ ఓర్.

**వాళి తిరునామజ్గళ్**

అత్తిగిరి యరుళాళర్ అడిపణిన్దోన్ వాళియే
అరుట్కచ్చి నమ్బియురై యాఱు పెత్తోన్ వాళియే
పత్తియుడన్ బాషియత్తై ప్పగర్‌న్దిట్టాన్ వాళియే
పదిన్మరైకలై యుట్పొరుళై ప్పరిన్దు కత్తోన్ వాళియే
శుత్తమగిళ్ మాఱన్ అడితొళు తుయ్‌న్దోన్ వాళియే
తొల్ పెరియనమ్బి శరణ్ తోన్ఱినాన్ వాళియే
శిత్తిరైయిల్ ఆదిరైనాళ్ శిఱక్క వన్దోన్ వాళియే
శీర్ పెరుమ్బూదూర్ మునివన్ తిరువడిగళ్ వాళియే.
ఎణ్డిశై యెణ్డిశై యాళ్వార్ ఎతిరాశరన్ వాళియే
ఎళుపత్తు నాల్వర్‌క్కుమ్ ఎణ్ణాజ్గుఱైత్తాన్ వాళియే
పణ్డైమఱైయై త్తెరిన్ద బాషియత్తోన్ వాళియే

పరకాల నడియిణై యై పరవు మవన్ వాళియే
తణ్డమిళ్ నూర్ నమ్మాళ్వార్ శరణానాన్ వాళియే
తారిణియుం విణ్ణులగుం తానుడై యోన్ వాళియే
తెణ్డిరైశూళ్ బూదూరెమ్బెరుమానాన్ వాళియే
శిత్తిరై యిర్ శెయ్య తిరువాదిరై యోన్ వాళియే
శీరారు మెతిరాశర్ తిరువడిగళ్ వాళియే
తిరువరై యిల్ శాత్తియ శెన్దువరాడై వాళియే
ఏరారుమ్ శెయ్యవడి యెప్పొళుదుమ్ వాళియే
ఇలఙ్గియ మున్నూల్ వాళి యిణై త్తోళ్గళ్ వాళియే
శోరాదు తుయ్య శెయ్య ముగచ్చోది వాళియే
తూముఱువల్ వాళి తుణై మలర్క్కణ్గళ్ వాళియే
ఈరారు తిరునామమ్ అణిన్ద ఎళిల్ వాళియే
ఇని తిరుప్పోదెళిల్ ఞానముద్దిరై వాళియే
అఱుశమయచ్చెడియదనై యడియఱుత్తాన్ వాళియే
అడర్న్దు వరుం కుదిట్టిగళై యఱత్తుఱన్దాన్ వాళియే
శెరుకలియై చ్చిఱిదుమఱ త్తీర్త్తు విట్టాన్ వాళియే
తెన్నరఙ్గర్ శెల్వమత్తుం తిరుత్తివైత్తాన్ వాళియే
మఱై యదనిల్ పొరుళనైత్తుం వాయ్మొళిన్దాన్ వాళియే
మాఱనురై శెయ్ద తమిళ్మఱై వళర్త్తోన్ వాళియే
అఱమిగు నఱ్పెరుమ్బూదూర్ అవతరిత్తాన్ వాళియే
అళగారుం ఎతిరాశర్ అడియిణైగళ్ వాళియే
శఙ్కర పాఱ్కర యాదవ బాట్ట పిరపాకరర్ తఙ్గళ్ మతమ్
శాయ్వురు వాదియర్ మాయ్వుఱుమెన్ఱు శెదుమఱై వాళ్న్దిడునాళ్
వెఙ్గలి యిఙ్గిని వీఱు నమక్కిలై యెన్ఱు మిగత్తలర్ నాళ్
మేదిని నఙ్జుమై యాఱుమెనత్తుయర్ విట్టు విళఙ్గియనాళ్
మఙ్గై యరాళి పరాఙ్కుశ మున్నవర్ వాళ్వు ముళైత్తిడునాళ్
మన్నియ తెన్నరఙ్గాపురి మామలై మత్తు మువన్దిడు నాళ్
శెఙ్గయల్ వావిగళ్ శూళ్వయల్ నాళుం శిఱన్ద పెరుమ్బూదూర్
శ్రీమానిళై యాళ్వార్ వన్దరుళియనాళ్ తిరువాదిరై నాళే.

## ముదలియాణ్డాన్



**తిరునక్షత్ర తనియన్:-**

**మేషే పునర్వసు దినే పాంచజన్యాంశ సంభవమ్ ।**
**యతీన్ద్ర పాదుకాభిఖ్యం వన్దేదాశరథిం గురుమ్ ॥**

**నిత్య తనియన్:-**

**పాదుకే యతిరాజస్య కథయన్తి యదాఖ్యయా ।**
**తస్య దాశరథేః పాదౌ శిరసా ధారయామ్యహమ్ ॥**

వీరు కన్దాడై కుడి (వంశము) యందు మేషమాసమున పునర్వసు నక్షత్రమున పూందమల్లికి సమీపమునగల "పచ్చై వారణ పెరుమాళ్‌కోయిల్" (పేట్టై) యందు పాంచ జన్యాంశము నందవతరించిరి. వీరు ఎంబెరుమానారులకు భాగినేయులు (మేనల్లుళ్ళు). ఎంబెరుమానార్లచే త్రిదండస్థానముగా పరిగణింపబడినవారు.

వీరు చరమ శ్లోకార్థమును సేవింపదలచి ఉడయవరులను ప్రార్థింపగా వారు తిరుక్కోట్టియూర్ నంబిగారి సన్నిధికి పంపిరి. వారును "విద్యామదము ధనమదము అభిజన్మదమను మదత్రయము పోయినచో ఎమ్బెరుమానారులే కృపచేయుదురని వీరిని పంపివేసిరి.

మొదలియాండాను కూడ మిగుల శమదమాది ఆత్మగుణ పరిపూర్తి కలవారై మిక్కిలి ఆర్తితో ఉడయవరుల శ్రీపాదములాశ్రయింపగా స్వామి సంతోషించి వారికి గుహ్యతమమైన చరమశ్లోకార్థము ననుగ్రహించి తమకు త్రిదండము చేతికి చిక్కినదని సంతోషించిరి. వీరును ఉడయవర్ శిష్యులలో ప్రధానులు. వీరి సంస్కృతనామము దాశరథి. వీరు ఎంబెరుమానారులకు పాదుకాస్థానీయులుగా పెద్దలు నిర్వహింతురు.

తిరునక్షత్రము: చైత్రం (మేషం) పునర్వసు
అవతారస్థలము: పచ్చైప్పెరుమాళ్ కోయిల్ - ఆచార్యులు: ఎంబెరుమానార్.
అనుగ్రహించిన గ్రంథముల్లు: ధాటీ పంచకం., రహస్యత్రయం.

### వాழி తిరునామజ్గళ్

అత్తిగిరి యరుళాళర్ అడిపణిన్దోన్ వాழிయే
అరుట్పచ్చై వారణత్తిల్ అవదరిత్తాన్ వాழிయే
శిత్తరయిల్ పునర్వాశం శిఱక్క వన్దోన్ వాழிయే
శీర్ బాషియ మీడుముదల్ శీర్ పెఱువోన్ వాழிయే
ఉత్తమమాం వాదూల ముయర వన్దోన్ వాழிయే
ఊర్తిరున్ద శీర్పాద మూన్రినాన్ వాழிయే
ముద్దిరయుం శెజ్గోలుం ముడిపెఱువోన్ వాழிయే
ముదలియణ్డాన్ పొఱ్పదజ్గళ్ ఊழிదోఱుం వాழிయే

# కూరత్తాళ్వానులు

## (కూరేశ మిశ్రులు)

తిరునక్షత్ర తనియన్ :–

మకరే హస్త నక్షత్రే సర్ప నేత్రాంశ సంభవమ్
శ్రీమత్కూర కులాధీశం శ్రీవత్సాఙ్క ముపాస్మహే ॥

నిత్య తనియన్ :–

శ్రీ వత్స చిహ్నమిశ్రేభ్యో నమ ఉక్తి మధీమహి
యదుక్తయ స్త్రయీ కంఠే యాంతి మంగళ సూత్రతామ్ ॥

వీరు ఉడయవరుల శిష్యులలో ప్రధానులు. కాంచీపురమునకు సమీపమునగల కూరమను అగ్రహారమున కలియుగాది 4109 సంవత్సరమునకు సరియగు సౌమ్యనామ సంవత్సర తైమాసమున (పుష్య) హస్తానక్షత్రమున సర్పనేత్రాంశము నందవతరించిరి. వీరికి తండ్రిగారుంచిన తిరునామము తిరుమరు మార్వన్ (శ్రీవత్సాఙ్క మిశ్రులు) వీరికి సర్వేశ్వరుని యందుగల ప్రేమాతిశయమును గుర్తించిన ఉడయవరులు "ఆళ్వాన్" అనిపేరిడిరి.

వీరి దేవిమారులు ఆండాళమ్మగారు. ఈ దపంతులిరువురు పరమ వైరాగ్య సంపన్నులు. మహాసంపన్నులై యుండియు ఆ సంపదనంతయు పరిత్యజించి ఉడయవర్ శ్రీపాదములే రక్షకములని నమ్మియుండిరి.

స్వామి యెంబెరుమానారుల యాజ్ఞచే తిరువరఙ్గత్తముదనార్లను దిద్దుబాటుచేసి వారినుండి శ్రీరంగనాథుని సన్నిధి నిర్వాహమును తీసికొని ఉడయవరులకు అప్పగించిరి. శ్రీరంగనాథుని పురోహితులుగా నిత్యము స్వామి సన్నిధిలో కైంకర్యము చేయుచుండెడివారు.

చోళరాజగు క్రిమికంఠుని వలన ఉడయవరులకు ప్రమాదము కలుగనున్నదని తలచి తాము పెరియనంబిగారితో కూడా చోళరాజసభకుపోయి "శివాత్పరతరంనాస్తి" అనువాదమును ఖండించి విష్ణుపరత్వ స్థాపన చేసిన మహనీయులు.

ఉడయవరులను గ్రహించిన శ్రీభాష్యరచనలో మిక్కిలి సహాయము చేసినవారు. వీరి కుమారులు వ్యాసభట్టర్,పరాశరభట్టర్. వీరి ప్రభావము వాచామ గోచరము. పరమ దయాసముద్రులగు వీరి చరితమును గురుపరంపరా ప్రభావాది గ్రంథములలో సేవింపవచ్చును.

తిరునక్షత్రముః మకరమాసం – హస్తా నక్షత్రం.

వీరనుగ్రహించిన గ్రంథములుః పంచస్తవములు 1. శ్రీ వైకుంఠస్తవం 2.

అతిమానుషస్తవం 3. సుందరబాహుస్తవము 4. వరదరాజస్తవము 5. శ్రీస్తవము. 6. గద్యత్రయవ్యాఖ్యానమ్; అవతార స్థలముః కూరం ; ఆచార్యులుః ఎంబెరుమానార్;

**వాళ్గి తిరునామజ్గళ్**

శీరారుమ్ తిరుప్పతిగళ్ శిరక్కవందోన్ వాళ్గియే
తెన్నరజ్గర్ శీరరుళై చ్చేరుమవన్ వాళ్గియే
పారారు మెతిరాశర్ పదమ్పణిన్దోన్ వాళ్గియే
పాషియత్తిన్ నుట్పొరుళై ప్పగరుమవన్ వాళ్గియే
నారాయణన్ శమయం నాట్టినాన్ వాళ్గియే
నాలూరాన్ దనక్కున్ ముత్తినళిగినాన్ వాళ్గియే
ఏరారుమ్ తైయిలత్త త్తిజ్గువన్దాన్ వాళ్గియే
ఎళ్గిల్ కూరత్తాళ్వాన్ తన్నిణైయడిగళ్ వాళ్గియే.



కూరత్తాళ్వాన్
KURATTALVAN

## "ఎంబార్"

## (గోవింద భట్టర్)

**తిరునక్షత్ర తనియన్:-**

పుష్యే పునర్వసు దినే జాతం గోవిన్ద దేశికమ్
రామానుజ పదచ్ఛాయా రాజహంసం సమాశ్రయే ॥

**నిత్యతనియన్:-**

రామానుజ పదచ్ఛాయా గోవిన్దాహ్వానపాయినీ
**తదాయత్త స్వరూపా సా జీయాన్మద్విశ్రమస్థలీ ॥**

వీరు భగవద్రామానుజులకు పినతండ్రి కుమారులు. తండ్రిగారు "కమలనయనభట్టరు. శ్రీపెరుంబూదూరునకు సమీపమునగల మధుర మంగలమను గ్రామమున మకరమాసమున (పుష్య) పునర్వసు నక్షత్రమందవతరించిరి.

వీరు కొంతకాలము అన్యసంప్రదాయమునందుండగా వీరి మేనమామ గారైన పెరియ తిరుమల నంబిగారు "తేవుమెప్పారుళుం పడైక్క" అను తిరువాయిమొళి అర్థాను సంధానముచేత వీరిని వశీకరించుకొనిరి. ఉడయవరుల శ్రీపాదముల నాశ్రయింపచేసిరి. తదాది వీరు ఉడయవరుల శ్రీపాదములను విడువక ఛాయవలె అనుసరించు చుండిరి. ఉడయవర్ తరువాత దర్శన నిర్వాహకులుగా వేంచేసియుండిరి.

కూరత్తాళ్వాన్ తిరుక్కుమారులు వ్యాసభట్టరు, పరాశరభట్టరులకు మంగళాసనము చేయదలచిన ఉడయవరుల సన్నిధికి, ఆ బాలకులను తీసికొనిపోవుచు "ద్వయమంత్రమును" రక్షగాచెప్పిరి. స్వామి ఎంబెరు మానార్లు ఆ బాలుర తేజస్సును గమనించి ఎంబారులవలన విషయము తెలిసికొని తమకంటె ముందుగా వారి క్షేమమును కోరినవారగుటచే వారికి ఎంబారులనే ఆచార్యులుగా నియమించిరి. వీరు అనుగ్రహించిన గ్రంథముః **విజ్ఞానస్తుతి.**

**వాళ్ తిరునామజ్గళ్**

పూవళరుం తిరుమగళార్ పొలివుత్తోన్ వాళియే
పొయ్గై ముదల్ పదిన్మర్ కలై పొరుళురై ప్పోన్ వాళియే
మావళరుం బూదురాన్ మలర్పదత్తోన్ వాళియే
మకరత్తిల్ పునర్పూశమ్ వన్దుదిత్తాన్ వాళియే
తేవుమెప్పారుళుమ్ పడైక్క త్తిరున్దినాన్ వాళియే
తిరుమలై నమ్బిక్కడిమై శెయ్యుమవన్ వాళియే
పావైయర్గళ్ కలవియిరుళ్ పగలెన్దాన్ వాళియే
బట్టర్ తొళుమెమ్బార్ పొఱ్పదమిరణ్డుమ్ వాళియే

# పరాశర భట్టర్

తిరునక్షత్రతనియన్:-

మాధవే మాస్యనూ రాధా జాతం భట్టార్య దేశికమ్

గోవింద తాత పాదాబ్జ భృజ్గరాజ మహంభజే ॥

నిత్యతనియన్:-

శ్రీ పరాశర భట్టార్యః శ్రీరంగేశ పురోహితః ।

శ్రీవత్సాంక సుతశ్శ్రీమాన్ శ్రేయసే మేஉస్తు భూయసే ॥

వీరు కలియుగాది 4164 వ సం॥ శుభకృత్ నామ సం॥ర వృషభ మాసమున అనూరాధా నక్షత్రమున పరాశరాంశతో అవతరించిరి.

స్వామి యెంబెరుమానారుల తర్వాత సిద్ధాంత వ్యాప్తిని చేసిన మహనీయులు పరాశరభట్టరు. వీరు కూరత్తాళ్వానుల తిరుక్కుమారులు. శ్రీరంగనాథుని అనుగ్రహమున అవతరించి శ్రీరంగనాథులచే పుత్రులుగా స్వీకరింపబడినవారు. వీరి సోదరులు వ్యాసభట్టరు. వీరి ఆచార్యులు ఎంబారు. వీరు సకలశాస్త్రములను దివ్య ప్రబంధములను తదర్థములను సాంగో పాంగముగ అధిగమించిరి.

ఎంబెరుమానారుల చివరి కాలమున మైసూరు ప్రాంతమున మాధవా చార్యులను అద్వైత వేదాంతి ఉండేవారు. ఎంబెరుమానారుల ఆజ్ఞచే భట్టరు ఆ వేదాంతిని వాదమున జయించి సంప్రదాయ ప్రవర్తకులను చేసిరి. వారే నంజీయరు.

వీరు బహుగ్రంథ కర్తలు. దివ్య ప్రబంధములయందు అనేక విశేషార్థముల ననుగ్రహించిరి. వానిని పెరియ వాచ్చాంపిళ్ళై తమ వ్యాఖ్యానములందు విశదీకరించిరి.

వీరనుగ్రహించిన గ్రంథములలో శ్రీవిష్ణుసహస్రనామ భాష్యమగు "భగవద్గుణ దర్పణము" ప్రధానమైనది. వరమవైరాగ్య సంపన్నులైన వీరి వైభవము గురుపరంపరాప్రభావాది గ్రంథములలో సేవింపవచ్చును.

తిరునక్షత్రం వృషభం - అనూరాధ

ఆచార్యులు: ఎంబార్ - శిష్యులు నంజీయర్ మొదలగువారు

అనుగ్రహించిన గ్రంథములు: 1. శ్రీగుణరత్నకోశము. 2. శ్రీరంగరాజస్తవము. 3.అష్టశ్లోకి 4. చతుశ్లోకి.

తెన్నరజ్గర్ మైన్దనెన చ్చిఱక్కవన్దోన్ వాళ్ళియే
తిరునెడున్దాణ్డగ ప్పొరుళై చ్చెప్పుమవన్ వాళ్ళియే
అన్నవయల్ పూదూరన్ అడిపణిన్దోన్ వాళ్ళియే
అనవరతం ఎమ్పెరుమానార్ క్కాట్చెయ్వోన్ వాళ్ళియే
మన్ను తిరుక్కూరనార్ వళముఱైప్పోన్ వాళ్ళియే
వైగాశి యనుడత్తిల్ వన్దుదిత్తాన్ వాళ్ళియే
పన్నుకలై నాల్వేదప్పయన్ తెరివోన్ వాళ్ళియే
పరాశరనాం శీర్ బట్టర్ పారులగిల్ వాళ్ళియే.



శ్రీ పరాశర భట్టర్
SRI PARASARA BHATTAR

# నంజీయర్

## (వేదాన్తి)



తిరునక్షత్ర తనియన్:-

ఫాల్గునోత్తరఫల్గున్యాం జాతం వేదాన్తి సన్మునిమ్ ।
శ్రీ పరాశర భట్టార్య పాదరేఖామయం భజే ॥

నిత్య తనియన్:-

నమో వేదాన్త వేద్యాయ జగన్మంగళ హేతవే ।
యస్య వాగమృతాసార పూరితం భువన త్రయమ్ ।

వీరు విజయనామ సంవత్సరమున మీన మాసము ఉత్తర ఫల్గునీ నక్షత్రమునందవతరించిరి. వీరు మొదట అద్వైత సంప్రదాయస్థులు. మాధవాచార్యులనిపేరు. "వేదాంతి" యను బిరుదముతో షడ్దర్శనములకు షడాసనంబిడి మతాంతర విద్వాంసులను జయించు చుండిరి.

వీరి ఖ్యాతిని వినిన శ్రీపరాశరభట్టరు శ్రీరంగపట్టణము వేంచేసి తొమ్మిది దినములు వీరితో వాదముచేసి జయము నిర్ణయము కాక పదియవ దినమున "తిరునెడుందాండక"మున గల రహస్యార్థముల నుపన్యసింపగా వేదాంతి సంభ్రమాశ్చర్యములతో భట్టరువారు శ్రీపాదముల నాశ్రయించెను. వారి వలన పంచ సంస్కారములు పొంది భగవద్రామానుజ దర్శనము నందభిమానము గలవారైరి.

శ్రీభట్టరును శ్రీరంగమునకు వేంచేసి వేదాంతిని జయించిన విషయమును "తిరునెడున్దాణ్డక దివ్య ప్రబంధ రహస్యార్థములను శ్రీరంగని సన్నిధిలో విన్నవించిరి. ఆమరునాటి నుండి అధ్యయనోత్సవ ప్రారంభము. తదాదిగా భట్టర్ విజయ సూచకముగా నేటికిని అధ్యయనోత్సవమునకుముందు దివసమున శ్రీరంగములో తిరునెడున్దాణ్డక ఉత్సవము జరుగుచున్నది.

వీరి ఆచార్యాభిమానము పరమ విలక్షణమైనది. వీరు శ్రీపరాశర భట్టరు వారి సన్నిధిలో దివ్య ప్రబంధార్థములను సేవించి రస్యముగా ఉపన్యసించెడివారు.

తిరువాయిమొழி "తిరుక్కురుగై ప్పిరాన్ పిళ్లాన్" అనుగ్రహించిన "ఆరాయిరప్పడి" వ్యాఖ్యానము అతిసంగ్రహముగానుండుటచే భట్టర్ నియమనానుసారము వీరు "ఒన్బదినాయిరప్పడి" వ్యాఖ్యను అనుగ్రహించిరి.

భట్టర్ వారిచే "నమ్ముడైయ జీయరో" అని అభిమానింప బడుటచే వీరికి "నంజీయరో" అను తిరునామమేర్పడినది.

తిరునక్షత్రము: మీనము - ఉత్తర

ఆచార్యులుః శ్రీపరాశర భట్టర్ – శిష్యులుః నంబిళ్లై మొదలగువారు.
అనుగ్రహించిన గ్రంథములుః తిరువాయిమొళికి "ఒన్బదినాయిరప్పడి వ్యాఖ్య,"
తిరుప్పావైకు ఈరాయిరప్పడివ్యాఖ్య, ఉరై ; శరణాగతిగద్య వ్యాఖ్య.

**వాళితిరునామజ్గళ్**

తెన్నురై శూళ్ తిరువరజ్గమ్ శెళిక్క వన్దోన్ వాళియే
శీమాదవ నెన్నుమ్ శెల్వనార్ వాళియే
పణ్డై మఱై త్తమిళ్ ప్పొరుళై పగర వందోన్ వాళియే
పజ్గునియిల్ ఉత్తిర నాళ్ పారుదిత్తాన్ వాళియే
ఒండొడియాళ్ కలవిదన్నై యొళి త్తిట్టాన్ వాళియే
ఒన్బది నాయిర ప్పొరుళై యోదుమవన్ వాళియే
ఎండిశైయుమ్ శీర్ బట్టరిణై యడియోన్ వాళియే
ఎళిల్ పెరుగుమ్ నఞ్జీయ రిని తూళి వాళియే

## "నంబిళ్లై"

**(కలివైరి దాసులు)**

**తిరునక్షత్రతనియన్:–**

**వృశ్చికే కృత్తికా జాతం కలివైరి గురుమ్భజే ।**
**వేదాన్తి ముని పాదాబ్జ శ్రితం సూక్తి మహార్ణవమ్ ।**

**నిత్యతనియన్:–**

**వేదాన్త వేద్యామృత వారిరాశేః వేదార్థ సారామృత పూరమగ్ర్యమ్**
**ఆదాయవర్షన్త మహం ప్రపద్యే కారుణ్యపూర్ణం కలివైరి దాసమ్ ।**

వీరు వృశ్చికమాసమున కృత్తికా నక్షత్రమునందవతరించిరి. నంబూరి వరదరాజులనునది తండ్రిగారుంచిన తిరునామము.

వీరు నంజీయర్ శ్రీపాదముల నాశ్రయించి వారి వలన దివ్య ప్రబంధార్థములధికరించిరి. నంజీయర్ అనుగ్రహించిన "ఒన్బదినాయిరప్పడి" వ్యాఖ్యానమును తాళ పత్రములపై తిరిగి వ్రాయు ప్రయత్నములో కావేరీ నదిలో దానిని పోగొట్టుకొని తాము వినిన విషయమగుటచే తమ మేధాశక్తితో తిరిగి వ్రాసి నంజీయర్ సన్నిధిలో సమర్పించిరి. వారి మేధా విశేషమున కాశ్చర్యపడిన నంజీయర్ వీరిని "నమ్ముడైయపిళ్లై" అని సాదరముగా మన్నించిరి. తదాది వీరికి నంబిళ్ళై యను తిరునామము ప్రసిద్ధి చెందెను. వీరికే తిరుక్కలి గన్రి దాసులు (కలివైరిదాసులు) అనియు లోకాచార్యులనియు తిరునామము.

ఆనాడు వీరి శిష్యగోష్ఠి అమితముగా నుండెడిది. దానిని జూచిన వారు నంబిళ్లైగోష్ఠియో? నంబెరుమాళ్ గోష్ఠియో అని ఆశ్చర్యపడుచుండెడివారు. వీరి శిష్యులు వడక్కుత్తిరువీధిపిళ్లై, పెరియవాచ్చాంబిళ్లై. మొదలగువారు.

దివ్య ప్రబంధార్థములను పలురీతుల వర్ణించి వాక్పయోదమని ప్రసిద్ధిచెందిన మహనీయులు "నంబిళ్లై"

తిరునక్షత్రము: వృశ్చికం - కృత్తిక; ఆచార్యులు: నంజీయర్. శిష్యులు: వడక్కుత్తిరువీధిపిళ్లై మొదలగువారు. గ్రంథములు: తిరువిరుత్త వ్యాఖ్యానంఈడు, కణ్ణినుణ్ శిరుత్తాంబుకుఈడు తిరుప్పల్లాణ్డుఈడు, మొదలగునవి.

## వాழ்திరునామజ్గళ్

తేమరువుం శెజ్గమల త్తిరుత్తాళ్గళ్ వాழியే
తిరువరై యిల్ పట్టాడై శేర్మరుఙ్గుం వాழியే
తామమణి వడమార్బుం పురినూలుం వా ழியే
తామరై క్కైయిణై యழగుం తడమ్బుయముం వాழியే
పామరువం తమిழ்వేదం పయిల్ పవళం వాழியే
పాడియత్తిన్ పొరుళ్దన్నై ప్పగర్ నావుం వా ழியే
నామనుతల్ మదిముగముం తిరుముడియుం వాழியే
నమ్బిళ్లై వడివழగుం నాడోఱుం వాழியే
కాతలుడన్ నంజీయర్ కழల్ తొழுవోన్ వాழியే
కార్త్తికై క్కార్త్తికై యుతిత్త కలికన్టి వాழியే
పోతముడ నాழ்వార్ శొற்పొరు ళురై ప్పోన్ వాழியే
పూతూరన్ పాడియత్తై ప్పుకழுమవన్ వాழியే
మాతకవా లెవ్వుయర్క్కుమ్ వాழ వళిత్తాన్ వాழியే
మతిళరఙ్గరోలక్కమ్ వళర్త్తిట్టాన్ వాழியే
నాతముని యాళవన్దార్ నలమ్పుక ழ்వోన్ వాழியే
నమ్బిళ్లై తిరువడికళ్ నాడోరుమ్ వా ழியే

# వడక్కు త్తిరువీథి పిళ్లై
## (శ్రీ కృష్ణపాదులు)

**తిరునక్షత్రతనియన్:-**

**మిధునే స్వాతి సంభూతం కలివైరి పదాశ్రితమ్ ।**
**ఉదక్ర్పతోళి నిలయం కృష్ణపాదమహంభజే ।**

**నిత్యతనియన్:-**

**శ్రీ కృష్ణపాద పాదాబ్జే నమామి శిరసా సదా ।**
**యత్ర్పసాద ప్రభావేన సర్వసిద్ధిరభూన్మమ ॥**

వీరు సర్వజిత్ నామసంవత్సర మిధునమాసము స్వాతి నక్షత్రము నందవతరించిరి. వీరి ఆచార్యులు నంబిళ్లై. వారి సన్నిధిలో సకల దివ్యప్రబంధార్థములను సేవించిరి. నంబిళ్లై ఉపన్యసించిన తిరువాయిమొళ్ళి విశేషార్థముల నన్నింటిని ఒక గ్రంధముగా గూర్చిరి. అదియే ఈడుముప్పత్తారాయిరప్పడి.

"తిరుక్కురుగై ప్పిరాన్ పిళ్లాన్" శ్రీవిష్ణుపురాణ సంఖ్యతో ఆరాయిరప్పడి వ్యాఖ్యానమును, నంజీయర్ శ్రీభాష్య ప్రక్రియ ననుసరించి ఒన్బదినాయిరప్పడి వ్యాఖ్యానమును, పెరియ వాచ్చాంబిళ్లై శ్రీరామయణ సంఖ్య ననుసరించి ఇరుపత్తు నాలాయిరప్పడి వ్యాఖ్యానమును అనుగ్రహింపగా వీరు శ్రుత ప్రకాశికా ప్రక్రియగా "ఈడుముప్పత్తారాయిరప్పడి"ని అనుగ్రహించిరి.

ఈడు అనగా సదృశమని యర్థము. ఉపనిషత్తులకు సదృశమగుటచే ఈ వ్యాఖ్యకు ఈడు ముప్పత్తారాయిరప్పడియను పేరువచ్చినది. సర్వులను భగవద్గుణము లందు ఈడుపడునట్లు (అవగాహనము చేయునట్లు చేయుటచే) "ఈడు" అని పేరు వచ్చినది. వీరి తిరుక్కుమారులు పిళ్లైలోకాచార్యులు, అళ్గియ మణవాళప్పెరుమాళ్ నైనారాచార్యర్.

తిరునక్షత్రము: మిధునం; స్వాతి; ఆచార్యులు: నంబిళ్లై; గ్రంథము: ఈడు ముప్పత్తారాయిరప్పడి.

### వాళ్ళి తిరునామజ్గళ్

ఆనిదని ల్చోదినా శవతరిత్తాన్ వాళ్ళియే
ఆళ్గ్వార్గళ్ కలై ప్పొరుళై యాయ్న్దురై ప్పోన్ వాళ్ళియే
తానుగన్ద నమ్బిళ్లై తాళ్ తొళ్ళువోన్ వాళ్ళియే
శడగోపర్ తమిళ్ళ క్కీడు శాత్ తినాన్ వాళ్ళియే
నానిలత్తిల్ బాషియత్తై నడత్తినాన్ వాళ్ళియే
నల్లవులగారియనై నమక్కళిత్తాన్ వాళ్ళియే
ఈనమఱవెమ్మై యాళు మిరైవనార్ వాళ్ళియే
ఎజ్గళ్ వడవీది పిళ్లై యిణై యడిగళ్ వాళ్ళియే.

## పెరియ వాచ్చాన్‌బిళ్లై
### ( శ్రీ కృష్ణదేశికులు)

**తిరునక్షత్రతనియన్:-**

సకల ద్రావిడామ్నాయ సార వ్యాఖ్యాన కారిణమ్ ।
శ్రావణే రోహిణీ జాతం శ్రీకృష్ణ గురు మాశ్రయే ॥

**నిత్యతనియన్:-**

**శ్రీ మత్కృష్ణ సమాహ్వాయ నమోయామున సూనవే**
**యత్కటాక్షైక లక్ష్యాణాం సులభ శ్రీధర స్సదా ॥**

వీరు కలియుగాది 42691 సం॥నకు సరియగు సర్వజిత్ నామ సం॥ర సింహ మాసమున రోహిణీ నక్షత్రమున శెంగనల్లూరు (తంజావూరుమావట్టం) నందవతరించిరి. (తిరువెళ్ళియఙ్గుడికి సమీపము) శ్రీకృష్ణాష్టమినాడు అవతరించుటచే వీరికి కృష్ణమాచార్యులను తిరునామము కలిగినది. వీరి ఆచార్యులు నంబిళ్లై. వారి నియమనానుసారము తిరువాయిమొழிకి శ్రీరామాయణ సంఖ్యతో "ఇరుపత్తునాలాయిరప్పడి' వ్యాఖ్యానము ననుగ్రహించిరి. అంతియగాక తాము నంబిళ్లై గారి యొద్ద సేవించిన దివ్యప్రబంధార్థములనన్నింటిని వ్యాఖ్యాన రూపముగా అనుగ్రహించిన మహనీయులు. వీరికి వ్యాఖ్యాతృ చక్రవర్తియని బిరుదము. అభయప్రద రాజులనియు" బిరుదము. వీరు శ్రీరామాయణ విశేషార్థములను వివరించు" తనిశ్లోకిని అనుగ్రహించిరి. వీరు సుమారు అరువది గ్రంథములు అనుగ్రహించిన మహనీయులు.(వీరి కుమారులు "నయనారాచ్చాన్ పిళ్ళై").

గ్రంథములు: ఇరుపత్తునాలాయిరప్పడి 2. తత్త్వత్రయ వివరణము 3. నిగమనప్పడి 4. పరందరహస్యము 5. మాణిక్యమాల 6. మూన్ఱాయిరవ్యాఖ్య 7. రహస్య త్రయ వివరణమ్ 8. నవరత్నమాలై, 9. సకల ప్రమాణ తాత్పర్యం 10. ఉపకార రత్నమ్ 11. గద్యత్రయ వ్యాఖ్యానం 12. ఆళవన్దార్ స్తోత్రవ్యాఖ్యానం 13. అభయప్రదాన వ్యాఖ్యానమ్; 14. చరమరహస్యమ్ 15. అనుసన్ధాన రహస్యమ్.

**వాழிతిరునామఙ్గళ్**

తణ్మై శింగం రోహిణినాళ్ తழைక్క వన్దోన్ వాழிయే
　　తారణియిల్ శెంగనల్లూర్ తానుడై యోన్ వాழிయే
పున్మై తవిర్క్కుం తిరువరంగర్ పుగழ్ఉరై ప్పోన్ వాழிయే
　　పూదూరెతిరాశర్ తాళ్ పుగరుమవన్ వాழிయే
మణ్ పుగழ் శేర్ శటగోపర్ వళముఱై ప్పోన్ వాழிయే
　　మత్తై నాలిన్ పొరుళ్ దన్నై పగుత్తురై త్తాన్ వాழிయే
అన్పుడ నులగారియర్ దం అడియిణై యోన్ వాழிయే
　　అభయప్రదరాజర్ తాళ్ అనవరతం వాழிయే.

# పిళ్లై లోకాచార్యులు
## (లోకాచార్యులు)



**తిరునక్షత్రతనియన్:—**

**తులాయాం శ్రవణేజాతం లోకార్యమహమాశ్రయే ।**
**శ్రీ కృష్ణపాదతనయం తత్పదాంబుజ సంశ్రితమ్॥**

**నిత్యతనియన్:—**

**లోకాచార్యాయ గురవే కృష్ణపాదస్య సూనవే ।**
**సంసారభోగి సందష్ట జీవజీవాతవే నమః ॥**

నమ్బిళ్లైగారి శ్రీపాదములాశ్రయించిన వారిలో వడక్కుత్తిరువీధిపిళ్లై గారొకరు. నంబిళ్లగారి మంగళా శాసనములతో వీరికిరువురు కుమారులుదయించిరి. అందు మొదటివారు పిళ్లైలోకాచార్యులు – రెండవవారు అళగియమణవాళప్పెరుమాళ్ నాయనార్ అనువారు.

పిళ్లైలోకాచార్యులవారు క్రోధ నామసంవత్సరం తులామాసం శ్రవణ నక్షత్రమున శ్రీరంగమునందవతరించిరి. తమ తండ్రిగారైన వడక్కుత్తిరువీధిపిళ్లై గారి శ్రీపాదములాశ్రయించి ఉభయవేదాన్త రహస్యములను అధికరించిరి.

పరమకారుణికులైన పిళ్లై లోకాచార్యులవారు సర్వులు తరించుటకు పురాణప్రక్రియననుసరించి అష్టాదశ రహస్యములను కృపచేసిరి. వీరిసోదరులు అళగియ మణవాళప్పెరుమాళ్ నాయనార్; ఆచార్యహృదయము; అరుచ్చెయల్ రహస్యము; తిరుప్పావై ఆరాయిరప్పడి వ్యాఖ్యానమును అనుగ్రహించిరి. వీరి శ్రీపాదము లాశ్రయించిన వారిలో తిరువాయిమొళి పిళ్లై ప్రధానులు.

తిరునక్షత్రం:– తులామాసం, శ్రవణం; ఆచార్యులు: వడక్కుత్తిరువీధిపిళ్లై
అనుగ్రహించిన గ్రంధములు: అష్టాదశ రహస్యములు
శిష్యులు: తిరువాయిమొళి పిళ్లై, అకియమణవాళప్పెరుమాళ్ నైనారాచార్యర్ మొదలగువారు.

### వాళితిరునామమ్

అత్తిగిరి అరుళాళర్ అనుమతియోన్ వాళియే
ఐప్పశియిల్ తిరువోణత్త వదరిత్తాన్ వాళియే
ముత్తి నెఱి మఱైత్తమిళాల్ మొళిన్దరుళ్ వోన్ వాళియే
మూదరియ మణవాళన్ మున్బుదిత్తోన్ వాళియే
నిత్తియం నమ్బిళ్ళై పదం నెఞ్జిల్ వైప్పోన్ వాళియే
నీళ్వశన బూషణత్తాల్ నియమిత్తాన్ వాళియే
ఉత్తమమాం ముడుమ్బైనగ రుదిత్తవళ్లల్ వాళియే
ఉలగారియన్ పదఙ్గళ్ ఊళిదోరుం వాళియే.

# తిరువాయిమొழிపిళ్లై
## (శ్రీ శైలనాథులు)

**తిరునక్షత్ర తనియన్:—**

శ్రీశైలేశగురుం లోకదేశికాంఘ్రి సమాశ్రితమ్
వృషే విశాఖా సంభూతం వన్దే వరగుణాకరమ్ ॥

**నిత్యతనియన్:—**

నమశ్శ్రీశైలనాథాయ కున్తీనగర జన్మనే ।
ప్రసాదలబ్ద పరమప్రాప్య కైంకర్యశాలినే ॥

వీరు విభవనామ సం॥రం వైశాఖ మాసం విశాఖానక్షత్రమున పాండ్యదేశమునందలి కున్తీ నగరమునందవతరించిరి. వీరికి తిరుమలై ఆழ్వార్ అనియు తిరువాయిమొழிపిళ్లై అనియు తిరునామములు. వీరు పిళ్ళైలోకాచార్యులుగారిని ఆశ్రయించి పంచసంస్కారములను పొందిరి. వారిసన్నిధిలోనే దివ్య ప్రబంధములనధ్యయనము చేసిరి.

దేవాధిపులని నామాంతరముగల నాలూరాచ్చాంబిళ్లైగారి సన్నిధిలో భగవద్విషయమును, శ్రీభాష్యాది గ్రంధములను అழగియమణవాళప్పెరుమాళ్ నాయనార్ సన్నిధిలోను, తత్త్వత్రయ ఆచార్యహృదయాదులను కూరకులోత్తమ దాసర్ వద్దను, మిగిలిన గ్రంధములను విళాంశోలై పిళ్లైగారి సన్నిధిలోను అధ్యయనము చేసిరి. వీరు నమ్మాழ்వార్ల యందు అమితమైన ప్రావణ్యముగల వారగుటచే ఆழ்వార్ తిరునకరి జీర్ణోద్ధరణ గావించిరి. రామానుజ చతుర్వేది మంగలమను అగ్రహారము నేర్పరచి దా[illegible]న్య ఉడయవరుల సన్నిధి నిర్మించి దాని నిర్వహణను పెరియజీయర్‌కు అప్పగించిరి. [illegible]శిష్యులలో మణవాళమామునులు ప్రధానులు. వీరు పెరియాళ్వార్ తిరుమొழிకి స్వాపదేశఉరై అనుగ్రహించిరి.

తిరునక్షత్రము:— వృషభం – విశాఖానక్షత్రం; ఆచార్యులు:— పిళ్లై లోకాచార్యులవారు
శిష్యులు:— శ్రీమన్మణవాళమహామునులు మొదలగువారు
గ్రంధములు:— పెరియాழ்వార్ తిరుమొழிకి స్వాపదేశఉరై.

### వాழி తిరునామమ్

వైయగమెణ్ శడగోపర్ మఱైవళర్త్తోన్ వాழிయే
వైగాశి విశాగత్తిల్ వన్దుదిత్తాన్ వాழிయే
ఐయన్ అరుళ్‌మారికలై ఆయ్‌న్దురైప్పోన్ వాழிయే
అழగారుమెతిరాశర్ అడిపణివోన్ వాழிయే
తుయ్యవులగారియన్‌దన్ తుణైప్పదత్తోన్ వాழிయే
తొల్‌కురుకాపురి యదనై త్తులక్కినాన్ వాழிయే
తెయ్‌వనగర్ కున్తిదన్నిల్ శిఱక్కవన్దోన్ వాழிయే
తిరువాయిమొழி పిళ్లై తిరువడిగళ్ వాழிయే

## శ్రీ మణవాళమామునులు

### (సుందరజామాత్రమునులు)

తిరునక్షత్రతనియన్:

తులాయామతులే మూలే పాండ్యే కుంతీ పురీవరే
శ్రీ శేషాం శోద్భవం వందే రమ్యాజామాతరం మునిమ్ ॥

నిత్యతనియన్:–

శ్రీశైలేశ దయాపాత్రం ధీభక్త్యాది గుణార్ణవమ్ ।
యతీంద్ర ప్రవణం వందే రమ్యాజామాతరం మునిమ్ ॥

వీరు సాధారణ నామ సంవత్సర తులా మాసమున మూలా నక్షత్రమున గోమఠం తిరునావీరుడయపిరాన్ తాతరణ్ణార్ అనువారికి కుమారులుగా నవతరించిరి. తల్లిగారు శ్రీరంగనాచ్చియార్. సోదరులు తిరుమలై ఆళ్వార్. సోదరి నాచ్చియారమ్మన్. పూర్వాశ్రమమున కుమారులు శ్రీరామానుజాచార్యులు. వీరికి తండ్రిగారు జాతకర్మాది సంస్కారములు చేసి "అళగియమణవాళన్ అనిపేరుపెట్టిరి. వీరును తమ మేనమామ గారి గ్రామముగు "శిక్కిల్ కిడారం" అను అగ్రహారమున బాల్యమును గడిపిరి.

"పిన్నానార్ వణఙ్గుం శోది' (వెనుకటివారు ఆశ్రయించి తరించుటకు తగిన తేజోమూర్తి) అనునట్లు సంసారి చేతనులను ఉజ్జీవింపచేయుటకై భగవద్రామానుజులే తిరిగి మణవాళమామునులుగా అవతరించిరి. ఆళ్వారాచార్యుల శ్రీసూక్తులే ధారకముగా గల మణవాళమామునుల దివ్యచరిత్ర భగవద్రామానుజుల చరిత్ర కంటె విస్తృతమైనది.

భగవద్రామానుజులవలె వీరును దివ్యదేశయాత్రచేయుచు అనేక దివ్య దేశములను జీర్ణోద్ధరణ గావించిరి. పరమత నిరసనమొనర్చి స్వమత స్థాపన చేసిరి. వడమధురై (ఉత్తరమధుర) వేంచేసి జీర్ణోద్ధారణగావించిరి. ఆళ్వార్ తిరునగరి యందు తిరువాయిమొళి పిళ్లై గారికి తమ స్వస్వరూపమగు ఆదిశేషావతారము ప్రదర్శించిరి. తిర్యక్స్థావర జంగమములకు పైతము మోక్షమునను గ్రహించిన దయా సముద్రులు వీరు.

శ్రీరంగమును నిత్యవాసముగా చేసికొని యుండుటయేగాక శ్రీరంగనాథులకు ఈడు వ్యాఖ్యానమును ప్రసాదించిరి. నంబెరుమాళ్లను పరమప్రీతితో "శ్రీశైలేశ దయాపాత్రం" అనుశ్లోకమును కృపజేసి పెరియజీయర్ అనుతిరునామమునొసంగిరి. తదాదిగా వీరికి కోయిల్ పెరియ జీయర్ అనుతిరునామమేర్పడినది.

వీరు దివ్య ప్రబన్ధములను భగవద్విషయమును స్వాచార్యులైన తిరువాయిమొళ్ళి పిళ్లై గారి వద్ద సేవించిరి. శ్రీభాష్యాదులను శ్రుత ప్రకాశికను కిడాంబి తిరుమలై అయ్యంగారి వద్ద సేవించిరి. తత్త్వత్రయాది రహస్యములను "కూరకులోత్తమ దాసర్" అను ఆచార్యులవద్ద సేవించిరి.

వీరు ఉడయవరుల శ్రీపాదములందు అత్యంత అభినివేశముగలవారగుటచే "యతీంద్ర ప్రవణు"లను తిరునామమేర్పడినది. మరియు మణవాళమామునులు, రమ్యజామాతృ మునులు; వరవరమునులు; వరయోగి, రామనుజన్ పొన్నిడి అను తిరునామములు కలవు.

వీరి సన్నిధిని ఆశ్రయించినవారు అనేకులు గలరు. వీరిలో 1. వానమామలై జీయర్ 2. పరవస్తు పట్టర్ పిరాన్ జీయర్ 3. తిరువేఙ్గడ జీయర్ 4. కోయిల్ కన్దాడై అణ్ణన్ 5. ప్రతివాది భయంకరం అణ్ణా 6. ఎఱుంబి అప్పా 7. అప్పిళ్లై 8. అప్పిళ్లాన్ అనువారలు అష్టదిగ్గజములుగా ప్రసిద్ధినొందిరి.

వీరనుగ్రహించిన గ్రంధములు 1. తత్త్వత్రయమునకు వ్యాఖ్య 2. రహస్యత్రయ వ్యాఖ్య 3. శ్రీవచనభూషణ వ్యాఖ్య 4. ఆచార్య హృదయ వ్యాఖ్య 5. జ్ఞానసార వ్యాఖ్య 6. ప్రమేయ సారవ్యాఖ్య 7. పెరియాళ్వార్ తిరుమొళ్ళి వ్యాఖ్య 8. రామానుశనూత్తందాది వ్యాఖ్య 1. ఈడుకు ప్రమాణతిరట్టు 2. ఆరాయిరప్పడి ప్రమాణతిరట్టు 3. తత్త్వత్రయ ప్రమాణ తిరట్టు 4. శ్రీవచనభూషణ ప్రమాణతిరట్టు.

1. ఉపదేశరత్తినమాలై, 2. తిరువాయిమొళ్ళి నూత్తందాది 3. ఆర్తి ప్రబంధము 4. తిరువారాధన క్రమము (జీయర్‌పడి)

1. యతిరాజ వింశతి 2. భగవద్గీతకు గీతార్థ సంగ్రహదీపికా యను సంస్కృత వ్యాఖ్య.

వాచామగోచరమైన వీరి దివ్య ప్రభావమును "యతీంద్ర ప్రవణ ప్రభావము" అను గ్రంథమున సేవింపదగును.

## వాళ్ళి తిరునామమ్

ఇప్పువియిల్ అరంగేశర్క్కీడళిత్తాన్ వాళ్ళియే
　　ఎళ్ళిల్ తిరువాయిమొళ్ళి పిళ్లై యిణై యడియోన్ వాళ్ళియే
ఐప్పిశియిల్ తిరుమూల త్తవదరిత్తాన్ వాళ్ళియే
　　అరవశర ప్పెరుంజోది యనన్దనెన్నుం వాళ్ళియే
ఎప్పొళ్ళుదుమ్ శ్రీశైల మేత్తవందోన్ వాళ్ళియే
　　ఏరారు మెతిరాశరెన ఉదిత్తాన్ వాళ్ళియే
ముప్పురినూల్ మణివడముమ్ ముక్కోల్ దరిత్తాన్ వాళ్ళియే

మూదరియ మణవాళ మామునివన్ వాఴియే

తిరునాళ్‌పాట్టు

శెన్దమిఴ్ వేదియర్ శిందై తెళిన్దు శిఱన్దు మగిఴ్న్దిడు నాళ్
శీరులగారియర్ శెయ్‌దరుళ్ నఱ్కలై తేశుపొలిన్దిడు నాళ్
మన్దమదిప్పువి మానిడర్ తఙ్గళై వానిలుయర్త్తిడునాళ్
మాశరు ఞానియర్ శేరెతిరాశర్ తం వాఴ్వుముళైత్తిడునాళ్
కన్దమలర్ పొఴిల్ శూఴ్ కురుగాదిపన్ కలైకళ్ విళఙ్గిడునాళ్
కారమర్ మేని యరఙ్గనగర్ కిఱై కణ్గళ్ కళిత్తిడునాళ్
అన్దమిల్‌శీర్ మణవాళమునిప్పిరాన్ అపదారం శెయ్‌దిడునాళ్
అఴగు తిగఴ్న్దిడుమైప్పశియిల్ తిరుమూలమదనై నాళే
శ్రీమతే రమ్యజామాతృ మునీంద్రాయ మహాత్మనే
శ్రీరంగ వాసినే భూయాత్ నిత్యశ్రీః నిత్యమఙ్గళమ్ ॥



మనవాళ మహాామునులు

MANAVALA MAHAMUNULU

# శ్రీ మద్వేదాంత దేశికులు

తిరునక్షత్ర తనియన్:-

కన్యాశ్రవణ సంభూతం ఘంటాంశం వేంకటేశితుః
శ్రీమద్వేంకట నాథార్యం వన్దేవేదాన్త దేశికమ్ ॥

నిత్యతనియన్:-

శ్రీమాన్ వేంకట నాథార్యః కవితార్కిక కేసరీ
వేదాన్తా చార్య వర్యోమే సన్నిధత్తాం సదాహృది ॥

శ్రీమద్వేదాన్త దేశికులు విభవనామ సంవత్సర కన్యామాసమున శ్రవణ నక్షత్రమునందు కాంచీపురమందలి తూప్పిల్ అని వ్యవహరింపబడు "దీపప్రకాశర్" సన్నిధి ప్రాంతమున అనంతసూరి - తోతారంబ అను దంపతులకు కుమారులుగా నవతరించిరి. వీరు అవతరించిన దినము శ్రీవేంకటాచలపతి వర్ష తిరునక్షత్రమగుటచే వీరికి తల్లిదండ్రులు వేంకటనాథులని పేరుపెట్టిరి.

వీరి మేనమామ వాది హంసాంబుది అని బిరుదు వహించిన ఆత్రేయ రామానుజాచార్యుల వారు. వీరికే కిడాంబి అప్పుళ్లార్ అనిపేరు. వీరియొద్దనే వేదాంత దేశికులు సకలశాస్త్రములను ఇరువది సంవత్సరముల వయసునకే అభ్యసించిరి. ఈ విషయమునే "వింశత్యబ్దే విశ్రుత నానావిధ విద్యః" అని స్వయముగా చెప్పియున్నారు. వీరు శ్రీనివాసుని ఘంటావతారమని పెద్దలు చెప్పుదురు. ఈ విషయము వీరి అవతార కాలమునందే వ్యవహారములో నుండెనది. ఆవిషయమునే వీరు తము సంకల్ప సూర్యోదయమను నాటకమున "ఉత్ప్రేక్ష్యతే బుధజనై రుపపత్తి భూమ్నా ఘంటా హరే స్సనుజనిష్ట యదాత్మనేతి" అనిచెప్పినారు.

ఆత్రేయ రామానుజాచార్యుల వారికి ఆచార్యులు నడాదూరు అమ్మాళ్. వారివద్ద కాలక్షేమునకై పోవునపుడు అప్పుళ్ళార్ వేంకటనాథులను కూడా తీసికొనిపోయిరట. అమ్మాళ్ వేంకటనాథులను గూర్చి విచారించి

"ప్రతిష్ఠాపిత వేదాంతః ప్రతిక్షిప్త బహిర్మతః
భూయాస్త్రైవిద్య మానస్త్వం భూరికల్యాణ భాజనమ్ ॥

(వేదాంతార్థములను స్థాపించి దుర్వాదులను నశింపజేసి త్రైవిద్యమానుడవై శుభముల బడయుము") అని మంగళా శాసనము చేసిరట. ఆమంగళాశాసన బలమే వారిని కవితార్కిక సింహులను చేసినది.

వీరు తమ ఆచార్యుల వలన గరుడ మంత్రమునుపదేశము పొంది తిరువహీంద్ర పురమున గరుడనదీ తీరమునగల ఔషధాద్రి యందు ఆ గరుడమంత్రమును జపించి

గరుడాళ్వార్ల అనుగ్రహమును పొందిరి. అంతేకాక వారి వలన హయగ్రీవ మంత్రము -నుపదేశము పొంది దానిని అచటనే జపించి హయ వదనుని అనుగ్రహమును సంపాదించిరి. కావుననే గరుడాళ్వార్లను స్తుతించుచు గరుడ పంచాశత్, హయగ్రీవ స్తోత్రరూపముగా హయగ్రీవస్తోత్రమును అనుగ్రహించిరి. అంతేకాక కాంచీపుర ప్రాంత దివ్యదేశమూర్తుల విషయములో అనేక స్తోత్రములను రచించిరి.

ఒకానొకప్పుడు శ్రీరంగమున మతాంతరుల ఆగడములు మితిమీరి నప్పుడు వీరు శ్రీరంగము వేంచేసి మతాంతరులను వాదమున జయించి విశిష్టాద్వైత సిద్ధాంతమును స్థాపించిరి. ఆ సందర్భములో జరిగిన వాద సారాంశమునే శతదూషిణిగా రచించిరి. వీరి విషయమున ప్రసన్నుడైన శ్రీరంగనాథులు వేదాన్తా చార్యులనియు, సర్వతన్త్ర స్వతంత్రులనియు, కవితార్కిక సింహులనియు బిరుదములను కృపచేసిరి. "త్రింశద్వారం శ్రావిత శారీరక భాష్యః" అని వారు ముప్పదిసార్లు శ్రీభాష్య ప్రవచనము చేయుటయే కాక శ్రీభాష్య సారార్థమైన అధికరణ సారావళిని రచించి వేదాన్తాచార్యులను బిరుదమును సార్థకమొనర్చుకొనిరి. శ్రీరంగనాథుల పాదుకా విషయమైన "పాదుకా సహస్రము"ను రచించి శ్రీరంగనాథుని అనుగ్రహమును పొందిరి.

వీరురచించిన గ్రంథములు శతాధికములు. వ్యాఖ్యాన గ్రంధములు, స్తోత్ర గంథ్రములు, ద్రవిడ ప్రబంధములు, వ్యాఖ్యానములు, సంస్కృత కావ్యములు, నాటకములు అనేకములు రచించిరి. వానిలో శతమాషణి, న్యాయ సిద్ధాంజనము, గీతాభాష్య తాత్పర్యచంద్రిక, న్యాయపరిశుద్ధి, పాదుకా సహస్రము, యాద వాభ్యుదయము, హంస సందేశము, సంకల్ప సూర్యోదయము, రహస్యత్రయసారము ప్రసిద్ధములైనవి. వీరి శ్రీపాదములను ఆశ్రయించిన వారిలో వీరి కుమారులు వరదాచార్యులు, బ్రహ్మతంత్ర స్వతంత్ర జీయరులు ప్రముఖులు. ఒక సమయమును విద్యారణ్యస్వామికిని అక్షోభ్యమునికిని ఏర్పడిన వాదములో మాధ్యస్థము వహించిరి.

వీరు రచించిన గ్రంథముల వివరములుః స్తోత్ర గంథ్రములు 29. కావ్యనాటకములు 5. వేదాన్త గ్రంథములు 21. అనుష్ఠాన గ్రంథ్రములు 2. రహస్య గంథ్రములు 30. ద్రావిడ ప్రబంధములు 25.

ఏమైనను "యతి ప్రవర భారతీ రసభరేణ నీతం వయః" అనియు "నిర్విష్టం యతి సార్వభౌమ వచసా మా వృత్తిభి ర్యవ్వనమ్" అనియు తామే చెప్పుకొనినట్లు భగవద్రామానుజుల శ్రీసూక్తులతోడనే కాలక్షేపము చేసిన మహనీయులు వేదాన్త దేశికులు.

**వీరి రచనలు:** రహస్యత్రయసారమ్, అమలనాదిపిరాన్ వ్యాఖ్యానమ్, సారాసారమ్, ఉపకారసఙ్గ్రహమ్, విరోధిపరిహారమ్, పరమపదసోపానమ్, పరమతభఙ్గమ్, ప్రబన్ధసారమ్, ఆహారనియతి, తత్త్వత్రయమ్, శతదూషణీ, సర్వార్థసిద్ధి, తత్త్వముక్తాకలాపమ్, స్తోత్రభాష్యమ్, పాఞ్చరాత్రరక్షై, న్యాసత్రయమ్, భగవద్ధ్యానసోపానమ్, అభీతిస్తవమ్, దశావతారస్తోత్రమ్, మధురస్తవమ్, గోదాస్తుతి, శ్రీస్తుతి, భూస్తుతి, యతిరాజసప్తతి, ద్రవిడోపనిషత్తాత్పర్యమ్, గరుడపఞ్చాశత్తు, సంకల్ప సూర్యోదయమ్, న్యాయపరిశుద్ధి, న్యాయ సిద్ధాఞ్జనమ్, గీతాభాష్యసారమ్, చతుశ్లోకీ వ్యాఖ్యానమ్, అధికరణ సారావళి, తత్త్వదీపికై, అవిద్యాఖండనమ్, కుదృష్టిత్రయనిరాసమ్, తాత్పర్యచంద్రికై, పాదుకా సహస్రమ్, మీమాంసాపాదుకై, మీమాంసాభాష్యమ్, యాదవాభ్యుదయమ్, వేదార్థసఙ్గ్రహ వ్యాఖ్యానమ్, హంససన్దేశమ్, హయగ్రీవస్తోత్రమ్, గోపాలవింశతి, గరుడదణ్డకమ్, మొదలైనవి.

**వాழி తిరునామమ్**

వాழி ఇరామానుశప్పిళ్ళాన్ మాతగవాల్
వాழுమ్ మణినిగమాన్త గురు - వాழியవన్
మాఱన్ మఱైయు మిరామానుశన్ పాడియముమ్
తేఱుమ్పడి యురైక్కుమ్ శీర్

వఞ్జప్పర వమయమ్ మాఱ్ఱవన్దోన్ వాయే
మన్నుపుగழ் పూ్పదూరాన్ మనముగప్పోన్ వాழியే
కఞ్జత్తిరుమఙ్గై యుగక్కవన్దోన్ వాழியే
కలియనురై కుడికొణ్డ కరుత్తుడైయోన్ వాழியే
శెఞ్జొల్ తమిழ் మఱైగళ్ తెళిన్దురైప్పోన్ వాழியే
తిరుమాలై మాల్ తిరుమణియాయ్ చ్చిఱక్కవన్దోన్ వాழியే
తఞ్జప్పరగదియై త్తన్దరుళ్వోన్ వాழியే
తణ్డమిழ் తూప్పుల్ తిరువేఙ్గడవన్ వాழியే

నానిలముమ్ తాన్ వాழ నాన్ మఱైగళ్తామ్ వాழ
మానగరిన్ మాఱన్మఱై వాழ - ఞానియర్కళ్
శెన్నియణిశేర్ తూప్పుల్ వేదాన్త దేశికనే
ఇన్నుమొరు నూఱ్ఱాణ్డిరుమ్



# శాత్తుమురై

పల్లాణ్డు పల్లాణ్డు పల్లాయిరత్తాణ్డు పలకోడి నూఱాయిరమ్
మల్లాణ్డ తిణ్డోళ్ మణివణ్ణా! ఉన్ శేవడి శెవ్వితిరుక్కాప్పు;
అడియోమోడుం నిన్నోడుం పిరివిన్ఱి ఆయిరం పల్లాణ్డు
వడివాయ్ నిన్వలమార్బినిల్ వాழ் గిన్ఱమంగైయుం పల్లాణ్డు
వడివార్ శోది వలత్తుఱైయుం శుడ రాழியుం పల్లాణ్డు
పడై పోర్ పుక్కు ముழங్గుం అప్పాఞ్జశన్నియముం పల్లాణ్డే.
సర్వదేశదశాకాలే ష్వవ్యాహతపరాక్రమా ।
రామానుజార్యదివ్యాజ్ఞా వర్ధతామభివర్ధతామ్ ॥
రామానుజార్యదివ్యాజ్ఞా ప్రతివాసరముజ్జ్వలా ।
దిగన్తవ్యాపినీభూయాత్ సాహిలోకహితేషిణీ ॥
శ్రీమన్ శ్రీరఙ్గ శ్రియ మనుపద్రవా మనుదినం సంవర్ధయ ।
శ్రీమన్ శ్రీరఙ్గ శ్రియ మనుపద్రవా మమదినం సంవర్ధయ ॥
నమశ్శ్రీశైలనాథాయ కున్తీనగరజన్మనే ।
ప్రసాదలబ్ధపరమప్రాప్య కైఙ్కర్యశాలినే ॥
శ్రీశైలేశదయాపాత్రం ధీభక్త్యాదిగుణార్ణవమ్ ।
యతీన్ద్రప్రవణం వన్దే రమ్యజామాతరంమునిమ్ ॥
వాழி తిరువాయ్ మొழிప్పిళ్ళైమాదగవాల్
వాழ్ుం మణవాళమామునివన్ వాழிయఱ్ఱన్;
మాఱన్ తిరువాయ్మొழிప్పొరుళై మానిలత్తోర్
తేఱుమ్పడి యురైక్కుం శీర్.
శెయ్యతామరైత్తాళిణై వాழియే శేలేవాழி తిరునాభి వాழியే
తుయ్యమార్బుం పురినూలుం వాழியే శున్దర త్తిరుత్తోళిణై వాழియే
కైయుమేన్దియ ముక్కోలుం వాழியే కరుణైపొఙ్గియకణ్ణిణై వాழியే
పొయ్యిలాద మణవాళమాముని పున్దివాழி పుగழ్ వాழி వాழியే.

ఆడియార్ గళ్ వాళ్ అరఙ్గనగర్ వాళ్
శడకోపన్ తణ్డమిళ్ నూల్ వాళ్ కడల్‌శూళ్న్ద
మన్నులగం వాళ్ మణవాళమామునియే !
ఇన్నుమొరు నూత్తాణ్డిరుమ్.

శ్రీమద్రఙ్గం జయతు పరమం ధామతేజో నిధానం
భూమాతస్మిన్ భవతు కుశలోకోపి భూమా సహాయః
దివ్యంతస్మై దిశతు విభవం దేశికో దేశికానాం
కాలే కాలే వరవరమునిః కల్ప్యయన్ మంగళాని ।

అపగతమదమానై రంతిమోపాయ నిష్ఠైః
అధిగత పరమార్థై రర్థకామానపేక్షైః
నిఖిల జన సుహృద్భిః నిర్జిత క్రోధలోభైః
వరవరమునిభృత్యై రస్తుమే నిత్య యోగః

**ఆళ్వార్ యెంబెరుమానార్ జీయర్ తిరునడిగళే శరణమ్**

**జీయర్ తిరువడిగళే శరణమ్**





శ్రీరస్తు
శ్రీమతే రామానుజాయనమః

# అనుబంధము

## ఆళ్వార్లు ఒక్కొక్కరు మంగళాశాసనం చేసిన దివ్య దేశములు

## పొయ్గై యాళ్వారు మంగళాశాసనం చేసిన దివ్యదేశములు

1. తిరువరఙ్గమ్
2. తిరుక్కోవళూర్
3. తిరువెఃకా
4. తిరువేఙ్గడమ్
5. తిరుప్పార్ కడల్
6. పరమపదమ్

## పూదత్తాళ్వార్ మంగళాశాసనం చేసిన దివ్యదేశములు.

1. తిరువరఙ్గమ్
2. తంజమామణిక్కోయిల్
3. తిరుక్కుడన్దై
4. తిరుమాలిరుంశోలై
5. తిరుక్కోట్టియూర్
6. తిరుత్తణ్గాల్
7. తిరుక్కోవళూర్
8. తిరుక్కచ్చి
9. తిరుప్పాడగమ్
10. తిరునీర్మలై
11. తిరుక్కడల్మల్లై
12. తిరువేఙ్గడమ్

## పేయాళ్వార్ మంగళాశాసనం చేసిన దివ్యదేశములు

1. తిరువరఙ్గమ్
2. తిరుక్కుడన్దై
3. తిరువిణ్ణగర్
4. తిరుక్కోట్టియూర్
5. తిరుక్కచ్చి
6. అష్టభుజమ్
7. వేళుక్కై
8. పాడగం
9. తిరువూరగం
10. తిరువెఃకా
11. తిరువల్లిక్కేణి
12. తిరుఘటికై
13. తిరువేఙ్గడమ్
14. తిరుప్పార్కడల్
15. పరమపదమ్

## తిరుమழிశై ఆళ్వార్ మంగళాశాసనం చేసిన దివ్యదేశములు

1. తిరువరఙ్గమ్
2. అన్బిల్
3. తిరుప్పేర్నగర్
4. తిరుక్కుడన్దై
5. కపిస్థలమ్
6. తిరుక్కోట్టియూర్
7. తిరుక్కురుఙ్గుడి
8. తిరుప్పాడగమ్
9. తిరువూరగం
10. తిరువెఃకా
11. తిరువెవ్వుళూర్
12. తిరువల్లిక్కేణి
13. తిరువేఙ్గడమ్
14. ద్వారకై
15. తిరుప్పార్ కడల్
16. పరమ పదమ్

## నమ్మాళ్వార్ మంగళాశాసనం చేసిన దివ్యదేశములు

1. తిరుమాలిరుంశోలై మలై
2. తిరువేఙ్గడమ్
3. తిరుక్కురుగూర్
4. తిరుక్కురుఙ్గుడి
5. తిరుక్కుడందై
6. శ్రీవరమఙ్గై
7. తిరువల్లవాళ్
8. తిరువణ్ వణ్డూర్
9. తిరువిణ్ణగర్
10. తొలై విల్లిమఙ్గలమ్
11. తిరుక్కోళూర్
12. తిరువరఙ్గమ్
13. తెన్ తిరుప్పేరై
14. తిరువారన్విళై
15. తిరుచ్చెఙ్గున్నూరు
16. తిరుక్కడిత్తానమ్
17. తిరుప్పులియూర్
18. తిరుప్పుళిఙ్గుడి
19. తిరుక్కాట్కరై
20. తిరుమూళిక్కళమ్
21. తిరునావాయ్
22. తిరుకణ్ణపురమ్
23. తిరుమోగూర్
24. తిరువనన్తపురమ్
25. తిరువాట్టారు
26. తిరుప్పేర్నగర్
27. శ్రీ వైకుంఠమ్
28. వరగుణమఙ్గై
29. తిరువణ్ పరిశారమ్
30. తిరుక్కుళన్దై
31. తిరుప్పాడగం
32. తిరు ఊరగం
33. తిరువెఃకా
34. తిరువయోధ్యై
35. ద్వారకై
36. వడమధురై
37. తిరుప్పార్ కడల్
38. పరమపదమ్

## కులశేఖరాళ్వార్ మంగళాశాసనం చేసిన దివ్యదేశములు.

1. తిరువరఙ్గమ్
2. తిరువేఙ్గడమ్
3. తిరువిత్తువక్కోడు
4. తిరుక్కణ్ణపురం
5. తిరుచ్చిత్తిరకూడమ్
6. తిరువాలి
7. తిరువయోధ్యై
8. వడమధురై
9. తిరుప్పార్కడల్
10. పరమ పదమ్

## పెరియాళ్వార్ మంగళా శాసనం చేసిన దివ్యదేశములు

1. తిరువరఙ్గమ్
2. తిరువెళ్ళరై
3. తిరుప్పేర్ నగర్
4. తిరుక్కుడన్దై
5. తిరుక్కణ్ణపురం
6. తిరుమాలిరుంశోలై
7. తిరుక్కోట్టియూర్
8. శ్రీవిల్లిపుత్తూర్
9. తిరుక్కుఱుఙ్గుడి
10. తిరువేఙ్గడమ్
11. తిరువయోధ్యై
12. సాలగ్రామం
13. బదరికాశ్రమం
14. తిరుక్కణ్డమెన్నుం కడినగర్
15. ద్వారకై
16. వడమధురై
17. తిరువాయ్ప్పాడి
18. తిరుప్పార్ కడల్
19. పరమపదమ్

## ఆణ్డాళ్ మంగళాశాసనం చేసిన దివ్యదేశములు

1. తిరువరఙ్గమ్
2. తిరుక్కుడన్దై
3. తిరుక్కణ్ణపురం
4. తిరుమాలిరుఞ్జోలై
5. శ్రీవిల్లిపుత్తూర్
6. తిరువేఙ్గడమ్
7. ద్వారకై
8. వడ మధురై
9. తిరువాయ్ప్పాడి
10. తిరుప్పార్ కడల్
11. పరమపదమ్

### తొణ్డరడిప్పొడి యాళ్వార్ మంగళాశాసనం చేసిన దివ్యదేశములు

1.తిరువరఙ్గమ్ 2. తిరుప్పార్ కడల్ 3. పరమపదమ్

### తిరుప్పాణాళ్వార్ మంగళాశాసనం చేసిన దివ్యదేశములు

1. తిరువరఙ్గమ్ 2. తిరువేఙ్గడమ్ 3. పరమపదమ్

## తిరుమఙ్గైయాళ్వార్ మంగళాశాసనం చేసిన దివ్యదేశములు

1. తిరుప్పిరిది
2. బదరికాశ్రమం
3. సాలగ్రామం
4. నైమిశారణ్యం
5. శిఙ్గవేళ్ కున్ఱమ్
6. తిరువేఙ్గడమ్
7. తిరువెవ్వుళ్ళూర్
8. తిరునీర్ మలై
9. తిరువల్లిక్కేణి
10. తిరుక్కడల్మల్లై
11. తిరువిడవెన్దై
12. తిరు అష్టభుజమ్
13. పరమేశ్వర విణ్ణగరమ్
14. తిరుక్కోవలూర్
15. తిరువహీన్ద్రపురమ్
16. తిరుచ్చిత్తిర కూడమ్
17. కాళిచ్చీరామ విణ్ణగరమ్
18. తిరువాలి
19. మణిమాడక్కోయిల్
20. వైకున్ద విణ్ణగరమ్
21. అరిమేయ విణ్ణగరమ్
22. తిరుత్తేవనార్ తొగై

23. వణ్ పురుడోత్తమం
24. శెమ్బొన్ శెయ్‌కోయిల్
25. తిరుతెత్తియమ్బలమ్
26. తిరుమణిక్కూడమ్
27. తిరుక్కావళంబాడి
28. పార్తన్ పళ్ళి
29. తిరువెళ్ళక్కుళం
30. తిరువిన్దళూర్
31. తిరువెళ్ళియజ్గుడి
32. పుళ్ళమ్పూదజ్గుడి
33. తిరుక్కూడలూర్
34. తిరువెళ్ళరై
35. తిరువరజ్గమ్
36. తిరుప్పేర్ నగర్
37. నన్దిపుర విణ్ణగరం
38. తిరువిణ్ణగర్
39. తిరునరయూర్
40. తిరుచ్చేరై
41. తిరువళున్దూర్
42. శిరుపులియూర్
43. తిరుక్కణ్ణమజ్గై
44. తిరుక్కణ్ణపురం
45. తిరుక్కణ్ణజ్గుడి
46. తిరునాగై
47. తిరుప్పుల్లాణి
48. తిరుక్కురుజ్గుడి
49. తిరువల్లవాళ
50. తిరుమాలిరుఞ్జోలై మలై
51. తిరుక్కోట్టియూర్.

ఈ 51 దివ్యదేశములు పెరియతిరుమొళి యందు సంపూర్ణ దశకమున కీర్తింపబడినవి.

52. ఉరైయూర్
53. తఞ్జమామణి క్కోయిల్
54. కరమ్బనూర్
55. తలైచ్చజ్గ నాణ్మదియం
56. తిరుమెయ్యం
57. తిరుత్తన్ గాల్
58. తిరుక్కూడల్
59. తిరునావాయ్
60. తిరువెఃకా
61. తిరుత్తణ్ గా
62. తిరుప్పాడగం
63. తిరువూరగం
64. తిరునిన్దవూర్
65. తిరుక్కడిగై
66. తిరువయోత్తి
67. ద్వారకై
68. వడమధురై
69. తిరువాయ్‌ప్పాడి
70. తిరుప్పార్ కడల్
71. పరమపదమ్
72. తిరుక్కుడన్దై
73. తిరుమూళిక్కళం
74. తిరుప్పుళ్కుళి

ఈ 23 దివ్యదేశములు పెరియ తిరుమొళి యందు ప్రత్యేక పాశురములలో కీర్తింపబడినవి.

75. తిరుక్కచ్చి
76. తిరు ఆదనూర్
77. తిరుక్కణ్డియూర్
78. తిరుప్పులియూర్
79. తిరువేళుక్కై
80. తిరు నీరగం
81. నిలాత్తిజ్గళ్ తుణ్డం
82. తిరుక్కారగమ్
83. తిరుక్కార్వానమ్
84. తిరుక్కళ్వనూర్
85. తిరుప్పవళ వణ్ణం
86. తిరుమోగూర్

ఈ 12 దివ్యదేశములు పెరియ తిరుమొళి యందు కాక తక్కిన తిరుమంగై యాళ్వార్ ప్రబంధములలోని ప్రత్యేక పాశురములలో కీర్తింపబడినవి.

ఆయా దివ్యదేశములకు ఆళ్వార్లు అనుగ్రహించిన మంగళాశాసన పాశురములు

## చోళనాడు తిరుపతులు 40

### శ్రీరంగమ్

| | | |
|---|---|---|
| ఒన్డు మఱన్దరియేన్ | ముదల్‌తిరువన్దాది | 6 |
| మనత్తుళ్ళాన్ | ఇరణ్డామ్ తిరువన్దాది | 28 పా |
| పయిన్ద్ర తరఙ్గమ్ | ఇరణ్డామ్ తిరువన్దాది | 46పా |
| తమరుళ్ళం తఞ్జై | ఇరణ్డామ్ తిరువన్దాది | 70పా |
| తిరుమ్బిత్తు | ఇరణ్డామ్ తిరువన్దాది | 88పా |
| విణ్ణగరమ్ వెక్కా | మూన్ఱాం తిరువన్దాది | 62పా |
| పాలిల్ కిడన్దతువుం | నాన్ముగన్ తిరువన్దాది | 03పా |
| అవనెన్నై యాళి | నాన్ముగన్ తిరువన్దాది | 30పా |
| నాగత్తణై కుడన్దై | నాన్ముగన్ తిరువన్దాది | 36పా |
| ఆళ్‌పార్త్తు | నాన్ముగన్ తిరువన్దాది | 60పా |
| అరఙ్గనే తరంగనీర్ | తిరుచ్చన్ద విరుత్తం | 21పా |
| కొణ్డైకొణ్డ | తిరుచ్చన్ద విరుత్తం | 49పా |
| వెణ్డిరై | తిరుచ్చన్ద విరుత్తం | 50పా |
| శరఙ్గళై | తిరుచ్చన్ద విరుత్తం | 51పా |
| పొత్తై | తిరుచ్చన్ద విరుత్తం | 52పా |
| మోడి యోడు | తిరుచ్చన్ద విరుత్తం | 53పా |
| ఇలత్తలై | తిరుచ్చన్ద విరుత్తం | 54పా |
| మన్నుమామలర్ కిళత్తి | తిరుచ్చన్ద విరుత్తం | 55పా |
| శురుమ్బరఙ్గ | తిరుచ్చన్ద విరుత్తం | 93పా |
| పొన్ని | తిరుచ్చన్ద విరుత్తం | 119పా |
| తణ్ణన్దుళాయ్ | తిరువిరుత్తం | 28పా |
| కఙ్గులుమ్ పగలుమ్ | తిరువాయమొళి | 7-2- |
| ఇరుళిరియ | పెరుమాళ్ తిరుమొళి | 1వ దశకము |
| తేట్టరుమ్ | పెరుమాళ్ తిరుమొళి | 2వ దశకము |
| మెయ్యిల్ వాళ్‌కై | పెరుమాళ్ తిరుమొళి | 3వ దశకము |
| తేవరయుమ్ | పెరుమాళ్ తిరుమొళి | 8-10 |
| కరువుడై మేకఙ్గళ్ | పెరియాళ్వార్ తిరుమొళి | 2-7-2 |
| శిలికన్ | పెరియాళ్వార్ తిరుమొళి | 2-7-8 |

| | | |
|---|---|---|
| కొణ్డల్వణ్ణా | పెరియాళ్వార్ తిరుమొళ్ళి | 2-9-4 |
| వణ్డుకళిత్తిరుక్కుమ్ | పెరియాళ్వార్ తిరుమొళ్ళి | 2-9-11 |
| కన్నినన్మామదిళ్ | పెరియాళ్వార్ తిరుమొళ్ళి | 3-3-2 |
| మాదవత్తోన్ | పెరియాళ్వార్ తిరుమొళ్ళి | 4-8 |
| మరపడియై | పెరియాళ్వార్ తిరుమొళ్ళి | 4-9 |
| తుప్పుడై యార్కై | పెరియాళ్వార్ తిరుమొళ్ళి | 4-10 |
| తెళ్ళియార్ | నాచ్చియార్ తిరుమొళ్ళి | 4-1 |
| తాముగక్కుమ్ | నాచ్చియార్ తిరుమొళ్ళి | 11వ దశకము |
| కావలిల్ | తిరుమాలై | పూర్తిపాశురములు |
| అమలనాది పిరాన్ | అమలనాదిపిరాన్ | అన్నిపాశురములు |
| పళ్లియావదు | పెరియ తిరుమొళ్ళి | 1-8-2 పా |
| ఎన్తుణై | పెరియ తిరుమొళ్ళి | 3-7-6 పా |
| ఉన్నిమేల్ | పెరియ తిరుమొళ్ళి | 5-4 వ దశకము |
| వెరువాదాళ్ | పెరియ తిరుమొళ్ళి | 5-5 వ దశకము |
| కైమ్మానమ్ | పెరియ తిరుమొళ్ళి | 5-6 వ దశకము |
| పణ్డై | పెరియ తిరుమొళ్ళి | 5-7 వ దశకము |
| ఏళై యేదలన్ | పెరియ తిరుమొళ్ళి | 5-8 వ దశకము |
| తారాళన్ | పెరియ తిరుమొళ్ళి | 6-6-9 |
| ఉరఙ్గళాల్ | పెరియ తిరుమొళ్ళి | 7-3-4 |
| తరఙ్గనీర్ | పెరియ తిరుమొళ్ళి | 8-2-7 |
| పునైవళర్ | పెరియ తిరుమొళ్ళి | 9-9-2 |
| కణ్ణన్మనత్తు | పెరియ తిరుమొళ్ళి | 11-3-7 |
| అణియార్ | పెరియ తిరుమొళ్ళి | 11-8-8 |
| ఇమ్మైమ్మయై | తిరుక్కుఱున్దాణ్డగమ్ | 7 పా |
| ఆవియై | తిరుక్కుఱున్దాణ్డగమ్ | 12 పా |
| ఇరమ్బు | తిరుక్కుఱున్దాణ్డగమ్ | 13 పా |
| పిణ్డియార్ | తిరుక్కుఱున్దాణ్డగమ్ | 19 పా |
| ఆరామమ్ శూళ్న్ద | శిరియ తిరుమడల్ | 71 పా |
| మన్నుమరఙ్గత్తు | పెరియ తిరుమడల్ | 118 పా |
| పొన్నానాయ్ | తిరునెడున్దాణ్డకమ్ | 10 పా |
| పట్టుడక్కుమ్ | తిరునెడున్దాణ్డకమ్ | 11 పా |

| | | |
|---|---|---|
| నెఞ్జురుగి | తిరునెడున్దాణ్డకమ్ | 12 పా |
| ముళైక్కుదిరై | తిరునెడున్దాణ్డకమ్ | 14 పా |
| కారవణ్ణమ్ | తిరునెడున్దాణ్డకమ్ | 18 పా |
| ముత్తారా | తిరునెడున్దాణ్డకమ్ | 19 పా |
| ఉళ్ళూ ్ ౹మ్ | తిరునెడున్దాణ్డకమ్ | 23 పా |
| ఇరుకై యిల్ | తిరునెడున్దాణ్డకమ్ | 24 పా |
| మిన్నిలజ్జు | తిరునెడున్దాణ్డకమ్ | 25 పా |

శ్రీరంగనాథుని కీర్తించిన మొత్తము పాశురముల సంఖ్య 248.

## 2. ఉఱైయూర్ 2

| | | |
|---|---|---|
| కోళియుం కూడలుం | పెరియ తిరుమొళి | 9-2-5 |

## 3. తంజైమామణి క్కోయిల్ 3

| | | |
|---|---|---|
| తమరుళ్ళమ్ | ఇరణ్డాం తిరువన్దాది | 70 పా |
| ఎమ్బిరాన్ | పెరియ తిరుమొళి | 1-1-6 |
| ఉడమ్బురివిల్ | పెరియ తిరుమొళి | 2-5-3 |
| ఎన్శెయ్గేన్ | పెరియ తిరుమొళి | 7-3-9 |

ఈ స్వామిని కీర్తించిన పాశురముల సంఖ్య 4

## 4. అన్బిల్ 4

| | | |
|---|---|---|
| నాగత్తణై | నాన్ముగన్ తిరువన్దాది | 36 పా |

## 5. తిరుక్కరమ్బనూర్ (ఉత్తమర్ కోయిల్) 5

| | | |
|---|---|---|
| పేరానై | పెరియ తిరుమొళి | 5-6-2 |

## 6. తిరువెళ్ళరై 6

| | | |
|---|---|---|
| ఉన్నైయుమ్ | పెరియాళ్వార్ తిరుమొళి | 1-5-8 |
| ఇన్దిరనోడు | పెరియాళ్వార్ తిరుమొళి | 2-8 వ దశకము |
| వెన్దిమా | పెరియ తిరుమొళి | 5-3 వ దశకము |
| తుళక్కమిల్ | పెరియ తిరుమొళి | 10-1-4 |
| పేరామఱు తిరుత్తాన్ | శిఱియ తిరుమడల్ | 70వ పా |
| మిన్నై యిరుశుడరై | పెరియ తిరుమడల్ | 117 పా |

ఈ స్వామిని కీర్తించిన పాశురముల సంఖ్య 24

